కీ.శే. మేకా సత్యనారాయణ శాస్త్రి @ బాంబు

**3వ వర్ధంతి సందర్భంగా**

# శతస్మృమాలు

(శతాధిక పుస్తకాల పరిచయాలు)




ప్రచురణ

**బాంబు స్మారక సమితి, పిఠాపురం**

కీ.శే.మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు)
మూడవ వర్ధంతి సందర్భంగా...

# శతస్వమాలు

(శతాధిక పుస్తకాల పరిచయాలు)

టైటిల్ పేజీ
వేమన శివ దుర్గా కళ్యాణి

గౌరవ్

ప్రచురణ
బాంబు స్మారక సమితి, పిఠాపురం

మేకింగ్ / సాంకేతిక సహకరం
శ్రీకాంత్ శర్మ, శ్రీకాకుళం

**విజ్ఞప్తి**

*ఇందులో పరిచయం చేసిన పుస్తకాలు ఆయ సందర్భాలలో సాఫ్ట్ కాపీలుగా పంపించాను. కానీ, తదనంతరం ఇవేవీ అందుబాటులో లేవు. కావున వీటి కొరకు నన్ను సంప్రదించి ఇబ్బంది పెట్టవద్దని మనవి.*

*మూల్యం - అమూల్యం*



వివరాలకు - 9032094492

# అంతర్వాక్యం

ఇదో వార్థక్యం అని కొట్టి పారేయడం సులువే కానీ అసలు ఇలాంటి ఆలోచన ఇప్పటికి నాకు ఎందుకు కలిగిందో కానీ మనసు తేలిక పడింది.'సామాజిక కార్యకర్త' ప్రత్యేక వృత్తిగా మారి పోయిన దశలో అదో కీర్తి కిరీటంగా ఉంది. అందుకే ధరించడం మానేసాను. నన్ను నేను ఏమని సంభోదించుకోవాలో ఏనాటికైనా నాకు తెలుస్తుందేమో చూడాలి. జీవితానికి అర్థం జీవించడం మాత్రమే అనేది నేటి సారం. మార్పు కోసం పని చేస్తున్నామనే సాకుతోతెలీకుందనే ఒక భ్రమని సృష్టించుకుని అందులోనే జీవించే నా బోటి వాళ్ళందర్నీ ఇప్పుడు కొత్తగా పలకరిద్దామని ఉంది. కానీ, ఏం చేయను..ఇప్పటికే వాళ్ళ దృష్టిలో నేనో అధముడ్ని. ఐనా, ఇంత దూరమని తెలీక ప్రయాణం చేశాను గానీ మనసులోని అలుపు ఇంకాగమని చెబుతోంది. ఇంకెక్కడికంటూ నిలదీస్తోంది. అంతర్వాక్యానికి ప్రణామం. లోకంలో ఉదయసాయంత్రాలు ఎలానో ఉద్యమాలు, పోరాటాలు కూడా అలాగే ఉన్నాయి. మనిషి స్వార్థం అన్నింటినీ పూర్తిగా మింగేస్తుంది. అసలు ఇంకా మనిషనే వాడు మిగిలాడా? ఒక ఆశ్చర్యం. ఏ రంగమైనా తీసుకోండి. పక్కవాడి మీద అక్కసు వెళ్లగక్కడమే నిత్యకృత్యం ఐపోయింది. ఇదంతా మానేసి ఒట్టి మనిషిగా అంతా కలిసి సమిష్టిగా సహృద్భావంగా బతకలేమా?ఏమో.

రచనా వ్యాసంగం, సామాజిక కార్యాచరణ ఇక చాలని నిర్ణయించుకుని వీలైనంత కుదురుగా, మౌనంగా ఉండడానికి ప్రయత్నం చేసే పనిలో ఉన్నాను. గతంలో అదేపనిగా ఆకర్షించినవేవీ ఇప్పుడంతగా ఆనట్లాదు. తాత్విక స్వీయ మానసిక ధోరణిలో ఒంటరిగా,

వీలైనంత అంతర్ముఖంగా ఉండడానికే ఈమధ్య మొగ్గు చూపుతున్నాను. కారణాలు తెలీదు కానీ మొత్తంగా సారంతో జీవించాలనుంది.

పేర్లూ, భుజకీర్తులూ అన్ని రకాల ముద్రలు వదిలేసి మళ్ళీ ప్రకృతి తల్లి పొదిలో బిడ్డగాహాయిగా బజ్జుండిపోదా మనుంది. హింస లేని ప్రపంచాన్ని చూడాలనుంది. హెచ్చుతగ్గులు లేని చోట ఆనందంగా గడపాలనుంది. మనిషికి కొత్త నిర్వచనం ఇద్దామని ఉంది. మరో మనిషిగా మారదామని ఉంది. మదిలోని అగ్ని పర్వతాలు అన్నింటినీ మంచినీటి సముద్రాలుగా, అందమైన సరస్సులుగా మార్చెద్దమని ఉంది. సరస్సులోని సుమాలది సమ్మోహన శక్తి. అది మనస్సు లోని బాధల్ని దూరంచేస్తుంది. వయస్సును ఇట్టే తగ్గించేస్తుంది. అందర్నీ అమాంతం ప్రేమతో చుట్టేస్తుంది. జీవితాన్ని జీవంతో మరిపిస్తుంది. బతుకులోని బంధాల్ని మురిపిస్తుంది. అస్తిత్వానికి అర్థాన్ని నిర్దేశిస్తుంది. మరి, అలాంటి సుమాలు ఒక్కసారేవందకి పైగా ఒక్కదరికి చేరితే ఎంత అందంగా ఆహ్లాదకరంగా ఉంటుంది. అందుకే ఇది,

**శతస్సుమాల సన్నిధి**

# అప్పడాలకర్ర నుంచీ అక్షరాలకథ వరకూ...!

## (100వ పుస్తకం నాటికి అంతరాత్మ చింతన)

చిన్నప్పుడు అప్పడాలకర్రనేది నా పేరు. ఎక్కువ దాంతో ఆడుకునేవాడ్ని. ఉష్ ఉష్ అంటో ఊహించుకున్న కాల్పనిక సినిమా పాత్రల్ని, కథానాయకుల్ని, నాలో ప్రతిష్టించుకుని ఆయా వ్యక్తుల్ని అప్పడాలకర్రలో సృష్టించుకుని నాదైన లోకంలో తేలియాడే వాడ్ని. ఎవర్నీ, దేనినీ పట్టించుకునే వాడ్ని కాను. అందరూ నవ్వేవారు. ఇంకొందరు ఆటపట్టించేవారు. మరికొందరు ఏడిపించేవారు. అవహేళనల్ని, ఎగతాళుల్ని అధిగమించిన చిన్ననాటి రోజులే ఎన్నటికీ గుర్తుండిపోయే బాల్యం సొబగులు. అలా చాలా ఏళ్ళపాటు చేతబట్టిన అప్పడాల కర్ర తర్వాత కాలంలో అక్షరాల కలంగా మారిందేమో అనిపిస్తుంది. 2010 లో పదిహేనేళ్ళ క్రితం మొదలెట్టిన ఈ అక్షర వ్యాసంగం ఇంతలోనే వంద ప్రచురణలకి ఎలా చేరిందో ఆశ్చర్యం. ఇంతా చేసి పుస్తకాల జాబితా నూరుకు చేరిందే కానీ మొత్తంగా చూస్తే చేర్చాల్సినవి ఇంకా ఉన్నాయి. లెక్కపెట్టుకుని రాయలేదు కాబట్టి, లెక్కలు చూసుకుని ఏదీ చేయడం అలవాటు కాలేదు. అందుకనే అన్ని ప్రజాతంత్ర శ్రేణులతో కలిసి పయనించడమే కానీ ప్రత్యేకంగా ముద్రలకు వంతపాడింది లేదు. కీర్తికోసమో, గుర్తింపు కోసమో పట్టించుకున్నదీ లేదు. ఐనా, అసూయద్వేషాలు పెంచుకోడానికి కారణాలు అక్కర్లేదనేది ఇన్నేళ్ళ అనుభవంలో నా పై పడేడ్చే వాళ్ళను చూసిన తర్వాత తెల్సిన పాఠం. సరే, ఈ సందర్భంలో నాన్న మూడో వర్ధంతిని పురస్కరించుకొని వందో ప్రచురణ తేవడం జరుగుతోంది. సామాజిక మాధ్యమాల్లో చేసిన వందకి పైబడి పుస్తకాల పరిచయం. అన్నీ కలగాపులగంగా ఉన్నాయి. వేటికవి విడిగా ప్రచురించాలని అనుకున్నా తీరికలేని పని ఒత్తిడి వల్ల కాలేదు. అలాగని పెద్దపెద్ద పనులూ ఏమీ లేవు. పనీ లేక ఖాళీ లేక సాగుతున్న వింత కథ. ఇంతా విని ఏం చేస్తుంటావని అడిగే వారికిఏం చెప్పలేను కానీ జీవితాన్ని ఆస్వాదించడం, జీవించడంలోని సారాన్ని ఆఘ్రాణించడం చాలా ఆలస్యంగా ఆరంభించానని తెల్సుకున్నాను. అందుకే, వీలైనంత సాంద్రతతో బతకడమెలాగో అన్వేషిస్తున్నాను. జీవిస్తున్నాను.

ఇందులోని పుస్తకాలు ప్రధానంగా సోషల్ మీడియాలో వివిధ సందర్భాల్లో పరిచయం చేసినవి. వాటన్నింటి సాఫ్ట్ కాపీలు ఇప్పుడు నా దగ్గర లేవు. అలాగే ఆయా నిర్దిష్టమైన కాలానుగుణంగా అప్పుడు రాసిన రాతలు, చేసిన వ్యాఖ్యలు ఎప్పటికీ వర్తించనవసరం లేదని మనవి. వరుసగా చేసిన ఈ పరిచయ వ్యాసాల్లో తొందరలో దొర్లిన అక్షర దోషాలకు, వాక్య సమన్వయ లోపాలకూ పూర్తి బాధ్యత నాదే. చదివిన కొన్ని మంచి పుస్తకాల్నయినా

కొద్దిమంది విజ్ఞత పరిధిలోకి తీసుకురావాలనే నిజాయితీ కలిగిన తపనే తప్పా మరే ఉద్దేశమూ నాకు లేదు. కాన, దురుద్దేశాలను ఆపాదించకండి. ఈ క్రమంలో అనివార్యంగా ఒకే సంస్థ పలు ప్రచురణలు , ఒకే వ్యక్తి ఇతర రచనలు ఒకట్రెండు సార్లు పరిచయం చేయడం కేవలం యాదృచ్ఛికం. అలాగే, చాలా అవసరమని భావించి చదివి మార్క్ చేసుకుని పక్కన పెట్టుకున్న పుస్తకాలు మరొకిన్ని ఇంకా పరిచయం చేయాల్సినవి ఉన్నాయి. వీటిల్లో చేర్చని రచనలు, ప్రచురణలు ఈసరికే సామాజిక మాధ్యమాల్లో పరిచయం చేసినవి కూడా ఉన్నాయి. జూలియన్ ఫ్యూజిక్ 'నోట్స్ ఫ్రమ్ గేలోస్' నుంచీ అప్టన్ సింక్లేర్ మామనార్ట్ వరకూ సిమోన్ ద బోఆ 'సెకండ్ సెక్స్' నుంచీ టాల్‌స్టాయ్ 'వార్ అండ్ పీస్' దాకా రాసిన రైటప్‌లు ఏమయిపోయాయో కనిపించలేదు. వాటన్నిటినీ ఒక్కచోటికి చేర్చకపోవడం కచ్చితంగా నా పొరబాటే. రికార్డు చేయడం, ఒకచోట రాసి ఉంచుకోవడం పాటించని కాలంలోనే ఆంధ్ర, తెలంగాణ లకి కలిపి గ్రంథాలయాలకి నేను పంపేసిన పుస్తకాల సంఖ్య రమారమీ 50,000. ఇది అతిసయోక్తి కాదు. అది కూడా రెండు దశాబ్దాల క్రితం మాట. అవి కాకుండా ఈ పదేళ్ళలో అనేక ప్రాంతీయ గ్రంథాలయాలకీ, ప్రైవేటు లైబ్రరీలకి వేల సంఖ్యలో పుస్తకాలు ఇచ్చాను. చాలా కాలంగాఎన్ని ఇబ్బందులు పడి ప్రచురిస్తున్న పుస్తకాలు అన్నింటినీ దాదాపు అమూల్యంగానే ఇస్తూ వస్తున్నాం. సాహిత్య, సామాజిక, సారస్వత , సాంస్కృతికోద్యమ స్రవంతిలో రవంత కృషే అయినప్పటికీ ఎందుకనో కొద్దిమంది కూడా ఆసరాగా నిలబడటం లేదు. బతుకు బాసటకి కనీస భరోసాను ఇవ్వడానికి ముందుకు రాలేదు. ఎంత వద్దనుకున్నా నిరాశ, నిస్పృహలు చుట్టు ముడుతున్నాయి. ఎంతటి సుదీర్ఘ పయనమైనా ఎక్కడో ఒకచోట ఆపాల్సిందే. కృంగదీస్తున్న విషయాల్ని దిగమింగి మొఖాన నవ్వు పులుముకుని మళ్ళీ బతుకు కాడిని భూజాన వేసుకోవాల్సిందే. ఆరోగ్యపరంగా,  ఆర్థికంగా, హార్థికంగా ఇక ఇంతకుమించి కొనసాగలేం అనే పరిస్థితులు దాపురించాక మనల్ని మనం కూడదీస్కోవడం తప్పా ఇంకెవర్నీ తప్పు పట్టలేం. అస్తమానం వ్యవస్థనీ నిందించలేం. అందుకనే కొన్నాళ్ళుగా సోషల్ మీడియాలో చేసిన పుస్తక పరిచయాల్నిలా గుదిగుచ్చి ఒక్కదరికి చేర్చడం జరిగింది. వీట్ని దాదాపు అన్ని పుస్తకం గ్రూపులు, సాహిత్యం సంఘాలుఉపయోగించుకున్నాయ్. కొన్ని రైటప్‌లు ఈనాటికీ చెక్కర్లు కొడుతుంటాయ్. మొదట్లోనే ఇలా ప్రచురిస్తాననే తలంపు ఏమాత్రం ఉన్నా ఈపాటికి అన్నీ గుదిగుచ్చి పెట్టేవాడ్ని. ఇంకాస్త ఒళ్ళు దగ్గర పెట్టుకుని రాసుండేవాడ్ని. కానీ, అలవాటైన అజాగ్రత్త వలన ఇంకా ఎన్నో విలువైన సమీక్షల్ని చేజేతులా పోగొట్టుకున్నాను. ఈ మాత్రమైనా ఇలా ఒక్క దరికి చేర్చడం నాకొక సాంత్వన. ఈనాటిదాక వెన్నంటి ఉన్న మిత్రులు, అమిత్రులు,  శ్రేయోభిలాషులు అందరికీ పేరుపేరునా నా హృదయపూర్వక

ధన్యవాదాలు. ముద్రణ రంగంలోనూ/ సాఫ్ట్ కాపీలుగానూ పుస్తకాల్ని రూపొందించడంలో నాకు సహకరించిన విజ్ఞులు/సాంకేతిక నిపుణులు, సిబ్బంది అందరకీ శుభాకాంక్షలు. ఉద్యమమిత్రులకు నా సెల్యూట్‌లు.

భావజాల రంగంలో సీరియస్ సాహిత్యాన్ని ప్రచారోద్యమంగా స్వీకరించి స్వచ్ఛంద సామాజిక కార్యకర్తగా మొదలైన ప్రయాణం ఇక్కడిదాకా చేరడానికి తోడుగా నిలిచిన ఆత్మీయ అభయ హస్తలన్నింటినీ ఈ సందర్భంగా తల్చుకోవాలి.ఒడిదుడుకులు ఎన్నొచ్చినా వదలకుండా వెన్నంటే ఉన్న సహచరికి కృతజ్ఞతలు చెప్పి నా నుండి వేరు చేయలేను. అమ్మ ఇతర కుటుంబ సభ్యులు, బిడ్డా సరేసరి. రచనా వ్యాసంగాన్ని క్రియాశీలక కార్యాచరణ స్థాయికి పెంచాలనే నా కల తీరిన రోజున, నిబద్ధత కలిగిన ఓ నలుగురు యువజనులు నా ఆర్తిని అర్థం చేసుకుని సమాజం కోసం, అణచబడిన జనాల కోసం, పీడితుల కోసం నిలబడిన రోజున, అప్పుడు, అక్షరాల ద్వారా అంతోఇంతో పడ్డ శ్రమని అవలీలగా అలవోకగా మర్చిపోయి సత్యాన్వేషణలో సార్వత్రిక స్వప్నాన్నై మిగిలిపోతాను. స్వేచ్ఛాగానంలో సామూహిక స్వరాన్నై సాగిపోతాను. అంతదాకా సెలవు.

## అంకితం

బాబ్‌మర్లీకి 80వ జయంతి సందర్భంగా..



## మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) స్మృతి చిహ్నంగా ఇప్పటివరకూ ప్రచురించిన పుస్తకాలు

1. ఒకే వ్యక్తి - అనేక జీవితాలు: రాహుల్ సాంకృత్యాయన్ (వ్యాస సంకలనం)
2. పర్యావరణ పరిరక్షణ: శాంతికీ, సంతోషానికి, సం తృప్తికీ మార్గం.
   ( సుందర్లాల్ బహుగుణ జపాన్ ప్రసంగం )
3. మన కర్తవ్య మార్గం :మాన వీయ, రాజకీయ, సామాజిక, ఆర్థిక జీవన పాశ్వాలు -
   (గదర్ బాబా సోహన్ సింగ్ భాక్నా విశిష్ట రచన)
4. సైన్స్ అంటే ఏమిటి ? పిల్లల కోసం విజ్ఞాన శాస్త్రం కథ- వినోద్ రైనా, డి.పి. సింగ్.
5. పిఠాపురం మహారాజా శ్రీ ఆర్.వి.కె. ఎమ్. సూర్యారావు బహదూర్- ఐ.వి. చలపతిరావు
6. మహాత్మాగాంధీ : డా. సచ్చిదానంద సిన్హా
7. ప్రజాపక్ష మేధావి - ప్రత్యామ్నాయ చరిత్రకారుడు డి. డి. కౌశాంబి అరవింద్ గుప్తా
8. కాకినాడలో ఒక సాంఘిక సంస్కరణ : యలమంచిలి వెంకటప్పయ్య (పునర్ముద్రణ)
9. నాకో భార్య కావాలి : జడీ బ్రాడీ ( 50 ఏళ్ల నాటి సంచలన రచన అనువాదం)
10. ప్రజల కోసం పాత్రికేయం: ప్రమాణాలు- ప్రభావాలు (వ్యాస సంకలనం)
11. ఏకవ్యక్తి సైన్యం - మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు)
12. పిఠాపురానికి వెలుగురేఖలు: ముగ్గురు మహనీయుల శతజయంత్యుత్సవ పరిచయం.
13. ఇరువురు ఏక వ్యక్తి సైన్యాలు (విశిష్ట భావోద్యమ దంపతుల పరిచయం)
14. వాక్కులు - వాక్యాలు ( పది ప్రసంగ వ్యాసాలు )

## తొలి బ్రాహ్మణాధిపత్య వ్యతిరేక గ్రంథం !

## మహాకవి అశ్వఘోషుడి వజ్రసూచి !!




ప్రాచీన సాహిత్యాన్ని కాళిదాసుతో ముడిపెట్టె ఆధునిక అగ్రహారాలు, మహాకవి అశ్వఘోషుడి అస్తిత్వాన్నే గుర్తించలేదు. ఇప్పటికి 1800 సంవత్సరాల క్రితమే బ్రాహ్మణులంటే ఎవరని ప్రశ్నించి 37 సూత్రాలను సాధికారికంగా కూర్చి, వర్ణవ్యవస్థ పై ధ్వజమెత్తిన తొలి సామాజిక విప్లవ గ్రంథం రచించిన అశ్వఘోషుని "వజ్రసూచి" చాలా ఏళ్ళపాటు ఎందుకనో తెలుగులో రాలేదు ! 97 లో మిళింద ప్రచురణల తరపున టి.రవిచంద్ భౌతికవాద రచయిత డా. మలయశ్రీ చేత సంస్కృతంలోని వజ్రసూచిని అనువాదం చేయించి ప్రచురించడం నిజంగా ఒక సంచలనం. కులనిర్మూలన వాదైన బౌద్ధుడు కనుకనే అశ్వఘోషునికి సాహిత్యంలో స్థానం దక్కలేదనేది నిజం! కె.బి. కృష్ణ రచించిన Studies in Hindu Materialism, అందులో భాగమైన భగవద్గీత లో భౌతికవాద అంశాలు, అలాగే తెలుగు బౌద్ధ దార్శనికుడు, హేతువాది ప్రొ.పోకల లక్ష్మీనరసు రాసిన what is Buddhism ని ఏటుకూరి బలరామమూర్తి గారిచేత "బౌద్ధం అంటే ఏమిటి?" గా అనువదింపజేసి ప్రచురించిన రవిచంద్ సంపాదకత్వంలో వెలువడిన ఈ 'వజ్రసూచి' పై వివిధ పత్రికలలో వచ్చిన సమీక్షలు, అభిప్రాయాలు కలిపి మళ్ళీ మరో పుస్తకంగా 1999లో ప్రచురించడం జరిగింది.అనేక మంది ప్రముఖులు, మేధావులు నాడు ఈ కృషి ని ప్రసంశిస్తూ రాసిన ఈ పుస్తకం కూడా చాలా విలువైనది ! డా.అంబేద్కర్ బౌద్ధం స్వీకరించినపుడు ఆయన్ని సమర్ధిస్తూ రాహుల్ సాంకృత్యా యన్ రాసిన "నవదీక్షిత బౌద్ధులు" వ్యాసాన్ని కూడా డా.మలయశ్రీ అనువదిస్తే మిళింద ప్రచురణల ద్వారా ప్రచురించిన సంగతి ఇక్కడ ప్రస్తావించాలి. "వజ్రసూచి ఒక విశిష్ట రచన. ఆధునిక యుగంలో కార్ల్ మార్క్స్ కమ్యూనిస్టు ప్రణాళికకు, డా.అంబేద్కర్ కుల నిర్మూలన కు ఎంత చారిత్రక ప్రాధాన్యత ఉందో, ప్రాచీన యుగంలో అశ్వఘోషుడి వజ్రసూచి కి అంత ప్రాధాన్యత ఉంది" అనే ప్రచురణకర్తల మాటలు యధార్థం ! కులనిర్మూలన కోసం కృషి చేసే వారు, సామాజిక చింతనాపరులు తప్పనిసరిగా చదవాల్సిన పుస్తకం ఇది.

**ఆసక్తి ఉన్న వారు నా వాట్సప్ 9032094492 కి రిక్వెస్ట్**

# “పసివాడి పగ” పైన పసిప్రేమ




**మా** చిన్నతనం నాటికే రష్యన్ సాహిత్యం క్రమంగా కనుమరుగవుతోంది. అప్పుడప్పుడు మా అత్త వాళ్ళింట్లోని పుస్తకాలు దొరకపుచ్చుకుని అక్షరాలు గుణించుకొంటూ చదివేనాటికి ఇంకా హైస్కూల్ చదువుకూడా నాకు లేదు. అలా బాల్యంలోనే నా మీద ప్రభావం చూపిన చిన్న పుస్తకం వి. బగమొలొవ్ రాసిన “పసివాడి పగ” (Ivan అనే రష్యన్ పెద్ద కథ కి తెలుగు అనువాదం) కొద్దిగా వయసొచ్చాక గోర్కీ అమ్మ లోని ఇవాన్, వాళ్ళమ్మ, అలాగే తుర్గేనెవ్ “తండ్రులు – కొడుకులు” లోని శూన్యవాదైన (నిహిలిస్ట్) బొజరేవ్ పాత్ర ఎంత ప్రభావం కలిగించాయో చిన్నప్పుడు ఈ కథ అంతగా ఆకట్టుకుంది నన్ను. అమ్మ నవల్లో ఇవాన్ లానే ఈ కథలోని ఇవాన్ కూడా కదిలిస్తూనే ఉన్నాడు. యుద్ధ సమయంలో జర్మన్ సైన్యానికి వ్యతిరేకంగా పనిచేసి పదేళ్ళ వయసులోనే తిరుగులేని ధైర్యంతో, అంతులేని ఆత్మవిశ్వాసంతో రహస్య గూఢచారిగా స్వచ్ఛందంగా ఉంటూ ఆ క్రమంలో అసువులు బాసిన బాలుడి , కాదు, అమరవీరుడి కథ ఇది !

“ యుద్ధం “ సామాన్య ప్రజా జీవితాన్ని ఎంతగా ప్రభావం చేయగలదంటే , అది ఏకకాలంలో వాళ్ళని కుటుంబాలని కాపాడుకునే పౌరులుగా ఉంచుతూనే, శత్రువుని ఎదిరించే అభిమన్యులుగా చేయగలదనే విషయం, “మహా దేశభక్తియుత యుద్ధంలో అభిమన్యులు” అంటో యూరీ యుకోవ్లెవ్ రాసిన ముందు మాట చదివితే తెలుస్తుంది.

“బ్రెస్ట్ దగ్గర అడివిలో వున్న ఒంటరి సమాధి నాకు గుర్తు వస్తోంది. ఒక చిన్న గుంజకి ఒక కొయ్యపలక మేకుతో దిగేసి వుంది. దానిమీద ‘ ఇక్కడ తాన్యా విశ్రమిస్తోంది’ అని రాసి వుంది” ఈ వాక్యాలు చదూతుంటే ‘అంటరాని వసంతం’ లోని ఆఖరి వాక్యం అప్రయత్నంగానే గుర్తుకొచ్చింది.

ఆర్వీయార్ అనువాదం చేసిన ఈ చిన్ని పుస్తకంలో వెరెయ్స్కీ వేసిన బొమ్మలు కూడా మనసులో ముద్రించుకుపోయాయ్. ప్రపంచకార్మిక దినోత్సవం నాడు ఎప్పట్లా చేసుకునే తంతుల కన్నా ఇలాంటి ఒక్క పుస్తకాన్ని ఇంట్లో పిల్లలకి పరిచయం చేయడం, ఎప్పుడైనా చిన్నారులకి బహుమతి గా ఇవ్వడం. అన్నింటికీ మించి ప్రచురణ అంతరించిపోకుండా పునఃప్రచురణకి ప్రయత్నించడం అవసరమని నా అభిప్రాయం.

1987 లో ( సరిగ్గా నేను పుట్టిన ఏడాది) తెలుగులో ప్రచురించిన ఈ పుస్తకం నన్నెంత కదిలించిందంటే ఏ సంవత్సరం చదివానో గుర్తులేదు కానీ ఒకటికి రెండు సార్లు చదివి వచ్చీరాని ఇంగ్లీషులో 'రాదుగ ప్రచురణాలయానికి ' ఒక ఉత్తరం రాసి పోస్ట్ చేసిన జ్ఞాపకం ఉంది. అంటరాని వసంతం లోని చివరి వాక్యం,

"ఆమె జ్ఞాపకం యుద్ధంలో విశ్రమించింది"

# చరిత్ర గతి మార్చిన పుస్తకాలు




రైతు ఉద్యమ నాయకుడిగా అణగారిన వర్గాల ప్రజల పక్షం వహిస్తూ 30,సంవత్సరాల క్రితం హత్య కాబడ్డ "బెజవాడ శరభయ్య" గారి పుస్తకం 'చరిత్ర గతి మార్చిన పుస్తకాలు'. రాజనీతి శాస్త్రం లో ఎం.ఎ . చేసి లా చదివి ఉద్యోగం చేసుకునే వీలుండి కూడా చేసుకోకుండా సామాజిక చైతన్య ప్రవాహంలో భాగస్వామై ముష్కరమూకల చేతుల్లో ప్రాణాలు కోల్పోయిన బెజవాడ శరభయ్య గారు కూర్చిన ఈ సంకలనం పుస్తక ప్రేమికులందరకీ ఒక తప్పనిసరి పాఠ్యాంశం.

చరిత్రలో పుస్తకాలు నిర్వహించిన పాత్రని సోదాహరణంగా వివరిస్తూ 17 పాశ్చాత్య గ్రంథాల పరిచయం ఇందులో కనిపిస్తుంది. ప్లేటో రాసిన ద రిపబ్లిక్, ద లాస్, అరిస్టాటిల్ మూడు గ్రంధాలు , ఎథిక్స్, పోలిటిక్స్, పొయిటిక్స్, మాకియావిల్లీ ద ప్రిన్స్, థామస్ మోర్ యుటోపియా, రూసో సోషల్ కాంటాక్ట్, డిస్కోర్స్ ఆన్ ఆరిజన్ ఆఫ్ ఇనీక్వాలిటీ, పెయినే ఏజ్ ఆఫ్ రీజన్, జాన్ స్టువర్ట్ మిల్ ఆన్ లిబర్టీ, రిప్రజెంటేటివ్ గవర్నమెంట్ వంటి చారిత్రిక గ్రంథాల విశ్లేషణతోపాటు అవి నిర్వహించిన పాత్ర కూడా ఇందులో తెలుసుకోవచ్చు.

పొనుగంటి కృష్ణారెడ్డి కి అంకితం ఇచ్చిన ఈ గ్రంథానికి తొలిపలుకు రాసిన ఏటుకూరి బలరామమూర్తి గారు, " ఈ రచయిత మరణవార్త పత్రికలో చదివిన రోజునే కొందరు మిత్రులు ఈ గ్రంధాన్ని ఇచ్చి రెండు మాటలు వ్రాయమన్నారు. రచయిత తో నాకు వ్యక్తిగత పరిచయం లేదు. వారి పేరు వినటం కూడా ఇదే మొదటిసారి. కాని వారి రచన బాగుంది. వారు మరణించిన తీరు వారిపట్ల నాకు గౌరవభావం కలిగించింది. " అన్నారు.

అనుబంధంగా "మానవ జీవితం పై పుస్తకాల ప్రభావం" అనే ముల్క్రాజ్ ఆనంద్ వ్యాసం, ముద్రిత గ్రంథాల చరిత్ర మహోత్సవం, మాతృ గ్రంథకర్తల పరిచయం ఇచ్చిన ఈ పుస్తకాన్ని 'పల్లవి పబ్లికేషన్స్', విజయవాడ వారు ప్రచురించారు. ఈ రైటప్ మొన్న ఏప్రిల్ 23 పుస్తక దినోత్సవాన్ని పురస్కరించుకునిరాయాల్సుంది.ఆలస్యమైంది. పుస్తక ప్రేమికులు, సామాజిక హితైషులు తప్పనిసరిగా తెల్సుకోవాల్సిన పుస్తకమిది.

# సందిగ్ధ సందర్భంలో...!




" సుబ్బారావుతో ఒక మేరకైనా పరిచయం ఉన్నవాళ్ళకి అతన్ని మర్చిపోవడం ఎంత కష్టమో, అతన్ని బొత్తిగా తెలియనివాళ్ళకి కొత్తగా పరిచయం చేయడం బహుశా అంతే కష్టం. " !

"శ్రీశ్రీ, తిలక్, చెరబండరాజు, శివసాగర్, నెరుడా, బోదిలేర్, పాష్, ఫైజ్, రిల్కే, గురజాడ, కుటుంబరావు, రావిశాస్త్రి, గ్రహమ్ గ్రీన్, గాబ్రియల్ గార్సియా మార్క్వెజ్, అలాగే మార్క్స్, లెనిన్, గువేరా, మావో – సుబ్బా రావు చైతన్యాన్ని , భావ ప్రపంచాన్ని ప్రభావితం చేసిన స్థానిక, జాతీయ, అంతర్జాతీయ సృజనాత్మక శక్తులు, ఆలోచనా విధానాలు" !

"శ్రీశ్రీ షష్టిపూర్తి సభలో చరిత్ర సృష్టించి విరసం ఆవిర్భావానికి దోహదం చేసిన విశాఖ విద్యార్థుల్లో అతి చిన్న వయస్కుడు సుబ్బారావే"!

"సుబ్బారావు ని పరిచయం చేసుకోవడం అంటే ఒక తరాన్ని పరిచయం చేసుకోవడం. అది తెలుగు సాహిత్యంలో ఉత్తమ లక్షణాల్ని స్వీకరించి ప్రపంచ సాహిత్యం వైపుగా ఎదిగిన తరంబీ శ్రీకాకుళం, నక్సల్బరీ పోరాటాల ప్రేరణతో మొదలుపెట్టి దేశవ్యాప్తంగా ప్రపంచవ్యాప్తంగా ప్రజలు చేస్తున్న పోరాటాలు అర్థం చేసుకునే ప్రయత్నం చేసిన తరంబీ...."!

" నేను తుపాకీ గుళ్ళకి బలైపోయిన
స్నేహితుల గురించి రాయను
వాళ్ళ వీరత్వంలో యాదృచ్ఛికతను
మాత్రం గుర్తిస్తాను"

అంటో "ఏంటీ – ఎలిజీ" లో రాసుకున్న సి.వి., అందులోనే,

" జీవించగల జీవితం తప్ప
ఇంకేమీ లేని వాణ్ణి
అమరత్వాన్ని కవిత్వంలో
ఆవిష్కరించ నిరాకరిస్తాను" అంటాడు.

ఎవరీ సుబ్బారావు?

ప్రఖ్యాత చరిత్రకారుడు రామచంద్ర గుహ How much should A person Consume

: Thinking through the Environment గ్రంథాన్ని ఈ సి.వి.సుబ్బారావు స్మృతి ని ప్రచురించాడు !అనేక అంశాలు ఆనాటి రాజకీయ విప్లవ హక్కుల సంస్కృతి ఆనవాళ్ళు.. ఇంకా ఎన్నో విషయాల పరంపరగా వచ్చిన సి.వి రచనల సంపుటే, " సందిగ్ధ సందర్భం".ఇంతకంటే పరిచయం అతౌతుందేమో కానీ సాహిత్యా భిమానులు , కళాభిమానులు, సామాజిక, సాంస్కృతిక కార్యకర్తలు తప్పనిసరిగా చదవాల్సిన పుస్తకం ఇది !

"సుబ్బారావు ఇవాళ మన మధ్య లేడు. అయినా అతను ఒక జీవితకాలం సంఘర్షించిన సందర్భం ఉంది. అందుకే అతనితో పరిచయం మన చైతన్యాన్ని, కర్తవ్యాన్ని ఏదో మేరకి స్పృశిస్తుంది. అతని కిష్టమైన మాటల్లో చెప్పుకోవాలనుకుంటే –

" ప్రయాణారంభాన్ని మర్చిపోతే గమ్యం శిథిలమౌతుంది."!

**( సుబ్బారావు రచనల సంపుటి "సందిగ్ధ సందర్భం" కి మిత్రులు రాసిన ముందుమాట నుండి....)**

# సగటు మనిషి ఎజెండా

## కవిత్వం పై ఎర్రజెండా!




"కెరటం విరగడం
తీరాన్ని విస్తరించడానికే!
ఒడ్డునున్న ఇసుకరేణువుల్ని
సాగర గర్భంలో ఇమడ్చడానికే!
ఉద్యమం లోతు చూపడానికే!
కెరటం విరగడం
చేపల్నించి తిమింగలాల్ని వేరు చేయడానికే!"

జి. కళ్యాణరావు సంచాలకుడుగా , చెంచయ్య , వరవరరావు, నారాయణస్వామి సంపాదకులుగా 1995 లో వచ్చిన కవితా సంకలనం ' కవిత్వం పై ఎర్రజెండా'. 117 కవితలున్న ఈ సంకలనం లో నాటి సాంఘిక రాజకీయ పరిణామాలు స్పష్టంగా కనిపిస్తాయి.

భిన్నమైన రాజకీయ అభిప్రాయాలు ఉండడమే నేరంగా ఈరోజు కవుల్ని, కళాకారుల్ని అక్రమంగా నిర్బంధించిన పరిస్థితి లో సృజనాత్మక అభివ్యక్తి ని నిలుపుకోవాల్సిన అవసరం తెలుగు సాంస్కృతిక సమాజం మీద ఉంది.

నలభై ఏళ్ళ క్రితం హన్మకొండలోని అన్యాయాలను ప్రశ్నించి కొండయ్యనే ముష్కరుడి చేతిలో హత్యకు గురైన జ్ఞానేశ్వర కీర్తి చనిపోయే ముందు ఇచ్చిన మరణ వాంగ్మూలంల, అతడి "కింద బండా మీద ఎండా" వర్గస్పృహకి ప్రతీక.

సలంద్ర "దళిత్ మానిఫెస్టో" cultured bastards మొహాన ఉమ్మితే, శివరావు

"ఉషస్సును ఉరితీయలేరం"టూ గర్జించడం కనిపిస్తుంది. అలిశెట్టి " గుండె గుండెకీ మద్య ", సాహు "మదనా నా వయారి", సి.వి, "యాంటీ ఎలిజీ" అజ్ఞాత సూరీడు గా సత్యమూర్తి రాసిన ఆకాంక్ష ఎంత అద్భుతమైన కవిత...

"ఈ ఒక్క క్షణాన్ని
సాగదీసి కాగడా లాగా
వెలిగించబోతున్నాను -
దీని వెలుతుర్లో
దోపిడీ చీకట్లను
జీవితాల తాకట్లనూ

తుదముట్టించబోతున్నాను
దీని వేడిలో
కృత్రిమ జీవితపు విలువల్ని
నాశనం చేస్తాను-
జీవితపు ఎలాస్టిక్ను
మరింకెప్పుడూ సంకోచించకుండా చేస్తాను!"

అక్షరాలా నూటపదిహేడు మంది ధిక్కార కవితల సంకలనం! మళ్ళీ ఈ స్థాయిలో తర్వాత రోజుల్లో 'విరసం' ప్రచురించిందేమో నాకైతే తెలీదుకానీ, సరగ్గా 25 సంవత్సరాల క్రితం వచ్చిన ఈ కవితా సంకలనం మాత్రం

కచ్చితంగా ఒక గొప్ప కృషి.

సీనియర్ కవులు, రచయితలు మొదలుకొని ఆనాటి వర్ధమాన కవులు, ఈరోజు పెద్దరికం సంతరించుకున్న అనేక మంది కవితల్ని ఇందులో చూడొచ్చు.యవక "కర్మ భూమిలో పూసిన ఓ పువ్వా" నుండి అనామధేయుడి,

"సూర్యుడా నీకు చావులేదు" వరకూ, శశికళ "పహారా" నుంచి,కౌముది స్మృతి గీతాలు, షహీదా "సందర్భాలు" దాకా ప్రతీ కవితా ఒక సంఘర్షణ తాలూకా తపనే!

"ప్రవాహాలు అలసిపోతాయి
దావానలం ఆరిపోతుంది
వాగులు ఇంకిపోతాయి
మిగిలిన ఇసుక పర్రల్లో
కన్నీటి విత్తనాలు కత్తులచెట్లై మొలకెత్తవు"
( నడక ఆపకు, వేణుగోపాల్)

నిత్య సంక్షోభాల మధ్య ఒంటరిగా ప్రయాణిస్తోన్న సామాజిక ఉద్యమాల యాదిలో ఎందుకనో నిరాశ, నిస్పృహల్ని అధిగమించే ఆచరణ దిశగా అక్షరాల్ని సాయుధం చేసే నక్సల్బరీ ప్రేరణతో గతకాలపు స్ఫూర్తిని తల్చుకోవాలని అనిపించింది. కళ్యాణరావు అన్నట్లు,

"ఈ రచన సాగిపోతూనే ఉంటుంది,
బ్రతుకే పునాదిగా రోజుకో మొగ్గ పుడ్తూనే ఉంటుంది.."

**("కవిత్వం పై ఎర్రజెండా"కి రజతోత్సవ శుభాకాంక్షలతో....)**

# మీరు కళ్ళు మూసుకుంటే,
## సూర్యోదయం చీకటి అయిపోతుందా..?



"శూద్ర కులాలు బ్రాహ్మణుల అజమాయిషీ ధిక్కరిస్తారు, కానీ కింద ఉన్న బిసీ, ఎస్సీ కులాల మీద పెత్తనాన్ని వదులుకోరు. బిసి కులాలు, అగ్రకులాల హాజం వద్దనుకుంటాయి కానీ ఎస్సీ కులాలు తమతో సమానమని ఒప్పుకోవు. మాలలు తమకి సమాన అవకాశాలు కావాలంటారు. కానీ, మాదిగలకి అటువంటి అవకాశం ఇస్తామనేంత పెద్దమనసు చూపలేరు. కుల రాక్షసి పదఘట్టనలో అట్టడుగున నలిగిపోయే అణగారిన కులస్తుడు కూడా , ఇంట్లో భార్య పైన ఆధిపత్యం చెలాయించకూడదని అనుకోడు."

(పేజి:165)

బి.సీ.ల కుర్చీల పై అగ్రకులాల కబ్జా ఎన్నాళ్ళు..?అంటూ సరిగ్గా 15 సంవత్సరాల క్రితం, మార్చి 2005 విజయవిహారం పత్రిక కవర్ కథనానికి మూడేళ్ళ తర్వాత వచ్చిన పుస్తక రూపమిది. కులనిర్మూలన ఇరుసుగా బి.సి.ఉద్యమం నినాదంతో 5 వేల సంవత్సరాల కులవ్యతిరేక పోరాట చరిత్రకు అక్షర రూపమిచ్చిన సాహసోపేత కథనం ఇది. మొహం పగిలేట్లు, నిప్పులతో కడిగినట్లున్న ఈ అక్షరాగ్నులుఆ పత్రిక ఎడిటర్ రమణమూర్తివి.

అర్ధదశాబ్దం పాటు రాష్ట్ర రాజకీయ, సామాజిక రంగాల్ని అట్టుడికించి ఎన్నో ఉద్యమాల్లో ఆరితేరి మరెన్నో ఆటుపోట్లు ఎదుర్కొని ఒక పత్రిక ద్వారా జై భారత్ అనే నవతరం యువజన సంఘాన్ని అనితర సాధ్యమైన రీతిలో నిర్మించుకున్న చరిత్ర పట్ల సోకాల్డ్ మేధావులంతామౌనం పాటించడం, తెలుగు మేధో సమాజానికి అలవాటైన జాఢ్యం.

కులనిర్మూలన కోసం కృషి చేసేవారి కులాన్ని బట్టి వ్యక్తిత్వాన్ని అంచనా వేసే దుస్థితి పోనంతకాలం సమాజంలో కులతత్వం పోదు. వామపక్షాలతో మొదలెడితే దళితబహుజన మేధావుల వరకూ, గతంలో రాసుకుపూసుకు తిరిగిన అవార్డు గ్రహీతల నుంచి ఎన్నో రంగాల్లో రివార్డులందుకుంటున్న ఎంతోమందికి మిత్ర సంస్థ జై భారత్ !

" కులం ఎప్పుడు ప్రారంభమైందో కులనిర్మూలన పోరాటం కూడా అప్పుడే ప్రారంభమైందని చెప్పాలి. కులానికి ఎంత చరిత్ర ఉందో కులనిర్మూలన పోరాటానికి సైతం అంతే చరిత్ర ఉంది " అంటో తెలుగు సాహిత్యంలో కులనిర్మూలన పోరాట

చరిత్రకి తిరుగులేని సాధికారిక డాక్యుమెంట్ రూపమిచ్చిన గ్రంథం ఇది.కులనిర్మూలన పట్ల కచ్చితమైన అంకితభావం ఉంటేతప్పా ఇలాంటి కృషి సాధ్యం కాదు. జై భారత్ ఇతరేతర ప్రచురణలన్నీ ఒకెత్తూ, ఇదొకటీ ఒకెత్తు!

చట్టసభలు మొదలు ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్ల వరకూ, ఎస్సీ వర్గీకరణ నుండి కులాంతర వివాహాలు, మత సమైక్యత దాకా, భారత ఉపఖండం చరిత్రలో ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్, చలం వంటి మహనీయుల పేర్లతో స్మారక భవనాలు కట్టడం నుండి రాం మనోహర్ లోహియా గ్రంథాలయ ఉద్యమం, పూలే ఆసుపత్రి, సాహుమహరాజ్, పందిళ్ళపల్లి శ్రీనివాస్,..ఇలా అనేక మంది మంచి మనుషులని గుర్తు చేస్తూ అనేక కార్యక్రమాలు...ఇంకా ఎన్నో కరపత్రాలు, గ్రంథ ముద్రణలు, సభలు, సమావేశాలు, వర్క్ షాప్ లు. ఈనాటికీ 'సమాచార హక్కు ఐక్య వేదిక' నుండి మానవ హక్కుల నేతల్ని విడుదల చేయమనే ఉ ద్యమం వరకూ న్యాయం పక్షాన నిలిచే బలమైన ఉద్యమ గొంతు జైభారత్ ది !

" ఈశావాస్య మిదం సర్వమ్" అంటూ జ్ఞానాన్నే ఆరాధించిన ఉపనిషత్తులు

"తత్వమసి" అని నినదించిన ఏకత్వం మొదలు, బౌద్ధం, జైనాల తిరుగుబాటు, ఆదిశంకరాచార్యులు, నందనార్, తిరువళ్ళువార్, రామానుజుడు, బసవుడు, బ్రహ్మానాయుడు, చొఖా?మేళా, నామదేవ్, గోరోబా, తుకారాం, జనాబాయి, సవతామాలి, నరహరి సోనార్, రాకా కుంభార్, సేనాన్హవి, కన్హోపాత్ర, గాడగిబూవా, మొల్ల, బహినాబాయి, గురవ , కబీర్, రవిదాస్, అన్నమయ్య, గురునానక్, కనకదాస్, చైతన్యుడు, వేమన, సుందర్దాస్, పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి, ఘాసీదాస్, శాయాజీరావు గైక్వాడ్, అయోతీదాస్, స్వామి నారాయణ, గోపాల్ కాశీనాథ్, స్వామి దయానంద సరస్వతి, భాయ్ పరమానంద, స్వామి శ్రద్ధానంద, లేఖరాం, మున్షీరామ్, సాయిబాబా చైతన్యాన్ని ఇందులో పరిచయం చేశారు.

అంతేకాదు, రాజారామ్ మోహన్ రాయ్, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, తుక్డోజి మహరాజ్, మహాత్మా పూలే, సావిత్రి బాయి, రమాబాయ్, నారాయణగురు, డా.పల్పు, కుమారన్ ఆశన్, సహోదరన్ అయప్పన్, అయ్యంకాళి, మన్నట్టు పద్మనాభన్, సాహుమహరాజ్, భాగ్యరెడ్డి వర్మ, మహాత్మాగాంధీ, అంబేద్కర్, పెరియార్, లోహియా, జె.పి, దాకా జాతీయోద్యమంలో కులతత్వానికి వ్యతిరేకంగా నినదించిన చరిత్ర కళ్ళముందుంచారు.

అక్కడితో ఆగలేదు. త్రిపురనేని రామస్వామి, గుర్రం జాషువా, బోయి భీమన్న, కుసుమ ధర్మన్న, గురజాడ, రఘుపతి వెంకటరత్నం నాయుడు, ఉన్నవ లక్ష్మీనారాయణ, కందుకూరి, గరిమెళ్ళ, కృష్ణశాస్త్రి, గోరా, సానే గురూజీ, ఠక్కర్ బాపా, దేవర్, కాలేల్కర్, మండల్,దాకా

ఈరోజు కులనిర్మూలన కోసం ఉద్దేశించిన నక్సలైట్ గ్రూప్ లు, కమ్యూనిస్టు పార్టీలు, దళిత బహుజన సంఘాల నాయకుల నలబై కి పైబడిన ఇంటర్వ్యూలు , అభిప్రాయాలతో ప్రచురించిన ఈ ప్రచురణ ఆనాడే కాదు ఈనాటికీ ఒక రికార్డే !

తెలుగు సమాజంలో కులనిర్మూలన కోసం విస్తృత స్థాయిలో జరిగిన మేధోకృషికి సంబంధించిన దార్శనిక సంవాదానికి విశాల దృక్పథంతో కూడిన దిక్సూచి ఈ ప్రచురణ. ఎవరు అంగీకరించినా, విభేదించినా సమానత కోసం రాయబడే చరిత్రలో ఈ దేశపు బహుజనులు, అణగారిన ప్రజలకోసం నినదించిన సమూహ గొంతు ఈ ప్రచురణ, అశేష జన శ్రేణుల సంక్షేమం కోసం సంధించిన అస్త్రం ఈ దస్త్రం. కులనిర్మూలన పై సీరియస్ అధ్యయనం చేసేవారందరి దగ్గర ఉండాల్సిన గ్రంథం ఇది.

అనేకమంది వ్యక్తులు, సంఘాలతో రాజకీయ,సామాజిక విభేదాలు ఉన్నప్పటికీ, ఇప్పటికీ జై భారత్ మౌనంగా తన పని తాను చేసుకొంటూ పోతోంది. ఉభయ తెలుగు రాష్ట్రాల లోనే కాక దేశంలోని ఐదు పైచిలుకు ఇతర రాష్ట్రాల్లోని కేడర్ తో నిరంతరం సామాజిక చైతన్యం కోసం కృషి చేస్తూ జై భారత్, ఎస్సీ వేదిక, బీసీ వేదిక, మహిళా వేదిక (జ్వాల), ఎం.బి.సి. వేదిక, ఎస్టీ వేదిక, సాంస్కృతిక వేదిక, రే సర్కిల్ , ముస్లిం రివల్యూషనరీ ఫోరం ఇలా అనేక విభాగాలతో సాహిత్య, సామాజిక, సాంస్కృతిక వికాసానికై పాటుపడుతోంది.

**(ఈ గ్రంథం ప్రచురించి 15 ఏళ్ళు అయిన సందర్భంగా ఈ చిన్న రైటప్. )**

# కల్లోర కఠిన నిజాలు, నెగెటివ్ కథలు !




తెలుగు సాహిత్యంలో ''నెగెటివ్ కథలు'' వచ్చి పదేళ్ళవుతోంది. అనేక సౌకుమార్యాల మధ్య కునారిల్లుతున్న తెలుగు కథని తన యదార్థ బతుకు అనుభవంతో చాచి లెంపకాయ కొట్టిన కెమేరా విజయకుమార్ దూరమై సరిగ్గా నాలుగేళ్ళు.

''ఆలస్యానికి ధృవపత్రముండదు'' పేరిట రాసిన ముందుమాటలో, " ఈ దేశంలో అంటరానివారంటే అసహ్యాన్ని మాటలు లేక చేతల్లో వ్యక్తీకరించకుండా కనుపాపల వరకే పరిమితం చేయడానికి చాలా రక్తపాతం అవసరమేమోననిపించడం మానలేదు.."

అంటో, " ..ఊహ ఎరిగిన నాటి నుండి చూస్తున్న సినిమాల్లో ' ఈ చిత్రంలోని పాత్రలు అన్నీ కల్పితాలే , ఎవరినీ ఉద్దేశించినవి కావు' అనే సర్టిఫికేట్ లు నేను నా కథలకు ఇవ్వలేను' అంటూ మొహం పగిలేలా చెప్పాడాయన.

పెద్ద రోగం మొదటి కథ. " కష్టాలతో కొట్టుకుపోతున్నా, తినడానికి తిండి లేకపోయినా, ప్రపంచమంతా వెలివేసినా, పక్కవాడ్ని కులం పేరుతో హీనంగా చూసేవాళ్ళు ఈ దేశంలో మాత్రమే దొరికే అరుదైన పౌరులు ." అంటారందులో.

ఏది పెద్ద రోగమో చెప్పక్కర్లేదనుకుంటా!

రెండోది ''అంటరాని ప్రేమ', " కర్మ, తలరాత అనే మత్తు మందుల్తో పుట్టకముందే ముఖాల పై అంటరాని వాళ్ళనే పచ్చబొట్టు పొడిచిన ఈ వ్యవస్థ పై మొదట చేయాల్సింది వర్ణ పోరాటం " మాటలు పాత్రవే ఐనా మనసు రచయితది.

భవిష్యనిధి, సర్వజ్ఞులు, ఇంకా తెలవారలేదు పేరుకే కథలుకానీ ఆయన అనుభవాలే. డైనోసర్ కథలో స్కూల్ లో కులగజ్జి ఎంతగా ఉండగలదో నిరూపిస్తూ వేసిన ప్రశ్న,

" గదిలో అగ్గిపుల్ల గీస్తే గది వేడెక్కుతుందా? మీ పిచ్చిగాని నీ ఒక్కడి వల్ల సమాజం మారదు. కాలాన్ని బట్టి నడుచుకోవాలి" అని అందరూ చెప్పేవారే, కానీ, " కొలిచే సాధనాలు ఉండాలే కాని గదిలో ఒక్క అగ్గిపుల్ల కాదు, సగం అగ్గిపుల్ల మండినా గది ఉష్ణోగ్రత అంతకు ముందు కంటే పెరుగుతుంది "అని తెల్సిన భౌతిక శాస్త్ర ఉపాధ్యాయుడిని" అంటారాయన.

బోన్సాయిని మించిన కసాయి నాకు నచ్చిన కథ. ఈరోజుకీ పరిష్కరించని జిల్లాలో శిరోముండనం కేసుకి సంబంధించిన మొదటి ఫొటో తీసింది , అక్కడ కెళ్ళి బాధితులకి అండగా నిల్చి వార్త రాసింది కెమేరా విజయకుమార్ మాష్టారే. ఆఖరు కథ ' ఈ సినిమా తెరకెక్కదు'. మధ్యమధ్యలో ఫొటోలతో వచ్చిన కెమేరా విజయకుమార్ ఏకైక పుస్తకం ఇది. పుస్తకంగా రాని రచనలు, వ్యాసాలు, ముఖ్యంగా బౌద్ధం గురించిన పరిశోధన కాలగర్భంలో కల్సిపోయాయి.

దళిత బహుజన సాహిత్యం – నెగెటివ్ కథలు అంటో ఎ.ఎన్. నాగేశ్వరరావు గారు ముందుమాట రాసారు.కడగని పాత్రలు ఈ నెగెటివ్ లంటూ సతీష్ చందర్ మున్నుడి రాస్తూ అంటారు.

" అవమానం అనుభవమయినచోట అధిక్షేపమే సాహిత్య మవుతుంది. ఉలికిపాటే ప్రతిస్పందన అవుతుంది..... ఈ కథల్లో శైలి ఉందా? లేదా? ఏమిటా శిల్పం?

" నెగిటివ్స్ లో రంగులు వెతకడం వృధా యత్నం.

నెగెటివ్ నెగెటివే దళిత సాహిత్యంలో కథకయినా, నవలకయినా , కవితకయినా – స్వీయచరిత్రాత్మకాంశం ఎక్కడో అక్కడ విధిగా ఉంటుంది.....

అందుకే, ఈ కథలు నిజంగానే నెగెటివ్ లు. కడక్కండి. రంగుల్ని అద్దకండి. నలుపూ ఒక రంగే. చీకటీ ఒక బతుకే. నిజం విశ్వరూపం చీకటే. దర్శించి తరించండి" అంటారు.

ఆ ధైర్యముంటేనే ఈ అక్షరాలు మింగుడుపడతాయ్. ఆయన బతికున్న రోజుల్లో చాలా సార్లు అనుకున్నా ఈ కథలమీద సమీక్ష రాయాలనీ, సమాజాన్ని ప్రక్షాళన చేయాలని తపించిన ఆయనలోని ఆవేశానిది ఒక అర్ధవంతమైన లక్ష్యం. అందుకే సామాజిక స్పృహ కలవాళ్ళందరికీ అదో అప్రకటిత దిక్సూచి.

**అసంపూర్తిగా అయినా, ఆయన వర్ధంతి సందర్భంగా ఇలా...**

# దళిత ఉద్యమ క్రోధం,

## పాతికేళ్ళ పంచమ వేదం!




"హైందవ పద్యానికి అతికిన అయిదవ
పాదాన్ని నేను.
వృత్తం వెలుపలే ఉత్తవచనంలా
పరిభ్రమించిన నాకు-
మరణమెపుడూ పునరావృతమే.
నూనెకు నోచుకోని గానుగెద్దును నేను.
వృత్తలేఖినిలోని పెన్సిల్ ముక్కలా
అరిగిపోయిన నాకు-
వర్తమానమెప్పుడూ చెరిపేసిన గతమే.
అంకెలకు విలువ నిచ్చిన గుండు సున్నాని నేను.
మొత్తాల కుడి ప్రక్కలో
సంఖ్యా మానభంగానికి గురయిన నాకు-
ఎడమెప్పుడూ కడుపులో రగిలే ఖాళీతనమే."

(వృత్తాంతం)

తెలుగు సాహిత్యంలో సతీష్ చందర్ "పంచమ వేదం" వెలువడి పాతికో సంవత్సరం. దళిత కవిత్వాన్ని సరికొత్తగా పదునెక్కించిన అక్షరసంపుటికి రజతోత్సవం. అడుగడుగునా అసమానతల విషాన్ని కక్కే కులవ్యవస్థ నిజస్వరూపం ఒక యువకవి బయటపెట్టి ఇరవై అయిదేళ్ళు. ఏం మారింది ఈ ఏళ్ళలో ఒక్క సాగే సమయం తప్పా..?

"నీకు చచ్చినా అర్దం కాదురా - అని
మీరు తిట్టుకుంటూ చెప్పిన వేళ్ళ మీద లెక్క
నాకు చచ్చాకనే అర్థమయింది.
నేనెన్నిసార్లు లెక్కపెట్టుకున్నా
నాచేతికి నాలుగు వేళ్ళే ఉండేవి.....
.....................
నేను తెల్లమొహం వేసినప్పుడల్లా
మీరదేదో అమృత భాషలో తిట్టేవారు.

నాకన్నం తప్ప అమృతం సయించదు.

నిజం చెప్పండి

పంచముడంటే అయిదోవేలు లేనివాడనేనా అర్థం?"

( పంచమ వేదం)

అంటూ ఆనాడు అడిగిన ప్రశ్న ఈనాటికీ పచ్చిగానే ఉంది.అదక్కడితో ఆగలేదు. సొంత మనుషుల పట్ల పెట్టిన చిచ్చును కూడా ప్రశ్నించింది,

"రెప్పవాల్చని కన్నుల్లా రెండు బావులు

ఒకటి మాకు

రెండు మా వాళ్ళకు

మధ్యలో ముక్కుమీద వేలేసుకున్న రోడ్డు"

(కలవని కనుపాపలు)

"గెలుపు ఓటములు

కత్తికట్టిన దేవుళ్ళవి

చావు బతుకులు

చప్పట్ల మధ్య కోళ్ళవి"

(కోడి పందాలు)

అవమానాల సుడిగుండాల్లో అన్నీ ఆధిపత్య రూపాలైనప్పుడు ఇక ఆప్యాయత లకి అవకాసం ఏది? అందుకే,

"నా వారసుడెప్పుడూ ఒకేఒక ప్రశ్న వేస్తాడు

"నాన్నా నేనెప్పుడు పుట్టాలి"

నిలువుటద్దం ముందు నిల్చుంటాన్నేను

అవయవాల దొంతర కాదు

అవమానాల పరంపర కనిపిస్తుంది "

( ఒక జననం వాయిదా)

అగ్రకులాధిపత్యం విస్తరించిన అన్ని పాశ్వాలూ ఎలా ఆవరించిందో కవి చెప్తూ,

" పాలే కాదు

కొన్నిచోట్ల పాపాలు కూడా తెలుపే

కాకుంటే కాసింత కన్నీళ్ళ కల్తీ."

( లాస్ట్ ఏంజిల్స్)

అంటాడు. ఈ రోజు అట్టుడుకుతున్న అమెరికాలోని జాతి వివక్షతను

ఎత్తిచూపుతూ ఆనాడే, " అమెరికన్ బ్లాక్స్ ఆగ్రహ జ్వాలలకు స్వదేశీఆజ్యమిది" అనడం, ఈ పుస్తకానికి ముందుమాట రాసిన ఏ.బి.కే. బ్లాక్స్ ఉద్యమం పై కూడా ప్రస్తావించడం ఈరోజు గుర్తు చేసుకు తీరాలి.

" తొలి కోడి బదులు
మలి కాకి కూసింది
దాని గొంతు నిండా పిండాకూడు.

...............................

ఎంత వేచి ఉన్నా
ఎర్రబారుతుందే తప్ప తెల్లవారదు"
(సామూహికంగా సిగ్గుపడదాం)

" దేశం వాడిది
గిన్నె వాడిది
అన్నం వాడిది
నోరే మరొకరిది"
( డీలక్స్ సెంటర్లో బిచ్చగాడు)

" నా జాతి అరికాలికి అంటిన ఎంగిళ్ళు మీరు"(ఎంగిళ్ళు) అన్న కవి, " నాకిప్పుడు కొండమీదకెక్కి ఉరుముల ముందు ప్రసంగించాలని ఉంది, గర్జించి, ఘీంకరించి ఊరిలేళ్ళను వాడవైపు పరుగులెత్తించాలని వుంది. సాధు జంతువుల క్రూర దంతాలను పరమ శాస్త్రోక్తంగా పెకలించాలని వుంది "(అక్షర శయ్య) అంటాడు.

సామాజిక కార్యకర్త, ప్రగతిశీల పాత్రికేయుడు తిరుమాని సత్యనారాయణ రాజు (సనారా) కి అంకితం ఇచ్చిన ఈ సంపుటిలోని చివరి కవిత,"విలుకాడి వీలునామా" సాక్షిగా 'అక్షరశయ్య'లోని అభివ్యక్తి అచ్చంగా ఒక విస్పష్టమైన విస్ఫోటన.

"ఆదియందు అక్షరముండెను. అక్షరము అమ్మవద్ద వుండెను. అక్షరమే అమ్మయి వుండెను. ఆమెన్."

**(1995 లో వెలువడ్డ పంచమ వేదానికి రజతోత్సవం సందర్భంగా., అవే ప్రశ్నలు అదే క్రోధంతో మళ్ళీ సంధిస్తూ, ఇలా ఈ చిన్ని రైటప్.)**

# శతాబ్దాల కులవివక్ష పై అక్షర యుద్ధం,
## హిందూ సామ్రాజ్యవాద చరిత్ర !




"సామ్రాజ్యవాద ఆధిపత్యాన్ని కొనసాగించడానికి, ప్రజలను విభజించి పాలించడానికి మానవ మేధస్సు కనిపెట్టిన ఆయుధాలన్నింటిలోకీ ప్రమాదకరమైన ఆయుధం ఈ కులవ్యవస్థ.." (పేజి : 48)

కేరళ లో సాంప్రదాయ కుటుంబంలో జన్మించిన పరమేశ్వర మీనన్,గోల్డ్ మెడలిస్టు విద్యార్థిగా, ఉన్నతశ్రేణి ఉద్యోగిగా, న్యాయవాదిగా చేసి తదనంతరం కులక్రౌర్యానికి కలత చెంది, ప్రఖ్యాత ఆధ్యాత్మిక విప్లవకారుడు , సంస్కరణవాది నారాయణగురు ప్రభావంతో "స్వామి ధర్మతీర్థ" గా మారి హిందూత్వం కులవ్యవస్థ ని పెంచిపోషిస్తున్న పద్ధతి ఎంత ఘోరంగా ఉందో దేశవ్యాప్తంగా అనేక ప్రాంతాలు పర్యటించి తెల్సుకున్నాడు !

విశాఖపట్నం నుండి రాజమండ్రి, తిరుపతి వరకూ, మద్రాసు నుంచి బొంబాయి, లాహోరు దాకా ఆచరణాత్మకంగా సాగిన ఆయన శోధన అనేక విస్మయకర వాస్తవాల్ని మన ముందుంచింది. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే భావనలకి హిందూ మతం లో ఎంతమాత్రం చోటు లేదని తెల్సి తన 56 వ ఏట హిందూయేతరుడిగా మారి మరణించాడు. "తన జీవితాన్ని కరిగించి చరిత్రను మధించి సారాన్ని వడపోసి రూపొందించిన ఈ పుస్తకాన్ని మనకు కానుకగా అందించాడు."అంటారు ప్రచురణకర్తలు. The Menace of Hindu Imperialism పేరుతో 1941లో ప్రచురించిన ఈ గ్రంథం తర్వాత The History of Hindu Imperialism పేరిట వెలువడి ప్రకంపనలు సృష్టించింది !

తెలుగులో రెండు దశాబ్దాల క్రితం కలేకూరి ప్రసాద్ అద్భుతంగా అనువదించిన ఈ విలువైన పుస్తకం హైదరాబాద్ బుక్ ట్రస్ట్ డాక్టర్ కొల్లా వీరయ్య చౌదరి గారి స్మృతిలో ప్రచురించింది. పాతిక అధ్యాయాలు ఉన్న నూటపదహారు పుటల ఈ పుస్తకం గురించి, " ఈ పుస్తకాన్ని నాకిష్టమైన దృష్టి కోణం నుంచి రాసారు. నేను కూడా ఈ అంశం పైన ఒక పుస్తకాన్ని రాస్తున్నాను. నేననుకున్న విషయాలు ఎన్నో ఈ పుస్తకంలో చర్చించారు. అందుకని ఈ పుస్తకం ఎంతగానో ఆహ్వానించదగినది." అంటారు

అంబేద్కర్ !

"కుల పథకంలో దేవాలయం ప్రధానమైన పాత్రను పోషిస్తుంది. అది కేవలం ఆరాధనా స్థలం మాత్రమే కాదు. అది ఎన్నో కార్యాల సాధనలో కీలకమైన పాత్ర వహిస్తుంది..." అన్నాయిన, "(పేజి- 54) హిందూమతం అనే బ్రాహ్మణ సామ్రాజ్యవాదాన్ని నిలబెట్టడానికి కులం, దేవాలయం, తత్వం స్తంభాలుగా నిలిచాయి. "(పేజి- 54) అంటారు. అంతేకాదు, "దేశం మొత్తం వ్యాపించిన దేవాలయాలు తమ భక్తుల నుండి డబ్బును కొల్లగొట్టడం తప్ప ఇంకెందుకైనా పనికొస్తు న్నాయా?(పేజీ- 89),అంటో ప్రశ్నిస్తారు !

"ఏ నాగరిక దేశంలోనైనా మతం ప్రాథమిక కర్తవ్యం సోదరులకు సాయం చేసి వార్ని పైకి తీయడం. కానీ భారతదేశంలో అధిక ఆదాయాలు పొందుతున్న దేవాలయాలు ఆ పని చేయడంలేదు...అణగారిన వారిని ఉద్ధరించే లక్ష్యమేదీ వాటికి లేదు. (పేజి74,75) " అంటారు !

"ఆధునిక సమాజంలో కులాలు చేసే ప్రయోజనకరమైన పనేదీ లేదు" అంటూ, జాతీయ జీవనంలోని ఏ అంశమూ కులం ప్రభావం నుండి తప్పించుకోలేదు... కుల వ్యవస్థ నేపథ్యంలో పెరిగినవారు జాతి శ్రేయస్సు గురించి కానీ, మానవత్వం గురించి కానీ పట్టించుకుంటారంటే అది అత్యాశే. కులం జాతి వ్యతిరేకమైనది. అప్రజాస్వామికమైనది. ప్రజాస్వామ్యం, కులం కలిసి జీవించలేవు."(పేజి - 73, 74)అంటారు !

వైదికయుగం నుండి బౌద్ధ యుగం వరకూ, ముస్లిం, క్రైస్తవ, సిక్కు మతాల పాత్ర నుంచి జాతీయోద్యమం, దివ్యజ్ఞాన సమాజం, కాంగ్రెస్, వేదాంతం, సోషలిజం వరకూ అన్ని అంశాల్ని విపులంగా చర్చించిన ఈ గ్రంథం, కులవ్యవస్థ అమానవీయ వికృత రూపాన్ని విప్లవాత్మకంగా విశ్లేషించిందనడంలో సందేహం లేదు. ఎంతో కృషి చేసిన ఈ కృతి ప్రతీ కులనిర్మూలనవాది ఒకటికి రెండుసార్లు చదవాల్సిన గొప్ప పుస్తకం !

" భారతదేశం స్వేచ్ఛను పొందాలనుకునే ముందు హిందూ జాతి స్వేచ్ఛను పొందాల"ని (పేజి - 108)ఉద్ఘాటించిన ధర్మతీర్థ, "నిజమైన సోషలిజం అంటే ఒక సంస్కృతి... సోషలిజం అంటే ఆర్థిక, సామాజిక రాజకీయమైన అంశాలేకాక, మానసిక, నైతిక, మేధోపరమైన అంశాలను కూడా ప్రభావితం చేసే ఒకానొక తత్వం....సోషలిజం విజయం అంతిమంగా ప్రజల నైతిక పరివర్తన పైన ఆధారపడి ఉంటుంది." (పేజి - 112) అంటారు !

"కులవ్యవస్థ కన్న ఏ సామ్రాజ్యవాదమైనా తక్కువదనే చెప్పవచ్చు. ఈ సత్యాన్ని మనం గుర్తించి ప్రచారం చేయాలి..." అంటూ చెప్పిన ధర్మతీర్థ, "కులరాజ్యాన్ని

పునరుద్ధరించటం (ఏ రూపంలోనైనా) అతి ప్రమాదకరమైన అంశం. దానికి వ్యతిరేకంగా స్వేచ్ఛను కోరే అందరూ హిందువులు, ముస్లింలు, సిక్కులు, క్రైస్తవులు కలసిపోరాడటానికి ఐక్యం కావాలి.” (పేజి -116) అంటూ ముగిస్తారు !

దేవాలయంలోకి వెళ్ళారనే సాకుతో, ప్రేమించారనే వంకతో దళిత బహుజనుల పై ఇష్టానుసారం దాడులు, హత్యలు చేస్తున్న ప్రస్తుత సమయంలో స్వాతంత్ర్య పూర్వం వొచ్చినదే ఐనా సమతా వ్యవస్థ కోసం ఆలోచించే, సమానత్వాన్ని ఒక విలువగా సమర్ధించే వారంతా చదవాల్సిన ముఖ్యమైన ఈ పుస్తకం పై ఎన్నాళ్ళ నుండో రాయాలని అనుకుంటున్న ఈ చిన్ని రైటప్ !

# అనేక వెతలకి అక్షర రూపం

## బీద బ్రతుకు




"బ్రాహ్మణుల ఇండ్ల వద్ద అన్నం తింటే పుణ్యమని కొంతమంది చాదస్తపు కలిమిగల బ్రాహ్మణేతరులు అనుకొని బ్రాహ్మణుని ఇంటికి భోజన సామాగ్రిని యావత్తూ పంపించి అక్కడ అన్నం తినేవాళ్ళు. అన్నం తిన్న తరువాత వారు తమ విస్తళ్ళను పారవేసి వచ్చి తాము అన్నం తిన్న చోటును ఆవు పేడతో అలికేవారు. తరువాత బ్రాహ్మణ ఆడవారు వచ్చి పసుపునీళ్ళు చల్లి ఆ చోటును శుద్ధిచేసేవారు" (పేజి 26)

తెలుగులో సూటిగా సంక్షిప్తంగా రాయబడిన ఆత్మకథ యలమంచిలి వెంకటప్పయ్య గారి "బీద బ్రతుకు". సరిగ్గా 35 ఏళ్ళ క్రితం 1985 లో మొదటిసారి ప్రచురించిన ఈ పుస్తకం 65 పుటలతో నాకు తెలిసి తెలుగులో వొచ్చిన ఆత్మకథల్లో చిన్నది. ఆద్యంతం ఆసక్తికరంగా ఉంటుంది.

" మాదెగవారు మా ఊళ్ళోకి రావాలంటే వానాకాలంలో మోకాటిలోతు రేగడ బురదలో కదం తొక్కుకుంటూ నడిచి రావలసి వచ్చేది. వారు మా ఊరి బ్రాహ్మణేతరుల బజారులో కూడా భయపడుతూనేనడిచేవారు...బ్రహ్మణేతరుల బజారులో కూడా మాదెగవారు చెప్పులు తొడుక్కొనిగాని, గొడుగువేసుకునిగాని వెళ్ళటానికి అనుమతి ఉండేది కాదు. కొన్ని ప్రాంతాలలో మాదెగ వారు ఇత్తడి పాత్రలను వాడటానికి వీలులేదు...వారు తలగుడ్డ చుట్టుకొని అగ్రకులాల ముందుకు రాకూడదు... " ఒకవేళ మాదెగవారు ఏదేని పనిమీద బ్రాహ్మణేతరుల బజారుకు వెళ్ళవలసి వస్తే వారు బజారు మధ్య నడవకుండా ఒక వైపుగా తొలగి తొలగి వంగి వంగి నడవాలి...." (పేజి 24)

ఆత్మకథల్లో స్వీయానుభవాల వర్ణనేకానీ సాంఘిక ఆర్థిక రాజకీయ అంశాల జోలికి పోయే ధైర్యం మహా రచయితలకి కూడా ఉండదు. కానీ ఈ పుస్తకంలో నాటి అణగారిన ప్రజల జీవితాన్ని ముఖ్యంగా మాదిగకులస్తుల గురించి పదిపేజీలు చెప్పారు. 23 వ భాగం " మా ఊరి మాదెగవారు మా ఊరికి సుమారు రెండు మూడు ఫర్లాంగుల దూరంలో చుట్టూ గుడిసెలు వేసుకొని వాటి చుట్టూ మట్టి గోడలు పెట్టుకొని కందికంప తడికలను వాకిళ్ళకు తలుపులుగా కట్టుకొని కాపురం చేస్తూ ఉండేవారు. వారికి మంచినీళ్ళబావి ఉన్నట్లు నాకు గుర్తు రావడం లేదు. కాని మా ఊరి మున్సిఫ్ గారి మేడకు పడమర వైపున

బజారులోని మంచినీళ్ళ బావివద్దకు దూరంగా కొంతమంది మాదెగవారు మంచినీటికై తమ కుండలను ఉంచేవారు. బ్రాహ్మణేతరులెవరైనా దయతలచి ఆ కుండల్లో నీళ్ళు పోస్తే పోసినట్లు, లేనట్లయితే ఆ కుండలు రోజుల తరబడి బావివద్దనే ఖాళీగా పడి ఉండేవి. నీళ్ళు పోసిన కుండల మీద మూతలుండేవి కావు. అందువల్ల కాకులు పిచుకలు వగైరా పిట్టలు ఆ కుండల మీద కూర్చొని రెట్ట వేస్తూ ఉండేవి."

(పేజి 23, 24)

మామూలు స్వీయచరిత్రల్లో కనబడే భాషా ప్రదర్శన,అక్షరాల్లోని పనికిమాలిన ఘోషా పద్ధతినే మాత్రం పాటించకుండా తనకు తెల్సినవి, తాను చూసినవాటినే చెప్పగలిగే ధైర్యం ఉన్న రచయితల రచనా వ్యాసంగం దానికదే ఒక రకమైన హుందాతనం కలిగుంటుంది. అదెలా ఉంటుందో తెల్సుకోవాలంటే చదవాల్సిన ఆత్మకథ ఇది.

" చాలా మంది బ్రాహ్మణేతర రైతులకు కూడా మాలమాదెగల పొడగిట్టేది కాదు. పొరపాటున తమ పంచె చెంగు వారికి తగిలితే వెంటనే చన్నీళ్ళ స్నానం చేసి తీరేవారు. మాలమాదెగలు పొరపాటున బ్రాహ్మణేతరుల ఇత్తడి, రాగి పాత్రలను ముట్టుకుంటే వాటిని మంటేసి తగలబెట్టి పసుపునీళ్ళుచల్లితీసుకునేవారు.....మాలమాదెగలు దగ్గరకు వస్తేనే మైలు పడిపోతామని బ్రాహ్మణులు వారికి చాలా దూరంగా ఉండేవారు...కాని మాలమాదెగలు దంపిన బియ్యం, నూర్చిన ధాన్యం, సంచులలో పోసిన వడ్లు, నేసిన గోనె సంచులు, నేసిన తాళ్ళు, పేనిన నులక, కోసుకొచ్చిన కూరగాయలు, చింతకాయలు, అరటికాయలు, వండిన బెల్లం, పండించిన ఉప్పు, కడిగిన పశువులు, గడ్డి వేసుకు వచ్చిన బండి, ఎడ్లు, అల్లిన చాపలు, వాడిన పలుగు, పార, తట్టలు, బుట్టలు మొదలగునవి బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు తడపకుండానే వాడుకునేవారు. వాటికి అంటులేదు. కాని మాలమాదెగల శరీరాలను అంటుకోకూడదు...."(పేజి 25)

స్వాతంత్ర్య సమరయోధుడు, హేతువాది, గాంధేయవాది, కార్యశీలుడు యలమంచిలి వెంకటప్పయ్య గారు యాభైకి పైబడి రచనలు చేసారు. సామాజిక రుగ్మతల మీద ముందుగా " కులమేది?" అనే రచన చేసారు (పేజి 62)" ఆర్థిక దాస్యం కంటే బౌద్ధిక దాస్యం (భావ దాస్యం) మరీ భయంకరమైనది. ఆర్థిక దాస్యానికి పునాది భావదాస్యమే. ఈ భావదాస్యం నుండి సామాన్య ప్రజలు స్వతంత్రులైన నాడు ఆర్థిక దాస్యం నుండి అతితేలికగా బయటపడగలుగుతారు. భావదాస్యానికి మూలము పుణ్యము, స్వర్గము, మోక్షము, దైవము మొదలైన మూఢనమ్మకాలు, మూఢాచారాలే. కనుక సామాన్య ప్రజలు ముందుగా మూఢాచారాలను , మూఢనమ్మకాలను విడనాడిన యెడల భావదాస్యం పతనమైపోతుంది. దానితోపాటు ఆర్థిక దాస్యం కూడా అంతర్ధానమై పోతుంది. "( పేజి 65)అంటారాయన.

అతి తక్కువ మూల్యంలో అమూల్యమైన ఆత్మకథ ప్రచురించిన “యలమంచిలి వెంకటప్పయ్య సంస్మరణ వేదిక” ని ప్రత్యేకంగా అభినందిస్తూ ఈ తరం యువత, సామాజిక స్పృహ కలవారు తప్పక చదవాల్సిన పుస్తకం ఇది. మరణానంతరం కూడా ఆయన దేహాన్ని భావి వైద్యులకు ఉపయోగపడేలా రాసిన అనుమతి పత్రం కూడా చూడొచ్చు. ఆయన కృషిని స్మరిస్తూ ఈ చిన్న రైటప్.

# అంతరాత్మ పెట్టిన కన్నీళ్ళు !

## అంబేద్కర్ అనుభవాలు (పుస్తక పరిచయం).




"డజను మంది కర్రలు పట్టుకుని నా ముందు వరసగా ప్రమాదకరంగా నిలబడితే వారి ముందు నేను భయం చూపులతో ప్రాధేయ పడుతూ నిలబడిన దృశ్యం పద్దెనిమిది సంవత్సరాలైనా నేను మరిచిపోలేక పోతున్నాను. ఇప్పటికీ నాకు ఆ ఘటన స్పష్టంగా వివరంగా గుర్తుకొస్తుంది. గుర్తుకు వచ్చిన ప్రతిసారీ కన్నీళ్ళు వస్తాయి. హిందువులకి అంటరాని మనిషి, పార్సీలకి కూడా అంటరానివాడేనని నాకు అప్పుడే మొదటిసారి తెలిసింది." (పేజి - 13)

న్యూయార్క్ లోని కొలంబియా యూనివర్శిటీ లో అభ్యసించి, లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్ లో చదువుతూ ప్రపంచ మేధావులెందరితోనో స్నేహం ఉండి అనితరసాధ్యమైన పాండిత్యాన్ని గడించి ఇండియా చేరిన డా.బి.ఆర్. అంబేద్కర్ కి తలదాచుకునే చోటులేక రైల్వేస్టేషన్ లో గంటల కొద్దీ గడిపి చివరికి ఒక పార్సీ మఠంలో మారుపేరుతో ఉన్నందుకు ఎదురైన అనుభవం ఇది !

"తరగతిగదిలో ర్యాంకులని బట్టి పిల్లలని కూర్చోబెడతారు. కానీ నేను అందరితోబాటు నా ర్యాంకుని బట్టి కూర్చోకూడదు. గదిలో ఒక మూలన వేరుగా ఒక్కణ్ణీ కూర్చోవాలి. క్లాస్ రూంలో కింద వేసుకుని కూర్చోడానికి నాకు వేరే గోనె పట్టా ఉండాలి. స్కూలంతా తుడిచేవాడు నేను వాడిన గోనె పట్టా ముట్టుకోడు. నేను ప్రతిరోజు సాయంత్రం గోనెపట్టాని ఇంటికి తీసుకుపోయి స్కూలుకి వచ్చేటప్పుడు వెంట తెచ్చుకోవాలి." ( పేజి - 7)

ఒకటా రెండా? ఎన్ని అవమానాలకి కుదేలై తట్టుకుని నిలబడగల చేవ చేకూర్చుకుని చరిత్ర గతినే మార్చగలిగిన ధిక్కార స్వరంగా వెలిగి అద్వితీయ వ్యక్తిత్వాన్ని నిర్మించు కోగలిగాడు. హిందువులకి అంటరాని వాడైనవాడు క్రైస్తవులకి, పార్సీలకి, ముస్లింల కి కూడా అంటరానివాడేనని అర్థం చేసుకున్న అంబేద్కర్ బౌద్ధాన్ని మతంగా కాకుండా ఒక విముక్తి మార్గంగా స్వీకరించినట్లు తెలుస్తుంది !

" ..చాకలివాళ్ళు లేక కాదు. చాకలికి డబ్బులివ్వలేక కూడా కాదు. మేం అంట రానివాళ్ళం కాబట్టి, అంటరానివాళ్ళ బట్టలని ఏ చాకలీ ఉతకడు...మంగలులు లేకా కాదు, మాకు వారికి డబ్బిచ్చే స్తోమత లేకా కాదు. అంటరానివాళ్ళం కాబట్టి ఏ మంగలీ మా జుత్తు కత్తిరించడు.." (పేజి - 8)

విస్తృతంగా రచనా వ్యాసంగం చేసిన అంబేద్కర్ తన వ్యక్తిగత జీవితం రాసింది తక్కువ. ఆ రాసినవేవైనా ఉంటే అవి ఈ 20 పేజీలు మాత్రమే Ambedkar - Autobi ographical Notes Navayana 2003 లో ప్రచురించిన ఈ చిన్ని బుక్లెట్ని hbt చిట్టిబాబు గారి అనువాదంగా అదే సంవత్సరంలో "అంటబడనివాడు: అంబేద్కర్ అనుభ వాలు" అని ప్రచురించింది. ఇరవై పేజీల చిన్ని పుస్తకం వెల 5 రూపాయలు. వసంతమూన్ సంపాదకత్వం వహించిన అంబేద్కర్ రచనలు & ఉపన్యాసాలు వరుసలో 12 వ సంపుటి లో " వీసా కోసం ఎదురుచూపు" అనే శీర్షికతో ఇవి ఉన్నాయని ముందుమాటలో పేర్కొన్నారు !

తండ్రిని చూడ్డానికని ఊరెళ్ళిన పిల్లాడిగా బండి వాళ్ళతో ఎదురైన చేదు అనుభవం మొదలుకొని తనని బండిమీద తీసికెళ్ళాలనే ఉత్సాహంతో ఎవరూ బండికట్టకపోయే సరికి సాటి దళితులే బండి తోలడం వల్ల కిందపడి తీవ్రంగా గాయపడిన దుర్ఘటన వరకూ అక్షరాలు కావవి అంతరాత్మ పెట్టుకున్న కన్నీళ్ళే!

చివరగా గాంధీజీ పత్రిక "యంగ్ ఇండియా" లో,కులోన్మాదం తలకెక్కిన డాక్టర్ కారణంగా ఒక దళిత టీచరు భార్య మరణించిన ఉదంతాన్ని ప్రచురించిన ఘటన, శివరాం అనే ఒక దళిత కుర్రాడి అనుభవాన్ని కూడా అంబేద్కర్ నోట్ చేసారు. బహుశా ఇలాంటి అనేక సంఘటనలు నమోదు చేసి ప్రచురిం చాలనే తలంపు ఆయనకి ఉండేది. సామాజిక కార్యకర్తలే కాదు, సమాజంలోని ప్రతి ఒక్కరూ తప్పని సరిగా చదివి తీరాల్సిన పుస్తకం !

# ఉనికే ఒక పోరాటం - ఉచల్యా




"నాది భారత దేశం. భారతీయులు అందరూ నా సోదరులు, నాకు భారతీయ సంస్కృతి మీద ఎంతో గౌరవం ఉంది. ఈ వాక్యాలు ఈ శబ్దాలు అన్నీ అబద్ధం అని నాకనిపించేది. మేం ఏం చేయకపోయినా దొంగతనం మోపి కారణం లేకుండా మమ్మల్ని ఎందుకు కొడతారు? నన్ను కొడతారు. మా అమ్మని కొట్టి ఆమె చీర పట్టుకుని ఇది దొంగతనం చేసిన చీర, చీర విప్పి ఇచ్చేయ్ అంటూ పోలీసులు ఆమె చెయి పట్టుకుంటారు. మరి భారతదేశం నాది అయినప్పుడు మమ్మల్ని వేరుగా ఎందుకు చూస్తారు? పుట్టుక నుండే దొంగలు అన్న ముద్ర ఎందుకు వేస్తారు? అందరూ నా బంధువులే అయినప్పుడు మాకు చేయడానికి పని ఎవరూ ఎందుకు ఇవ్వరు?మాకు సూది మోపేటంత భూమి కూడా ఎందుకు దొరకదు?ఓ మంచి ఇల్లు ఎందుకు లేదు? మనం అందరం సోదరులం ఐతే మాకు దొంగతనాలు చేయాల్సిన గతి ఎందుకు పట్టింది..?"(పేజి 49)

లక్ష్మణ్ గాయక్ వాడ్ జీవిత చరిత్ర "ఉచల్యా" లో ఆయన అడిగిన ప్రశ్నలివి.మరాఠీ లో రాసిన ఈ ఆత్మకథ 1994 లో వసంతగారి తెలుగు అనువాదంలో సాహిత్య అకాడమీ ప్రచురించింది. చదువుతుంటే ప్రతి పుటా కదిలించి కన్నీళ్ళు తెప్పిస్తుంది.దేశ చరిత్రలో పుట్టుకతోనే నేరస్తులుగా ముద్రవేయబడ్డ అణగారిన వర్గాల నుండి వొచ్చిన అరుదైన ఆత్మకథ ఇది. సంచార జాతులు, తెగల చరిత్రను తడిమినవారు, నేరస్తులని ముద్ర వేయబడ్డ బాధితుల గోడుని అక్షరబద్ధం చేసే వారు విస్మరించరాని విలక్షణమైన స్వీయచరిత్ర " ఉచల్యా"!

"మా మాతృభాష తెలుగు. తెలుగులో మమ్మల్ని సంతముచ్చార్ (ముచ్చులు – దొంగలు) అని అంటారు. ముచ్చర్ అంటే దొంగతనం చేసేవాళ్ళు. సంత ముచ్చార్ అంటే సంతలలో దొంగతనం చేసేవాళ్ళు అని అర్థం. అసలు మా జాతి ఏమిటో మాకు పూర్తిగా తెలీదు. మొత్తం భారతదేశంలో మా జాతి వాళ్ళ ఇంటి పేర్లు రెండే ఉన్నాయి. జాధవ్ మరియు గాయక్ వాడ్. జాధవ్ మరియు గాయక్ వాడ్ వాళ్ళిద్దరి మధ్య పెళ్ళిళ్ళు చేసుకుంటారు. కానీ జాధవ్, గాయక్ వాడ్ లలో వాళ్ళలో వాళ్ళు పెళ్ళిళ్ళు చేసుకోరు. ఇంటిపేర్లు రెండే ఉన్నా మాలో ఎన్నో శాఖలు ఉన్నాయి. గాయక్ వాడ్ లలో ఉళనోర్, బమనోర్, కాళపిటనోర్, జాధవ్ లలో కాస్ కనోర్, పప్పానోర్, ఇలెనోర్, అనే శాఖలు ఉన్నాయి. ఈ శాఖలు చూసి

పెళ్ళి సంబంధాలు కలుపుకుంటారు. ...” (పేజి 4)

“ మా ఇళ్ళల్లో పిల్లలు దొంగతనాలు చేయడం నేర్చుకోకపోతే పెద్దవాళ్ళు తంతార”న్న రచయిత, ఆకలి ఎంత భయంకరమైనదో చెబుతాడు. “..తాతతో వేటకి వెళ్ళినప్పుడు తినడానికి నాకు ఎన్నెన్నో జంతువులు దొరికేవి. ఎలుకులు, కుందేళ్ళు, ముంగీసలు, తేళు ్ళ, ఉడుములు, ఉడతలు, బాతులు, కొంగలు, తాబేళ్లు, పందులు, నక్కలు, పావురాలు, పీతలు, కప్పలు, మేకలు, గొర్రెలు, నెమళ్ళు మొదలగువాటిని పట్టుకుని తినేవాళ్ళము.” ( పేజి 8,9)

“మా పెద్దవాళ్ళు మీకు పందులమీద ఉన్న చర్మం తినడానికి ఇస్తాం ఇక్కడ ఉన్న ఈ పెంటనంతా ఎత్తి పారేయండి అని పిల్లలతో అనేవాళ్ళు. మేము చర్మం కోసం ఎత్తేసేవాళ్ళం. ....గున్నను ఒక్క వేటుతో నరికి చంపేసేవాడు. గున్న గిలగిలా కొట్టుకుంటూ చచ్చేది. ఆ గున్న కింద కట్టెపుల్లలు పెట్టి పైన కచరా వేసి వాటిని కాల్చేవాళ్ళం. ....తులసీరాం పంది పొట్టను చీల్చి ప్రేగులు లాగేసేవాడు, మాణిక్ దాదా గుండెను తీసేవాడు. ముక్కలు చేసేవాడు. వాటిని మేము గబగబా మింగేసేవాళ్ళం. అందరి మూతులు రక్తంతో ఎర్రగా అయిపోయేవి. ఆ ముక్కలు వేడివేడిగా ఉండేవి. ఇంకా ముక్కలు కావాలని చేతులు జాచేవాళ్ళం. ...” (పేజి 11)

అడుగడుగునా ఒళ్ళు గగుర్పొడిచే నిజాల భాస్వరాన్ని అక్షరాల్లో దట్టించి పేల్చిన ఒక అతి సామాన్యుడి అసాధారణ ఆత్మకథ ఇది. ఏ మాత్రం సాహిత్య శైలీ, శిల్పం, మేధో పాండిత్యం లేకుండా అక్కర్లేని సుత్తి సంగతులు, స్వోత్కర్షలతో సాగదీయకుండా ఉన్నదున్నట్లు సూటిగా రాసిన స్వీయచరిత్ర ఇది.స్కూల్లో చేరాడని వాడలో కలరా వ్యాపించిందనే మూఢనమ్మకంతో కులం వాళ్ళంతా పంచాయతి పెట్టి స్కూలు మానేయమంటే ఒక మాష్టారి చలవ వలన గట్టెక్కిన రచయిత ఒక పార్టీ తరపునుండి రాజకీయ నేతగా పోటీ చేసేదాకా ఎదిగి చివరకి “భటక్యా విముక్త జమాతీ సంఘటన” సంస్థ పెట్టి సామాజిక కార్యకర్త గా మారిన విధం చదివి తీరాలి.

“ ఈ దేశంలో ఎలక్షన్లలో నిల్చుని గెలవడానికి నైతికత, మంచితనం ఉన్నా పనికిరావు.ఇక్కడ అధికారాన్ని చేపట్టాలంటే పైసలు ఉండాలి, ప్రతిష్ఠ ఉండాలి, ఉన్నత కులంలో జన్మించాలి, గుండాగిరి చేయగల దమ్ములుండాలి, అవతలి వాళ్ళను మోసం చేయుగల నేర్పరితనం ఉండాలి. ఈ సత్యాలను నేను అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాను..”(పేజి 164)

బి.ఎస్.పి పార్టీ నుండి కాంగ్రెస్ పార్టీ వరకూ మోసపోయిన తన అనుభవాల్నిలా బాధపడుతూ చెప్పిన లక్ష్మణ్ గాయక్వడ్,

“దళితులు, శోషితులు, పీడితులు, దేశదిమ్మరులు మొదలగువారి యెడల ప్రజలకు ఉండే ఉద్దేశాలలో మార్పు ఎట్లా తీసుకురావాలి? మా వాళ్ళ బతుకులను ఎట్లా బాగుపరచాలి? రాత్రింబవళ్ళు నేను వీటిని గురించే ఆలోచిస్తూ ఉంటాను. శోషణ అనే బలమైన చక్రాల కింద నలిగిపోతున్న అమాయకులను రక్షించాలి. ఈ కుళ్ళిన వ్యవస్థను బాగుపరచడం కోసం నా చేతనైనన్ని ప్రయత్నాలు చేయాలి. కొత్త వ్యవస్థకు పునాది రాళ్ళు వెయ్యాలి. వీస్తున్న చెడు గాలికి ఎదురు తిరగాలి. ఇదే నా జీవనోద్దేశ్యము.” ( పేజి 167)అంటో ముగించాడు.

ఇంతకంటే పరిచయం అవసరం లేదు. నా వరకూ నాకు ఇదో గొప్ప గ్రంథం. ప్రతి ఒక్కరూ చదివి చర్చించాల్సిన పుస్తకం.

2008 లో అంటే పన్నెండేళ్ళ క్రితం ఢిల్లీలో ఒక ఎక్జిబిషన్ లో అనుకోకుండా కొని చదివిన ఈ పుస్తకం ఆనాటి నుండి నన్ను మెలిపెడుతూనే ఉంది. ఆ మధ్య ఈ జీవిత చరిత్ర నేపథ్యంలో సినిమా కూడా తీయబోతున్నట్లు తెల్సింది కానీ ఎందుకనో రాలేదు.ఈ బుక్ సాఫ్ట్ కాపీ ఉంటే ఎవరైనా పెట్టొచ్చు.

**( మరాఠీ లో 1987లో అద్భుతమైన ఈ పుస్తకం ప్రచురించబడి 32 ఏళ్ళు పూర్తవగా తెలుగులో 1994లో ప్రచురించి 25 ఏళ్ళు పూర్తయ్యాయి. ఆ సందర్భంగా చాలా రోజుల్నుంచి అనుకుంటున్న ఈ రైటప్.)**

# పతనమవుతున్న వ్యవస్థ పై ఆక్రోశం

## పతంజలి భాష్యం




"ఆదియందు అక్షరముండెను. అది అబద్ధమై ఉండెను. అందువల్లనే అది అక్షయము, అక్షరము, అమరమూ అయిఉండెను. అది పాలకుల వద్ద ఉండెను. ఆ అక్షరము నుంచి క్రమముగా అసత్య ప్రచారము పుట్టుకు వచ్చెను. అది కూడా ఏలినవారి నాలుక చివరనే ఉండెను.ఏలినవారి అవసరార్ధము వారి తాబేదారులు, మాగధగణమూ, ఆ అసత్య ప్రచారమును రథముల పై మోసుకు తిరుగుచుండెను. ఏమీ అర్ధం కాలేదా..?"

(నాకు తప్పదు కదా? -127)

"లేనిదానికోసం వెతకడం వేదాంతం అయితే, ఉన్నదాన్ని చూడనట్టు నటించడం శాస్త్రం అవుతుంది. అవసరం లేని వాటికోసం వెంపర్లాడటం సామాజిక శాస్త్రమూ, అక్కర్లేని వాటికోసం తాపత్రయపడటం ధార్మిక శాస్త్రమూ, అవసరం లేని, అక్కరలేని, అసలేలేని విలువ కోసం కాలక్షేపంగా పోరాడటం సామాజిక ధర్మశాస్త్రం అవుతుంది. రాజకీయ రంగంలో నైతిక విలువలకోసం ప్రస్తుతం జరుగుతున్న పోరాటం అలాంటి వాటి కోవలోకి వస్తుంది."

(పార్టీలే వేరు పాములన్నీ ఒకటే - 85)

"భారతదేశానికి పాలేరుతనం అలవాటైపోయింది. మొదటిరోజున కొంచెం అభిజాత్యం అనిపించి, ఆత్మగౌరవం అనే కంటిలో నలుసు వల్ల కొంచెం ఇబ్బంది అనిపిస్తుంది కానీ రెండు మూడు రోజుల తర్వాత అది అలవాటైపోతుంది. అయ్యగారు బండబూతులు తిట్టకపోయినా , లాగి లెంపకాయ కొట్టకపోయినా, ఎడమకాలితో ఈడ్చి తన్నకపోయినా "ఏదో" గా ఉంటుంది. మన పెద్దయ్యగారికి మనమీద ఎందుకోగానీ కోపం వచ్చిందని దిగులేస్తుంది."

(నీకెటూ ఆత్మగౌరవం లేదు- 135)

"పత్రికలన్నా, ప్రజలన్నా అందరికంటే పోలీసులకు కాస్త ఎక్కువ కోపం. ఎందుకు అని కొందరు అమాయకంగా అడగొచ్చు. కన్నపు దొంగలకి పోలీసులంటే ఎందుకు భయమో ప్రజలన్నా, పత్రికలన్నా పోలీసులకు అందుకే భయం. ఆ భయం నుంచే

ద్వేషం.”

(పంచదార పత్రికలుండాలి – 56)

కె.ఎన్.వై. పతంజలి మూడు దశాబ్దాల పాటు వివిధ పత్రికలలో రాసిన రాజకీయ సామాజిక రన్నింగ్ కామెంటరీల కూర్పు, “పతంజలి భాష్యం”. మొదటిసారి జూలై 1989 ,లో అచ్చయిన ఈ పుస్తకాన్ని మళ్ళీ పర్స్పెక్టివ్స్ 2009 లో ముద్రించింది. 30 ఏళ్ళు పూర్తి చేసుకున్న అద్వితీయ వ్యంగ్య రచనల చిరునామా ఈ పతంజలి నామా!

పైన పేర్కొన్నవి ఇందులో మచ్చుకు కొన్ని బాణాలు మాత్రమే, ఆసక్తున్న వాళ్ళు తప్పక పుస్తకం చదవండి. All are mortals . But patanjali are more mortal than others. ఈ లోకంలో immortals అంటారు ముందుమాట లో 'మో'. 1952 మార్చి 3 న జన్మించిన పతంజలి 2009 మార్చి 11 న నిష్క్రమించారు. ఈ పుస్తకానికి నేపథ్యం రాస్తూ, “ బహుశా నేనపుడు నేలకు చాలా దగ్గరి వాణ్ణి...” అంటో మొదలు పెట్టిన పతంజలి, “ of all things written, that which was written with blood is pure and beautiful “ అని నమ్మతాను. “ for blood is spirit and the spirit of truth గనుక.”అని ముగించారు.

సత్యం పట్ల ఆ నిబద్ధత కలిగిన రచయిత కనుకనే విశ్వేశ్వరరావు గారు నివాళిగా శివారెడ్డి గారి మాటల్ని ఉదహరిస్తూ,

'its the death that is dead

not P A T A N J A L I అన్నారు. I write to please the worlds within me అంటూ సాగిపోయే పతంజలి వంటి రచనా యోధుడి గురించి చెప్పడానికి ఇంతకంటే ఏముంటుంది..?పుస్తకం చివర రమణజీవి

“పతంజలి గారి ఓ సాయంత్రం...” అదనపు ఆకర్షణ.

“ సాక్షాత్తూ బూదేవతే వచ్చి, నా గడ్డం పట్టుకుని బాపొరే గోపాతుర్డూ! నాను గుండ్రంగా, పంపరపనాసకాయనాగున్నాన్రా తండ్రీ ...అని చెప్పినా నేన్నమ్మను”

“నాయనా వైద్యుడిగా చెలామణీ కావడానికి వైద్యమే రానక్కర లేదు. మనం వైద్యం చేస్తే జబ్బులు పూర్తిగా తగ్గిపోకూడదు. మనుషులు కూడా పోకూడదు.”

“అసలు మనకు జాలి పడవలసిన దగ్గర జాలీ, ప్రేమ కలగవలసిన దగ్గర ప్రేమా, అసహ్యం కలగవలసిన దగ్గర అసహ్యమూ, ఆగ్రహం రావలసిన దగ్గర ఆగ్రహం నిజంగా కలుగుతున్నాయా? కలిగినట్టు మనం నటిస్తున్నామా?”

“పిచ్చివాడా! జ్ఞానం ఎవరైనా ఇస్తారు. మాంసం బోయనం మాత్రం నువ్వు

సొంతంగా సంపాయించుకోవాల్సిందే. అర్ధమైందా? ఇదే జ్ఞానమార్గంలో ఆఖరి పాఠం!"

ఒకటా, రెండా ఎన్నెన్ని ఎకసెక్కాలు, వ్యవస్థ లోని చెడుగులన్నింటినీ చెడామడా వ్యంగ్యంతో చెడుగుడాడేసుకున్న ఈ  చారిత్రక రచయిత, పాత్రికేయుడైన పతంజలిది ఉత్తరాంధ్ర లోని విజయనగరం జిల్లా ఆలమండ సొంతూరు. ఇంకా ఎన్నో కథలు, నవలలు, నవలికలు రాసారు. తెలుగు సాహిత్యంలో విలక్షణమైన వ్యంగ్యానికి, సునిశితమైన విమర్శకి చిరునామాగా నిలిచారు.

**పతంజలి భాష్యం ప్రచురించబడి 30 ఏళ్ళు పూర్తయిన సందర్భంగా ఈ చిన్ని రైటప్.**

# గెలుపు సరే...బతకడం ఎలా ?

## (కె. ఎన్. వై. పతంజలి అద్భుత రచన)




"కార్ల్ మార్క్స్ అనే ఆసామి ఈ అదనపు విలువ గురించి అందరకీ చెప్పక ముందే అదొకటి వుందని, అది చాలా లాభ దాయకంగా ఉందనీ పెట్టుబడి దారులు కనిపెట్టారు. జీవహింస అనేది చాలా తప్పయ్యా, యుద్ధాలు చేసి, శారీరక హింసపెట్టి మనుషుల్ని కాల్చుకు తినక్కర్లేదు. వ్యాపారం చేస్తే చాలు, అటు పుణ్యం, ఇటు పురుషార్థం వస్తాయని ప్రపంచానికి మొదట బోధించినవాడు వర్ధమాన మహావీరుడనే క్షత్రియ జ్ఞాని. ఆయన శిష్యులే ఇప్పటి మార్వాడి షావుకార్లు. వాళ్ళు, డబ్బులు మాత్రమే దొంగిలిస్తారు కానీ, ప్రాణాలు దొంగలించరు. వృత్తిగా శాకాహారులుమరియు అహింసావాదులు మరియు ఐశ్వర్యవంతులు. డబ్బులు సంపాదించడం కూడా మహాపాతకం అని చెప్పిన బుద్ధుడు, ఆ కారణం వల్లనే ఈ దేశంలో అడ్రసు లేకుండా పోయాడు..."

( పేజి 14)

మేధావి కాకపోయినా మేధావి అనిపించు కోడం సమాజంలో పైకి రావడానికి చాలా అవసరం.నిజమైన మేధావులతో స్నేహం చేసి వాళ్ళు చెప్పేవి విని, విన్న దాంట్లో ఒకటీ అరా ముక్కలు ఆచితూచి అప్పుజెప్పడం ద్వారా మేధావులుగా చలామణీ అయిపోవచ్చు...... మేధావి అనే అబద్ధం జాగ్రత్తగా ప్రచారంలోకి తీసుకొచ్చిన తరువాత ఎంత కష్టమైనపనైనా ఎడమ చేత్తో చేసి పారేస్తామన్న కల్పనని ప్రచారంలోకి తీసుకురావాలి. కష్టపడి ఏదైనా పూర్తి చేసిన వాడి కంటే, సునాయాసంగా ఆ కష్టసాధ్యమైన పనిని పూర్తి చేసే వాడి మీదే ప్రజలకు గౌరవం ఎక్కువ కలుగుతుంది. ఫ్యాన్ కనిపెట్టిన వాడు సృజనాత్మక మేధావి. దాన్ని తిరగేసి ఎగ్జాస్ట్ ఫ్యాన్ కింద వాడిన వాడు యుక్తి పరుడు. (పేజి 30, 31)

దేవుడు అబద్ధం, అయితే అతడికుమారుడైన యేసు క్రీస్తు నెలకొల్పిన మతం నిజం. లేని దేవుడి దూత అయిన మహమ్మద్ ప్రవక్త స్థాపించిన ఇస్లాం మతం నిజం. హిందూ మతం కూడా అదే రకమైన అబద్ధాన్ని ఆశ్రయించుకుని కొనసాగుతోంది. ఈ మతాల మనుగడకు ఆ అబద్ధం ఎంత ముఖ్యమో, లెక్కలనే శాస్త్రం మనుగడకు సున్నా అనే అబద్ధం అంతే ముఖ్యం....ఇదే విధంగా మంచితనం, ధర్మం, సత్యవాక్కు, పౌరుషం, ఆత్మగౌరవం, మంచి చెడ్డలనే విలువలూ ఆ కోవలోకే వస్తాయి. లేని విలువలు వున్నట్టు

నటించడమే నాగరికత. ఈనాగరిక సమాజంలో అన్నిటికంటే ఆసక్తికరమైనదీ, అన్నిటికంటే ఆకర్షణీయమైనదీ మనుషులు తొడుక్కునే మారుమొగమే. ఫలానావాడు దాత,ఫలానావాడు ధర్మమూర్తి, ఫలానా వాడు పీక పోయినా అబద్ధం చెప్పడు, ఫలానావాడు మాట తప్పడు, ఫలానావాడు జన్మలో పరాయిసొమ్ము ఆశించలేదు అని నలుగురు పొగడ్డానికి ఈ మారుమొగాలే కారణం...(పేజి 44, 45)

నీతిగా, నిజాయితీగా వుండక్కర్లేదని నాగరిక

సమాజంలో సకలవర్గాలు ఎన్నడో ఒకఅవగాహనకి వచ్చాయి. కాబట్టి, అవినీతికి, వంచనకు, అసత్యానికీ అగౌరవం ఏమీలేదు.కోర్టుల్లో భగవద్గీత, బైబిలు చేతిలో పెట్టి భగవంతుడి సాక్షిగా నిజం చెప్పమని అడుగు తారు కానీ అబద్ధం చెప్పకుండా వుంటారని ఎవరూ ఆశించరు.రాజ్యం అనే స్టేట్ గురించి అనేక అపోహలు, అవగాహనలు ఉన్నాయి. అది చాలా దుర్మార్గమైనదని చాలామంది మేధావులు అంటూ ఉంటారు. కానీ, రాజ్య మంటే మానవజాతి తన స్వార్థం కోసం సమిష్టిగా చేసుకున్న ఒక ఒప్పందం తప్ప మరొకటి కాదు. అది స్వార్థాన్ని, స్వప్రయోజ నాన్ని కాపాడుతుంది. ఆ ఒప్పందపు సారం అదే. ( పేజి 82)

కె. ఎన్. వై. పతంజలి రచన "గెలుపు సరే...

బతకడం ఎలా?" వర్తమాన సమాజ చిత్రాన్ని

ఆవిష్కరించిన ఓ అసాధారణ వ్యంగ్యాస్త్రం. వ్యక్తిత్వ వికాస వ్యాపారాన్నీ, వ్యవహారాన్నీ చాచిపెట్టి గుయ్యిమనేలా కొట్టిన బలమైన వెటకారాయుధం. కీ. శే. మేకా అప్పారావు గారి స్మృతి చిహ్నంగా మొన్ననో సభలో మిత్రులు ఇవ్వగా చాలా కాలం తర్వాత మళ్ళీ చదివాను.ఏం భాషది? ఏం తీరది ? వాడిగా, వాటంగా, సమాజ వికృత రూపాల పై అక్షరాల్ని అదనుగా సంధించడం ఆయనకే చెల్లు. అందుకే, ముందు మాటలో "వేమన కవిత్వం ఎందుకు కవిత్వం కాదో నా పుస్తకాలు అందుకే సాహిత్యం కాదు. ఈ పుస్తకంలో అటువంటి అనుమానానికి ఏమాత్రం ఆస్కారం లేదు. ఇది జీవితం ఎలా ఉందో చెప్పటమేకాకుండా, జీవితంలో ఏ మెలకువలు అవసరమో ఎలా జీవించాలో చెప్పాను. ఇలాగ జీవించడం నాకు వ్యక్తి గతంగా ఇష్టం లేదు. గానీ,జీవితం మన ఇష్టాయిష్టాల్తో నిమిత్తం లేకుండా నడుస్తుంది." (పేజి 10) అంటారు.

"నమ్మకాలన్నీ ఒకటే. నమ్మకాలు, మూఢ నమ్మకాలు అని విడివిడిగా ఉండవు. మన నమ్మకాల్ని మనం నమ్మకాలు అని గౌరవంగా పిలుచుకుంటూ, ఎదుటివాళ్ళ నమ్మకాల్ని మూఢ నమ్మకాలు అనిపిలుస్తాం. ఈ నమ్మ కాలు అనేక రకాలు. ఏ నమ్మకమైనా ప్రమాద కరమే." (పేజి 64) "ఎక్కువ మంది ఎందుకు వాదిస్తారంటే తమ జ్ఞానాన్ని ప్రదర్శించు

కోవడానికి, ఇతరుల్ని కించ పరచ డానికి, చుట్టూ ఉన్న వాళ్ళ దృష్టి ఆకర్షించ డానికి, పొద్దుపోవడానికి వాదిస్తారు.మీరుమీసమయాన్ని అలాంటి పనికిమాలిన విష యాల మీద వృథా చేయకండి." (పేజి 112)వంటి చెణుకు బెణుకులు ఎన్నన్ని అమాంతం మన అంతరాత్మని మెలిపెడతాయని. మళ్ళీ ఒక్కసారి పతాక స్థాయిలో పతంజలి అక్షర వర్షంలో హర్షాతిరేకంతో విహరిద్దాం రండి.

# గడ్డిపరకతో విప్లవం




"ఈ గడ్డి పరక నుండి ఒక విప్లవం మొదలవుతుందని నా నమ్మకం. పరాకుగా చూస్తే గడ్డి పరకేగా అనిపించవచ్చు. ఇది విప్లవం తీసుకురాగలదంటే ఎవ్వరూ నమ్మకపోవచ్చు. దీని శక్తిని నేను గుర్తించాను. దీనితో విప్లవం తీసుకురావడం సాధ్యమేనని నాకు తెలుసు." అంటో ప్రారంభిస్తారు ఈ గ్రంథాన్ని మసనోబు ఫుకుఓకా !

"సంస్కృతిని కేవలం మనుషులు రూపొందించి, కాపాడి అభివృద్ధి చేయలేరు. మనిషీ, ప్రకృతి కలయికతోనే సంస్కృతి పుడుతుంది, రూపుదిద్దుకుంటుంది. సంస్కృతి కీ రోజువారీ జీవితానికీ ఎంతో దగ్గర సంబంధం ఉంది. ఈ విధంగా ఇది తరతరాలకు సంక్రమిస్తూ నేటివరకు కొనసాగుతూ వచ్చింది... మానవ అహంకారం నుంచి, సుఖాన్వేషణ నుంచీ పుట్టింది నిజమయిన సంస్కృతి కాదు. నిజమయిన సంస్కృతి ప్రకృతిలో పుట్టి స్వచ్ఛందంగా, సీదాసాదాగా అణుకువగా ఉంటుంది."(పేజి 154)

జపనీస్ ప్రకృతి ప్రేమికుడు, తత్వవేత్త మసనోబు ఫుకుఓకా రాసిన "గడ్డిపరకతో విప్లవం"(The One Straw Revolution) పుస్తకాన్ని మొదట టింబక్టు కలెక్టివ్ తెలుగులో సరిగ్గా 30 ఏళ్ళ క్రితం 1990 లో ప్రచురించింది.మళ్ళీ 2001, 2010 లో హెచ్.బి.టి పునర్ముద్రించింది. "కేవలం వ్యవసాయం గురించే ఈ పుస్తకంలో ఉంటుందనుకునే పాఠకులు ఆహారం గురించి, ఆరోగ్యం గురించి, సాంస్కృతిక విలువల గురించి, మానవ జ్ఞాన పరిమితుల గురించి కూడా ఇందులో ఉండటంచూసి ఆశ్చర్యపోతారు.." అంటో ముందుమాట మొదలుపెట్టిన వెండల్ బెర్రీ, "వ్యవసాయం మనిషిని శారీరకంగా మానసికంగా ఆరోగ్యంగా ఉంచుతుంది. కేవలం అన్నం తినడం వల్లనే మనం బతకటంలేదు." అంటూ ముగిస్తాడు !

"తన సిద్ధాంతం ఏ మతం పైనా ఆధారపడి లేదని ఫుకుఓకా చెబుతారు. కానీ అతని బోధనా పద్ధతిపైనా , ఉపయోగించే పదజాలం పైనా జెన్, బౌద్ధం, టావోయిజమ్ ల ప్రభావం బాగా ఉంది...." అంటారు పరిచయం రాసిన ల్యారీ కార్న్."ఒకవైపు వినాశనం, మరోవైపు మనుగడ ఉన్న కూడలిలో మానవాళి ఈనాడు చేరుకుంది. ఇటువంటి

విషమపరిస్థితిలో ఎలా ఇరుక్కున్నాం అని ప్రశ్నించుకుంటే ప్రకృతి నుంచీ మనిషి మూర?ంగా దూరం కావడమేనన్న సమాధానం ఒక్కటే మిగులుతుంది. " అంటారు తెలుగు ప్రతికి ముందుమాట రాసిన పర్మాకల్చర్ వెంకట్ !

"మనిషి జీవితానికి ఒక ఉద్దేశమంటూ లేదు. అది ఉందని ఊహించుకుని దానిని తెలుసుకోవాలన్న తాపత్రయంతో కొట్టుమిట్టాడుతుంటారు. ఇది ఒకే వ్యక్తి చేసే ముష్టి యుద్ధం వంటిది. జీవితానికి ఉద్దేశమంటూ ఊహించుకోనవసరం లేదు, దాని కోసం వెతకనవసరం లేదు. ఉద్దేశం లేని జీవితం అర్ధరహితమేమో పిల్లల్ని అడిగి చూడండి." (పేజి 180) అని చెబుతూ,

"తన పని చూసుకొంటూ హాయిగా తిని సుఖంగా నిద్రపోతూ ఏ చీకూ చింతా లేకుండా ఉండేవాడు చాలా సంతృప్తికరమైన జీవితం జీవిస్తున్నాడు. ఏమీ సాధించాలని లేని వాడికంటే గొప్పవాడు మరొకడుండడు." (పేజి 173)అంటారు !

అనేక విషయాల్లో ఆయన అభిప్రాయాల్లో మనకి విభేదాలుండొచ్చుకానీ నాగరిక యాంత్రిక జీవనం మొహం పగిలేలా చీవాట్లు పెట్టి ఒక సుస్థిర మనవ జీవనవిధానం కోసం నిజాయితీగా చేసిన ప్రయోగాత్మక ప్రయత్నాలని తెల్సుకుని తీరాలి. "పరిశోధకులయ్యే ముందు ఎవరైనా సరే తత్వవేత్తలు కావాల" ని చెప్పే ఫుకుఓకా"ఆహారాన్ని అర్ధం చేసుకోటానికి తత్వశాస్త్రాలు చదవటం కంటే, రోజువారీ ఆహారం నుంచీ ఒక అవగాహనకు రావటం  మంచిది " అంటారు !

"పనులు పెరిగినకొద్దీ, సమాజం 'పురోగమించిన' కొద్దీ సమస్యలు పెరుగుతాయ్. ప్రకృతి నిర్లక్ష్యానికి గురవుతోంది. మనవ ఆత్మ క్షీణించి హీనమౌతోంది. ఏదో సాధించాలన్న తాపత్రయం వల్లనే ఈ సమస్యలన్నీ. మొదట్లో ప్రగతి సాధించటానికి ఏమీ ఉండేది కాదు. ప్రస్తుత పరిస్థితుల్లో ఏమీ చేయకుండా ఒక 'ఉద్యమం' తీసుకు రావటం తప్పించి మరో మార్గం లేదు." (పేజి 175)

ఎన్నో భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికి మానవాళి మనుగడకు అవసరమైన కొన్ని విలువయిన సూత్రీకరణలు ఫుకుఓకా అందించారనే అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. "ప్రకృతిని చూసే విధానం యుగయుగానికీ మారవచ్చుకానీ ప్రకృతి మారదు. ఏ యుగమైనాసరే వ్యవసాయానికి ఆలంబనగా ప్రకృతి సేద్యం ఉండనే ఉంటుంది." అనే భావనతో స్పష్టంగా "వంద వివరణలు ఇవ్వడం కన్నా ఒక ఆచరణ ఎన్నో రెట్లు నయం.." అనే అభిప్రాయంతో జీవితాంతం ప్రకృతితో మిళితమై జీవించి తన అనుభవాలకి అక్షర రూపం ఇచ్చిన ఈ గ్రంథం ప్రస్తుతం మరింత అవసరమని నా అభిప్రాయం. ఎందుకనే ప్రశ్నకు జవాబు ఫుకుఓకా మాటల్లోనే,"వ్యవసాయం అంతిమ లక్ష్యం పంటలు పండించటం కాదు, పరిపూర్ణ

# సమానత్వమే ఆమె లక్ష్యం

## సరస్వతీ గోరా జీవితం.




"నా జీవితం నేను వెనక్కి తిరిగి చూసుకుంటే ఆశ్చర్యంగానూ వుంటుంది, సంతోషంగానూ వుంటుంది, సంతృప్తిగానూ వుంటుంది. జీవిత ధ్యేయం ఏమిటి అనేది చాలామందిని వేధించే ప్రశ్న. దానికి సమాధానం దొరకడం అంత తేలిక కాదు. ఎందుచేతనంటే ఎవరి జీవితం వారిది. కనుక ఎవరి జీవితానికి ధ్యేయం వారే రూపొందించుకుంటారు.

.........................

" నేను మరణం కోసం కాక జీవితం కోసం జీవించాలి అనుకున్నప్పుడే జీవితానికి విలువ, సార్ధకత వస్తుంది. నా జీవితాన్ని వేరే ఎవరో , ఎక్కడో నిర్ణయిస్తున్నారు అనుకుంటే జీవించడంలో కర్తృత్వ శక్తి లేదు. విధి రాసిన జీవితమే నేను జీవిస్తే, దేవుడు నిర్ణయించిన జీవితమే నేను జీవిస్తే, నా జన్మనక్షత్రం వల్ల నిర్ణయమైపోయిన జీవితమే నేను జీవిస్తే, ఆ జీవితంలో స్వేచ్ఛకి స్థానం లేదు. స్వేచ్ఛ కి స్థానం లేనప్పుడు, నిర్ణయింపబడిన జీవితమే నేను జీవించినప్పుడు మంచీ, చెడు, నీతి, అవినీతి, సత్యము, అసత్యము అనేవి అర్ధరహితమౌతాయి."(పేజి 9)

తెలుగులో ఆత్మకథలు, అందులోనూ మహిళల ఆత్మకథలు మరీ తక్కువ.

ఉత్తరాంధ్రలో పుట్టి చిన్నప్పుడే అనుకోని పరిస్థితుల్లో గోరాగార్ని ఏడవ తరగతిలో పదేళ్ళకే పెళ్ళిచేసుకుని జాతీయస్థాయిలో అవిశ్రాంత భావోద్యమ కృషి చేసిన 'సరస్వతీ గోరా' ఆత్మకథ "గోరాతో నా జీవితం"లో ప్రారంభ వాక్యాలివి!

1992 లో ఆమె 80 వ ఏట ప్రచురించబడిన ఈ గ్రంథం తర్వాత 2011 లో పునర్ముద్రణ పొందింది.

"మా ఇంటికి ఎదురుగా ఎనభై గజాల దూరంలోనే గురజాడ అప్పారావు గారి ఇల్లు ఉండేది. గురజాడ అప్పారావు గారు, ఆదిభట్ల నారాయణదాసు గారు, ద్వారం వెంకటస్వామి నాయుడు గారు, తోడల్లుడైన గిడుగు రామమూర్తి గారు మొదలైన వారంతా మా తాతయ్యగారి వద్దకు తరచు వచ్చి కబుర్లు చెప్పుకుంటూ ఉండేవారు." (పేజి 17)

"వివాహానికి నాకు పది సంవత్సరాలు. నేను ఏడవ తరగతి చదువుతున్నాను.

వివాహానంతరం నన్ను చదవవద్దని ఎవరూ చెప్పలేదు. కాని నేనే మానేశాను. వివాహానికి, నేను చదువు మానివేయడానికి ఏమీ సంబంధం లేదు. దాని కథ వేరే ఉంది. అది మాట పట్టింపుకు సంబంధించింది." (పేజి 26)

ప్రపంచంలోనే మొట్టమొదటి నాస్తిక కేంద్రం స్థాపించి లోకం నలుచెరుగులా సమాజసంస్కరణే ధ్యేయంగా తిరిగిన  గోరా, సరస్వతీ దంపతుల కృషి అవిస్మరణీయం. 28 ఏళ్ళ క్రితం మొదటి సారి ప్రచురించిన ఈ పుస్తకం తెలుగు సాహిత్యంలో ఎన్నదగినదని నా అభిప్రాయం. కేవలం మాటలకే పరిమితం కాని సరస్వతి గారు 1972 లోనే స్వాతంత్ర్య దిన రజతోత్సవాన్ని పురస్కరించుకుని ఆగష్టు15న "బీఫ్ అండ్ ఫోర్క్ ఫ్రెండ్షిప్ డే" గా నిర్వహించారు. ఆ ఏడులోనే మొట్టమొదటి ప్రపంచ నాస్తిక మహాసభలు నిర్వహించారు. స్వాతంత్ర్యోద్యమంలో జైలు శిక్ష అనుభవించారు. స్వేచ్ఛ, సమానత్వం, మానవత్వం నినాదాలతో దేశానికి ఆర్థిక, సాంఘిక స్వాతంత్ర్యం కావాలంటూ సేవాగ్రాం నుండి ఢిల్లీ దాకా ఏకంగా 1100 మైళ్ళ పాదయాత్ర చేసారు.

సాంఘిక శ్రేయోభిలాషులుగా గోరా దంపతుల భావోద్యమం ఒకెత్తయితే, సాంప్రదాయ కుటుంబంలో జన్మించి చిన్నవయసులోనే పెళ్ళి చేసుకుని ఒక కొత్త వాతావరణంలోకి అడుగుపెట్టిన సరస్వతి గారు తనని తానొక భావోద్యమ కార్యకర్త గా

నిబద్ధత గల గాంధేయవాదిగా కులనిర్మూలన వాదిగా, మతోన్మాద వ్యతిరేకిగా , ప్రగతిశీల మార్గం కోసం మల్చుకున్న తీరు చదివి తీరాలి.

200 పేజీల ఈ గ్రంథంలోని అన్ని భావాలతోనూ మనం ఏకీభవించలేకపోవచ్చును కానీ తొంభై ఏళ్ళకు పైగా మతాతీత మనిషిగా, మానవతావాదిగా జీవించి మంచి కోసం తపించిన ఆమె ఆదర్శాల వెలుగు మన ఆచరణని కచ్చితంగా ప్రభావితం చేయగలుగుతుందని తెల్సుకుంటాం.ఆమె అన్న మాటలు ఆమె నమ్మిన  విలువలకి

నిలువెత్తు ప్రతీకలు,

"మహిళలకు తాను పెట్టుకున్న నగలు, ఆస్తులు, సంపదలు ఏనాటికీ ఆభరణాలు కాలేవు. ఎప్పటికైనా స్త్రీకి నిజమైన ఆభరణాలు, ధైర్యం, సాహసం, విద్యే."

**(ఆగష్టు 19 సరస్వతీ గోరా వర్ధంతి సందర్భంగా ఈ చిన్ని రైటప్)**

# మహోజ్వల పోరాటానికి అక్షరరూపం

## మనకు తెలియని మన చరిత్ర




"స్త్రీలకు సంబంధించిన ఏ పాలసీని కమ్యూనిస్టు పార్టీ తయారు చేయలేకపోయింది. ఉద్యమానికి స్త్రీలు అత్యవసరమని గుర్తించినప్పటికీ పార్టీ వాళ్ళను సహాయకులుగా మాత్రమే చూసిందికానీ చరిత్రకర్తలుగా గుర్తించలేదు" ( పేజి 25)

తెలంగాణ రైతాంగ పోరాటంలో పాల్గొన్న మహిళల్ని ఏడుగురు సామాజిక కార్యకర్తలైన స్త్రీలు(లలిత, వసంత కణ్ణబిరాన్, రమా మేల్కొటే, ఉమా మహేశ్వరి, సుసీ తారూ, వీణా శత్రుఘ్న, రత్నమాల) కల్సి స్వయంగా ఇంటర్వ్యూలు చేసి వారు చెప్పిన అమూల్యమైన వివరాలకి అక్షర రూపం ఇచ్చిన చారిత్రక గ్రంథం " మనకు తెలియని మన చరిత్ర "(తెలంగాణ రైతాంగ పోరాటంలో స్త్రీలు), స్త్రీ శక్తి సంఘటన మొదటిసారి 1986లో ప్రచురించిన ఈ పుస్తకాన్ని హెచ్.బి.టి. 2002 లో పునర్ముద్రించింది

" నా పేరు చిట్యాల ఐలమ్మ, చిట్యాలోల్లంటరు. నా పెనిమిటిదేం లేదు. నా కొడుకులదేం లేదు. ఎక్కడవోయిన ఏం జేసిన ముందుగా నా పేరే జెప్తరు. ఎప్పటి కొత్తనే వుంటరు. సంగపోల్లు."

(పేజి 59, చాకలి ఐలమ్మ ఇంటర్వ్యూ)

"ఈ పోలీసేక్షణయి పార్లమెంటు ఎన్నికలయిన తర్వాత నిజంగా అప్పుడు ఆ ఊహలకు ఆలోచనలకు ఎంతదెబ్బ! ఎంత ఇదయిపోయినం అని! పూర్తిగా చితికిపోయినట్టయింది. కోడిగుడ్డు పట్టుకొని చితిపితే చితికినట్టు , ఈ పార్లమెంటు ఎన్నికలు అవీ అయిన తర్వాత మేం ఎట్లయిపోయినమంటే 'ఎక్కడున్నావే గొంగడీ అంటే వేసిన చోటే కంబళి." ( పేజి - 101, పియంవద ఇంటర్వ్యూ)

"ఇంట్లో బాధలుపడలేక కొన్నిసార్లు స్త్రీలు ఉద్యమంలోకి వచ్చారు. వాళ్ళ ఆడవాళ్ళు కూడా ఉన్నారని పార్టీ ప్రపంచానికి చూపించాలనుకుంది....పార్టీలో వాళ్ళు ఆడవాళ్ళని సమానంగా చూసారు కానీ స్త్రీల సమస్యల గురించి సిద్ధాంతపరంగా ఎన్నడూ ఆలోచించలేదు. ఎన్నడూ చర్చించలేదు. ఏదో మొక్కుబడి తీర్చుకున్నట్టు. కానీ కుటుంబంలో లాగా పార్టీలో కూడా పనులు కలిసిపంచుకునే వాళ్ళు. ఒక్క నాయకులు మాత్రం సమస్యల్ని తేలికగా కొట్టిపారేసేది. ఆలోచనాపద్ధతిలోనే ఏదో లోపం ఉంది. .." (పేజి 125,

సుగుణమ్మ ఇంటర్వ్యూ)

"అసలు స్త్రీలు లేని చరిత్ర లేదమ్మా..గతం నుంచి యిప్పటి వరకు చూసుకోండి. స్త్రీల్లేని చరిత్ర లేదు. స్త్రీలు సగభాగం కాదు కదా జనాభా లో ఎక్కువ భాగం స్త్రీ లే. ఉ ద్యమం ప్రబలటానికి కారణం స్త్రీలు, స్త్రీ ల పాత్ర చాలా ఉంటుంది. కానీ స్త్రీల పాత్ర అణగారిపోతూ, పురుషుల పాత్రే పైకి పోతూ వుంది. దానికి కారణం తరతరాల నుంచున్న స్త్రీ వ్యతిరేకతే." (పేజి 168, కొండపల్లి కోటేశ్వరమ్మ ఇంటర్వ్యూ)

"చరిత్ర అనుభవం మనకి నేర్పేదేమంటే బాల్య వివాహం, వితంతు వివాహాలు, హింస, మానభంగాల వంటి సమస్యలకు వ్యతిరేకంగా పోరాటం స్త్రీల పరిస్థితుల్ని కొంత మెరుగు పరుస్తుందే తప్ప సంఘంలో వాళ్ళ స్థానంలో పెద్ద మార్పు తీసుకురాలేదు. సెక్సువాలిటీ, పిల్లల్ని కనడం లాంటివి అచ్చం స్త్రీల సమస్యలే అని కాకుండా సామాజిక సమస్యలుగా పట్టించుకున్నప్పుడే సమాజంలోనూ, స్త్రీల స్థానంలోనూ మార్పొస్తుంది. ఇది అర్థం చేసుకోవాలంటే మొత్తం కుటుంబ స్వరూపాన్ని స్త్రీ ని అణగదొక్కడంలో కుటుంబ పాత్ర ఏమిటి అన్న విషయాన్ని మొదలంటూ ప్రశ్నించాల్సి వస్తుంది..."

(పేజి 313, స్వరాజ్యం ఇంటర్వ్యూ)

అరుదైన పోరాటయోధుల ఫోటోలతో, వివరణలతో,300 పైగా పేజీలున్న ఈ గ్రంథం విస్మరించబడ్డ స్త్రీల స్వర సమాహారం. ప్రతీ సామాజిక కార్యకర్త తప్పనిసరిగా అధ్యయనం చేయాల్సిన పుస్తకం. "చరిత్రలు సృష్టించినా పేరులేని స్త్రీ లకూ, పోరాటాలకూ " అంకితం ఇచ్చిన ఈ పుస్తకం లో సుమారు 16 మంది మహిళల ఇంటర్వ్యూలున్నాయి. దేనికదే ఒక పాఠ్యాంశం.

కులతత్వం, పురుషాధిక్యత సర్వాంతర్యాములుగా చెలామణీ అవుతున్న ప్రస్తుత పరిస్థితుల్లో ఈ గ్రంథం మీద ప్రోగ్రెసివ్ సెక్షన్స్ లో కూడా జరగాల్సినంత చర్చ జరగకపోవడం మూర్తీభవించిన పురుషాధిపత్యం అనే నా అభిప్రాయం. అందుకే చాలా ఏళ్ళ నుంచి ఈ పుస్తకం ప్రచురించినట్లు లేదు. ఎందుకనేది స్పష్టమే, ఈ పుస్తకం ముందుమాట గా "స్త్రీల చరిత్ర అంటే"లో ఒక దగ్గర పేర్కొంటారు,

" అణిచివేతకు, దోపిడీకి గురయ్యే వాళ్ళ ఏ అనుభవాలయితే సిద్ధాంతాల్లోకి పూర్తిగా ఇమడలేదో ఆ అనుభవాలే కార్యాచరణకూ, మార్పునకూ దోహదం అవుతాయి. "

**(మనకు తెలియని మన చరిత్ర బీ ఒక సజీవ చరిత్ర ప్రచురించి 34 ఏళ్ళ పూర్తయిన సందర్భంగా చాలా కాలం నుండి అనుకుంటున్న ఈ చిన్న రైటప్)**

# కులతత్వం పై గాండ్రించిన అక్షర గర్జన

## "థూ"

"ఒక్క విషయం అండీ. మీరు చికెన్ బిర్యానీ అనండి, చికెన్ కూర అనండి, చికెన్ మంచూరియా అనండి అందులో చివరికి ఉండేది చికెనే కదా. అలానే పార్టీలని తరచి చూస్తే ఆ పార్టీకి హెడ్డు కచ్చితంగా కమ్మ కానీ రెడ్డి కానీ అయి ఉంటాడు. పేరుకి వంద సిద్ధాంతాలు చెప్పచ్చు కానీ వంద కులాల వాళ్ళలో ఏ ఒక్కళ్ళనీ ఆ పార్టీలు నెత్తిన ఎక్కించుకోవు...మీరు కాంగ్రెస్ అనండి, బిజెపి అనండి, కమ్యూనిస్టనండి, తెలుగుదేశం అనండి ఏదైనా అనండి చివరికి దాని అధిపతి ఈ రెండు కులాలవాళ్ళే అయివుంటారు. ఒకవేళ ఏ బిసినో, యస్సీనో తాత్కాలికంగా పార్టీ అధ్యక్షుడిగా చేయ్యచ్చుగానీ సీయంని చేసే సరికి ఈ రెండు కులాలే రావాలి తప్ప ఇంకో కులపోడ్ని సీయం చేసే దమ్ము ఏ పార్టీ కి లేదండి." (పేజి 5, 6)

థూ...

పి.వి. సునీల్ కుమార్

'థూ' కథ కాదు, వ్యధ. కళ్ళ ముందు జరిగిన ఘోరకలికి న్యాయం కోసం ఉద్దేశించిన స్థానాన్ని ఆశ్రయిస్తే కులతత్వం నిండిన న్యాయస్థానం అసలిది నిజమే కాదు కథని కొట్టిపారేసిన వ్యధ. ఎవరితో చెప్పుకోవాలి? ఇంకెక్కడ మొత్తుకోవాలి? అన్యాయాన్ని వ్యతిరేకించడానికి "అక్షరాన్ని" ఆయుధంగా చేసుకోమన్న పెద్దాయన అంబేద్కర్ ఆదేశానుసారం తెలుగు సాహిత్యం లో అణచబడ్డ అంతరాత్మలు దట్టించి పేల్చిన పెను ఫిరంగి గుండు "థూ"!

"....నిజమేనండయ్యా...రచైతగారు మామీద ఇసుక్కోడంలో తప్పేమీలేదు. అందమైన ప్రేమకతలు చదవాలనుకుంటే ఇటు రామాకండయ్యా. అమాయకత్వం కూనీ అవుతుంటే అమాయకమైన ప్రేమకతలు ఎందుకు రావట్లేదనే దౌర్భాగ్యపు ముండాకొడుకులున్న చండాలమైన ప్రపంచమయ్యా యిది. అయినా మాలాంటోళ్ళ కతలు నన్నయ్య, తిక్కన రాసారుగనకా ఇప్పుడు మీరు రాయడానికి. రాజు గారి చెంకలో మట్టి నలిపితే అగ్రహారాలు వత్తాయి. ఆ పనేగా మొన్నటి దాకా కవులు చేసింది. ఇప్పుడు సినిమాలో హీరోల చంకలో మట్టి నలుపుతారు. లేకుంటే దేవుళ్ళని పొగిడితే ఆ దేవుడి పేరున్నంత వరకూ మీ పేరు కూడా వుంటది. మాబోటోళ్ళ గురించి రాస్తే అక్షరాలు కూడా మలినం అయిపోతయ్యటయ్యా." (పేజి 10)

అభ్యుదయం పేరుతో ఆచరణకి దూరంగా విలాసాలకి అంటకాగుతూ నచ్చిన సిద్ధాంతాలతో,

తోచిన రాద్ధాంతాలతో రసికారుతున్న అగ్రకుల గజ్జిని అంతర్గతంగా పెంచి పోషించుకుంటున్న జంధ్యంపోగు సాహిత్యం మొహాన ఇంకెన్నళ్ళీ అన్యాయమంటూ గాండ్రించి ఉమ్మేసిన దళిత బహుజన సమిష్టి ధిక్కారం "థూ"! "ఆర్యా...కులం అంటే ఏంటండీ? కుటుంబం అనే దాన్ని కొంచెం సాగదీస్తే అదే కులం. అంటే మన కులపోళ్ళంతా మన కుటుంబ సభ్యులు. అట్టాంటప్పుడు మన ఇంట్లో వాళ్ళకి పెట్టుకున్నాక మిగిలిందే కదండీ బయటోళ్ళకి పెడతాం. ఇందులో అన్యాయం ఏముందండీ? ఎవడైనా సొంత కొడుకుని పస్తుపెట్టి పక్కింటి పిల్లాడికి పరమాణ్ణం పెడతాడా?" ( పేజి 7)

స్థూలంగా ఒకే కథ, కానీ ఇద్దరు వ్యక్తుల దృక్కోణాల్లో ఉంటుంది. నిజానికి వాళ్ళిద్దరూ వ్యక్తులు కాదు. సమకాలీన సమాజంలో రసికారుతున్న అగ్రకుల గజ్జికి ప్రతినిధి బసివి రెడ్డినాయుడైతే, అణచబడ్డ పీడిత సమూహానికి ప్రతినిధి కుంటి జోసెప్పు. " బసివి రెడ్డినాయుడు గారు చెప్పిన కథ" మొదటిదైతే, "కుంటి జోసప్పుగాడి ఎదవగొడవ" తర్వాతది.కథ ప్రారంభంలోని "ముసలి లంజకొడుకు" కుంటి జోసప్పే. మామూలు జోసప్పు కుంటి జోసప్పు ఎలా అయ్యాడో, ఇరవై ఏళ్ళుగా జబ్బు చేసి రాని 'ఉమ్ము' హఠాత్తుగా జడ్జిగారి మొహం మీద ఎందుకు పడిందో తెలుసుకోవాలంటే ఈ 'కథ' చదివి తీరాలి.కాకి మాధవరావు అన్నట్లు, "అలెక్స్ హేలీ రాసిన 'రూట్స్' అంతటి గొప్పది ఇది" అనే అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తూ ప్రతీ ఒక్కరూ, ముఖ్యంగా ప్రతీ సామాజిక కార్యకర్త తప్పనిసరిగా చదివి తీరాల్సిందిగా కోరుతున్నాను. తెలుగు సాహిత్యంలో "థూ" వొచ్చి ఐదేళ్ళు నిండాయి. సమాజం, సాహిత్యం, కళ, రాజకీయాలు సరేసరి, న్యాయస్థానాలకి కూడా పాకిన కులం కుళ్ళుని చుండూరు తీర్పు నేపథ్యంలో ధైర్యంగా ఒక రచయిత ఈడ్చిపెట్టి తన్ని తగలేసిన తెగువకి ఆరేళ్ళొచ్చాయి.ఆ ఆక్రందనని  న్యాయస్థానాల్లో కూడా బతికించుకోలేక పోయాం, కనీసం అక్షరాల్లోనైనా ఆ చేవని చేజారిపోకుండా కాపాడుకోవడం ఆలోచన పరులందరి ఉమ్మడిబాధ్యత. ప్రభుత్వో ద్యోగిగా ఉండి ఇంత మంచి కథ రాసిన పి.వి.సునీల్ కుమార్ కి ప్రత్యేక అభినందనలు. కథ ఇంకా చదవనివారూ, చదవాలని అనుకునేవారు నా వాట్సప్ నంబర్ 9032094492 కి రిక్వెస్ట్ పెడితే సాఫ్ట్ కాపీపంపుతాను. ( "థూ" పుస్తకం 'అంబేద్కర్స్ ఇండియా మిషన్' ప్రచురించింది. పది రూపాయలు పెట్టి ఈ పుస్తకం కొంటే చుండూరు బాధితుల కోసం జరుగుతున్న న్యాయపోరాటానికి సాయం చేయ్యొచ్చు. కనీసం వందమందికి తక్కువ కాకుండా ఈ కథ పరిచయం చేసాను. తెలుగు చదవడం రాని మిత్రులకి నేనే చదివి వినిపించాను. నా వరకూ నాకు ఇదో గొప్ప కథ. చదివి స్పందించాలనుకుంటే సునీల్కుమార్ మెయిల్ పుస్తకంలో ఉంది. తెలుగు సాహిత్యంలో "థూ" వొచ్చి ఆరేళ్ళయిన సందర్భంగా దళిత బహుజనుల పై పేట్రేగుతున్న దాడులకి నిరసనగా చాలా రోజుల నుండి అనుకుంటున్న ఈ చిన్న రైటప్)

# అణగారిన ప్రజల రణన్నినాదం!

## అంటరాని వసంతం !!

## (జ్ఞాపకం గతం కాదు!!!)




" ఏ గోతిలో ఏ వాస్తవం విసిరివేయబడ్డదో తెలీదు.
ఏ మట్టి దిబ్బ కింద ఏ బతుకులు శాశ్వత సమాధులయ్యాయో లెక్క లేదు.
ఏ లోయలో ఏ నాగరికత ఉరితియ్యబడ్డదో అర్థంకాదు.
మట్టిమీద ఆధిపత్యం.
మనుషుల్ని నిర్దాక్షిణ్యంగా వేరుచేసి అణిచివేసిన కౌటిల్యం.
వర్గం.
కులం.
విసిరేయబడ్డ బతుకులు.
సమాధి చేయబడ్డ బతుకులు.
ఉరితియ్యబడ్డ నాగరికతలు.
మాలలు, మాదిగలు.
వాళ్ళు రాజవీధుల్లో నడవలేదు.
నిజంగా నడవలేదు.
ఊరి బావుల్లో నీళ్ళు తాగలేదు.
మెడకు ముంత. ముడ్డికి తాటాకు.
మనుషులే. రెండు కాళ్ళు.రెండు చేతులు. ఒక మెదడు అందరిలాగే
బాపనాళ్ళకులాగే, రెడ్లకులాగే, కమ్మవాళ్ళకులాగే, యింకా చాలామంది అగ్రకులాల వాళ్ళకు లాగే.
మనుషులే, మెదళ్ళే
తమిళదేశంలో పెరియాలు
కన్నడలో హులీలు
మహారాష్ట్రలో మాంగ్లు, మహర్లు, భంగీలు, చమార్లు
తెలుగులో మాలలు, మాదిగలు.
అట్టా చాలా చోట్ల. ఈ దేశం ప్రతిమూల
ఈ పవిత్ర భారతదేశంలో అపవిత్రంగా, అసహ్యంగా చూడబడ్డవాళ్ళు.

అంటరానివాళ్ళు
మాలలుజి
మాదిగలు.( పేజి 129, 130)
"మృగాల్ని మనుషులు వేటాడటం లేదు. మనుషుల్ని మృగాలు వేటాడు తున్నాయ్. అవి మామూలు మృగాలు కాదు. రెండు యినుపకాళ్ళ క్రూర మృగాలు. ఒక కాలు మతం మరో
కాలు కులం..." ( 146)
క్రైస్తవుల పై దాడులు అనేకన్నా మాల మాదిగ క్రైస్తవుల పై దాడులంటే బాగుంటుంది... మాలాళ్ళ మీద దాడి. మాదిగాళ్ళ మీద దాడి. మాలక్రీస్తు మీద దాడి. మాదిగ క్రీస్తు మీద దాడి. క్రీస్తు అంటరానివాడైతే చాలు. దాడి జరిగి తీరుతుంది. (పేజి 150/151)
"ఈ దేశంలో పీల్చేగాలికి కులముంది
తాగే నీటికి కులముంది
పారే పంట కాల్వకి, పండే భూమికి కులముంది
బడికి, గుడికి, రచ్చబండకి కులముంది
తినే తిండికి, వుండే ఇంటికి, కట్టే బట్టకి కులముంది
మాటాడే మాటకి కులముంది
సాహిత్యానికి, సంస్కృతికి కులముంది
రాజ్యానికి కులముంది, దాని చట్టానికి కులముంది
న్యాయానికి, న్యాయస్థానానికి కులముంది
శవానికి, శ్మశాన వాటికకు కులముంది
దేవుడికి కులముంది, దెయ్యానికి కులముంది..."
(పేజి 197/198)
అక్షరాలు అంతరంగాన్ని తొలుస్తున్నాయా?
వర్తమానం కళ్ళముందు నిలుస్తోందా...??
దూర్త రాజకీయాలు గుర్తొస్తున్నాయా???
అక్షరాలు కావవి!
జ్ఞాపకాల దొంతర్లు!
అవమానాల పరంపరలు!
ఆత్మగౌరవ ఆక్రందనలు!
అంతులేని పోరాటాలు!

ఎలాంటి జ్ఞాపకం అది?
“ ఎట్టాంటి జ్ఞాపకం అది...
ఓ దృశ్యం
చంద్రుడ్ని వెన్నెల్ని చూసే చిత్రకారుడి హృదయం లాంటి జ్ఞాపకం. ఎట్టా వుంటుంది అట్టా చంద్రుడ్ని వెన్నెల్ని మాత్రమే చూసే హృదయం......
వర్ణాలు. దృశ్యం నిండా. ఉష్ణవర్ణాలు. శీతల వర్ణాలు. ఒకదానితో ఒకటి కలిసిపోతో, వెన్నెల చంద్రుడ్ని, కరిగి పారే మంచు నీటిని, సూర్యుడ్ని చూపగలిగే వర్ణాల సంగమం. ప్రతి మలుపులో ఎంత చిక్కగా అల్లుకపొయ్యాయి. చెరిపేసినా చెరగని నవ్వు. తడి ఆరని ఏడుపు.

ఓ జీవిత దృశ్యం

ఓ అంటరాని వసంతం. “(పేజి 163)

వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యం విస్మరించిన వెలివాడల బతుకు చిత్రాన్ని, తరతరాల అవమానాల కొలిమిలో మండిన శ్రామిక సమూహాల సంగ్రామాన్ని తిరుగులేని ధిక్కారంతో ఈ దేశపు పీడితుల పక్షాన చరిత్రలో నమోదు చేసిన నవల
“అంటరాని వసంతం “!
ఈ దేశపు దళిత బహుజనుల తాత్విక సామాజిక చిత్రాన్ని ఆవిష్కరించిన అక్షర శిల్పం 'అంటరాని వసంతం'. సమాజం, చరిత్ర, కళ, సంస్కృతి... అన్నింటా శతాబ్దాలుగా సాగుతున్న అన్యాయం, దోపిడీ, ఆధిపత్యం తాలూకు కన్నీటినీ, చెమటనీ, రక్తాన్నీ బాధ్యతగా దోసిటపట్టి రికార్డు చేసిన గ్రంథం ఇది. అందుకే, “రూతు ఇష్టంగా చదువుకొనే ఆనాటి రూబేను డైరీలలో కొన్ని పేజీలు ఎలాంటి మార్పు లేకుండా...” 1920వ ఏడు మొదలైన అన్వేషణ 1924 దాక సాగినట్టు నమోదు చేసింది!
“నిజంగా అన్పిస్తోంది.జీవితం పరిగెత్తుతున్నట్టే వుందని. అదో నిరంతర ప్రవాహమని. ఆ ప్రవాహం కాలం తర్వాతి కాలాన్ని కలుపుకొంది. తరం తర్వాతి తరాన్ని తాకుతుంది. ప్రతి కాలం నిన్నలా వుండదు. ప్రతి తరం ముందుతరంలా వుండదు.
కాని ఇక్కడో ప్రత్యేకత ఉంది.
ఈ దేశం మాల, మాదిగల జీవితాల్లో ఆ ప్రత్యేకత మరీ ప్రత్యేకమైంది.
అంటరానితనం. అది ఎప్పుడూ ఒకేలా ఉంది. అన్ని కాలాల్లో వుంది. అన్ని తరాలకూ వుంది. అది తాకకుండా, అది కలవకుండా వాళ్ళ జీవితం లేదు. వంశం లేదు.

సినసుబ్బడి తర్వాత ఎల్లన్న. ఎల్లన్న తర్వాత ఎర్రెంకడు. ఎర్రెంకడు తర్వాత ఎల్లన్న. ఎల్లన్న తర్వాత శివయ్య. శివయ్య తర్వాత రూబేను. రూబేను తర్వాత యిమ్మానుయేలుబీ

యిమ్మానుయేలు తర్వాత జెస్సీ.

అట్టాగే

సిన సుబ్బి తర్వాత లచ్చిమి. లచ్చిమి తర్వాత లింగాలు. లింగాలు తర్వాత సుభద్ర. సుభద్ర తర్వాత శశిరేఖ. శశిరేఖ తర్వాత రూతు. రూతు తర్వాత మేరీ. మేరీ తర్వాత రూబీ. తరం ఏదైనా కావచ్చు. జీవితం ఎవరిదైనా కావచ్చు. తాకకుండా పోలేదు. అంటరానితనం కాటెయ్యకుండా పోలేదు.".

(పేజీ 166)

అతిశయోక్తనుకునే వారి మానాన వార్ని వొదిలేయడం మినహా చేసేదేం లేదుకానీ సామాజిక కార్యకర్తలు, ఉద్యమకారు లనే కాదు, చదవడం వొచ్చిన ప్రతి ఒక్కరూ చదివి తీరాల్సిన గొప్ప పుస్తకం అంటరాని వసంతం. దళిత బహుజన ప్రజాతంత్ర ప్రత్యామ్నాయ సాంస్కృతిక కార్యకర్తలకు ఒక తప్పనిసరి పాఠ్యాంశం ఇదని నా అభిప్రాయం. ఇంకా చదవనివారూ, చదవాలని, చదివించాలనుకునే వారు వాట్సప్ , ఈ మెయిల్ పెడితే సాఫ్ట్ కాపీ పంపగలను.నెట్లో కూడా ఉంది. మొదలుపెట్టి ఆపకండి. నెమ్మదిగా

నైనా మొత్తం చదవండి !

దాదాపు15 ఏళ్ళ నుండి అనేక మందికి, అనేక సందర్భాలలో పరిచయం చేస్తూనే ఉన్నాను. వివిధ భాషల్లోకి అనువాదం ఐన అంటరాని వసంతం పై తెలుగులో జరగాల్సినంత చర్చ జరగలేదనే అసంతృప్తి ఇన్నేళ్ళుగా నన్ను వెన్నాడుతూనే ఉంది. నా రచనలు, ఇతరేతర ప్రచురణలు, సంకలనాల్లో కోట్ చేస్తూనే ఉన్నాను. "సంస్కృతి, (సంక్షోభాలు – సంవాదాలు) సంకలనంలో అంటరాని వసంతంలోని కొటేషన్లు ప్రత్యేకంగా, ఇష్టంగా డిజైన్ చేయించుకున్నాను. "భారతదేశంలో బౌద్ధ పతనం" డా.బి.ఆర్.అంబేద్కర్, రాహుల్ సాంకృత్యాయన్ ల వ్యాసాలకి నా అనువాదం "అంటరాని వసంతా" నికి ప్రేమతో అంకితం ఇచ్చిందే. నా వరకూ నాకు ఇదో నిత్యం పఠించే పుస్తకం. ఎందుకనేది స్పష్టమే బీ

"ఓ చిరుజల్లు ఆ తర్వాత సూర్యాస్తమయం

ఓ జ్వాల

జీవితం ఎంత భీకరమైన పోరాటం.

జీవితం నిజంగా ఓ యుద్ధభూమి.....

జ్ఞాపకాలు.... వాస్తవాలు....

నిన్న తన మనుషులు చేసిన యుద్ధం తాలూకూ జ్ఞాపకాలు. ఈ రోజు తన బిడ్డలు చేస్తున్న యుద్ధం తాలూకూ వాస్తవాలు. మలుపు మలుపుకు పూసిన జ్ఞాపకాలు. పూసిరాలిన జ్ఞాపకాలు. రాలిమొలిచిన వాస్తవాలు.

కథలు మలుచుకొన్న జ్ఞాపకాలు.

కవితలు అల్లుకున్న జ్ఞాపకాలు.

కల్లోలం సృష్టించుకున్న వాస్తవాలు.

అంతా యుద్ధమే.

ఈవల్లూ ,యిల్లూ,ఆకలి,చెట్టు,చేను..అంతా..అంతా..అంతా..అంతా..యుద్ధమే.”

(పేజి 227/28)

(అంటరాని వసంతం పై విభిన్న సమీక్షలు, అభిప్రాయాలను వ్యాసాలుగా చేర్చి ఒక సంకలనం తీసుకొద్దామనే ఆలోచన ఉంది.అనేక కారణాల వల్ల ఇప్పటికైతే కాలేదు. ముఖ్యంగా అణగారిన వర్గాల పక్షం వహించి, వారికి వెన్నుదన్నుగా నిలిచే అద్వితీయ గ్రంథం, అట్టడుగు ప్రజల గుండెల్లో నిత్యం నిలిచే గాఢమైన 'గతం కాని జ్ఞాపకాన్ని', "అంటరాని వసంతా"న్ని తెలుగు సాహిత్యానికి ఆ మాటకొస్తే మానవాళివైపు నిల్చే మానవతా సాహిత్యం మొత్తానికి అందించిన జి. కళ్యాణరావు గారికి ప్రత్యేక అభినందనలు తెలుపుతూ

రెండో భాగం కోసం ఎదురుచూస్తూ,

**ముఖచిత్రం,వెనుక చిత్రం, ముందుమాట, చివరి మాట ఫొటోలతో 2000 సంవత్సరంలో విరసం ప్రచురణ గా వచ్చిన అంటరాని వసంతం పై చాలా రోజుల్నుంచీ అనుకుంటున్న ఈ చిన్న రైటప్)**

# జ్ఞాపకం గతం కాదు, ఆగతం !

## పాతికేళ్ళ అక్షరజ్వాల, అంటరాని వసంతం !

## (అట్టడుగు మహిళ ధిక్కార విస్ఫోటనం)




మహిళా దినోత్సవం పేరిట అనేకానేక తతంగాలు జరుగుతున్న వేళ మీకో మహిళ కథ పరిచయం చేయాలి. "నా బిడ్డ వో ఆచరణ" అని తలెత్తి చెప్పగల యోధురాలి మాటల్లోనే ఆమె కథ వినాలి. తెలుగు సాహిత్యానికి, సమాజానికి ఆమె చిరపరిచిత వ్యక్తే అయినా ఒక పాత్రగా ఆమెకు 25 ఏళ్ళు. ఆమె ఈ దేశంలోని వేలాదిమంది అణగారిన బడుగు వర్గాలకి ప్రతీక. ఆమె పేరు రూతు. భర్త పేరు రూబేను !

"క్రీస్తు నా విశ్వాసం. పోరాటం నా అవసరం. శతాబ్దాల సంఘర్షణకి ప్రతిరూపం నా బిడ్డ. ఓ మాలాడికి, మాదిగాడికి అది అలంకారం కాదు. అది ఆదర్శం కాదు. అవసరం. అంటరానివాడిగ పుట్టాను. సెంటు భూమి లేనివాడిగా పుట్టాను. విసిరేయబడ్డాను. వెలివేయబడ్డాను. అన్నిటికీ నా బిడ్డ జవాబులు వెతికి ముందుంచాడు.."

యిమ్మానుయేలు కోసం తండ్రి రూబేను ఒక పోలీసు సి. ఐ. తో అన్న మాటలివి. రూబేను చర్చి పాస్టరు. చనిపోయిన కొడుకు కోసం ఏమన్నాడు ? "నాకు దేవుని బిడ్డల్ని పంపటం మాత్రమే తెలుసు. జనం బిడ్డల్ని ఎట్టా పంపాలో నాకు తెలీదు." జనం బిడ్డ , రూతు బిడ్డ జనం బిడ్డ ఎట్టా అయ్యాడు? మరి ఆ జనం బిడ్డకి ఏమైంది ?

"అనుకుంటాంగాని భూమ్మీద త్యాగానికి ఉన్న విలువ దేనికీ లేదు. అది ఎంత చిన్నదైనా కావచ్చు. దాన్ని ఎంత చిన్న వాడైనా చెయ్యొచ్చు. దాని శక్తి దానిదే. మనుషుల గుండెల్లో గూడుకట్టుకొని, వాళ్ళ మాటల్లో మరణం లేకుండానే ఉంటుంది.."

అక్షరాల్లో రచయిత రాసిన ఈ మాటలు అంటరాని వసంతానికి సరిగ్గా సరిపోతాయి. జి. కళ్యాణ రావు రాసిన ఈ నవల మొట్టమొదట 1998 లో అరుణతార లో వచ్చింది. తర్వాత 2000లో పుస్తకంగా విరసం ప్రచురించింది. ఎలాంటి పుస్తకం అది ! ఎంత గొప్ప జీవిత చిత్రమది ! ఎడతెగని పోరాటాల చరిత్ర, ఎల్లల్లేని త్యాగాల చిత్రణ ! ఈ దేశంలో శతాబ్దాలుగా శకలాలుగా బతుకీడుస్తున్న పీడిత ప్రజల ధిక్కార స్వరం, తరతరాల అణిచివేతకి వ్యతిరేకంగా బిగించిన శ్రామికవర్గాల ఉక్కు పిడికిలి, కష్టాలు, కన్నీళ్ళు, కళలు,

కవిత్వం, యుద్ధం..వెరసి ఇంత గొప్ప అద్భుతమైన నవలగా, కాదు కాదు వాస్తవంగా తెలుగు సాహిత్యంలో వెల్లివిరిసింది !

"ఆకలి, అంటరానితనం, దోపిడీ, దౌర్జన్యం ఎల్లన్న మొదలు యిమ్మానుయేలు దాకా. సుభద్ర మొదలు మేరీ సువార్త దాకా. చూడాల్సిన పదాలు. కారణాలు వెతకాల్సిన పదాలు..."

వెతికితే ఎలాగుంటుందో ఈ అక్షరాల్లో జీవం పోసుకున్న ప్రాణాలు చెబుతాయ్. వెలివేయ బడ్డ కళాకారుడి గుండె లోతుల్లో మండిన సమిష్టి దుఃఖం చెపుతుంది. ఒక జీవిత కాలపు అణిచివేతకు గురై తిరగబడ్డ వేదనా భరిత ఆవేశం చెబుతుంది. ఎన్నెలపిట్ట చెబుతుంది, అంటరానివసంతం చెబుతుంది!

మరి, వినాలంటే ఏంచెయ్యాలి? గొప్పకు పోకుండా, భూమికి చెవులాన్చాలి. మొక్క అంటుకట్టినట్లు జాగ్రత్తగాపోరాటాన్ని ప్రేమతోవెతకాలి. అప్పుడది గొప్పగా ఉంటుంది. చాలా ఉన్నతంగా ఉంటుంది. అప్పటిదాకా చూడని చరిత్రనూ, భవిష్యత్తు నూ ఒకేసారి చూపిస్తుంది. ఆక్రందనలువినిపిస్తూనే ఆశాదీపాన్ని వెలిగిస్తుంది. ఆ వెలుతురులో మనక్కూడా రూతు లాగానే ఆకాశంలో ఒంటరి చుక్కొక్కటే కనిపిస్తుంది. మళ్ళీ, ఈ రూతు ఎవరంటారా ?

"మొదటగా మీకు రూతుని పరిచయం చేస్తాను. తర్వాత కథలోకి వెళ్తాను. ఆమెని రచయిత్రిగా ఎరిగిన వాళ్ళు మా అభిమాన రచయిత్రిని మాకు కొత్తగా పరిచయం చేయాల్సిన సాహసం చెయొద్దనచ్చు. నిజమే. ఆమె బోలెడు కథలు రాసింది. కవితలు రాసింది. అయితే నేను యిప్పుడు పరిచయం చేస్తోంది రచయిత్రి రూతుని, ఆమె రచనల్ని కాదు. కేవలం రూతుని. నాకు తెలిసిన రూతుని. "

వసంతం ప్రారంభ వాక్యాలివి. మీకూ రూతును పరిచయం చేసుకోవాలనుందా? రూతు కథ తెలుసుకోవాలని ఉందా? 25 ఏళ్ళుగా తెలుగు సాహిత్యంలో అద్వితీయ మైన ప్రజాగొంతుకల్ని వాటి నోటితోనే అనుభూతి చెందాల్నుందా ? ఇంకెందుకు ఆలస్యం, అంటరాని వసంతం వెంటనే చదివేయండి మరి! మర్చేపోయాను, ఇది రూతు కథ మాత్రమే!! మేరీ సువార్త కథ త్వరలోనే వస్తుందని ఆశిద్దాం !!!

(ఆసక్తి ఉన్న వారు నా నంబర్ 9032094492 కి వాట్సప్ రిక్వెస్ట్ పెడితే సాఫ్ట్ కాపీ పంప గలను. అనుకుంటాంగానీ ఏదో ఓసారి చదివి పక్కన పడేసే పుస్తకం కాదిది.అనేక రాత్రుళ్ళు మనల్ని వెంటాడేది, అసంఖ్యాక ఆలోచనల్ని తట్టిలేపేది. అపరిమితమైన అలజడుల్ని పరిచయం చేశేది. రెండు దశాబ్దాలుగా నా జీవితంలో, కలల్లో భాగమైన ఈ కల్లోల వసంతం తెలుగు సాహిత్యంలో పాతికేళ్ళు పూర్తి చేసుకున్న సందర్భంగా ఒక చర్చా కార్యక్రమమో, ఒక చిన్న సమాలోచనో పెట్టాలని ఉంది. అంటరాని వసంతం పై వచ్చిన వ్యాసాలు కనీసం కొన్నింటి నయినా సంకలనంగా కూర్చాలనుంది. నా అసహాయత్వానికి గుర్తుగా పాతికేళ్ళు నిండిన 'అంటరాని వసంతం' గురించి, మహిళా దినోత్సవం సందర్భంగా

# విలక్షణ విప్లవ కథనం,దక్షిణ తూర్పు పవనం!
## (మార్కోస్ అద్వితీయమైన పుస్తక పరిచయం)




"తిరుగుబాట్లు భూమి ఫలాలు. వాటికంటూ కొన్ని రుతువులుంటాయి. గతం గురించిన పశ్చాత్తాపాలతో నిండిపోయిన పుస్తకాలలో తిరుగుబాట్లు ఫలదీకరించవు. మరణం తప్ప మరోప్రత్యామ్నాయం లేని స్థితికి నెట్టివేసిన తరువాత జీవితం పట్ల గల ప్రేమతో మరణాన్ని రాజ్యాన్నీ ఏకకాలంలో ధిక్కరిస్తూ తిరుగుబాట్లు ఫలదీకరణ చెందుతాయి. ఆ సాఫల్యం వొక్క తిరుగుబాటునే కాదు, స్వేచ్ఛని గురించిన ఆశని కూడా నేర్పుతుంది. మరో మాటలో అదే మా యుద్ధనీతి!"(పేజి 20)

"ప్రజాస్వామ్యం! స్వేచ్ఛా! న్యాయం" కోసం మెక్సికోలోని చియాసన్ రాష్ట్రంలో నియంత పాలక విధానాలకి వ్యతిరేకంగా మార్కోస్ నాయకత్వంలో జరిగిన జపటిస్టా ఆదివాసీ పోరాట కాలంలో గెరిల్లా యోధుడిగానే కాక కవి, రచయిత, విమర్శకుడిగా మార్కోస్ రాసిన లేఖలు, ప్రకటనల సంకలనమే, Shadows of Tender Fury, మంత్లీ ప్రెస్ (న్యూయార్క్) 1994 లో ప్రచురించిన ఈ పుస్తకం తెలుగులో శశి అనువాదంగా గద్దర్ ముందుమాటతో 1999లో ప్రచురించింది. అన్యాయాల్ని ప్రశ్నించి, ఘాటైన వ్యంగ్యంతో అక్రమాల్ని నిలదీసే మార్కోస్ అద్భుతమైన గొంతు అంతర్లీనంగా ఇందులోని ప్రతి అక్షరంలోంచి మనకి వినబడుతుంది !

"ఇది ఆత్మగౌరవం కోసం జరిగే యుద్ధం. శాంతియుత మార్గాల ద్వారా ఆత్మ గౌరవం దక్కితే మేం శాంతియుతంగానే మా లక్ష్యాన్ని సాధించుకుంటాం. యుద్ధం చేయడం వల్ల మాత్రమే మేం ఆత్మగౌరవం సాధించగల మనుకుంటే యుద్ధమే చేస్తాం. మరణించడం వల్ల మాత్రమే ఆత్మగౌరవం దక్కుతుందంటే మరణించడానికి మేం సిద్ధం!." (పేజీ 32)

నిరంతరం ప్రాణాల్ని గుప్పిట్లో పెట్టుకుని ప్రమాదకరమైన పరిస్థితుల్లో కూడా యుద్ధభూమిలో నుండి అనితరసాధ్యమైన హాస్యచతురతనీ, వ్యంగ్యాన్ని జోడించిన మార్కోస్ రాసిన అక్షరాల్లో నిజానికి కనిపించేది అసంఖ్యాక పీడితుల పక్షం పై అంతులేని ప్రేమ, ఆప్యాయత. పత్రికలకీ, మధ్యతరగతి ప్రజలకీ కూడా సుతిమెత్తగా వాతలు పెడుతూ అధికారులు మొదలుకొని బడిపిల్లల వరకూ సంభోదిస్తూ సూటిగా, స్పష్టంగా సాగుతుంది ఈ పుస్తకం !

"ఇతర్లు బతకడానికి మేము చనిపోయినా ఫర్వాలేదు. చనిపోయిన వాళ్ళ కంటే గొప్ప జీవితాన్ని బతికున్న వాళ్ళు చవిచూడాలి. మా మరణాల వెనక ఉన్న చేదు వాళ్ళకి బోధపడి బాధ్యతగా వాళ్ళు బతకాలనుకుంటాను. జాగ్రత్త! ఫాసిస్టు భూతం మీ వెనకాలనే ఉంది. దాని నీడ మిమ్మల్ని వెంబడిస్తుంది!" (పేజీ 44)

సమకాలీనంగా అన్వయించుకోడానికి కూడా సరిగ్గా సరిపోతాయ్ ఈ మాటలు, అంతేకాదు, ఇలా హెచ్చరిస్తూనే కలం వీరుల పై అపారమైన ప్రేమని వ్యక్తీకరిస్తూ,

"...మా కన్నీళ్ళని సిరాగా మార్చి మా గోడుని అచ్చువేసి ప్రపంచానికి ప్రకటించిన మీరు వీరులు. ముఖానికి ముసుగు వేస్కొని తపంచ పట్టినవాడే కాదు, నిర్భయంగా కలం చేతబట్టిన వాడూ వీరుడే. జోహార్లు మీకు. నిజం చెప్పడానికి వెనుకాడని మీకు వందనాలు." (పేజి 45) అంటారు!

ప్రపంచ ప్రజలకు మార్కోస్ ఉత్తరం రాస్తూ తిరుగుబాటుకి దారితీసిన 8 కారణాలు పేర్కొంటారుబీ

1. ఆకలి, దుఃఖం, పేదరికం, అసమానత
2. భూమిలేమి, పనిలేమి
3. అణిచివేత, నిర్భంధకాండ, హింస, హత్యారాజకీయాలు
4. మానవ హక్కుల ఉల్లంఘన, మూల వాసుల పట్ల విద్వేషం
5. దోపిడీ, ద్రోహం
6. అత్యవసర పౌరసాధకాల లేమి, నిర్లక్ష్యం
7. అరవై ఏళ్ళ అబద్దాలు, వంచన, మోసం, దగా, స్వేచ్ఛారాహిత్యం, అరాజ్యం.
8. రాజ్యాంగానికి ద్రోహం, మూలవాసుల హక్కుల ఉల్లంఘన !

ఇంకా ఈ రోజుకీ అన్ని పీడిత దేశాలకీ సరిపోయే 34 న్యాయబద్ధమైన డిమాండ్లను, ఆ ఒడంబడికను కూడా బహిరంగంగా మన ముందు పెడతారు. ప్రతి సామాజిక కార్యకర్త తప్పనిసరిగా చదివితీరాల్సిన పుస్తకం ఇది. న్యూయార్క్ టైమ్స్ లో బిల్ కాస్ బీ ఈ పుస్తకం కోసం సమీక్షిస్తూ,

" ఈ పుస్తకం మీరు చదవకపోతే ఎంతో నష్టపోతారు. కొద్ది రోజుల్లో మీ ముఖం వాడిపోతుంది. రాత్రులు నిద్రపట్టదు. క్రమంగా మీ జుట్టు రాలిపోతుంది. ఆ తర్వాత కాళ్ళు చేతులు సహకరించడం మానేస్తాయ్. ఏం జరుగుతుందో తెలియని వేదనతో చనిపోతారు.." అన్న మాటలుఈరోజు మరింత నిజం!

ఇంతకీ ఇంతా చేసి రాసిన సాయుధ తిరుగుబాటుదారుడు, విప్లవ గెరిల్లా మార్కోస్ ఎవరో తెల్సుకోవాలనుందా?

“మార్కోస్ అనే వ్యక్తి హోమోసెక్సువల్. యూరప్ లో నల్లని వాడు. శాన్ క్రిస్తోబాల్ వీధుల్లో ఆదివాసీ. స్పెయిన్ లో అనార్కిస్ట్. పాలస్తీనా లో ముస్లిం విద్యార్థి. నాజీల జర్మనీ లో యూదుడు.బాస్నియాలో శాంతి కాము కుడు. కమ్యూనిస్టు పార్టీలో స్త్రీ వాది. పెరూలో గెరిల్లా. 1968 నాటి పారిస్ లో విద్యార్థి. సోవియట్ కూలిపోయాక మార్క్సిస్ట్. ఇంకా...కూరగాయలు కొనే ఇల్లాలు, ఫిల్లర్ వార్తలు రాసుకునే జర్నలిస్టు. ఎప్పుడూ బొమ్మలు వేయని కళాకారుడు. అర్ధరాత్రి సిటీ బస్సులో ప్రయాణం చేసే ఒంటరి స్త్రీ. ప్రాక్టీస్ లేని లాయరు. పుస్తకాలు రాయని రచయిత. నిరుద్యోగి. శాన్ ఫ్రాంసిస్కోలో ఎయిడ్స్ వ్యాధిగ్రస్తుడు. సోమాలియాలో అన్నార్తుడు. చైనాలో అసమ్మతివాది. ఇటాలియన్ కార్మికుడు. భారతదేశంలో భూమి లేని రైతు. దళితుడు. మొత్తంగా మనిషి. ప్రాపంచిక అసహానానికి బలైపోయే రహస్య మెజారిటీ అతను.’’ఇక చాలు’’ అని అరిచే గొంతు..ఇవన్నీ..!”(పేజీ 61)

**(షేడోస్ ఆఫ్ టెండర్ ఫ్యూరీ తెలుగు అనువాదం ఫోటోలు గద్దర్ ముందుమాటతో సహా...సాఫ్ట్ కాపీ ఎవరి దగ్గరైనా ఉంటే పెట్టొచ్చు. తప్పక చదవాల్సిన ఈ పుస్తకం గురించి ఎన్నాళ్ళ నుండో అనుకుంటున్న ఈ చిన్న రైటప్)**

# అథాతో లోకసంచార జిజ్ఞాస

## (రాహుల్జీ ఘుమక్కడ్ శాస్త్ర పుస్తక పరిచయం)




తిరుగుబోతుతనం తిట్టు కాదు, లోకం పై పట్టు ! లోకసంచారం లోకువ కాదు, వెలుగు వేకువ ! ! ఒకసారి హిమాచల్ ప్రదేశ్ లో ఉండగా తమిళ మిత్రుడు భారతి Travel itself is a form of Protest అన్నాడు. వెంటనే ఆ వాక్యాన్ని నోట్ చేసుకున్న నేను తర్వాత దాని గురించి ఆలోచిస్తే ఎంత నిజమెా అనిపించింది. అనవూనతల్ని ఎదిరించే ఆలోచనాపరులకూ, సమసమాజాన్ని ఆశించే స్వాప్నికులకూ, ముఖ్యంగా అన్ని రకాల సామాజిక కార్యకర్త లకూ ప్రపంచాన్ని ప్రయాణమనే సాధనంతో ఈదడానికి మించిన ప్రక్రియ మరేదీ లేదనేదే నా అభిప్రాయం. అందుకే అంటుంటాను నా ప్రేయసితో, ప్రయాణం నా ప్రేయసని. కొద్దికాలం క్రితం ఒక మిత్రురాలు రాహుల్జీ ఘుమక్కడ్ శాస్త్ర్ కల్పిత నవలా? అని అడిగింది. మరో మిత్రుడు రాహుల్జీ సంచారం గురించి రాసిందాని వివరించమని అడిగాడు. పూర్తిగా కాకున్నా ఇప్పటికి తీరింది కనుక కాస్త సంక్షిప్తంగా నాకు తెల్సిన మేరకు రాస్తున్నాను. ఇది సమగ్ర సమీక్ష కాదని మనవి !

"నా దృష్టిలో ప్రపంచంలో సర్వ శ్రేష్టమైనది లోకసంచారం" అంటారు రాహుల్జీ. ఘుమక్కడ్ శాస్త్ర్ "తిరుగుబోతుల/దేశ దిమ్మరుల శాస్త్రం నాకు తెలిసీ ప్రపంచంలో మొట్టమొదటి సారిగా సంచారాన్ని సశాస్త్రీయంగా విశ్లేషించిన గ్రంథం. అది కల్పిత నవల కాదు. అసలు Fiction కానేకాదు. సంచారం పై అనేక అపోహలతో కూడిన అభిప్రాయాలను పటాపంచలు చేసి మానవ వికాసానికి పర్యటన ఎంత ముఖ్యమో తేల్చి చెప్పిన గ్రంథం. ఆనాటికే కాదు ఏవో చిన్నా చితకా ఉండవచ్చు కానీ ఈనాటికీ ఆ గ్రంథం ప్రయాణాన్ని సాధనంగా చేసుకున్న అన్వేషకులకు అత్యంత విశిష్టమైనదే.

అసలు సంచారం గురించి అంత విపులంగా వివరించింది నా వరకూ నాకు వ్యక్తిగతంగా మరో పుస్తకం తెలియదు. ఏ భాషలోనైనా ప్రాథమికంగా విద్యార్థులకు పాఠ్యాంశంగా ఉండాల్సిన గ్రంథం, ప్రగతిశీల భావాలు కలిగిన సంఘాలు తప్పనిసరిగా పనికట్టుకుని తమ కార్యకర్తలకు ఇచ్చి చదివించాల్సిన కరదీపిక ఈ పుస్తకం, అలాంటిది దానిని పట్టించుకున్న వారే లేరు !

యువత ప్రయాణం ఎందుకు చేయాలి? పర్యటనని ఒక దార్శనిక సాధనంగా ఎలా మల్చుకోవాలి?అసలు మనిషి ప్రయాణాలు ఎందుకు చేయాలి? ప్రయాణాలకి ఎలా సంసిద్ధం కావాలి ? ప్రయాణాల్లో ఎదురయ్యే అనుకోని అవాంతరాలు/ ప్రమాదాల్ని ఎలా ఎదుర్కోవాలి? ప్రయాణాల్లోని ఖర్చులు, దుస్తులు, ఆహారం, వసతి, తదితర వివరాలు. ఎప్పుడు ఎలాంటి ప్రాంతాలని ఎంచుకోవాలి? సంచారి తప్పనిసరిగా నేర్చుకుని ఉండాల్సిన విద్యలు, లక్షణాల గురించి సంగ్రహంగా రాస్తారు. అంతేకాదు, ఉండకూడని/చేయ కూడని పనుల్ని కూడా (do and donts) ఇలా ప్రయాణాలకి సంబంధించిన సర్వాన్నీ అంతే స్పష్టంగా వివరిస్తారు రాహుల్జీ ఇందులో. అందుకే సంచారాన్ని సైన్స్ స్థాయికి తీసుకుని వెళ్ళిన వైజ్ఞానిక గ్రంథం ఇదనేది నా అభిప్రాయం!

పర్యటన పరమార్థం ప్రజాహితం. ప్రపంచంలోని భిన్నత్వాన్ని ఆఘ్రానిస్తూ ఏకాకిగా అంతరాత్మ లోకి తొంగి చూసుకోవడం. మంచులా గడ్డకట్టిన తెలీని జడత్వాన్ని వీడి జన సమూహాలతో మమేకమవడం. చెట్టునీ, చేమనీ, పక్షినీ, పశువునీ పలకరిస్తూ పోవడం ఒక్క మాటలో చెప్పాలంటే మనిషిగా పరవశించిపోవడం.

ఈ రోజు Tourism ఎరుతో పర్యటనలోని చింతనాత్మక దృక్పథాన్ని నాశనం చేసే సంచారాన్ని కేవలం ప్రదేశాల్ని చుట్టొచ్చే ఒక వ్యాపార, భక్తి కేంద్రక, వ్యక్తిగత వ్యవహారం చేయడం వెనుక భారీ కుట్రని అధ్యయనం చేయడం అవసరం. సమాజంతో మిళితమై నవీనోత్తేజంతో సాగాల్సిన పర్యటన సారాన్ని పర్యాటక ప్రదేశాలు చూసి రావడంగా కుదించడం దారుణం. ప్రయాణాన్ని గురించిన ప్రజాతంత్ర స్ఫూర్తిని, ప్రత్యామ్నాయ ప్రజాహిత పర్యటన పద్ధతిని కాపాడుకోవడం ఈరోజు మనందరి కర్తవ్యం !

జీవితంలోని కష్టల్ని ధైర్యంగా ఎదుర్కోడానికి, ఆత్మ స్థైర్యాన్ని అనర్గళంగా పెంపొందించు కోవడానికి, ప్రకృతితో మమేకం అవడానికి, సౌందర్యోపాసన జరిగి రసాస్వాదన చేయడానికి, మనిషిని మనిషి గా గుర్తించి మరో మనిషి అస్తిత్వం పట్ల అచంచలమైన స్పృహ కలిగి ఉండడానికి , అన్నింటికంటే ముఖ్యంగా మన ఉనికిని ఒక అర్థవంతమైన మార్గంలో సార్థకం చేసుకోవడానికి ప్రయాణం తప్పా మరో మార్గం లేదంటాడు రాహుల్జీ. అలాంటి ప్రయాణం ప్రాముఖ్యత వివరిస్తూ లోక సంచార శాస్త్రం కోసం లోకంలో మొట్టమొదటి సారిగా సశాస్త్రీయంగా విశ్లేషించిన గ్రంథం ఘుమక్కడ్ శాస్త్ర్. నిజానికి ఘుమక్కడ్ అనేది హిందుస్తానీ లో తిట్టుగా వాడబడింది. మనకి కూడా తిరుగుబోతు/ దిమ్మరి మొదలైన పదాలు గౌరవప్రదంగా ఉపయోగించిన దాఖలాలు తక్కువ. రాహుల్జీ ఘుమక్కడ్ శాస్త్ర్ ని తెలుగులో దశాబ్దాల క్రితమే కీ. శే. ఆలూరి భుజంగరావు గారు అనువదించారు. రాహుల్జీ రచన దివోదాసుతో పాటు ఈ లోకసంచార శాస్త్రం పుస్తకాన్ని విశాలాంధ్ర ప్రచురించింది. ఆసక్తి ఉన్న వారి కోసం సాఫ్ట్ కాపీ కూడా పెడుతున్నాను, తప్పక చదవండి!

# సర్వకాల సర్వావస్థల సమానతా నినాదం

## స్పార్టకస్ (పుస్తక పరిచయం)




“అతను ఓడిపోయాడు, చనిపోయాడు. క్రీస్తుకి పూర్వమే పుట్టాడు, గిట్టాడు. కాని అతని పేరు చెప్తే దోపిడీదారులందరికీ ఇప్పటికీ బెదురు. ఎందుకంత బెదురు ? ఎందుకా ? వారు శ్రామిక వర్గాల జనాన్ని పందులకంటే హీనంగా చూస్తారు. కాని ఆ జనాలు ఉగ్రనరసింహులు గా వారి విజృంభించ గలరన్న సత్యాన్ని చరిత్రలో మొదటిసారిగా చాటి చెప్పినవాడు స్పార్టకస్. అందుకే, ఇరు వర్గాల వారికీ కూడా అతను ముఖ్యుడు. ఇరు వర్గాల వారూ అతణ్ణి గుర్తు ఉంచుకుంటారు – శ్రమించే వారు ఆశతో, దోపిడీ దార్లు పగతో.” అంటారు రాచకొండ విశ్వనాథశాస్త్రి ఈ పుస్తకానికి రాసిన ముందుమాటలో. ఇంతకీ ఈ స్పార్టకస్ ఎవరు ?

“అయ్యా! మా దేశంలో స్పార్టకస్ రోమ్ ను జయిస్తాడు అనుకునేవారంటే నమ్మండి. దాంతో మా దేశంలో కూడా దాని ఛాయలు పడక మానలేదు. కొద్దిమంది బానిసలు తిరగబడ్డారు. వాళ్ళ పప్పులుడకనివ్వలేదు మేం. మరి లేవకుండా అణిచిపారేసాం....ఆ స్పార్టకస్ ధైర్యం మండ బీ ప్రపంచంలోని మంచినంతనీ ఔన్నత్యాన్నంతనీ బరి మీదికి లాగి సవాలు చేసాడు. పోనీ వాడు తెచ్చి పెట్టిన దేమిటయ్యా అంటే, అరాచకం, దోపిడీలు, గృహదహనాలు, ఖూనీలు, అల్లకల్లోలం, నానాభీభత్సం..” (పేజీ 8)

“అతన్ని గురించి ఎవరికీ బాగా తెలీదు. ఎలా తెలుస్తుంది?... స్పార్టకస్ సంపూర్ణ స్వభావ నిర్ణయం చేయగల వాళ్ళంతా ఏపియన్ మార్గంలో శిలువల నలంకరించారు. ఆ మనిషే ఒక కలలా వచ్చి కలలాగే కరిగి పోయాడు. మెరుపులా వచ్చి మాయమయ్యాడు.అతన్ని మళ్లీ మనం ఒక బానిస గా తయారు చేసుకోవాలి. అంటే అనగనగా ఒక బానిస అని మొదలెట్టి అతన్ని గురించి ఆలోచించాలి....”

“అతనేం దెయ్యం లాంటి మనిషి కాదు, మహా శక్తివంతుడూ కాదు. కాని త్రినేత్రుడినయినా సరే ఎదిరిం చగల కోపం మాత్రం ఉంది. రోషం ఉంది. అతను యుద్ధం చేస్తుంటే క్రోధం, బ్రహ్మాండమైన కోపం ఉగ్రరూపం దాల్చి యుద్ధ రంగంలో ప్రవేశించిందా అనిపిస్తుంది.” (పేజీ 15,16)

“గాల్ ప్రజలు ఎందుకు యుద్ధం చేస్తారో నాకు తెలుసు. అట్లాగే గ్రీకులు, జర్మన్లు,

స్పాని యార్డుల యుద్ధోన్మాదం నేనెరుగుదును. కాని ఈ బానిసలకు యుద్ధమేమిటి? నా కర్థం కానిదల్లా ఈ బానిస ప్రకటించిన యుద్ధమే. ఎందుకు వీడికీ యుద్ధం? ప్రపంచంలోని చెత్తనంతటినీ, అల్లరి మూకనంతటినీ, అలగా జనాన్నందరినీ కూడగట్టుకుని మరే ఇతర దేశమూ సృష్టించలేని, గర్వింపదగ్గ అద్భుతమైన రోమన్ సైన్యాన్ని వీడెందుకు నాశనం చెయ్యతలపెట్టాడు..?"(పేజి33, 34)

అతని కోసం తెలిసిన వాళ్ళంతా ఆనాడే చనిపోయారు. కాదు, చంపబడ్డారు, క్రూరంగా హత్య కావించబడ్డారు. వాళ్ళ శవాలు మొత్తం 6472, అక్షరాలా ఆరు వేల నాలగొందల డెబ్బై రెండు కళెబరాల్ని రహదారిలో శిలువలేసి మరీ కాకులకీ, గద్దలకీ ఆహారంగా వేసారు. మరి బానిసల చరిత్ర ఎవరు రాయాలి? ఎలా తెలియాలి?

"బానిసల సాహసాన్ని చిత్రించేందుకు చరిత్రకారులు లేరే. ఒకవేళ బానిస చేసిన పనులకు చరిత్రలో స్థానం ఇచ్చి తీరాల్సిన అవసరమే ఏర్పడిందనుకోండి బీ అప్పుడైనా బానిసలను కొనుక్కునేవాడే, వాళ్ళని అసహ్యించుకునేవాడే, వాళ్ళంటే భయ పడేవాడే ఆ చరిత్ర ను రాసేందుకు తయారయ్యేవాడు.." (పేజీ 92)

"చూసినవాళ్లెవరైనా కాలం అతన్నందు కుంటోంది అంటారు. సరిగ్గా చెప్పాలంటే అతనిభుజాల పై కూచుని స్వారీ చేస్తోంది. ఎందుకని అంటారేమో ! ఎన్నో శతాబ్దాలు గడిచిపోనీ, ప్రపంచం ఎంతో దూరం, ఎన్నో మెలికలు తిరిగి సాగిపోనీ, ఆ వ్యక్తిని మాత్రం మరిచిపోదు. కొద్దికాలం క్రితం అతనొక బానిస. కాని ఈ రోజున అతని పేరు తెలీని వాడు లేడు. తానే విధంగా తయారయ్యా డన్న విషయం కూచుని కాస్సేపాలోచిం చడానిక్కూడా అతనికి తీరుబడి లేదు... ప్రస్తుతం అతను ఏభై వేల సైనికులకు సర్వసేనాని. ఆ సైన్యం కొన్ని విషయాల్లో చూస్తే ప్రపంచంలో సైన్యాలన్నింటికన్నా ఉత్తమ మైనది. స్వతంత్ర సాధన కోసం పోరాడే సైన్యమది..." (పేజీ 168)

"అప్పుడే స్పార్టకస్ ఒక దెయ్యం అయిపో యాడు. రేపా దెయ్యమూ మిగలదు. ఇంక పదేళ్ళయ్యాక ఈ స్పార్టకస్ ఎవరో ఏమిటో ఎవరికీ జ్ఞాపకముండదు. ఎందుకు జ్ఞాపక ముండాలి? ఏమంత ఘనకార్యం చేసాడని అతని పేరు జ్ఞాపకముంచుకోవాలి ప్రజలు? బానిస యుద్ధాల కో చరిత్రంటూ ఉండే డిసిందా? అదీకాక స్పార్టకస్ ఒక నిర్మాణా త్మక శక్తి కాదు. అతనొక వినాశకారి. ప్రపంచం నిర్మాతలనే జ్ఞాపకం ఉంచుకుంటుంది తెలుసా..?" (పేజి 202)

స్పార్టకస్ మరణానంతరం అతని భార్య వరీనియాతో బానిస యజమాని క్రాసన్ అన్న పై మాటలకి ఆమె చెప్పిన సమాధానం సర్వ కాలాలకీ వర్తించేది, మన దేశ దళిత బహుజన పీడిత ఉద్యమాల్లో అసువులు బాసిన అందరికీ వర్తించే గొప్ప జవాబది,

ఇన్నేళ్ళ ప్రజాతంత్ర ఉద్యమాల ద్వారా, అవిరామ పోరాటాల వల్లా ఏం సాధించా రంటూ సామాజిక కార్యాచరణని ఆడి పోసుకునే వారికి చెంపపెట్టు ఆమె అన్న ఆ రెండు మాటలు, " ఆశను నిర్మించాడతను ! "

అలాంటి మహత్తరమైన ఆశను నిర్మించిన వ్యక్తికి సంబంధించిన వివరాలు ఎక్కువ చరిత్రలో లేవు. లేకుండా పాలకులు జాగ్రత్త పడ్డారు. కానీ, ఈనాటికీ ఆ పేరంటే దడపుట్టే దుండగుల కోసం, దుర్మార్గుల కోసమైనా అతను నిర్మించిన 'ఆశ' లో మనిషి పక్షం నిలిచే వారంతా భాగం కావాలి. ఎందుకనేది స్పష్టం, అదెందుకో పుస్తకంలోని ముగింపు వాక్యాలే చెప్తాయ్. అవి బీ

"సంఘంలో చాలా మంది ఎల్లప్పుడూ తమ శ్రమ శక్తిని ధారపోసి సృష్టించిన సంపదనం తనూ ఏ కొద్దిమందో భుక్తం చేసుకుని మానవ జాతిని దోపిడీ చేసినంత కాలమూ, ఈ స్పార్టకస్ పేరు జ్ఞాపకముంటూనే ఉంటుందిబీ ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది. భయం వల్లనో, శక్తిహీనత వల్లనో ఒక్కొక్కప్పుడా పేరు గుసగుసలలోనే ఉండిపోవచ్చు. కాని అదే పేరు మరొకప్పుడు రణన్నినాదమై దిక్కులు పిక్కటిల్లేటట్లు, విశ్వమంతా కంపించేటట్లు ప్రతిధ్వనించవచ్చు." (పేజీ 222)

(హొవార్డ్ ఫాస్ట్ రచన స్పార్టకస్ ని ఆకెళ్ళ కృష్ణమూర్తి గారు తెలుగు చేయగా 67 ఏళ్ళ క్రితం 1955 లో విశాలాంధ్ర మొదటిసారి ముద్రించగా కొద్దిపాటి మార్పులతొ %ఎదీ% 40 ఏళ్ళ క్రితం 1981 లో రా.వి. శాస్త్రి గారి ముందుమాటతో రెండోసారి ప్రచురించింది. నాటి నుండి అనేక ముద్రణలు పొందిన ఈ పుస్తకం అంటే చిన్నప్పటి నుండి నాకెంత గానో ఇష్టం. ఇంకా చదవని వాళ్ళుంటే నా వాట్సప్ నంబర్ 9032094492 కి రిక్వెస్ట్ పెడితే సాఫ్ట్ కాపీ పంపగలను. కానీ అవకాశం ఉన్న వాళ్ళు హార్డ్ కాపీయే చదవడానికి ప్రయత్నం చేయండి. రెండొందల పుటల పుస్తకాన్ని పరిచయం చేయడానికి ఈ అక్షరాలు సరిపో వచ్చునేమో కానీ మానవాళి మనుగడ ని నిత్యం మండించే మహత్తరమైన స్ఫూర్తిని అందించే స్పార్టకస్ జీవితాన్ని తెలుసు కోవాలంటే మాత్రం మనం కూడా పీడితుల వైపు నిల్చోక తప్పదు. మార్పులో భాగం కాకుంటే మరి మనసొప్పదు. అందుకే ఎప్పటి నుంచో అనుకుంటున్న స్పార్టకస్ పుస్తకం పై ఈ చిన్న రైటప్ ఇన్నాళ్ళకిలా...)

# విప్లవ సందేశం

## (పుస్తక పరిచయం)




“ఏ యవకాశముతో యే మనుస్మృతి ధర్మాలను బ్రాహ్మలు బ్రాహ్మణేతరుల పై చలామణీ చేసారో,చేయుచున్నారో, చేయ సంకల్పించారో ఆ యవకాశముతోనే (జయించి) ఆ మనుస్మృతి ధర్మాలనే బ్రాహ్మల పై , బ్రాహ్మణేతరులు చలామణి జేయుట బ్రాహ్మణేతరుల తక్షణ కర్తవ్యము. ప్రతీకార ధర్మము. విధి. అందుకై ఎవరు కృషి చేసినారో, చేయుచున్నారో, చేసెదరో అట్టివారికి అంకితం” ఇవ్వబడిన గ్రంథం 1950 లో జాకోబిన్ పబ్లిషింగ్ కంపెని, తెనాలి తరపు నుండి కె. వి. రావు ప్రచురిం చిన “ విప్లవ సందేశం “ అనే విలక్షణ పుస్తకం !

“పాశ్చాత్య శాస్త్రజ్ఞులు యే పరిణామ వాదమును (ఎవల్యూషన్ థీరీ) ప్రతిపాదించిరో నద్దాని ననుసరించితి.” అనే వాక్యంతో ప్రారంభించిన ఈ పుస్తకం డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం మొదలుకొని అనేక అంశాలను విశ్లేషిస్తూ సాగింది.” బ్రాహ్మణ జాతిని బ్రాహ్మణ మతాన్ని బ్రాహ్మణా ధికారాన్ని భగ్గు భగ్గు న మండే మంటల్లో భస్మీపటలం జేసెద ఇదే నా ప్రతిజ్ఞ..” అంటో రచయిత చేసిన ప్రతిజ్ఞ నాటికీ నేటికీ కూడా తీవ్రవాదమే !

సృష్ట్యారంభము, హిందూదేశ చరిత్రము, బౌద్ధ మహాయుగము, మహమ్మదీయ మహాయుగము, బ్రిటీషు మహాయుగము, కాంగ్రెసు, సింహావలోకనము, బ్రాహ్మణ (ఆస్తిక) మత ఖండనము, విప్లవము ఇలా అనేక ఆసక్తికరమైన అధ్యాయాలు, వాటిల్లో మళ్ళీ విభాగాలతో విశదీకరించారు. ఇదో అరుదైన పుస్తకమని నా అభిప్రాయం !

నాకు తెలిసీ తెలుగులో చరిత్రనీ, విజ్ఞాన శాస్త్రాన్ని, పరిణామవాదాన్నీ ప్రతిపాదిస్తూనే బ్రాహ్మణాధిపత్యాన్ని తీవ్రంగా వ్యతిరేకించిన బహుశా తొలి పుస్తకం ఇదే కావచ్చునేమో. వివాదాల జోలికి నేను పోబోవడం లేదు కానీ “హిందూ దేశ చరిత్రకారులు”ద్రావిడ” పదమునే చరిత్ర యందు లిఖింపకపోవుట విచారకరం.” “ద్రావిడులన నేటి బ్రాహ్మణే తరులు గాన బ్రాహ్మణ చరిత్రకారులు ద్రావిడుల గురించి కొందరు మాత్రమే వ్రాయుచున్నారు. ఎట్లు? ద్రావిడులు యనాగరీకులని, అవివేకులని, ఇట్లు వ్రాయు చరిత్రకారులు పక్షపాత బుద్దినే ప్రదర్శిస్తు న్నారు.” అంటారు రచయిత!

“పక్షపాత రహితమున వ్రాయబడినదే చరిత్ర. అట్టివాడే చరిత్రకారుడు. మరుగుపడిన

చరిత్ర ను వెలికి తీయువాడే చరిత్రకారుడు. పరిశోధించి సత్యమును ప్రచారము జేయు వాడే చరిత్రకారుడు." అంటారు ఉపోద్ఘాతం లో రచయిత. ఎంత నిజం ! ఇన్ని సంవత్స రాల తరువాత కూడా చరిత్ర పట్ల చిన్న చూపు, నిర్లక్ష్యం వహిస్తున్న తెలుగు జాతికి ఎంత ముఖ్యమో ఆ మాటలు అనిపిస్తుంది !

"ప్రజాభ్యుదయమునకు పాటుపడే బౌద్ధ మతమును బ్రాహ్మలు నామ రూపాదులు లేకుండా నాశనము జేయగా, ప్రజాభ్యుదయ మును ఖూనీ చేసిన, జేస్తున్న బ్రాహ్మణ మతాన్ని , బ్రాహ్మణాధికారాన్ని నామ రూపాలు లేకుండా యేనాడో నశింప జేయవలసింది. ఇప్పటికే ఆలస్యమయినది. ఇక ఒక్క క్షణమైనా ఆలసింపకూడదు..." కొద్దిగా గ్రాంథికమనే కానీ లాగి లెంపకాయ కొట్టినట్లు ఎంత తీవ్రంగా ఉన్నాయో పదాలనిపిస్తుంది. అది కాదు అసలు విషయం, "నేటికినీ నాటి బ్రాహ్మణత్వమే సజీవంగా వున్నది గనుక అలా వుండవలయు ననే యభిలషించు చుండిరి గాన, నేడు బ్రాహ్మల పై చర్య తీసుకొనుటకు , శిక్షించుటకు మరేమైనా చేయుటకు బ్రాహ్మణేతరులకు సంపూర్ణాధికారము కలదు !" ఎంత పకడ్బందీగా తర్కించారో కదా !

"ఆధునిక బ్రాహ్మణ యువకులు కొందరు సనాతనత్వమును ద్వేషించుచూ, బ్రాహ్మణేతరుల నుద్ధరించుటకై కంకణము కట్టుకున్న వారలమని ప్రగల్భములాడు చుండిరి. వీరు దేశ కాల పరిస్థితులు గమనించనవారై తమ అధికారాన్ని సుస్థిరము చేసుకొనటానికి యీ విధంగా ప్రయత్నిస్తున్నారు. వీరి మోసాన్ని గమనించండి." అంటారు. ఇదే పుస్తకం చివర్లో, "ఆధునిక బ్రాహ్మణ యువకులు చాలా బుద్దిమంతులని బ్రాహ్మణేతరు లభిప్రాయ పడుచున్నారు. ఇలాంటి యభిప్రాయము కలవారు బుద్ధి హీనులని నేను యభిప్రాయ పడుచున్నాను." అంటారు. ఇంతకంటే రాడికల్ థింకింగ్ ఉంటుందా ? ఒక సమూహానికి సంబంధించి ద్వేషాన్ని పెంచుకున్నట్లు అనిపించవచ్చు కానీ చరిత్ర అధ్యయనం పట్ల ఆసక్తి ఉన్న ఔత్సాహికులు పూనుకుని ఇంతటి తీవ్రతకి కారణాల్ని అన్వేషించి విశ్లేషిస్తే ఈనాటి బహుజన ఉద్యమాలకి ఒక తోడ్పాటవు తుందని నా అభిప్రాయం. అవకాశం ఉంటే ఈ ఉపోద్ఘాతం వరకైనా మళ్లీ ముద్రించాలని ఉంది. ఇందులోని ముగింపు పేరా తోనే ఈ రైటప్ ని కూడా ముగిస్తాను, ఆసక్తి ఉన్న వారి కోసం సాఫ్ట్ కాపీ పెడుతున్నాను.

"గ్రామాల్లో నేటికిని, బ్రాహ్మలు దేవుళ్ళవలె పూజింపబడుచున్నారు. ఈ అత్యధిక గౌరవాన్ని బ్రాహ్మలెలా పొందినారో, పొందు చున్నారో బ్రాహ్మణేతరులు గమనిం చలేదు. బ్రాహ్మణ కుతంత్రములను బ్రాహ్మణే తరులు గ్రహించలేదు. బ్రాహ్మణ చరిత్రను బ్రాహ్మణే తరులు తెలిసికొనలేదు. కాన సంపూర్ణ బ్రాహ్మణ చరిత్రను యీ గ్రంథములో వ్రాసాను. బ్రాహ్మణ కుతంత్రా లను బ్రాహ్మణేతరులు తెలిసికొని సనాతనా చారాలను మూఢవిశ్వాసాలను ఖండించి

బ్రాహ్మలను నీచాతినీచంగా చూస్తే నా శ్రమ ఫలించినట్లే. గ్రామాల్లో వుండే ఆవిద్యా వంతులకున్నూ అందుబాటులో వుండేలా గున తేలిక భాషలో వ్రాసాను. " (– గ్రంథకర్త, 1– 10– 50, తెనాలి.)

(ఒక సమూహాన్నింతగా ద్వేషించే ఉద్దేశం పట్ల భిన్నాభిప్రాయాలు ఉండొచ్చు కానీ అసలు జాకోబిన్ పబ్లిషింగ్ హౌస్ తరపున వచ్చిన పుస్తకాల వివరాలు, ఈ కె. వి. రావు గారి గురించి , అలానే ఆనాటి బ్రాహ్మణేతర ఉద్యమంలో భాగంగానే ఇది ప్రచురించారా లేక వేరే స్వతంత్ర మార్గం ఉన్నదా తదితర విషయాలు తేలాల్సి ఉంది.

విశాఖపట్నం భావోద్యమ మిత్రులు బుద్ధా గారు ఎన్నడో అభిమానంగా ఇచ్చిన ఈ గ్రంథం నాటి నుండీ నా సముద్రంలో ఎక్కడో దాగిపోయింది. ఇంత కాలానికిలా పరిచయం చేస్తూ రాసిన చిన్న రైటప్. ఔత్సాహికుల కోసం సాఫ్ట్ కాపీ పంపుతున్నాను.)

# తెలుగు నాటకం మూలాలు ...!




"జీవితం అంటే మహావృక్షాల అరణ్యమన్నాడు ఒకడు. అక్కడ మహావృక్షాలే కాదు చిన్ని మొక్కలు , సన్నతీగలు కూడా వుంటాయి, కళ్ళు పెట్టుకుని చూడమంటాడు యింకొకడు. జీవితం లోనే కాదు సాహిత్యం లోనూ అంతే. ఆర్థర్ మిల్లర్ రెండు రకాల రచయితల్ని చెప్పాడు. ఒకరకం రచయిత ప్రపంచానికి దూరంగా ఉండి రచనలు చేసేవాడు. వీడు ఉన్నత తరగతి జీవితం వర్ణిస్తాడు. ఒకడు సమాజం నట్టనడుమ తన గుడారాల్ని కట్టుకొని జీవించేవాడు. వాడు పేద, మధ్యతరగతి జీవితం రాస్తాడు. ఆర్థర్ మిల్లర్ అనుభవంలోకి ఇండియా లోని మూడో రచయిత రాలేదు. ఈ దేశంలో మూడో రచయిత ఉన్నాడు. వాడు సమాజం తన గుడారాన్ని నట్టనడుమ కట్టుకోడానికి వీలు లేకుండా చేసినప్పుడు ఊరికి దూరంగా ఉన్న తన గుడారంలో సాహిత్యాన్ని అల్లుకున్నవాడు. వర్గసమాజం ఇచ్చిన విభజనలో పేద వర్గానికి చెందిన వాడు. వర్ణవ్యవస్థ ఇచ్చిన కులచట్రంలో అట్ట డుగు కులానికి చెందిన వాడు." (పేజి - 1)

చూడటానికి ఇష్టపడని తెలుగు నాటక మూలాలు పేరిట 'తెలుగు నాటకం మూలాలు...' పుస్తకంలో కళ్యాణరావు మొదటి పేజిలోనే సాంప్రదాయక మూస పద్ధతిలో సాగుతున్న విశ్లేషణ ఒరవడి కి విరుద్ధంగా తానెవరి పక్షమో స్పష్టం చేసిన ఒక ధిక్కార స్వరం ప్రజాపక్షాన ఈ అక్షరాల్లోంచి వినబడుతుంది. కళల్ని, నాటకాల్ని ఒక రకంగా మాత్రమే చూడటానికి అలవాటు పడ్డ వామపక్ష రాజకీయ బుద్ధిజీవుల్ని కూడా ఇంతటి లోతు కలవర పెడుతుంది. ఎందుకంటే,

"ఈ దేశంలో వర్గంతో పాటు కులం కూడా ఉంది. కులానికి వేల సంవత్సరాల చరిత్ర ఉంది. ఇక్కడ వర్గ సమాజం అభివృద్ధి చెందింది. అక్కడ కులం ఉంది. రాజ్యం ఆవిర్భవించింది. అక్కడ కులం ఉంది. మహమద్ దండ యాత్రలు, మొగలాయి సామ్రాజ్యాలు వచ్చాయి. అక్కడ కులం ఉంది. ఈస్టిండి యా కంపెనీ వచ్చింది. బ్రిటీష్ పాలన దీర్ఘకాలం ఉంది. అక్కడ కులం ఉంది. సోకాల్డు స్వరాజ్యం వచ్చింది. సంక్షేమ రాజ్యం అంటో నడుస్తోంది. కులం చాలా పదిలంగా ఉంది. ఈ దేశంలో ఆటకు వర్గం ఉంది, కులం ఉంది. పాటకు వర్గం ఉంది, కులం ఉంది. మాటకూ అంతే అవి రెండూ వున్నాయి. కులం ఏదైనా

కావచ్చు. ప్రాంతం ఏదైనా కావచ్చు. ఈ దేశంలో కళని కులం తక్కెట్లోనే తూచి ఖరీదు కట్టారు. ఈ మాటలు కొందరికి పచ్చిగా వుండొచ్చు. నిజాలు ఎప్పుడూ అట్లాగే ఉంటాయి. పచ్చిగా ఉంటాయి. పరమ దుర్మార్గంగా ఉంటాయి."

(పేజి - 32)

ముప్పై మూడు పుటల చిన్న పుస్తకం. ముప్పై మూడు పళ్ళూ రాలగొట్టే ప్రశ్నల్నిలా వేస్తే తట్టుకోలేక పోతుంది చరిత్ర. ఎందుకంటే అది కొందరి పక్షమే. అందరిదీ కాదు. అలా కాకుండా చేయడానికే ఈ దేశంలో కొన్ని వ్యవస్థలు ప్రత్యేకంగా రూపొందిం చబడ్డాయి. ఇప్పటికీ రూపొందించ బడుతున్నాయ్. ఎలాగంటారా?

"విచిత్రమేమిటంటే ఈ దేశం అట్టడుగు వర్గం వాడు, ప్రత్యేకించి దళితుడు తన కోసం తన పూర్వీకుల కోసం చరిత్రని వెతికితే ఎన్ని పేజీలు దొరుకుతాయ్. పట్టుమని పది పేజీలు కూడా దొరకవు. దొరికినా అక్కడ అతను ఉండడు. అతని పూర్వీకులు ఉండరు. వాళ్ళదంతా వినికిడి జ్ఞానం. వినికిడి సాంప్రదాయం. అల్లిక వారసత్వం. ఆ వినికిడి, ఆ అల్లిక చరిత్రలో సాహిత్యం లో అతని శరీరంలాగే అంట రానిదై పోయింది. అది కళ కావచ్చు. సంస్కృతి కావచ్చు. ఏదైనా కావచ్చు. తొక్కివేయ బడింది. I belong to Netting Heritage . నాది "అల్లిక వారసత్వం". Netting Heritage అనే పదం ఆంగ్ల నిఘంటువుల్లో దొరక్క పోవచ్చు. అల్లిక వారసత్వం అనే పదం తెలుగు నిఘంటువు ల్లోనూ దొరక్క పోవచ్చు. దొరక్కపోతే ఆ పదాల్ని కలపాల్సి ఉంది. వాటి మూలాల్ని వెతకాల్సి ఉంది. ఆఫ్రికన్ సాహిత్యం లో గూగీ తన పూర్వీకులు వాడిన పదాల కోసం చేసిన అన్వేషణ యిక్కడా జరగాల్సి ఉంది. అప్పుడు అర్థమౌతుంది అల్లిక వారసత్వం ఎంత అద్భుత మైందో." (పేజీ - 22)

నిజమే, ఎంత అద్భుతమైనవి ప్రజా కళలు. ఎంత నిండైనవి జానపదాలు. ఈ రోజు ఎక్కడ వెతుక్కోవాలి ? ఎవరు వెతుక్కోవాలి ? మతం, రాజ్యం జమిలి గా కబ్జా చేసిన కళల్ని ఈరోజు మనం స్వచ్ఛంగా ఎలా అనుభూతి చెందాలి ? అసలు అవి ఉన్నదెక్కడ..?

"సామాన్య వర్గాల్లో జానపద సంప్రదాయం ఉంది. దేవా లయం బయటి కళ ఉంది. నిండైన జీవితం ఉంది. అట్లా వుండి అది సామాజి కంగా ఉంది. మొత్తం కలిసి ఒక సామాజిక కళ, వాస్తవిక విలువ, జీవితమంత అద్భుతమైన రంగస్థలం సామాన్యుల మధ్య ఉంది. కళలు అలా వొదిగివొదిగి అమ్మమ్మ ఒడిలో దాక్కొని అద్భుతమైన కథలు వినే అందాల మనవరాలిలా ప్రజల గుండెల్లో గూడు కట్టుకుని ఉన్నాయి. నాటకం కూడా అంతే. అది వాళ్ళ జీవితాల్లో మిగిలి ఉంది. అట్లా ఉందని తెలుసుకోకపోవడం మన తప్పవుతుంది. అది నాటకం తప్పు మాత్రం కాదు." (పేజీ - 2)

ఇక్కడే కళని ఎలా చూడాలనే ప్రశ్న కూడా వస్తుంది. ఆస్కార్ వైల్డ్ దగ్గర్నుంచీ ఆధునిక నాటక విమర్శకుల వరకూ, కందుకూరి వీరేశలింగం నుంచి గురజాడ అప్పారావు వరకూ తెలుగు సారస్వత చరిత్ర మీద రచయిత జి. కళ్యాణరావు పెట్టిన ప్రశ్నలు అన్నీ కూడా అర్థవంతమైన దుఃఖం తాలూకు భావోద్వేగాలే . అందుకే,

"కళలు ఆరాధించే విగ్రహాలు కాదు. కళారాధన, కళోద్ధరణ, కళా తపస్సు యివన్నీ విశ్రాంతి వర్గ మేధావుల, పండితుల మేధస్సులోంచి పుట్టుకొచ్చిన పదాలు. ఈ పదాలకు కళకు ఎలాంటి సంబంధం లేదు. సామాన్య జనానికి కళ ఒక ఆరాధన కాదు. వాళ్ళెప్పుడూ కళను ఉద్ధరిస్తున్నట్లు భ్రమపడరు. భ్రమ ఎప్పుడూ సహజత్వానికి దూరంగా ఉంటుంది. జానపదుడి గానానికి, పండితుడి సంగీతానికి తేడా వుంది. కళ తనకి తాను ఓ ప్రత్యేక జ్ఞాపకం అని అనుకోదు. ప్రత్యేక అనుభూతి అనుకోదు. నిజానికి తానో ప్రత్యేక రూపం అని కూడా అనుకోదు. మనిషి ఎంత సహజమైన సంఘజీవో కళ కూడా సమాజానికి చాలా సహజమైన జ్ఞాపకం, అనుభవం, అనుభూతి, రూపం, సారం." (పేజీ - 17)

ఇంతటి సహజమైన కళా ప్రక్రియల నేపథ్యం ప్రజా జీవన తాత్వికత అధ్యయనం చేసిన వారికే సాధ్యం. అందుకే,

"ప్రజలకు తిండి కావాలి. గుడ్డ కావాలి. ఇంత నీడ కావాలి. వీటితోపాటు కళ కూడా కావాలి. తిండి, గుడ్డ, నీడ, పని, కళ యివన్నీ చాలా సహజమైన అవసరాలు. ఈ మాట ఇంత సాదాగా, చాలా మామూలుగా అంటే శిష్టులు గుండెలు బాదుకొంటారు. ఎందుకంటే కళకీ, సాహిత్యా నికీ వీళ్ళు చాలా నిబంధనలు పెట్టారు. ప్రమాణాలు పెట్టారు. విమర్శకు కూడా అంతే. ఎన్ని కొలబద్దలో ! ఆ కొలబద్ద లతోనే సాహితీ విమర్శని ఓ అందని పండుని చేసారు. నిజానికి సాహితీ విమర్శ అనేది సామాన్యుడికి అందుబాటులో ఉ ండాలి. అర్థమయ్యేదిగా ఉండాలి. అప్పుడే సాహిత్యం బాగుపడేది. "

(పేజీ - 19)

"తెలుగు సాహిత్యంలో పితామహులు, మాతామ హులు, యుగకర్తలు, మహాకవులు అంతా పండిత వర్గాల నుంచే సృష్టించ బడ్డారన్న"(పేజీ 13) ఆయన, అందుకే,"నిజం మాట్లాడితే నిష్టూరంగా వుంటుందేమో గానీ తెలుగు నేల మీద దళితులు జ్యోతి రావు పూలే 'తృతీయరత్న' లో తమ బతుకు వెతుక్కో గలరేమో కానీ , ఈ నేల మీద పుట్టిన ఎంత గొప్ప కళాఖండ మైనా 'కన్యాశుల్కం' లో తమని వెతుక్కోలేరు. నా మటుకు నాకు గురజాడ కన్నా పూలే దగ్గరివాడు." అని కచ్చితంగా చెప్పగలిగాడు. చెప్తూనే, "అయితే, బుచ్చమ్మ లాంటి బిడ్డల బతుకు ప్రపంచం ముందు వుంచినందుకు, మధురవాణి వ్యక్తిత్వాన్ని ఉన్నతంగా తీర్చిదిద్దినందుకూ గురజాడను అభినందిం చకుండా వుండలేను" (పేజీ 13)

అంటారు.

“నిజానికి తెలుగు నేల మీద ఎంతమంది అంటరాని హోమర్లు ఎంత అద్భుతమైన ఒడిస్సీలు, యిలియడ్లు గానం చేసారో ! అని అనుకున్న ప్పుడు అదోలా ఉంటుంది. ఆ మూలం తాకడానికి నిజంగా ఎంత వెతుకులాట మొదలు కావాలి. ఈ వెతుకులాట జరక్కపోతే చరిత్రతో తెగతెంపులు చేసుకోవడమౌతుంది. ఒక సహజమైన వారసత్వానికి తిలోదకాలు ఇవ్వడ మౌతుంది ..తొలి తెలుగు నాటకాన్ని నిరక్షరాస్యులే నిర్మించు కున్నారు. అదో అద్భుతమైన జ్ఞాపకశక్తి. యిది ఒక్క తెలుగు నేల మీదే కాదు ప్రపంచ వ్యాపితంగా జరిగింది. కాలం, జ్ఞానం, అనుభవం కలగలిపిన అల్లిక అది...” (పేజీ - 23)

అలాంటి అల్లిక పై రాత కుట్రెలా జరిగిందో చెప్పే నాలుగు వాక్యాల తోనే ఈ పుస్తకం ప్రారంభమై చివర్లో వాటితోనే ముగుస్తుంది. కాన దాంతోనే నేనూ ముగిస్తాను. అర్థం చేసుకోవాలే కానీ ఆ అక్షరాల్లో శతాబ్దాల ఘోష ఉంది. ఆవేదన ఉంది. ఆక్రందన ఉంది. అది,

“మా అయ్య అల్లిందాన్నే
వాడయ్య రాసేడు
అల్లిక అంటరానిదైంది
రాతేమో రాజై కూసుంది”

(ప్రజా కళామండలి రాష్ట్ర మహాసభల సందర్భంగా జి. కళ్యాణరావు చేసిన అద్భుత మైన ప్రసంగ పాఠాన్ని సరిగ్గా ఇరవై ఏళ్ళ క్రితం 2002 లో ‘తెలుగు నాటకం మూలాలు..’ పేరిట చిన్న పుస్తకంగా విరసం ప్రచురిం చింది. నన్నెంతగానో ప్రభావితం చేసిన ఇరవై ఏళ్ళ ‘అంటరాని వసంతాన్ని’ గుర్తు చేసినట్లే దీన్ని కూడా గుర్తు చేసుకోవడం ఆలోచనా పరులందరి బాధ్యతనేది నా భావన. అందుకే కామ్రేడ్ దివాకర్కి ప్రేమతో అంకితం ఇవ్వబడ్డ ఈ చిన్ని పుస్తకం ఈ రోజు మరింత అవసరమనీ , ప్రత్యామ్నాయ ప్రజా సంస్కృతి ని, కళల్నీ అధ్యయనం చేయడానికి ప్రధాన సాధనంగా ఉంటుందనే నా అభిప్రాయం ఇలా తెలియ జేస్తూ ఈ బుక్లెట్ ఇప్పుడు అందుబాటులో ఉందో లేదో తెలియదు కానీ లేకపోతే కనుక కచ్చితంగా పునర్ముద్రణ చేసే విధంగా ఔత్సాహికులు ప్రయత్నం చేయాలనే నా ఆకాంక్ష ను ఇరవై ఏళ్ళ ఈ ప్రసంగ ప్రచురణనిలా రైటప్ రూపంలో పరిచయం చేయడం ద్వారా తెలుపుతూ ఇక్కడికి ఆగుతాను.)

# ఆయన స్మృతి పథంలో సాగుతున్న యాత్ర !

## ఆచంట జానకిరాం సుప్రసిద్ధ స్వీయచరిత్ర !!




When the heart is heavy with thoughts Of thee When the home coming bird calls in divine motherhood to the eagar nursling in her nest. When all creation, dumb, weary and spent, seeks for a nights repose.
Then, I a homeless begged, drop a silent, painful tear in which gleams the distant star of Love%.µµ

A. Janakiram, P-91

ఎవరో ఆంగ్ల మహాకవి రాసినట్లున్న ఈ కవితా పంక్తులను రాసింది వందేళ్ళ క్రితం ఒక తెలుగు కవంటే ఎంత అబ్బురంగా ఉంటుంది? అయినా నిజం అదే! ఆచంట జానకిరాం స్వీయచరిత్ర 'నా స్మృతి పథంలో సాగుతున్న యాత్ర (1902 - 1922) జ్యేష్ఠ లిటరరీ ట్రస్ట్ ప్రచురణ - 2008 చదివితే ఎవరికైనా అలాగే అనిపిస్తుంది!

"ప్రేమ మనల్ని ఒక మెట్టు పైకి తీసుకుపోవాలి గాని, క్రిందికి దిగలాగకూడదు. ప్రేమించి నవారు మిక్కిలి ఉదారత్వ మును ప్రకటించాలి గానీ సంకుచిత బుద్ధితో, తమ ప్రేమను ఒక విలువ గల స్థిరాస్తిగా భావించి దానిని అంటిపెట్టుకొనిఉండిపో కూడదు. ఎటువంటి సందర్భంలోనూ ప్రేమ సంతోషాన్ని, ఆనందాన్ని ఇయ్యాలి గాని, నిస్పృహనూ, విషాదాన్ని కలిగించకూడదు."

పేజి - 295

ప్రేమ గురించి ఇంత ఉన్నత మైన భావాలను వెలిబుచ్చిన ఆయన "నిజమైన ప్రేమ అంటే భౌతికం కాని అశరీరమైన ఆశయారాధన" పేజి - 29 అంటారు. అంతే కాదు, వేరే సందర్భంలో "కాలగతిని వ్యక్తుల పదవులు మారవచ్చు కానీ,హృదయాలు ఎన్నటికీ మారవు!" పేజి - 129 అంటో తన విశ్వాసాన్ని ప్రకటిస్తారు!

If winter comes can spring be far behind% అనే షెల్లీ వాక్యం (పేజి 49) మొదలు విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ మదన పల్లె వచ్చినప్పుడు ఒక అమ్మాయి ఆయన ఆటోగ్రాఫ్ కోసం పుస్తకం ఇస్తే ఆయన రాసిన The fruit carries within it the sacrifice of the flower (పుష్పము చేసిన త్యాగ సంపదే ఫలము నందు ఇమిడి ఉన్నది)(పేజి

– 46) అద్భుత మైన సందేశం వరకూ ఎన్నో సంగతులు ఇందులో మనకు ప్రతి పుటలోనూ కనిపిస్తాయి!

One drop of water, fast asleep in the ocean%µ%s mighty depths
One grain of sand, glistening through heat, in the desert s endless sands;
One speck of dust, floating through time in the universe stupendous expanse ;
One lost phantom, of a myriad that figure in the pitiless play of the life and death P - 91

విలియం జేమ్స్ ప్రాగ్మాటిజం సిద్ధాంతం గురించి (పేజి 115) మొదలుకొని, నార్వేజియన్ రచయిత జాన్ బోయర్ రాసిన అద్వితీయ నవల %+తీమ్ఞ్ ఎబఅస్త్రవతీ% (పేజి 122) వరకూ ప్రేమగా అక్షరాలతో తడిమి పాఠకుల మదిని తడి చేస్తారు. హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ విసిరిన God himself is jealous of our immortal love వంటి చణుకుల్ని కూడా అక్కడక్కడా పరిచయం చేస్తారు!

“స్నేహితుడు కృష్ణశాస్త్రి లాగే, నేనూ పూర్వాన్ని మరచి పోలేను. ఎంత ప్రయత్నించినా కానీ జీవితము మొండిది. చివరకు తన పట్టే నెగ్గించు కుంటుంది (పేజి 197) అంటూ చేదు అనుభవాల్ని నెమరే సుకునే జానకిరాం, కొంపెల్ల జనార్ధనరావు కి తనకీ మధ్ ఉన్న అనుబంధం గురించి చెబుతూ, “స్మీరు” (నీంమీ) కొత్త పిలుపు ని ఉదహరించారు. పేజి – 207

“ఉన్నట్టుండి ముంచుకొస్తుంది ఏదో బెంగ, ఎన్నడో అనుభ వించిన మధుర క్షణాల జ్ఞాపకం, భరింపనశక్యమైన ఏదో తీరని వెలితి. కాల స్రవంతిలో జారిపోయిన ఒకానొక అమూల్యమైన వస్తువు కోసం వెర్రిగా వెతుక్కుంటూ ఉంటాను. పుష్కరపు జన సమూహంలా కళ్ళముందు సాగిపోతున్న లక్ష ముఖాలతో ఆ ఒక్కముఖం కోసం నిర్నిమేషంగా కనులు విప్పుకు చూస్తూ ఉంటాను పగలనక, రాత్రనక మేలుకొని నిద్రిస్తూ, ఈ ఒంటరితనము ఎలా భరించడము?”

పేజి 161

“మానవుడు తన నిరంతరా న్వేషణలో ఎన్నో గొప్ప విశేషాలు సాధించి ఉండవచ్చును. విద్యుచ్ఛక్తిని అరికట్టి ఉండవచ్చును. ఉపగ్రహాలను సృష్టింప వచ్చును. అణుశక్తి ప్రభావంతో అంత రిక్షాన కోట కట్టుకోవచ్చు. కాని వీటన్నింటికంటే గొప్పదీ శాశ్వతానంద కరమైనదీ అతడు పరిణితికి తెచ్చిన సంగీత కళ అనుకుంటాను అనేకసార్లు...”

పేజి – 50

మంచి భాష, మమేకమయ్యే మానవీయ భావాల సమా హారమైన ఈ ఆత్మకథ పుస్తకాన్ని ఏళ్ళ క్రితం చదివినప్పుడు రాసుకున్న చిన్న నోట్స్ పై ఆధారపడి మాత్రమే ఈ రైటప్ రాస్తున్నానే కాని పుస్తకం ప్రస్తుతం నా దగ్గర లేదు . అంతమందిలో, అనేక లైబ్రరీ ల్లో ఎక్కడ ఎప్పుడు ఎవరికి ఇచ్చానో కూడా గుర్తులేదు. ఎందుకనో ఇది చదివినప్పుడు సంజీవ్ దేవ్ ఆత్మకథ "తుమ్మపూడి", అలాగే ఆవంత్స సోమసుందర్ ఆత్మకథ " కలలు – కన్నీళ్ళూ" గుర్తుకొచ్చిన జ్ఞాపకం మట్టుకు ఉంది. నెట్ లో మిత్రులు ఇచ్చిన లింక్ ద్వారా చలం గారి ముందు మాటతో ఉన్న పాత సాఫ్ట్ దొరికింది. ఆసక్తి ఉన్న వారి కోసం లింక్ పంపుతున్నాను. అవకాశం ఉన్న వారు తప్పక చదవాల్సిన పుస్తకం ఇది!

There is no passion in me now; only a great peace.

Universe may tumble, cracking the very firmament with their fall.

But, I can stand aloof and watch catastrophies, quite unperturbed,

Like a lonely seagull that watches giant ships godown..position, fame, and power..

The ugly race for secular advantage - these do not affect me.

Only, the pain of misunderstanding still hurts ...still hurts%..µµ

A. Janakiram, P - 142

# కుట్ర - కోడిదా ? మనిషిదా ??




"కొద్దిపాటి ఇంగితం ఉన్నవాళ్ళకి ఎవరికైనా కోడి కూసేందుకు ఏమీ నిశ్చయమైన వేళలు వుండవని తెలిసే ఉంటుంది. కోడి కూయక పోవటం వల్ల తెలవారని ఉదయాలు ఎప్పుడూ లేవు. కోళ్ళు పట్టించుకోకపోవడం వల్ల ఉదయాలకు గానీ, సూర్యుడికి గానీ వచ్చిన నష్టం ఏమీ లేదు. ఒకటో రెండో పెరళ్ళు, కొన్ని చెట్టు కొమ్మలు, ఎప్పటికీ అభద్రతతో కూడిన జీవితం, ఆదివారాలు విందులకు వచ్చిన అతిథుల నుండి తప్పించుకున్నా హఠాత్తుగా వెనకనించి వచ్చి పట్టుకునే చేతుల గురించిన నిత్యం భయం – బహుశా ఇవే ఒక పుంజు ఆత్మకథ లోకి వస్తాయి. ఇందులో కుట్రను చూడటం ఎంత మూర?త్వం?" (పేజీలు 43, 44)

కోడికి కూసే స్వేచ్ఛ ఉంది కానీ ఎగరే శక్తి లేదు. కూయాలని అనిపించినపుడల్లా గొంతును సవరించుకుని కూసే కోడిని అనాదిగా మనిషి ఆహారంగా మాత్రమే చూస్తున్నాడు. నిత్యం అభద్రతా భావంతో బతికే మనిషికి స్వేచ్ఛని వినిపించే గొంతులంటే తెలీని భయం. ఆ భయం నుంచే ద్వేషం, దాన్నుండే స్వార్థం పుడతాయ్. పౌర సమాజంలో ఆహారం కోసం మాత్రమే పెంచే కోళ్ళన్నీ అల్పసంఖ్యాక మౌతాయ్. అప్పుడిక వాటి కూతలన్నీ కుట్రలే, గొంతులన్నీ కుతంత్రాలే !

నానియమ్మ గా గ్రామ ప్రజలంతా పిలుచుకునే వయసూడిగిన చెవిటి ముసలమ్మ అసలు పేరు దుర్గాదేవి. బ్రిటిష్ అధికారి సాండర్స్ ని హత్య చేసిన తర్వాత లాహోర్ నుండి భగత్సింగ్ తప్పించుకోవడానికి అతని భార్యగా నటించి, స్వాతంత్ర్య భారతంలో కూడా చివరి వరకూ అసమ్మతి స్వరంగానే జీవించిన విప్లవకారిణి, భగవతీ చరణ్ వొహ్రా భార్య పేరైన దుర్గా బాబీ పేరే, ఉత్తర భారత దేశంలో కొన్నాళ్ళు పని చేసిన ఆ ముసలమ్మ తండ్రి ఆమెకు పెట్టాడనే విషయం ఎవరికీ తెలీదు !

అటువంటి ముసలమ్మ కోడి తన కూతతో మానవాళి పై కుట్ర పన్నింది మరి. కాబట్టి, ఊర్లోని కోళ్ళన్నీ వాటి నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవాలి. నిరంతరం ఊరంతటికీ విధేయతను ప్రకటించుకుంటూ ఉండాలి. కోళ్ళెప్పుడు కూయాలో అనుమతులు జారీ చేయబడాలి. కోళ్ళ పై ప్రత్యేక నిఘా ఉండాలి. అవి అణిగిమణిగుండటమే కానీ, హక్కుల మాటెత్తరాదు.

ఇన్ని చేసినా ఊర్లోని కోళ్ళన్నింటినీ మట్టు పెట్టాల్సిందే, దేశంకోసం పట్టుకుని వాటి గొంతులు నులమాల్సిందే !

"మనుషులందరికీ స్వతహాగా కథలు చెప్పే సామర్థ్యం ఉంటుంది. కొందరు రాస్తారు. కొందరు కేవలం చెప్తారు. రాసే వాళ్ళను నవలా రచయితలనో, కథా రచయితలనో పొగుడు తారు. చెప్పే వాళ్ళను అబద్ధాలకోర్లుగా లెక్కేస్తారు. అంతిమ విశ్లేషణలో అన్ని కథలూ అబద్ధాలే...."

( పేజీ 53)

సూర్యోదయాన్ని కుట్రగా సూర్యుడ్ని కుట్ర దారుడిగా చూసే లోకానికి కోడి కూత కుట్రగా ముసలమ్మ కుట్ర దారుగా కనిపించడం వింతేమీ కాదు. దేశంలో పౌరసత్వాన్ని చూస్తున్న వాళ్ళకి, ఊర్లోని కోడిసత్వం అర్థం కాకపోదు. అందుకే, కొచ్చు కుట్టన్ గ్రంథాలయం చూరు మీద ఏనాడో రాసిన వాక్యమొకటి చదివి వినిపించిన నేరం మనల్ని చివరి వరకూ వెంటాడుతుంది. ద గుడ్ పర్సన్ ఆఫ్ షేజ్వాన్ లో వాక్యమది :

"ఒక నగరంలో అన్యాయం జరిగితే అక్కడ తిరుగుబాట్లు రావాలి. లేకపోతే, అది కాలి మసై మట్టిలో కలవటమే మేలు!"

(మళయాళంలో ఉన్ని ఆర్ గా ప్రసిద్ధి చెందిన పి. జయ చంద్రన్ 2019లో రాసిన 'ప్రతి పూవన్ కొళి' రచనని జె. దేవిక 'ది కాక్ ఈజ్ ది కల్ప్రిట్' పేరు తో ఇంగ్లీషు చేసారు. దాన్నుండి పద్మజా షా తెలుగు లో "జ్ఞాపకం ఆక్రందనై పిలుస్తోంది" అనే మంచి మున్నుడితో సహా అనువాదం చేసిన 'కుట్రదారు కోడి' పుస్తకం సిక్కోలు బుక్ ట్రస్ట్ ప్రచురించింది. అను వాదం అనిపించ కుండా తెలుగు చేసిన పద్మజా షా గారికి, పంపించిన రమా సుందరి గారికి, చక్కగా ముద్రించిన సిక్కోలు బుక్ ట్రస్ట్ కి ప్రత్యేక అభినందనలు. తప్పకుండా చదవాల్సిన ఈ చిన్ని పుస్తకం పై చిన్న రైటప్.)

# అత్యాచారాల పై అక్షర నిరసన

## హస్బెండ్ స్టిచ్ – 1




"అమ్మా నాకూ ఆరేళ్ళేగా , నా పైనా అత్యాచారం చేస్తారా..?" 'ప్రశ్న' కథలో ఆరు సంవత్సరాల నీహారిక వేసిన ప్రశ్న పుస్తకం పూర్తిచేసినా తల్లి స్వరూప చెవుల్లో లాగానే మన చెవుల్లో కూడా తిరుగుతూనే ఉంటుంది!"మగ పిల్లవాడు పుట్టటానికేదైనా ప్రత్యేక ఆహారం, చికిత్సా పద్ధతులున్నావా, ఉంటే చెప్పండి డాక్టర్, ఈసారి ఎలాగైనా మగపిల్లవాడే కావాలి." మగ పిల్లాడి కోసం దేశంలో జరుగుతున్న నిత్య హత్యలకు 'హత్య' కథలోని మంజీర ఒక ఉదాహరణ మాత్రమే!"కన్న తండ్రితో సంబంధం పెట్టుకుంటే ఇస్లాం క్షమిస్తుందా...?''రాయిగా మారిన పసిపిల్ల అస్రా మీదనే రాళ్ళేసిన పురుషాధిక్య సమాజం!"నాన్న ఇంటికొస్తే ఇంట్లో ఒక బీతావహ వాతావరణం మొదలవుతుంది. ఇల్లు ఇల్లులా అనిపించదు. క్రూరమృగాలు సంచరించే కీకారణ్యంలా మారిపోతుంది.ఆయన ఇంట్లో లేకపోతే మృగం ఎప్పుడు ఏ క్షణంలో వచ్చి తన మీద దాడి చేస్తుందో తెలియని కుందేలులా అమ్మ బితుకు బితుకుమంటూ ఉంటుంది. ఆయనింట్లో ఉంటే ఆహారం కాబోయే కుందేలులా వజ వజ వణుకుతూ ఉంటుంది."!

జననాంగాల కారణంగా పుట్టబోయే శిశువు సైతం ఎదుర్కోబోయే అమానుష హింస, 'ఖడ్గచాలనం' కథ!"ఎక్స్ట్రా నాట్", "హస్బెండ్ స్టిచ్"కథ భర్త సుఖం కోసం దేహమంతా కోతలు, గీతలు , కుట్లు వేసుకుంటున్న భార్య పంటి బిగువన భరించే నొప్పి , ఎదుర్కొనే ప్రాణాంతక వ్యాధుల పరిణామాలు కచ్చితంగా అర్థం కావలసిన అవసరం మగ సమాజాని కెంతైనా ఉందని చెబుతుంది!

"ఆర్థిక అవసరాలు తీర్చే తండ్రిని లోకంలోని పిల్లలందరూ అతని తప్పొప్పులతో సంబంధం లేకుండా సమర్థిస్తారో...లేదా ఎదిరించలేనితనమో..ఏమో.."

నిజమే, మగాళ్ళది రసికత్వం, స్త్రీ చేస్తే విశృంఖలత్వం. పురుషుడి కోరిక విలాసం, మహిళ ప్రేమ మాత్రం 'నింఫోమానియా' రోగం!"తలలేని మొండెంతో , కేవలం తన దేహంలోంచి మొలుచుకొచ్చిన రొమ్ములే తన అస్థిత్వమా?""శిల కాని శిల" కథలోది కాదు, మొత్తంగా స్త్రీ జాతి సమస్తం పురుష ప్రపంచాన్ని నిలేసి అడుగుతున్న ప్రశ్న!"ఆడదాని శరీరాన్ని కుమ్ముతూ, గిల్లుతూ, కొరుకుతూ, రక్కుతూ ఆఖరికి వుమ్మినో వీర్యాన్నో ఆడదాని

శరీరం పై విసర్జించడమే శృంగారమా?" "శృంగారమంటే రెండు స్త్రీ పురుషుల జననాంగాల మధ్య జరిగే రాపిడి మాత్రమే కాదు. దంపతులు ఒకరి పై ఒకరికి ఉండే ప్రేమను స్పర్శ ద్వారా వ్యక్తపరుచుకునే అందమైన దేహభాష! దానిక్కావాల్సింది ప్రేమ, ఆప్యాయత, బాధ్యత, గౌరవం, నిజాయితీ, ...!""ఫ్రీజ్డ్ " కథ పేరు కాదు, చైతన్యంలేని చచ్చుబడిన సమాజంలో స్త్రీల పై జరుగుతున్న దారుణాల హెూరు!

"మగాడి కోసం ఆడం కోసం మాత్రమే నన్నెందుకు తయారు చేసావు?నన్ను విడిగా ఒక వ్యక్తిగా ఎందుకు తయారు చేయలేదు?అందుకే ఈ జ్ఞానఫలం తిని తెలివి తెచ్చుకున్నా," "ఫాల్ ఆఫ్ ది మాన్" కథలో ఈవ్ నవ్వుతోంది!

"పెళ్ళాం ఉండుడు దేనికీ...మగన్ని సుఖపెట్టని ఆడది ఆడదేనా..?" 'నా భర్త నన్ను రేప్ చేసాడు' కథ మనందర్నీ అడిగే ఘోరమైన ప్రశ్న !

"స్త్రీల నిర్మూలనను ఒక జాతి హననంవలె సాగిస్తున్న దేశంలో సున్నితమైన రచనలు చేయగలగటం సామాజిక బాధ్యతగల ఏ రచయితకైనా సాధ్యమా?" అంటో కాత్యాయని పుస్తకానికి ముందు రాసిన "ప్రశ్నలు రేపిన కథ" ల్లోని ప్రశ్న అలాగే పాఠకుల్ని వెంబడిస్తుంది!

"స్త్రీల శృంగార సమస్యల కారణాల్ని కేవలం వైరస్, బ్యాక్టీరియా ఫంగస్ రక్తంలో కాకుండా ...ఆ సుఖవ్యాధులు కలిగించే భర్తల ఆధిపత్య స్వభావంలో , భావజాలంలో వెతకాలని చెప్పాలని అనుకున్న..." రచయిత రచనకి నూరుశాతం న్యాయం చేసారనేది నా అభిప్రాయం.

హస్బెండ్ స్టిచ్, మై హస్బెండ్ రేప్డ్ మి (exclusively for men)"స్త్రీల విషాద లైంగిక గాథలు" 2018లో మళ్ళీ 2020లో తెలుగులో 'వెన్నెల ప్రచురణల' తరపున వొచ్చిన డా.భారతి(గీతాంజలి) రాసిన కథల సంపుటి. ప్రతి ఒక్కరూ తప్పక చదవాల్సిన నిజ జీవిత గాథలివి. సాఫ్ట్ కాపీ పెడుతున్నాను, తప్పక చదవండి.

# ఆక్రందనలకి ఒక అక్షర భరోసా

## హస్బెండ్ స్టిచ్ -2 (స్టోమా)




" మరేమో...మరేమో...మా నాన్న రాత్రి పూట నా బట్టలు ఇప్పుడుగా...అందుకనే మంచోడు..!" ఏడేళ్ళ పసిపాప 'ఫలక్' మాటలకర్థం తెలియాలంటే ''మా నాన్నెందుకు మంచోడంటే..'' కథ చదవాలి! "..ఆడదన్నాక భర్త కోరిక కాదంటే ఎట్టా..?"

నోటి నుండి కారుతున్న చొంగతో, వళ్ళంతా రసి కారుతున్న పుండ్లతో కూడా పురుషాధిక్యత కి కాపలా కాసే సమాజం ఒక "కర్ర". అదెలా విరిగిందో తెలుసుకోవాలంటే 'కర్ర' కథ చదవాలి!

" కాళ్ళూ, చేతులు, తెగిపోతేనే గుడ్డి, మూగ, చెవిటితనం ఉంటేనే అవిటితనమా? దేహంలో ఎక్కడ తెగిపోయినా అవిటితనమే కదా?....దేహంలో అన్ని అంగాలు ఉన్నాయి. కానీ...తను జననాంగాలు లేనిది. కాళ్ళ మధ్య ఏమీ లేదు ఖాళీ, శూన్యం, ఒక చిన్న రంధ్రం తప్ప!" "ఖత్నా" కథ కళ్ళు చెమర్చక మానవు!

"శృంగారం ఇలానే ఉంటుందా? పెళ్ళాం సమ్మతి లేకుండా ఎక్కడ బడితే అక్కడ చేతులు వేసెయ్యడమే శృంగారమా దీనికి తను ఒప్పుకోవాలా...అదీ సంతోషంగా..!"

"సమ్మతి"కథ మొత్తం వ్యవస్థని ప్రశ్నిస్తోంది!

" యా అల్లా..ఈ లోకంలో ఎవరూ ఉండక మునుపు..ఈ లోకం శూన్యంగా ఎట్టా ఉండేదో అట్టా..మళ్ళీ చేసేయ్..ఆడాల్ల పక్కన ఈ మగాళ్ళు లేకుండా చేసేయ్..ఎవరూ ఉండద్దు తన మొగుడు, ఆద్య చిన్నాయ్యా, బస్సులో కారం కళ్ళవాడూ...పసిపిల్లకాయల్ని ఆడదాన్ని కళ్ళతో చేతులతో ఖరాబు చేసే తమామ్ గలీజు మగాల్లు ఎవరూ లేకుండా సెయ్యి అల్లా....!"

ఆడబిడ్డ తల్లి అల్వీరా ఎందుకు ఈ కోరికతో అల్లాకు మొక్కిందో "ది కిస్" కథ చెప్తుంది!

"పగలు భర్త కొట్టినా అవమానించినా ముఖం మీద ఉమ్మినా రాత్రికాంగానే భర్త కోసం స్వచ్ఛంగా ఉడుకునీళ్ళతో స్నానం చేసేసి, సెంటు చల్లేస్కుని తెల్ల చీర కట్టేస్కుని మల్లెపూలు పెట్టేస్కుని అతనికిష్టమైనవి చేసి పెడ్తూ, వాడింటికి రాగానే వగలు పోతూ వాడు చేసిన అవమానాలు, ఒంటి మీద దెబ్బలు అన్నీ మర్చిపోయి సిగ్గు లేకుండా ఇకిలిస్తూ వాడ్నింట్లోకి

ఆహ్వానించేసి, వాడికి మెక్కబెట్టేసి రాత్రి వాడు కౌగిలించుకుంటే భార్య అన్నీ మర్చిపోయి లజ్జా, మర్యాద, ఆత్మాభిమానం లేకుండా వాడి కౌగిలిలో పలకరించి పోతుందట;వాలట!" సంసారం పేరిట వళ్ళంతా పంటిగాట్లు, సిగరెట్టు వాతలు తప్పా ఇంకేదీ మిగుల్చుకోని ఆవేదన "చచ్చినపాము" కథ!

"స్టోమా" అంటే రంధ్రం. స్టోమా బేగ్ మలం సంచి! ఆడదాని శరీరాన్ని కావాల్సి నప్పుడల్లా ఆకలి తీర్చుకునే 'కన్నం' గా మాత్రమే చూసే మగ సమాజంలోని అసమాన లైంగికతకి 'స్టోమా' కథ పరాకాష్ట!

"....దీపంమీద పడి వొళ్ళు కాలిపోయిన మాలచ్చిమి శవం, వంట చేస్తూ 'పొరపాటున' కొంగంటుకు చచ్చిన సరళ, పద్దు, రుక్మిణి, రత్న, విజయ, చంద్రికల మొగుళ్ళూ అత్తలు...కట్నమేదే పెళ్ళామా కోడలా అంటూ కిరసనాయిలు స్నానాలు చేపించేసి కాల్చేసి చంపేసిన సత్యలక్ష్మి, సులోచన, వసంత, భారతి, శ్యామల, కోమల..నీలిమ, ఫాతిమా, రజియా, నూర్జహాన్ లు...నీరింకిపోయిన రక్తమూ..కిరసనాయిలూ కలిసిపోయిన ఉ డికిపోయిన శవాలు వేసిన ప్రశ్న..!

"... ఐదేళ్ళ అమీనా కూనని, ఆరేళ్ళ శ్వేత తల్లినీ..మల్టీ ఛానళ్ళ మత్తువాసనకి మరిగిన పదేళ్ళ గౌతమిని నువ్వు పాడుబడ్డ బంగళాకు తీసుకెళ్లి చిన్నారి పువ్వుల్ని గుండెల్ని ఎర్రగా చిదిమితే ఆ పసికూనలు నిస్సాయంగా..వెర్రిగా.."

..అడిగిన ప్రశ్న "ఎందుకు? ఎందుకకా" అంటూ కథలో రచయితని కాదు, రాయిలా స్పందించని ఈ వ్యవస్థని, నిన్ను, నన్ను, అందర్నీ అడుగుతున్నారు!

"ఒంటి మీద వెంట్రుకలున్న ఆడదానికి కామం ఎక్కువ !"

తరాలకి తరాలపాటు పసిమనసుల్ని ప్రభావితం చేసిన "పెద్ద బాలశిక్ష", నిజానికి ఇలాంటి రాతల్ని చెలామణీ చేసే ఒక కలుషిత పుస్తకమని మనకెప్పటికి తెలుస్తుంది !

'ఆక్సిజన్', 'అనస్థీషియా' కథలు కూడా గుండెల్ని లోతుగా తాకుతాయ్, దేశంలో ఎక్కడా నమోదు కాని వలస కార్మికుల పై, ముఖ్యంగా స్త్రీల పై జరిగే ఘోరాలు, లైంగిక నేరాల యదార్ధ గాథ, 'చావు' కథ, స్మృతి స్రవంతి శైలిలో ఆంతరంగిక వేదన 'ఫేస్ ఆఫ్'!

హస్బెండ్ స్టిచ్ - 2 , స్టోమా (స్త్రీల విషాద లైంగిక గాథలు) Exclusively For Men వెన్నెల ప్రచురణల తరపున 2020 లో వొచ్చిన గీతాంజలి (డా.భారతి) కథా సంపుటి. తప్పక చదవాల్సిన కథలు.

సాఫ్ట్ కాపీ పెడుతున్నాను.

తప్పక చదవండి.

# దళిత స్త్రీల వ్యథలు:"బ్లాక్ ఇంక్" కథలు!



"అది శారదా నికేతన్. పెద్ద బడి. పెద్ద పెద్ద చెట్లున్నాయ్. కాంపౌండు గోడ తల మీద 'వందేమాతరం' అని సిమెంట్ తో రాసిన పెద్ద పెద్ద అక్షరాలున్నాయి. ఐదవ తరగతి 'బి' అనున్న గదిలో నన్ను కూర్చోబెట్టి ఆమె అక్కడ్నుంచీ వెళ్ళిపోయింది... అందరూ అమ్మాయిలే. కొంత మంది నన్ను పలకరించారు. పేరేంటని అడిగారు. మార్తని చెప్పాను. 'అంటే' అనడిగారు. బైబిల్లో మరియ చెల్లెలని చెప్పాను. 'కిరస్తానీలా?' అన్నారు? అవునన్నాను. అంతే! అందరూ ఒక్కసారిగా దూరంగా జరిగారు. 'ముట్టుకోకండే, కిరస్తానీలట, మైలబడిపోతాం, దూరం జరగండి, దూరం జరగండి', అని ఆందోళనగా అరుస్తానే ఉన్నారు. నా చుట్టూ ఒక మూర వరకూ ఖాళీ స్థలమేర్పడింది."(పేజి 28, మరియ)

రాజస్థాన్ లోని దళిత స్త్రీ భన్వారీదేవిని అగ్రకులస్తులు సామూహికంగా రేప్ చేసిన కేసులో "ఒక అగ్రకులానికి చెందిన వ్యక్తి తక్కువ కులం స్త్రీ ని రేప్ చేయడం ద్వారా తనని తాను కించపరుచుకోడ" ని (పేజి 31) న్యాయస్థానం కేసు కొట్టేసిన ఘటనకి కోకొల్లలు గా ఉన్న ఉదాహరణలకు ఈ పుస్తకం లోని మొదటి కథ ఒక రూపం.

"మా డాడీకి, మమ్మీకి హరిజన్ ఫ్రెండ్సే లేరు! నాక్కూడా లేరు! అసలు మాకు వాళ్ళతో ఫ్రెండ్షిప్పే ఇష్టం ఉండదు. నా ఫ్రెండ్సంతా బ్రామ్మిన్స్, చౌదరీస్, రెడ్డీస్, వేరే హిందూస్..." (పేజి 40, బ్లాక్ ఇంక్)

పసి వయసులోనే పిల్లల మనస్సుల్లో నాటుతున్న దుర్మార్గమైన కులతత్వానికి 'బ్లాక్ ఇంక్' ఒక పరాకాష్ట!

"తిండిలేక తినకపోతే అది పస్తంట. తిండి ఉండి, వద్దనుకొని తినకపోతే అది ఉపవాసమంట." (పేజి 53, బాలేదు...జెరమొచ్చింది) "బేటీ బచావో, బేటీ పడావో " అంటూ ఊదరగొట్టు ప్రచారాలు చేసే ఈ దేశానికి "బేటీకొ ఖిలావో" అనే స్పృహ ఎప్పుడొస్తుందో!

"యెంత ధైర్యమేనీకు పాకీ లంజా! ముందు యిక్కడ్నించి అవతలకి పో, పావలా ఠికాణా లేదు, యెన్నేళ్ళకి తీరుద్దనే రెండొందలడిగావ్, యేవనుకుంటున్నావే రెండొందలంటే..? పెంటకుప్పల నుకుంటున్నావా..? డబ్బులే డబ్బులు! లక్ష్మీదేవి! పెంటెత్తే చేతులేమైనా

పద్మాలంటే ఆమొచ్చి మీ చేతుల్లో కూర్చోడానికి...ఆ తల్లిని మీ చేతుల్లో అప్పనంగా కూర్చోబెట్టి ద్రోహం చెయ్యమంటారంటే....ముందు యిక్కడ్నుంచి కదలవే లంజా..."
(పేజి 62, block)
పాతికేళ్ళు అమానవీయమైన పాకీ పని చేసిన ఆమె కూతురు కోటిలక్ష్మి పెళ్ళి కోసం రెండు వందలడిగినందుకు బూతుల్తిట్టి మొహాన ఉమ్మేసిన దేశం. అగ్రకుల ఆధిపత్యం పట్టపగలు నట్టనడివీధిలో దళిత స్త్రీ ని నగ్నం చేసి రక్తం కారేలా, పేగులు బయటకొచ్చేలా కొట్టిన ఘటన.
"నిజానికి నువ్వు చాలా అందంగా ఉంటావు. ఫ్యాషన్ గా ఉంటావు. ఎత్తు, సరిపడా లావు, పొడవైన చేతులు, గుండ్రటి భుజాలు, చక్కని కళ్ళు, అందమైన చూపులు....వాట్ నాట్? అన్నీ...అంతా బావుంటావు. కానీ నిన్ను చూసాక, వీటన్నింటిలో నీ కులం కన్పిస్తోందనీ మా ఇంట్లో అందరూ అనుకున్నారు. వేరే వాళ్ళకు నిన్ను'ఫలానా కులం' అని పరిచయం చేయకపోయినా, చూడగానే నువ్వు దళిత్ వని అర్థమయిపోతావు..."
(పేజి 74, ప్రియుడు కావాలి)
"శరీరమే ఒక కులం సర్టిఫికేట్ గా..." కనిపించడమంటే ఏంటో, కులరక్కసి కోరలు చాపిన వ్యవస్థ కంట్లో అగ్రకుల రసెంత ధారగా కారుతుందో చెప్పడానికి ఈ కథ ఒక సాక్ష్యం.
అగ్రహార సంస్కృతి గొప్పదనే భ్రమలో పడి సొంత ఆత్మగౌరవ విలువని ఆలస్యంగా గ్రహించిన "తప్పిపోయిన కుమార్తె", అభ్యుదయ రచయితగా పుస్తకాల్లో అణగారిన ప్రజల గురించి ఆదర్శాలు వల్లించే స్నేహితురాలి తండ్రి, భార్యను "ఛండాలపు ల..మాల్ల...మాదిగ చేష్టలూ...మాదిగ బుద్ధులూ...కిరస్తానీ ముండా!" అంటో భయంకరంగా అరుస్తూ తిట్టడంతో ఈ దేశంలోని పెత్తందార్ల తిట్లకు కూడా అణగారిన వర్గాల స్త్రీలన్నా, వారి మాన ప్రాణాలన్నా ఎంత చులకనో తెలుసుకుంటుంది.
రైతు ఆత్మహత్య లపై మరోచూపు, "ఒక విలన్ ఆత్మహత్య" కథ. రైతు దేశానికి వెన్నెముక అంటో గ్రామాల్లో అగ్రకుల
అహంకారాన్నీ, ఫాసిస్ట్ మత సంస్కృతి నీ కాపలా కాసే వారికి అర్థం కావాల్సింది, ఈ దేశంలో "కూలీల" బతుకులు ఎలా తెల్లారుతున్నాయనే విషయం!
చాకలి కూడు, కుమారక్క, కూడా హృదయాన్ని ద్రవింపచేసే కథలు. వాడలోని స్త్రీల కి కాలకృత్యాలు తీర్చుకోవడం ఎంతటి గడ్డు సమస్యో 'కట్ట' కథ చూపిస్తుంది.
"రైలు కూడా మొగోడే!వస్తే నిలబడాల్సిందే!గూడ్సు బండొస్తే కూడా! ఎన్ని పెట్టెలుండి యెంత పొడుగున్నాసరే, ఇంక కూర్చోగోడుదు, చివర్లో గార్డు ఉంటాడుగా!(పేజి 127)

"...మనం ఏసయ్య మతం తీసుకుంటే 'కిరస్తానీ' వోళ్ళం అయ్యాం. అదే పెద్ద కులపోళ్ళు తీసుకుంటే.... " జార్జిరెడ్డి, ఎజ్రాశాస్త్రి, జాన్సన్ చౌదరి, శామ్యూల్ పిళ్ళై... అవుతారు. " (పేజి 144, అత్త అంబేద్కర్ లా ఉంది)

"నీకు లాగా ఆ సిద్ధాంతాలని నమ్మినోళ్ళంతా యిట్నే ఉన్నారా? నీకు లాగా అన్నీ తీసేసారా..?"

"అన్నీ అంటే...ముక్కులకి, చెవులకీ, కాళ్ళకీ, మెడలోకీ యేం బెట్టుకోరత్తా...పూవులసలు పెట్టుకోరు. జుట్టు కత్తిరించుకుంటారు. పాంట్లు, షర్టులు గూడా యేసుకుంటారు. కాటిక బెట్టుకోరు..! బొట్టు మాత్రం పెట్టుకుంటారు..!"

"యెందుకే? యెవర్నైనా అడిగావా ఎందుకో?"

" ఆ..! అలవాటు కదా, వొదులుకోలేకపోతున్నాం అనీ, అది లేకపోతే అద్దంలో తమని తామే చూస్కోలేకపోతున్నామనీ...కొంతమంది, చీరలు కట్టుకుని పెళ్ళిళ్ళకి, ఫంక్షన్ లకీ వెళ్లినప్పుడు తమని విధవరాళ్ళనుకుంటున్నారనీ- అందుకు కుటుంబ సభ్యులు బాధపడుతున్నారనీ, పెద్దది కాదు, చిన్న చుక్కేగా అని కొంతమంది....ఇట్లాంటివే ఇంకా యేదేదో చెబుతుంటారత్తా..."

"అదేనే, వాళ్ళంతా పెద్ద కులపోళ్ళు. హిందూ మతస్తులు. వాళ్ళ కులం, వాళ్ళ మతం అంతా బొట్టులోనే ఉన్నాయి! దాన్నెందుకు వొదులుకుంటారు! దానిని వొదులుకుంటే జనం వాళ్ళని కిరస్తానీలనుకుంటారని వీళ్ళకి గుబులు!మొగోళ్ళతో సమానంగా వుండాలని చేసే పోరాటం చిన్నదా? చానా పెద్దది గదా! 'విధవరాలేమో' అని జనం అనుకుంటారనుకుంటే నువ్విక పోరాటం ఏం జేస్తావ్? అది గాదు నీ బయ్యం! జనం నిన్ను మాల పిల్లో, మాదిగ పిల్లో అనుకుంటారని నీ బయ్యం! నిన్ను కులం తక్కువదని జనం అనుకోకూడదు. నీ పెద్ద కులాన్ని నువ్ వొదులుకోకూడదుగా...!!(పేజి 145)

ఎమ్.ఎమ్. వినోదిని "బ్లాక్ ఇంక్" కథలు పుస్తకం వొచ్చి ఐదేళ్ళు అయ్యింది. అసమానతలు నిండిన సమాజంలో "ప్రజలు", "రైతులు", అన్నట్లే "స్త్రీలు" అని జనరలైజ్ చేయడం ప్రజాస్వామ్యం పేరిట కులతత్వం చెలామణీ అవుతున్న ఈ దేశంలో ఎంత పొరపాటో ఈ కథలు మనకి చెప్తాయ్. చదవనివాళ్ళు వెంటనే చదవండి. కళ్ళకే కాదు, చూపులకి పట్టిన తెరలు కూడా తొలగుతాయ్.

# "వర్ణం నుండి కులం దాకా"

## (భారత సామాజిక వ్యవస్థలో కులం)

## ఒక రాజకీయ ఆర్థిక విశ్లేషణ !




"ఎంతో మంది అతణ్ణి గాంధీ అని పిలిచేవారు. లేదా జ్ఞానులైన పెద్ద మనుషులను పిలిచే ఏదైనా పేరు పెట్టి పిలిచేవారు. నవీన్ రాజకీయాలకు గాంధీతో ఏ సంబంధమూ లేదని తెలిసే ఇలా పిలిచేవారు. గాంధీ తరహా వ్యక్తిత్వం, జీవనశైలి, వైఖరి ఉందనే అర్థంలో అలా పిలిచేవారు...."

(పేజి 120, బచ్చు రమేశ్ బాబు)

"మావో సె టుంగ్ ను ఎవరో కమ్యూనిస్టు అంటే ఒక్క మాటలో నిర్వచించండి అని అడిగినప్పుడు ఆయన 'ప్రజలకు సేవ చేయడం' అని చెప్పాడట. నవీన్ ఈ నిర్వచనానికి నిదర్శనంగా జీవించి అమరుడయ్యాడు. పీడిత పోరాట ప్రజలకు ఎన్నో రూపాల్లో సేవ చేయడంలోనే కాదు, వాళ్ళ కోసం వర్గపోరాటంలో ప్రాణాలు అర్పించడం అనే అత్యున్నత త్యాగం వల్ల ఆయన గుర్తుండిపోయాడు. అంతకన్నా ఏ మనిషి అయినా మానవ సమాజానికి ఇవ్వగలిగింది ఏముంటుంది!"

(పేజి 136, వివి)

"మాలో అందరికన్నా " మార్పు" కోసం అంకితమైనవాడు. గొప్ప వాడైనప్పటికీ తన గొప్పతనం ప్రదర్శించని లక్షణాన్ని చివరగా చూసింది గాంధీజీలోనూ, ఇతనిలోనే. నవీన్ అమరత్వాన్ని గురించిన వార్త మాకు చేరినప్పుడు మా స్నేహితులు పత్రికల్లో సందేశాలు రాసినప్పుడు వాటితో పాటు అతికించడానికి ఫొటోల కోసం చాలా వెతికారు. నవీన్ కు ఎంతో మంది స్నేహితులు ఉన్నారు. వారి జ్ఞాపకాలలో అతడెప్పుడూ జీవిస్తూనే ఉన్నాడు కానీ ఆరోజు మాత్రం ఉపయోగించడానికి వీలయ్యే ఒక్క ఫొటో కూడా దొరకలేదు. తప్పనిసరిగా ఫొటో దొరకగలిగే స్థానం నుండి అంటే జె.ఎన్.యు.లో అతడి ప్రవేశ పత్రం నుండి ఆయన ఫొటోను తీసారు. నవీన్ జీవితపు సారం ఇది.."

(పేజి 149, భూపేంద్ర యాదవ్)

"నవీన్ ఆచరణ, దళితులతో సహా అందరితో మమేకమైన తీరు వల్లనే దళితులతడ్ని 'తమ వాడను'కున్నారు. మేమేమో దళిత నేపథ్యం నుండి వచ్చిన మార్క్సిస్టు మేధావి అని గర్వించే వాళ్ళం.విప్లవ పార్టీలో, సంఘాల్లో ఈ రూపంలో కులాల ఎరుక ఉందనడానికి

కూడా ఇదొక ఉదాహరణ."          (పేజి 153, ఎన్.రవి)
"ప్రస్తుత సమాజంలో తనకు ఏమాత్రం సంబంధం లేని వ్యక్తుల కోసం తన సర్వస్వం ధారపోసే నవీన్ వంటి సరళమైన, మంచి వ్యక్తి ఉన్నాడని విశ్వసించడం కూడా కష్టం." (పేజి 156, బాలా) గుంటూరు జిల్లా రేపల్లె మండలం గుడ్డికాయలంక గ్రామంలో పుట్టిన యలవర్తి నవీన్ బాబు కుటుంబం అతని చిన్నప్పుడే ప.గో.జిల్లా విజయిరాయికి వలస వెళ్ళారు. ఢిల్లీ లోని జె.ఎన్.యు. అతడ్ని విద్యార్థి గా, ఒక సామాజిక వేత్తగా మలిచింది! దేశవ్యాప్తంగా అనేక ప్రజాతంత్ర విద్యార్థి ప్రగతిశీల ఉద్యమాల్లో తలలో నాలుకగా మారి పనిచేసాడు. మితవాద వామపక్ష రాజకీయ పార్టీలు మొదలుకొని అతివాద రాడికల్ సంఘాల వరకూ అన్నిట్లోనూ తనదైన ముద్రవేసాడు!
స్టూడెంట్ ఫోరమ్ (విద్యార్థి వేదిక) స్థాపకుడైన నవీన్, 'ప్రగతిసాహితి', 'కలం', 'డెమోక్రటిక్ వాయిస్' వంటి పత్రికలు నడిపాడు. వెబేరియన్ నుండి మార్క్సిస్ట్ మేధావిగా ఎదిగాడు. డి.ఎస్.వో, డి.ఆర్.ఎస్.ఓ. , పి.యు.డి.ఆర్. వంటి సంఘాల్లో ముఖ్యపాత్ర వహించాడు! 1996లో ఢిల్లీలో 'అఖిల భారత ప్రజా ప్రతిఘటన వేదిక' ఆద్వర్యంలో ప్రపంచ వ్యాప్తంగా అనేకమంది మేధావుల సమక్షంలో జరిగిన జాతీయత సమస్య పై అంతర్జాతీయ సెమినార్కి నవీన్ చేసిన కృషి అద్వితీయమైనదంటారు!
అజ్ఞాత వీరుడిగా నవీన్ 2000 సంవత్సరంలో తూ.గో.జిల్లా దారకొండ గ్రామంలో జరిగిన ఒక ఎన్ కౌంటర్ లో చనిపోవడం జరిగింది. రమేశ్ బాబు మాటల్లో, "..అతని జీవితపు విలువ యుద్ధానికి ఇరువైపులా ఉన్న ఆయుధాల కంటే విలువైనది." (పేజి 119)
ఎమ్.ఏ అనంతరం రిసెర్చ్ ఫెలోషిప్ స్కాలర్షిప్ కోసం యుజిసిలో అర్హత సాధించిన నవీన్ ప్రొ యోగేంద్ర యాదవ్ పర్యవేక్షణలో కులం మీద పరిశోధనకు పూనుకుని 1989 లో పూర్తి చేసాడు. ఇంగ్లీష్ లో ప్రచురించిన చాలా కాలానికి రెండేళ్ళ క్రితం ఇలా తెలుగులో వచ్చింది!
"సగటు భారతీయుల దైనందిన జీవితంలో ఏ సంభాషణలో కానీ, చర్చలో కానీ రెండో వాక్యం వద్దకు చేరగానే " మీదే కులం" అనే ప్రశ్న తప్పనిసరిగా ఎదుర్కొంటామనటంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు.. " (పేజి 104)అన్న రమేశ్, నడరాజా "కుల వ్యవస్థ ను రద్దు చేయటం భారత ప్రజాస్వామిక విప్లవపు ఒక మౌలిక లక్ష్యం కావాలి" (పేజి 108) అంటారు!
జి.ఎన్.సాయిబాబా తో సహా ప్రజాస్వామిక వాదుల పై జరుగుతున్న హింసను గురించి కూడా తన వ్యాసం లో తడిమిన వి.వి. ప్రస్తుతం అదే రాజ్య హింసతో పోరాడు తున్నారు. కులనిర్మూలన కోసం పనిచేసే ప్రతి కార్యకర్త చదవాల్సిన పుస్తకం ఇది. ఎందుకంటే,

"మాలో చాలా మందిమి పెట్టుబడిదారీ వినిమయ సంస్కృతికి లొంగిపోకుండా ఉండడానికి చాలా అవస్థ పడుతుంటే, జె.ఎన్.యు.లో మేమెంచుకున్న విలువలకనుగుణంగా జీవించలేకపోతుంటే నవీన్ మాత్రం చాలా సహజంగా సునాయాసంగా నిరాడంబరమైన జీవనశైలిని అలవరుచుకుని అనవసర ఖర్చులను వదిలేసేవాడు. తాను ఎంచుకున్న మార్గం పట్ల అతడికి ఎటువంటి అనుమానాలు, గందరగోళాలు లేవు. అతడి సోదరి మాటల్లో చెప్పాలంటే, "ఇటువంటి మనుషులు మళ్ళీ పుట్టరు."

"నవీన్ వంటి వారు మనుషులలో ఉన్న మంచి తనానికి కొలబద్ద లాంటి వారు. మనిషి లో ఉన్న అపరిమితమైన శక్తి సామర్థ్యాలను మనకు గుర్తు చేస్తారు. అతడి జీవితాన్ని కృషి నీ పంచుకోక పోవడమంటే, అది అతడికి చేసే లోపం కాదు, మిగిలిన ప్రపంచానికి చేసే లోపం. మా జీవితకాలంలో మేమంత గొప్ప వ్యక్తిని చూడగలగడం మా అదృష్టం." (పేజి 124)

(ఈ పుస్తకానికి ఈ పరిచయం సరిపోవచ్చు కానీ 20 ఏళ్ళ క్రితం తాను నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడి జీవితాన్ని ధారపోసిన ఒక యువ మేధావి, సామాజిక కార్యకర్త త్యాగాన్ని స్మరించు కోవడానికి ఎన్ని అసంఖ్యాక అక్షర నీరాజనాలు కావాలో..!)

# తరతరాల బానిసత్వం పై యుద్ధభేరి

## "గులాంగిరి"




"దీనిని చదివితే ఎవరూ నాలుక కోసెయ్యరు. చదవగా వింటే కాగిన సీసం చెవుల్లో పోసెయ్యరు. రాయవలసింది రాసుకోవడానికి, చెప్పదలిచింది చెప్పు కోవడానికి స్వేచ్ఛ ఉన్న ఈ లౌకికరాజ్యంలోప్రతి శూద్రుడు, అతి శూద్రుడూ (అంటే బహుజనులందరూ) ఈ గ్రంథాన్ని చదివి, ఇతరులచేత చదివించి, వినిపించి, ఈ దేశానికి త్వరలో తప్పనిసరైన శాంతియుత సామాజిక విప్లవాన్ని త్వరితం చేసే సామాజిక స్పృహనీ, అవగాహననీ, ఆలోచననీ ప్రేరేపిస్తారని ఆశిస్తాను."

భారతదేశంలోని కులతత్వ బానిసత్వాన్ని సశాస్త్రీయంగా మొట్టమొదట సిద్ధాంతీ కరించి, జీవితాంతం అణగారిన ప్రజల కోసం కృషిచేసిన మహాత్మా జోతిబా ఫూలే రచించిన ""గులాంగిరి" గ్రంథం తెలుగు చేసిన ఏలూరి రామయ్యగారు 1993లో దానికి అనువాదకుడి మాటలలో పై వాక్యాలు రాసారు. ఆ లక్ష్యం ఇంకా నెరవేరవలసే ఉంది.

"భారతదేశం పై బ్రాహ్మణాధిక్యత పూర్తి చరిత్రని బాగా అధ్యయనం చేసి ఈనాటి వరకూ కూడా ప్రజల్ని బానిసత్వంలో ముంచి ఉంచిన వైనం తెల్సుకున్న ఎవరైనా, యదార్థ పరిస్థితిని గ్రహించిన వారెవరైనా ఇన్నాళ్ళూ భారతదేశాన్ని ఏలిన బ్రాహ్మల నిరంకుశత్వాన్ని, కేవల స్వసుఖాన్నే కోరుకునే నిర్దయత్వాన్నీ, సంపూర్ణ వంచకత్వాన్నీ వర్ణించడానికి ఎంత కఠినమైన భాషైనా కూడా సరిపోదని మాతో అంగీకరిస్తారు." (పేజి 8, పీఠిక)

పుక్కిటి పురాణాలు, కాల్పనిక సాహిత్యం ద్వారా అత్యధిక శాతం ప్రజల్ని భక్తి ముసుగులో వందల ఏళ్ళుగా చదువుకీ, జ్ఞానానికీ, అవకాశాలకీ మతం మత్తులో దూరం చేసిన దుర్మార్గమయిన పన్నాగాన్ని ప్రశ్నోత్తరాల ధోరణిలో వెలుగులోకి తెచ్చిన ఈ పుస్తకం, అమెరికాలోని "నీగ్రో జాతి దాస్య విముక్తి కోసం అంకితంఇవ్వబడి, (బహుశా అలా ఇచ్చిన మొట్టమొదటి భారతీయ గ్రంథం ఇదేనేమో)మహాత్మా ఫూలే విశ్వజనీన దృక్పథాన్ని చాటి చెబుతుంది.

"భారత సామ్రాజ్యపు ఆదాయంలో అధిక భాగం పేదవాడి కృషి వల్ల పుట్టిందే" (పేజి

11) అంటూ ఈ దేశపు శ్రమజీవి ఔన్నత్యాన్ని చాటిన ఫూలే, "దేశం అనే దేహానికి శూద్రులు ప్రాణం, రక్తనాళాల వంటివారు"ని (పేజి 13) ఉద్ఘాటించాడు.
సాహిత్యవేత్తగా, సంస్కర్తగా మొదలుకొని సత్యశోధక్ సమాజ్ స్థాపకుడిగా, సామాజిక విప్లవకారుడిగా భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనానికి పునాది వేసిన వాళ్ళలో మహాత్మా ఫూలేది తిరుగులేని స్థానం. అందుకే అంబేద్కర్ ఫూలే ని సగౌరవంగా తన గురువుగా ప్రకటించాడు.
"ఏ పనికైనా, మనం ఉపయోగించే సాధనాల పవిత్రతని నేను నమ్ముతాను. సత్ఫలితాల కోసమని నీచ మార్గాన్ని నేను ఎన్నడూ తొక్కను. అలాగయితే, సదుద్దేశాలు నష్టపడతాయ్.." (పేజి 83) అంటూ లక్ష్యాలే కాదు లక్ష్య సాధన కోసం ఉద్దేశించే సాధనాలు కూడా సమున్నతంగా ఉండాలనే సందేశాన్ని ఇచ్చిన మహాత్మా ఫూలే ఉద్యమాలకి నిత్య స్మరణీయుడు.
1873లో మరాఠీలో మొదటిసారి ప్రచురించబడిన "గులాంగిరి" ని తెలుగులో మొదట "సంస్కరణ సమితి" 1993 లో ప్రచురించగా తదనంతరం హైదరాబాద్ బుక్ ట్రస్ట్ అనేకసార్లు పునర్ముద్రించింది. ప్రతి సామాజిక కార్యకర్త తప్పనిసరిగా చదవాల్సిన పుస్తకం.
(మహాత్మా జోతిరావు ఫూలే వర్ధంతి సందర్భంగా 'గులాంగిరి' గురించి చాలా రోజులుగా అనుకుంటున్న ఈ చిన్ని రైటప్.ఆసక్తి ఉన్న వారికోసం సాఫ్ట్ కాపీ పెడుతున్నాను.)

# రామ్ మనోహర్ లోహియా

## "కులాల సమస్య"




"ఎవడో ఒకడు బ్రాహ్మణుడు కనుక అతని పాదాలు కడగడం అంటే కులవ్యవస్థను, పేదరికాన్ని, బాధలనూ, కష్టాలనూ కొనసాగించగలమని హామీ ఇవ్వడమన్నమాట...ఏ దేశ రాష్ట్రపతి అయితే బ్రాహ్మణుల పాదాలు కడుగుతాడో ఆ దేశంలో ఒక భయంకరమైన ఔదాసీన్యం వ్యాపిస్తుంది..." (పేజి 2)

"ఆవేశంలో ఒకసారి ఆయన (నెహ్రూ) నాతో చివరికి హిందువులు హిందువులే - ముస్లింలు ముస్లిములే అనేంతదాకా వెళ్ళారు. ఆ సంగతి నాకు తెలియదు కాని బ్రాహ్మణులు మాత్రం బ్రాహ్మణులేనన్నాను. కోపాన్ని దిగమింగడం ఆయనకు తెలుసు. నోరు మూసుకున్నాడు. ఆ తర్వాత మాట మార్చాడు....దేశంలోని జేబులకు కోమటి యజమాని అయితే, మనస్సుకు బ్రాహ్మడు యజమాని....దేశానికి బలం లభించాలంటే....పొట్టమీదా, మనస్సు మీదా కొనసాగుతున్నటువంటి ఈ గుత్తాధిపత్యం అంతమవ్వాలి"

(పేజి 55)

కాశీలో 200 మంది బ్రాహ్మణుల కాళ్ళు రాష్ట్రపతి కడగడాన్ని ఎండగడుతూ బాబూ రాజేంద్ర ప్రసాద్ ని కడిగిపారేసినా,సాక్షాత్తూ దేశ ప్రధాని నెహ్రూ హిందూ, ముస్లింల కోసం నోరుజారి మాట్లాడి నందుకు మొహం పగిలేలా జవాబిచ్చినా అంతటి ధైర్యం, తెగువ ఉన్న నాయకుడు డా. రామ్ మనోహర్ లోహియా. ఈ దేశంలోని సమస్యలు అన్నింటితోపాటూ "కులాల సమస్య" ను లోతుగా అధ్యయనం చేసిన వ్యక్తాయన. ప్రధానితో జరిగిన సంభాషణను పంచుకుంటూనే, "దేశంలో జేబులకు కోమటి యజమాని అయితే, మనస్సుకు బ్రాహ్మడు యజమాని..."అంటూ పొట్ట మీదా, మనస్సు మీదా కొనసాగుతున్న గుత్తాధిపత్యం అంతమైనప్పుడే దేశం బలిష్టం అవుతుందంటారు.

"సాంఘిక విప్లవం కూడా తోడైరాకపోతే రాజకీయ విప్లవం నిష్ప్రయోజనం. ఈ సాంఘిక విప్లవానికి వైతాళిక పాత్ర వహించగల రాజకీయ పార్టీ ఏదైనా ఉన్నట్లయితే అదే ఈ దేశానికేమన్నా చేయగలుగుతుంది...."(పేజి 10)అంటూ సామాజిక విప్లవవసరం నొక్కిచెప్పిన లోహియా,"ఏ పార్టీలో అయితే ఆడవాళ్ళు, శూద్రులు, హరిజనులూ,

ముస్లిములూ అధిక సంఖ్యాకులుగా ఉంటారో ఆ పార్టీ మాత్రమే దేశాన్ని శక్తివంతం, సుఖవంతం, సత్యశీలవంతం చేయగలుగుతుందని నా దృఢాభిప్రాయం...వీలైనంతవరకు విత్తనాలు స్త్రీలు, హరిజనులు, శూద్రులు, ముసల్మానులవే కావాలి. వీరిని నాయకత్వ స్థానంలో కూర్చోబెట్టాలి. ద్విజులు ఎరువుగా ఉపయోగపడాలి. అటువంటి పార్టీ రూపొందాలి." అంటారు.

(పేజి 61)

సామాజిక న్యాయం పక్షం వహించే రాజకీయ పార్టీ పట్ల ఇంతటి స్పష్టత ఉంది కనుకనే, "ముఖస్తుతులు చేయడంగానీ, ద్వేషాగ్నులను రెచ్చకొట్టడం గానీ అలవాటు లేని నాయకులు వెనుకబడిన కులాల నుండి ఎదిగి రావాలన్నది నా కోరిక."

(పేజి 42) అనగలిగారు. అంతేకాదు, "సవరించడానికి వీలులేని ఒక చట్రం కులం...." అన్నాయన, "మార్పును నిరోధించడంలోనూ, యధాస్థితిని కొన సాగించడంలోనూ కులవ్యవస్థ భయంకరమైన శక్తి....ఈనాడు భారతదేశంలోని రాజకీయ దృక్పథాలు విమర్శయోగ్యం కావు. అవన్నీ ఉన్నత కులాలకు చెందినవారి అబద్దపు, అస్వాభావికమైన ప్రయోజనాలనే ప్రతిబింబిస్తాయి." అన్నారు.

"ఇప్పటి వరకూ సాగిన సంస్కరణ ఉద్యమాలన్నింటినీ హిందూ వ్యవస్థ తనలో జీర్ణం చేసుకున్నది. కులవ్యవస్థ అనే భయంకరమైన ఊబి ఇప్పటికీ యధావిధిగా కొనసాగుతూనే ఉన్నది. ఈ ఊబి చాలా లోతైంది. ఎంత పెద్ద రాయి వేసినా, దీనిలో అంతుచిక్కకుండా ఇమిడిపోతుంది. ఈ ఊబిని ఎండగట్టేంత వరకూ భారతదేశంలో కులవ్యవస్థను అంతం చెయ్యడం సాధ్యం కాదు.....

"....వెనుకబడిన కులాల నుంచి నాయకత్వం ఎందుకు పుట్టుకొని రావడంలేదని మనం బాగా ఆలోచిస్తే, ఈ విశాల సముదాయం కేవలం సంఖ్యగానే మిగిలిపోయిందనీ, ఇందులోని ఏ వ్యక్తికి కూడా వ్యక్తిత్వమనేది మిగలలేదనీ నిర్ణయానికి వస్తాం. భారతీయ సమాజంలో స్థిరపడిపోయిన గొప్ప ఊబి ఇది. ప్రతి ఉద్యమం ఆందోళనా ఇందులో ఇమిడిపోయి, అమరిపోయి, ఎంత లోతుకు వెళ్ళిపోతుందో అంతుచిక్కదు. ఊబి అలాగే కొనసాగుతూ ఉంటుంది."

(పేజి 29)

"కులనిర్మూలన పోరాటంలో దక్షిణ భారతం మొత్తం దేశానికే నాయకత్వం వహించగలదన్న నా ఆశ అడియాశ అయిపోయింది. కాపులు, ఈడబాలు, మాలలు, మాదిగలు, అన్సార్ లు, ఆదివాసులు, ఆవాస క్రైస్తవులు మొదలైన వారు ఆడవారందరూ కూడా సంఘటితపడి ఎన్నికలను ప్రభావితం చేయడానికి పూనుకోనంతవరకూ ఎటువంటి ఆశకూ తావులేదు."

(పేజీ 128) అంటూ నిర్మొహమాటంగా చెప్పినాయన,"గత 50 సంవత్సరాలుగా దక్షిణాదిన సాగుతున్న రెడ్ల, మొదలియర్ల, నాయర్ల అధికారం బ్రాహ్మణ విరోధంగా సాగడానికి కారణం తామూ బ్రాహ్మణులంతవారం కావాలన్న లక్ష్యంతోనే..." అని నిష్కర్షగా చెప్తారు (ibid)

భారతదేశ పతనానికి కులతత్వం, స్త్రీ అణిచివేత ప్రధాన కారణాలుగా గుర్తించిన లోహియా "ఏ స్త్రీ కి ఎందరు భర్తలుండేవారు? ఎంత మంది ప్రేమికులు ఉండేవారు? ఈ ఒక్క అంశాన్ని ఆధారం చేసుకుని ఆమె శీలం ఎటువంటిదని మాత్రమే పరిశీలించడం, ఆమెకున్న టువంటి మిగతా గుణగణాలను పరిశీలించకపోవడం ఈనాడు భారతదేశ ప్రజల పతనావస్థకు సంకేతమేగాని మరొకటి కాదు." (పేజి 135) అన్నారు. "మిగతా అన్ని రకాల అసమానతలకూ

స్త్రీ - పురుష అసమానత్వమే పునాది....

"ఆలోచనా రంగంలోనైతే ప్రపంచంలో ఏ దేశంలో కూడా స్త్రీలకు సమాన హోదా లేదు." అంటూ, భారత స్త్రీ కి 'ద్రౌపది' ప్రమాణం కావాలంటారు.

జీవితాంతం వివాదస్పదునిగా ఉన్నప్పటికీ కులనిర్మూలన విషయంలో కచ్చితంగా అధ్యయనం చేయాల్సిన వ్యక్తి లోహియా. గాంధీ, మార్క్స్, సోషలిజం పై నిర్మాణాత్మక ప్రజాస్వామ్యం ఆయన లక్ష్యం. అందుకే అంబేద్కర్తో, పెరియార్తో కల్సి పని చేయాలని తపించాడు.

"డాక్టర్ అంబేద్కర్ హఠాన్మరణం వల్ల నాకు కలిగిన బాధ ఎంతటిదో - ఎంతటి వ్యక్తిగతమైనదో నీవు అర్థం చేసుకోగలవని భావిస్తున్నాను. ఆయన్ను మనలోకి తెచ్చుకోవడానికి నేను సదా ప్రయత్నం చేసాను. కేవలం సంస్థాగతంగానే కాక, సైద్ధాంతిక పరంగా కూడా సంపూర్ణంగా ఆయన్ను మనలో కలుపుకోవాలని ప్రయత్నించాను. అలాంటి క్షణం దగ్గరపడ్డట్లె అనిపించింది.... భారత రాజకీయ రంగంలో డాక్టర్ అంబేద్కర్ చాలా గొప్ప వ్యక్తి అని నా అభిప్రాయం. గాంధీజీని వదిలేస్తే ఉన్నత కులాల వారిలో డాక్టర్ అంబేద్కర్ అంతటి గొప్ప నాయకుడు మరొకరు లేరు. మనదేశంలోని హిందూమతంలో నాటుకొని ఉన్న కులవ్యవస్థ ఏనాటికైనా అంతం కాగలదన్న నమ్మకం, విశ్వాసం

ఆయన వ్యక్తిత్వాన్ని చూసి నాకు కలుగుతుండేది."అంటూ ఒక మిత్రునికి రాసిన లేఖలో పేర్కొన్నారు.

(పేజి 27)

'కులాల సమస్య'తెలుగు అకాడమీ ప్రచురణగా, సురమౌళి అనువాదంగా, ఆచార్య భీంసేన్ నిర్మల్ ఆద్వర్యంలో 1989 లో మొదటి ముద్రణ వచ్చింది. 2013లో రెండో ముద్రణ జరిగింది.కులం పై లోహియా వ్యాసాలు, ఉపన్యాసాలు, లేఖల సంకలనం

ఇది. ప్రతీ సామాజిక కార్యకర్త తప్పనిసరిగా చదవాల్సిన పుస్తకం.

అంగీకారమైనా, విభేదమైనా సూటిగా స్పష్టంగా చెప్పగలిగే సత్తా ఉన్న అరుదైన విప్లవకారుడు లోహియా. గాంధీ, మార్క్స్, అంబేద్కర్, పెరియార్...ఇలా వివిధ భావజాలాల్ని సవినయంగా గౌరవిస్తూనే సంపూర్ణంగా అర్దం చేసుకుని విశ్లేషిస్తూ తప్పొప్పులను ఎత్తి చూపడం ఆయన లక్షణం. అందుకే లోహియా అకాల మరణం పై నార్ల సంపాదకీయం రాస్తూ,

"ఆయన గాంధేయ తత్వాన్ని కొన్ని ముఖ్యాంశాలలో త్రోసివేసిన గాంధేయవాది. మార్క్స్ ను కొన్ని ప్రాధమిక సూత్రాల్లో ఖండించిన మార్క్సిస్ట్. నెహ్రూ సోషలిస్టు విధానాల్ని ఖండించిన సోషలిస్టు. చిన్న పెద్ద విషయాలన్నింటిలో ఆయన భావాలా యనవే, ఆయన మార్గాలాయనవే" అంటారు. ( ఆయన అన్ని అభిప్రాయాలతోనూ అంగీకరించ కున్నా ప్రతి సామాజిక కార్యకర్త తప్పనిసరిగా తెలుసుకోవాల్సిన వ్యక్తి లోహియా." కులాల సమస్య" ప్రచురించబడి 30 ఏళ్ళు పూర్తవుతున్న సందర్భంగా ఆయన రచనని పరిచయం చేస్తూ ఇలా ఈ చిన్న రైటప్.)

# అసమానత్వం పై ధిక్కార ప్రకటన

## అంబేద్కర్ "కుల నిర్మూలన"




"…. నీవు ఏ దిక్కుకు తిరిగినా సరే, దారికడ్డంగా నిలబడే పెనుభూతం కులవ్యవస్థ. ఈ భూతాన్ని చంపి పారవేస్తే తప్పా నీవు రాజకీయ సంస్కరణగాని, ఆర్థిక సంస్కరణగాని సాధించలేవు."

(పేజి 28)

"… హిందూ మతంలో కులాలు నిలిచి ఉన్నంత కాలం హిందూ మతం ప్రచారక మతం ఎన్నటికీ కాజాలదు. కులాలు నశించకుండా ఇతరుల్ని హిందువులుగా మార్చే శుద్ధి కార్యక్రమం అర్థరహితమూ, నిరర్థకమూ."

(పేజి 39)

"…హైందవేతరులలో కూడా కులాలను పోలిన శాఖలు ఉన్నాయని తృప్తిపడడం చాలా ప్రమాదకరమైన భ్రమ. హైందవేతరులలోని శాఖా భేదాలు మొత్తం సమాజ భావానికి లోబడినట్టివి. హిందువుల లోని కులాలు మాత్రం సమాజ భావాలను విచ్ఛిన్నం చేసే అవరోధాలు. ఈ సత్యాన్ని పూర్తిగా గుర్తించవలసి ఉంది. హిందువులలో కులాలు హైందవే తరులలోని శాఖలు ఒకటే అనే భ్రమను హిందువులు ఎంత త్వరగా తొలగించుకుంటే అంత మంచిది."

(పేజి 56)

"…వర్ణాంతర భోజనాలకు, వర్ణాంతర వివాహాలకు వ్యతిరేకులైన వారిని విమర్శించడం వల్ల గానీ లేక అప్పుడప్పుడు వర్ణాంతర భోజనాలు, అక్కడక్కడ వర్ణాంతర వివాహాలు జరపడం వలన గానీ ఏమీ ప్రయోజనం ఉండదు. మనం అనుసరించ వలసిన సరైన మార్గం ఏమిటంటే – శాస్త్రాలపట్ల, వాటి పవిత్రత పట్ల ప్రజలకు గల విశ్వాసాన్ని తొలగించడం."

(పేజీ 60)

"కులం అనేది కొన్ని మత విశ్వాసాల కారణంగా ఏర్పడిన వ్యవస్థ. ఆ మత విశ్వాసాలకు శాస్త్రాల మద్దతు ఉంది. ఆ శాస్త్రాలు దైవ సమానులైన ఋషులచే ప్రతిపాదించ బడినట్టివనే ప్రతీతి ఉంది. ఆ ఋషులు మానవాతీత శక్తి కలవారని మహా జ్ఞానులని, అట్టి వారి ఆదేశాలను ధిక్కరించడం మహా పాపమని, ప్రజలకు ఒక నమ్మకం ఉ

ంది...హిందువులుతమ సామాజిక వ్యవస్థను పరమ పవిత్రంగా భావిస్తారు. కులానికి దైవిక ప్రాతిపదికను ఆపాదిస్తారు. అందువల్ల మీరు కులాన్ని నిర్మూలించాలంటే దానికి ఆధారంగా కల్పించబడ్డ దైవికతను, పవిత్రతను ముందు నిర్మూలించవలసి ఉంది. అంటే, శాస్త్రాల యొక్క, వేదాల యొక్క అధికారాన్ని నిర్మూలించ వలసి ఉన్నదన్నమాట."

(పేజి 61)

".... నిజానికి మతాతీతులైన బ్రాహ్మణులకు ఆచారపరులైన బ్రాహ్మణులకు మధ్య తేడా ఊహించడం కూడా నిష్ప్రయోజనమే. ఆ రెండు రకాల బ్రాహ్మణులు రక్తసంబంధీకులే. ఒకే శరీరానికి రెండు చేతుల వంటి వాళ్ళు. అందులో ఒకరి మనుగడకు మరొకరు పోరాడక తప్పదు... బ్రాహ్మణుడు చచ్చినా విప్లవవాది కాలేడు."

(పేజి 62, 63)

"ఆర్థిక విప్లవం తీసుకు రావడం కోసం శ్రామిక జనాన్ని రెచ్చగొట్టేందుకు మార్క్స్ మహాశయుడు" మీరు పోగొట్టుకునేదేమీ లేదు – మీ సంకెళ్ళు తప్ప" అని వారికి ఉద్బోధించాడు. కాని, హిందువులలోని వివిధ కులాల ప్రజలను కుల వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రేరేపించడానికి మార్క్స్ మహాశయుని నినాదం ఏ విధంగానూ పనికిరాదు. అంత చాకచక్యంతో విచిత్రంగా మత సాంఘిక హెూదాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ కులాల అంతస్తులు, వాటి హక్కులూ – ఈ కులాలన్నింటికీ దేనికి దానికే కొద్దో గొప్పో కొన్ని కొన్ని ఆధిక్యతలు ఉండేటట్టు ఏర్పాటు కావడం వలన మొత్తం కుల వ్యవస్థ రద్దయితే తమ స్వాతిశయాలు పోగలవనే భయం ప్రతీ కులానికి ఉంది. ఇంతేకాక, ఒక కులానికి మరొక కులం మీద ఉన్న ప్రభావాలు, ప్రతిష్టలు పోతాయనే భీతి కూడా ఉంది. ఈ విషయాలలో ఒక కులం కంటే మరొక కులం ఎక్కువ పోగొట్టుకునే వీలు ఉన్నందువల్ల, ఈ కులాలు నిత్యమూ మాత్సర్యంతో మ్రగ్గుతూ ఉన్నందువల్ల, మార్క్స్ మహాశయుడు శ్రామిక జనంలో ఆశించే ఐకమత్యం హిందువులలో మృగ్యం కాగా – కుల వ్యవస్థను ఎదిరించడానికి హిందువులను ఒక సంఘటిత శక్తిగా సమీకరించడం మీకు సాధ్యం కాదు. "

(పేజి 65, 66)

బ్రాహ్మణ మతం యొక్క వాస్తవ సాక్షాత్కారమే కుల వ్యవస్థ. హిందూమతాన్ని నాశనం చేసిన క్రూర విషమే బ్రాహ్మణ మతం. బ్రాహ్మణ మతాన్ని మీరు నిర్మూలించి పారవెయ్యగలిగినప్పుడే హిందూమతాన్ని మీరు రక్షించిన వాళ్లౌతారు. ఈ సంరక్షణకు ఎవరి నుంచీ, ఏ విధమైన వ్యతిరేకత ఉండనవసరం లేదు...మతానికి సైద్ధాంతికమైన ఒక కొత్త ఆధారాన్ని మాత్రం కల్పించవలసి ఉంది. అది స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే మూడు మానవ సూత్రాలకు – అంటే ప్రజాస్వామికానికి అనుగుణంగా

ఉండాలి. ఈ విషయంలో నాకు అంతగా ప్రవేశం లేదు. కాని నేను విన్నదానిని బట్టి - స్వాతంత్ర్యంతోనూ, సమానత్వంతోనూ, సౌభ్రాతృత్వంతోనూ సమన్వయం పొందగల మత సూత్రాలు మనకు కరువేమీ కాదని, అట్టివి ఉపనిషత్తు ల నిండా ఉన్నాయని అట్టి వాటిని విదేశాల నుంచి అప్పు తెచ్చుకోవలసిన అవసరం లేదనీ తెలుస్తున్నది.... "

(పేజీ 74, 75)

"నా ఉద్దేశంలో హిందూ సమాజం కులరహిత సమాజం అయినప్పుడు మాత్రమే అది తనను తాను రక్షించుకొనే శక్తినీ, సామర్థ్యాన్ని సంతరించు కోగలదు. అంతరంగికమైన బలం లేకుండా హిందువులకు స్వరాజ్యం వచ్చినా, అది మళ్ళీ దాస్యం వైపు ఒక అడుగు ముందుకు వెయ్యడమే కావచ్చు.బాగా ఆలోచించండి."

(పేజి 79)

1936 లో లాహోర్‌లో జాత్పాత్ తోడక్ మండలివారి వార్షిక మహాసభ కోసం తయారు చేయబడిన ఈ ఉపన్యాసమే కులనిర్మూలన (%ూాఅఅఅష్ట్రఅశ్రీఫ్‌అశీఅ శీట ఝుర్‌వ%). డా. అంబేద్కర్ వెలిబుచ్చిన భావాలతో ఆహ్వానసంఘం వారు ఏకీభవించక మహాసభనే రద్దు చేసుకొన్నందువలన ఇది ప్రసంగించబడలేదు. ఐతే గత 85 సంవత్సరాలుగా యావత్ దేశంలోని సామాజిక ఉద్యమాలన్నింటినీ ఈ పుస్తకం ప్రభావితం చేస్తూనే ఉంది. ముఖ్యంగా కులనిర్మూలనోద్యమానికి తిరుగులేని దిక్సూచిగా ఉపయోగ పడుతూనే ఉంది. సామాజిక కార్యకర్తలే కాదు, ప్రతి ఒక్కరూ తప్పనిసరిగా చదివి తీరాల్సిన పుస్తకం ఇది.

చదవగలిగి ఉండి అసలీ పుస్తకం చదవకపోతే అది నిరక్షరాస్యతతో సమానం! అసమానతల వ్యవస్థలో బతుకుతూ ఈ పుస్తకం గురించి తెలుసుకోలేకపోతే ఆ బతుకు నిరర్ధకమని నా అభిప్రాయం. ఈ దేశంలో మనిషిగా మసలడానికి, దోపిడీ, పీడనల్ని చూడటానికి ఈ పుస్తకాన్ని మించిన దిక్సూచి నాకైతే తెలీదు!

కేవలం చదివి ఊరుకుంటే చాలదు,

ప్రతీ సామాజిక చైతన్య సంస్థా, ప్రజా సంఘమూ "కుల నిర్మూలన" గ్రంథం పై ప్రత్యేక తరగతులు నిర్వహించుకోవాలి.75 ఏళ్ళ స్వాతంత్ర్య భారతావనిలో అంబేద్కర్ "కుల నిర్మూలన" గ్రంధానికి 85 ఏళ్ళు పూర్తవుతున్న సందర్భంగా ఎక్కడికక్కడ దళిత బహుజన ప్రగతిశీల సంఘాలన్నీ దార్శనిక సదస్సులు, సెమినార్లు, సమాలోచనలు నిర్వహించాలి. ఈ రోజు ప్రతీ సంఘం, ప్రతీ రాజకీయ పార్టీ కులనిర్మూలన జపం చేసే అత్యధిక శాతం వ్యక్తులు, సంస్థలకు ఒక నిర్మాణాత్మకత లేకపోవడం ప్రత్యక్షంగా కనిపిస్తున్న క్రమంలో అంబేద్కర్ ఫొటోలతో ఫోజులు, విగ్రహాలకి దండలు కాదు, ఆయన "కుల నిర్మూలన" ని పాఠ్యాంశంగా పెట్టమనే డిమాండ్ ని పెద్ద ఎత్తున ప్రచారం చేయాలి. 'కులనిర్మూలన'

కోరుకుంటామంటూనే పుస్తకాన్ని పాఠ్యాంశంగా పెట్టడానికి ప్రయత్నించకపోవడం నిజాయితీ కాజాలదు. అంతిమంగా గ్రంథంలోని ఆశయ సాధన కొరకు శక్తిమేరకు తోడ్పడటం, అందుకు కలిసొచ్చే వ్యక్తులు, శక్తులతో సమిష్టి కార్యాచరణ దిశగా అడుగేయడం కుల నిర్మూలన వాదులుగా నిబద్ధతతో చేయాల్సిన పనులని నా అభిప్రాయం.పుస్తకం
సాఫ్ట్ కాపీ కూడా పంపుతున్నాను.

(75 సంవత్సరాల స్వాతంత్ర్య భారతావనిలో డా. బాబాసాహెబ్ అంబేద్కర్ సమతా దిక్సూచి "కుల నిర్మూలన" గ్రంథం మొదటిసారి ప్రచురించబడి 85 సంవత్సరాలు కాబోతోంది. అలానే బోయి భీమన్న గారి తెలుగు అనువాదం ప్రచురించబడి 50 ఏళ్ళు పూర్తయిన సందర్భంగా తెలుగు సమాజంలో రోజురోజుకీ గాఢతను సంతరించుకుంటున్న కులాధిపత్య అంశం పై అసహ్యంతో "కులనిర్మూలన" గురించి కొద్దిమంది మిత్రుల వ్యాసాలతో ఒక సంకలనం తీసుకొచ్చే ప్రయత్నం మొదలైంది. ఈలోగా ఆ ఫొటోలు బోయి భీమన్నగారి ముందుమాట ఫొటోతో సహా ఈ అక్షరాయుధం పై చాలా రోజుల నుండి రాయాలనుకుంటున్న ఈచిన్ని రైటప్.)

# “భారతదేశంలో కుల సమస్య”




“కుల వ్యవస్థ పెరగటం, ఘనీభవించటం ఒక యాదృచ్ఛిక ప్రక్రియ కాదు. రాజ్యం మద్దతు, అండ దానివెనక ఉన్నాయి. తీవ్ర హింసతో దానిని నిలబెట్టి ఉంచారు. దీనికి తోడు అంటరాని వాళ్ళ పై అగ్రకులాల హింసను బ్రాహ్మణవాదం ఆమోదించింది. అంటరాని వాళ్ళు ఏ రూపంలోనైనా తమ పరిధులను దాటినప్పుడు వాళ్ళని చంపే హక్కు అగ్రకులాలకు ఉండేది. మత సిద్ధాంతాల ద్వారానే కాకుండా కత్తిని ఉపయోగించి కూడా కుల వ్యవస్థను కాపాడుకుంటూ వచ్చారు.” (పేజీలు 52, 53)

“ఎవరు ప్రజాస్వామికవాదులు, ఎవరు కాదు అన్న విభజన రేఖను (మనం తరచు చేస్తున్నట్లు) ఒక వ్యక్తి లేదా ఉద్యమం కమ్యూనిస్టు అనుకూలురా, ప్రతికూలురా అన్నదాని ఆధారంగా గియ్యలేం...కులానికి వ్యతిరేకంగా పోరాడే శక్తులు, మహిళల సమాన హక్కుల కోసం, జాతుల అణిచివేతకు వ్యతిరేకంగా, అల్పసంఖ్యాక వర్గాల అణిచివేతకు వ్యతిరేకంగా పోరాడే వాళ్ళందరూ ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంలో భాగస్వాములై వాళ్ళ సిద్ధాంతం ఏమైనప్పటికీ, ప్రగతిశీలురే అవుతారు. అదే విధంగా ఉదాహరణకు నిజంగా దేశభక్తులైన వాళ్ళు (అంటే అన్ని రూపాలలో అగ్రరాజ్యాల పెత్తనాన్ని వ్యతిరేకించేవాళ్ళు) కూడా ఏ సిద్ధాంతానికి చెందిన వాళ్ళైనప్పటికీ, ప్రజాస్వామిక ఉద్యమంలోని వాళ్ళే.

(పేజి 103)

“కులం అన్నది సామాజిక ఆర్థిక వ్యవస్థలో అంతర్భాగంగా ఉన్నప్పటికీ మానవ స్వభావంలో లోతుగా నాటుకుపోయింది. వేల సంవత్సరాలుగా నిరాటంకంగా కులచరిత్ర కొనసాగటం వల్ల దానికి ఆటుపోట్లను తట్టుకుని నిలబడే శక్తీ, తనదైన స్వయం ప్రతిపత్తి సమకూరాయి. దాంతో మార్పు ప్రక్రియను నిరోధించే శక్తి దానికి ఒనగూడింది. కుల వ్యవస్థను సమూలంగా నిర్మూలించాలంటే ముందుగా వెనకబడిన అర్థ-ఫ్యూడల్ సామాజిక ఆర్థిక వ్యవస్థని కుప్పకూల్చాలి. అయితే అదొక్కటే సరిపోదు - కుల సిద్ధాంతం పై నిరంతరం దాడి చెయ్యాలి. కుల ఆధారిత సామాజిక సంబంధాలను వ్యతిరేకించాలి, అన్నిటికీమించి అన్ని రూపాలలో కుల వివక్షతకు, అణిచివేతకు వ్యతిరేకంగా పోరాడాలి.”

"భారతదేశంలో కుల సమస్య"
"కుల వ్యవస్థ పెరగటం, ఘనీభవించటం ఒక యాదృచ్ఛిక ప్రక్రియ కాదు. రాజ్యం మద్దతు, అండ దానివెనక ఉన్నాయి. తీవ్ర హింసతో దానిని నిలబెట్టి ఉంచారు. దీనికి తోడు అంటరాని వాళ్ళ పై అగ్రకులాల హింసను బ్రాహ్మణవాదం ఆమోదించింది. అంటరాని వాళ్ళు ఏ రూపంలోనైనా తమ పరిధులను దాటినప్పుడు వాళ్ళని చంపే హక్కు అగ్రకులాలకు ఉండేది. మత సిద్ధాంతాల ద్వారానే కాకుండా కత్తిని ఉపయోగించి కూడా కుల వ్యవస్థను కాపాడుకుంటూ వచ్చారు." (పేజీలు 52, 53)

"ఎవరు ప్రజాస్వామికవాదులు, ఎవరు కాదు అన్న విభజన రేఖను (మనం తరచు చేస్తున్నట్లు) ఒక వ్యక్తి లేదా ఉద్యమం కమ్యూనిస్టు అనుకూలురా, ప్రతికూలురా అన్నదాని ఆధారంగా గియ్యలేం...కులానికి వ్యతిరేకంగా పోరాడే శక్తులు, మహిళల సమాన హక్కుల కోసం, జాతుల అణిచివేతకు వ్యతిరేకంగా, అల్పసంఖ్యాక వర్గాల అణిచివేతకు వ్యతిరేకంగా పోరాడే వాళ్ళందరూ ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంలో భాగస్వాములై వాళ్ళ సిద్ధాంతం ఏమైనప్పటికీ, ప్రగతిశీలురే అవుతారు. అదే విధంగా ఉదాహరణకు నిజంగా దేశభక్తులైన వాళ్ళు (అంటే అన్ని రూపాలలో అగ్రరాజ్యాల పెత్తనాన్ని వ్యతిరేకించేవాళ్ళు) కూడా ఏ సిద్ధాంతానికి చెందిన వాళ్ళైనప్పటికీ, ప్రజాస్వామిక ఉద్యమంలోని వాళ్ళే.
(పేజి 103)

"కులం అన్నది సామాజిక ఆర్థిక వ్యవస్థలో అంతర్భాగంగా ఉన్నప్పటికీ మానవ స్వభావంలో లోతుగా నాటుకుపోయింది. వేల సంవత్సరాలుగా నిరాటంకంగా కులచరిత్ర కొనసాగటం వల్ల దానికి ఆటుపోట్లను తట్టుకుని నిలబడే శక్తీ, తనదైన స్వయం ప్రతిపత్తి సమకూరాయి. దాంతో మార్పు ప్రక్రియను నిరోధించే శక్తి దానికి ఒనగూడింది. కుల వ్యవస్థను సమూలంగా నిర్మూలించాలంటే ముందుగా వెనకబడిన అర్థ-ఫ్యూడల్ సామాజిక ఆర్థిక వ్యవస్థని కుప్పకూల్చాలి. అయితే అదొక్కటే సరిపోదు - కుల సిద్ధాంతం పై నిరంతరం దాడి చెయ్యాలి. కుల ఆధారిత సామాజిక సంబంధాలను వ్యతిరేకించాలి, అన్నిటికీమించి అన్ని రూపాలలో కుల వివక్షతకు, అణిచివేతకు వ్యతిరేకంగా పోరాడాలి."
(పేజీలు 107, 108)

"ప్రస్తుత రాజ్యాంగ చట్ర పరిధిలోనే మార్పు కోసం ప్రయత్నించటం దళిత ఉద్యమంలోని బలహీనత, ఇదే అంబేద్కర్ దృక్పథంలో కూడా కనబడుతుంది. కుల వ్యవస్థ మనుగడకు కారణమైన ప్రస్తుత రాజకీయ వ్యవస్థని నిర్మూలించకుండా కుల వ్యవస్థను బలహీనపరచలేం. అయితే ఇది కూడా ఆరంభం మాత్రమే. కుల సిద్ధాంతం మనుషుల

ఆలోచనల్లో బలంగా వేళ్ళూనుకుని ఉన్నందువల్ల నిరంతర సైద్ధాంతిక పోరాటాల ద్వారానే దానిని కూకటి వేళ్ళతో పెకలించగలం.

(పేజీలు 109, 110)

"...కులవ్యవస్థకు వ్యతిరేక యుద్ధంలో గెలవాలంటే ముందుగా కులాలను అధిగమించి అణిచివేతకు గురైన వాళ్ళందరి ఐక్యత సాధించడం తప్పనిసరి. కాబట్టి కుల అణిచివేతకు వ్యతిరేకంగా జరిగే పోరాటాలు ప్రస్తుత వ్యవస్థను కుప్పకూల్చి, పూర్తిగా ప్రజాస్వామ్యం ప్రాతిపదికగా సమాజాన్ని పునఃనిర్మించేందుకు అణిచివేతకు గురైన వర్గాలు చేసే పోరాటంతో చేతులు కలపాలి"

(పేజి 111)

కర్ణాటకలోని కూర్గులో పుట్టిన అనురాధ గాంధీ 1972 లో మహరాష్ట్ర దళిత్ పాంథర్స్ ఉద్యమంతో ప్రభావితం అయ్యి బొంబాయిలో ప్రజా ఉద్యమ కార్యకర్తగా పనిచేశారు.నాగపూర్ లోని దళిత బహుజన అణగారిన వర్గాల మధ్య ఉంటూ అనేక సమస్యల మీద కృషి చేశారు. ఆమె జీవిత, ఉద్యమ భాగస్వామి కోబడ్ గాంధీ (తీహార్ జైల్లో నుండి ఆయన రాసిన The Question of Freedom and Peoples Emancipation అనే అద్భుతమైన వ్యాసం ఆసక్తి ఉన్నవాళ్ళు నెట్లో చదవచ్చు)అనురాధ గాంధీ 2008లో సెలిబ్రల్ మలేరియా వచ్చి అనారోగ్యంతో మరణించారు.

కులసమస్యని క్షేత్ర స్థాయిలో అధ్యయనం చేసిన అతి కొద్ది మంది సామాజిక కార్యకర్త ల్లో అనురాధ గాంధీ ఒకరు.ప్రజా సమూహాలతో విస్తృతమైన అనుభవాలు, ఉద్యమాలతో విశాలమైన అనుబంధం కలిగిన అనూరాధ 1990లో కులం పై రాసిన అముద్రిత రచన Caste Question ని 2015లో కె.సురేష్ అనువాదంగా "భారతదేశంలో కుల సమస్య" పేరిట 'మలుపు' ప్రచురించింది.

"కులాలను నిర్మూలించాలంటే ముందు వాటిని అర్థం చేసుకోవాలి!" అనే సామాజికవేత్త ఆనంద్ తేల్తుంబ్డే ముందుమాటతో (దీని అనువాదం ప్రభాకర్ మందార చేసారు)నున్న ఈ పుస్తకం కులనిర్మూలన వాదులూ, సామాజిక కార్యకర్తలు తప్పక చదవాలి.

తెలుగులోకి ఈ పుస్తకం వచ్చి ఐదేళ్ళయిన సందర్భంగా ఈ చిన్న రైటప్.

# బ్రాహ్మణవాదం

## ( భారతదేశానికి శాపం )



బ్రాహ్మణవాదం(Brahminism)

(భారతదేశానికి శాపం)

ఇంగ్లీషు మూలం:

శ్రీ వి.టి.రాజశేఖర్‌శెట్టి

స్వేచ్ఛానుకరణ, అనువాదం:

పసల భీమన్న

ఎమ్.ఏ.ఎమ్.ఇడి.

ప్రచురణ

ఝాన్సీ పబ్లికేషన్స్

ఇంటి నెంబరు 79-8-9/1, పోస్టల్‌కాలనీ,

శ్యామలానగర్, రాజమండ్రి-533103,

ఫోన్:0883-2423610, సెల్: 9490123276

"మనం వ్యక్తిగతంగా బ్రాహ్మ ణులకు వ్యతిరేకంకాదు. మనది ఏదో కులాన్ని వ్యతి రేకించే పోరాటం కాదు. మన యుద్ధం బ్రాహ్మణవాదం మీదనే. అది ప్రమాదకరమైనది. బ్రాహ్మణులే 'పవిత్ర పురాణ గ్రంథాలు' రాసి, వాటికి సంరక్షకులుగా ఉంటూ,బ్రాహ్మణవాదాన్ని స్థాపించారు. కనుక వ్యక్తి గతంగా బ్రాహ్మ ణులు మనకు శత్రువులు కాదు. మన విమర్శ ద్వారా ఏ బ్రాహ్మణ వ్యక్తయినా మానసికంగా గాయ పడితే, అందుకు అతని అజ్ఞానానికి మనం జాలి పడదాం. బ్రాహ్మణ వాదం కనీసం అధిక సంఖ్యాకు లైన బ్రాహ్మణులకైనా సహాయ. పడలేదు...బ్రాహ్మణవాదాన్ని ఎదుర్కొనే మనం భారతదేశం లో భాగస్థులైన బీద బ్రాహ్మణు లను కూడా బ్రాహ్మణవాద పిడికెళ్ళ నుండి రక్షించడానికి సమానంగా ఆసక్తి కలిగి ఉన్నాం!" (పేజి - 2)

బ్రాహ్మణవాదం (Brahmanism) శీర్షికతో వి.టి. రాజశేఖర్ శెట్టి రచించిన పుస్తక ముందుమాట లోని వాక్యాలివి. తెలుగులో సరిగ్గా పదేళ్ళ క్రితం ఝాన్సీ పబ్లికేషన్స్,(రాజమండ్రి) తరపున ప్రచురించిన ఈ చిన్న పొత్తాన్ని మిత్రులు పసల భీమన్నగారు అనువదించారు. ఆంగ్లంలో 160 పుటలకి పైబడి ఉన్న ఈ ప్రసంగ వ్యాసాన్ని మొదటిసారి సుమారు 40 ఏళ్ళ క్రితం, 1981 లో బెంగుళూరు, దళిత సాహిత్య అకాడెమీ వాళ్ళు ప్రఖ్యాత ద్రావిడ కజగం నేత కె. వీరమణి గారి మున్నుడితో వెలువరించారని ప్రారంభంలోనే అనువాదకుడు పేర్కొన్నారు !

"బ్రాహ్మణవాదం హిందూవాదా నికి సరియైన పేరు. బ్రాహ్మణ వాదం కేవలం కులవ్యవస్థ మాత్రమే. కులంతీసేస్తే హిందూ వాదం చని పోతుంది. అంటే, "కులం భారతదేశం నుంచి కనుమరు గైతే హిందూయిజం కూడా కనుమరుగవుతుంది (M. N. Srinivas - A Note On Sanskrtisation and Western isation Far Eastern Quartarly - 1956, Vol - 15, Page - 495) కులవ్యవస్థ (వర్ణాశ్రమ ధర్మం) బ్రాహ్మణ వాదానికి మరోపేరు. దీన్ని చాలా మంది బ్రాహ్మణ, బ్రాహ్మణేతర ఆలోచనాపరులు, సంస్కర్తలు వ్యతిరేకించారు" అన్నాయన "కులం భారత దేశాన్ని నాశనం చేసిందని", చెబుతూ, "సామాజిక సమానత కోసం కులపెత్తనం పోవాలంటే,ఏ ఉద్యమమైనా బ్రాహ్మణ వ్యతిరేకత మూలం లో ఉండి

తీరాల్సిందే " అంటారు ! (పేజీ - 3)

అంతేకాదు, "సమానత్వం, సామాజిక న్యాయం,వ్యక్తిగత ఆస్తి నిర్మూలన, స్త్రీల విముక్తి మొదలైన వాటికోసం పోరాడే వారంతా ముఖ్యంగా బ్రాహ్మణ వ్యతిరేకులే అయ్యుండాలి. ఆర్థికసమానత్వం(సోషలిజం), ప్రైవేటు ఆస్తి పోవడం కోసం పాటుపడేవారు బ్రాహ్మణులను సమర్దించడం కుదరదు. హిందూ దేశంలో బ్రాహ్మణిజం, సోషలిజం పరస్పర వ్యతిరేకం. బ్రాహ్మ ణిజం నాశనం కాకుండా సోషలిజం ఇండియాకు రాదు. "అంటారు,ఇంకా,"బ్రాహ్మణులు రాజకీయ సంస్కరణ ఉద్య మాల్లో ముందుండి పాల్గొం టారు. ఆర్థిక సంస్కరణ ఉద్యమాల్లో కొన్నింటిలో పాల్గొం టారు. కాని, కుల నిర్మూలనా పోరాటాల్లో మాత్రం పాల్గొనరు. డా. అంబేద్కర్ చెప్పినట్లు, "పురోహిత బ్రాహ్మణులుగానీ, లౌకిక వాదులైన బ్రాహ్మణులు గానీ ఎవ్వరూ కుల వ్యతిరేక ఉద్యమాల్లో పాల్గొనరు. ఎందుకంటే వారి కులశక్తి, హోదా పోతాయని. వారి కులం శాశ్వతంగా ఉండాలని కుల నిర్మూలన వారు కోరుకోరు." కనుక బ్రాహ్మణులు ప్రధానంగా యధాస్థితి వాదులు." అంటారు! (పేజి - 4)

"హిందూ ఇండియాలో దేవుడు లేడని తెలిసిన వాడు ఎవరైనా ఉన్నారంటే, అది బ్రాహ్మణ పురోహితుడే. అందుకే, వారు తమను భూసురులని (భూమి మీద దేవతలు) చెప్పుకుం టారు. ఇది నమ్మే పరమ మూరు?లు ఇండియా లో చాలామంది ఉన్నారు"అంటూ, 'ఫాసిజం యొక్క మూలాలు' విభాగాన్ని ప్రారంభించిన ఆయన, "ఫాసిజం యొక్క తత్వశాస్త్రాన్ని ఆర్యుల కులవ్యవస్థ భావమే ప్రేరేపిం చింది.. ఫాసిజం అనే తత్వ శాస్త్రం సరిగ్గా భారతీయ ఆధ్యాత్మికవాదంతో సమానం గా పోల్చుకోవచ్చు." అని చెప్పారు ఎమ్.ఎన్. రాయ్. గీత, ఉపనిషత్తులు ఫాసిజం యొక్క బైబిలు.ఫాసిజం లక్ష్యం ఏమిటి? దాని లక్ష్యం మార్క్స్ వాదాన్ని నాశనం చేయడం. బ్రాహ్మణ వాదం యొక్క లక్ష్యం ఏమిటి? వర్ణాశ్రమధర్మం, ఉన్నత కులాల హక్కుల్నీ కాపాడుతూ వాటిని కొన సాగించడం.కనుక బ్రాహ్మణ వాదం ఫాసిజం యొక్క తండ్రి... ఫాసిజం నుండి భారతదేశాన్ని రక్షించుకోవా లంటే బ్రాహ్మణవాదాన్ని నాశనం చేయాలి." అంటారు! (పేజి - 11, 12)

"పరస్పర వైరుధ్యం" అనేది పవిత్ర పురాణ గ్రంథాల సారాంశం. వాటికి ఎవ్వడైనా, ఎలాగైనా తనకు నచ్చినట్లు అర్థం చెప్పుకోవచ్చు. శంకరా చార్యులు, రామానుజా చార్యులు, మధ్వా చార్యులు, గాంధీ, తిలక్, గాడ్సే కూడా వారికిష్ట మొచ్చినట్లుగా వాటికి అర్థం చెప్పారు. ఈ చర్చ శతాబ్ధాల నుండి కొనసాగు తూనే ఉంది. సాధవూ, దెయ్యం కూడా తమ చర్యలను, భావాలను సమర్ధించుకోవడానికి అవే పురాణాల నుండి ఉదహరిం చవచ్చు. ఇదీ వాటి అందం! పురాణాలు ఎలా బడితే అలా ఉపయోగిం చుకోవడానికి

వీలుగా ఉద్దేశ పూర్వకంగా రాయబడ్డాయి. అవి యాదృచ్ఛికంగా వ్రాయబడ లేదు.” అన్నాయన ‘పవిత్ర పురాణాలు పరస్పర వైరుధ్యాల పుట్ట’ అంటారు ! (పేజి 14)

“సర్వేజనా సుఖినోభవంతు” అని హిందూ యిజం (బ్రాహ్మణ వాదం) ప్రభోదిస్తుందని చెబు తారు. అంటే, ప్రతి ఒక్కరూ సుఖంగా ఉండాలి. ప్రతి ఒక్కరూ రక్షింప బడతారని అర్థం.అంటే, దోపిడి దార్లూ, దోచుకోబడేవాళ్ళూ ఇద్దరూ కలిసి సహజీవనం సాగిస్తారని అర్థం. ఇది ఎలా సాధ్యం? తోడేలు, గొర్రెపిల్ల కల్సి జీవించగలవా? సంపూర్ణంగా విరుద్ధ ప్రయోజ నాలు గల విరుద్ధ శక్తులు కలిసి ఎలా గుండగలవు? తోడేలుకు ఆకలి వేయగానే అది గొర్రె పిల్లను తినేస్తుంది. అంతవరకు అది గొర్రెపిల్లను క్షేమంగా చూసుకుంటుంది. బ్రాహ్మణ వాద న్యాయ చట్టంలో ఇలాగే జరుగు తుంది.’సర్వేజనా సుఖినోభవంతు’ అనేది గొర్రెపిల్లను తోడేలుకు అర్పించడానికి చాలా అనుకూలమైన తత్వశాస్త్రం.” అంటారు ! (పేజి - 17)

“భారతదేశం ముక్కలవ్వ డానికి, అనైక్యతకీ మొగ్గు చూపుతుంది. ప్రతిపార్టీ, ప్రతి సంస్థ ఎందుకు విడిపోతుం టాయ్?ఇండియాలో గొడవలు, కొట్లాటలు, సర్వసాధారణంగా ఎందుకు జరుగుతుంటాయి? హిందువులు అంతా ఒకే ఐక్యతగల జాతిగా వుండి, ఎందుకు కలిసి పని చేయలేకపోతున్నారు. వారు ఎప్పుడూ ఎందుకు విడిపోతారు?విడిపోయిన వారు మళ్ళీ మళ్ళీ ఎందుకు విడిపోతారు ?బ్రాహ్మణవాదం ఒక్కటే మన ఈ క్లిష్ట పరిస్థితికి కారణం. మనం ఎప్పుడూ ఒక జాతిలా ఉండ లేము. ఐక్యత మన రక్తంలో లేదు..” అంటారు! (పేజి - 19)

సంస్కృత భాషా విధానం, పాశ్చాత్య విధానం, పారిశ్రామిక విధానం - ఇవి బ్రాహ్మణవాదాన్ని బలపరచ డానికి మాత్రమే సహాయ పడ్డాయి. బ్రాహ్మణ వాదం లోకి వచ్చిన ఈ కొత్త బ్రాహ్మలు, బ్రాహ్మణుల కంటే ఇంకా ఎక్కువ ప్రమాదక రమైన వారు. నేడు బ్రాహ్మణ కోటను శక్తివంతం చేసింది భారతీయ మార్క్సు వాదం. మార్క్సు వాదుల కంటే బ్రాహ్మణ వాదాన్ని ఎక్కువగా సమర్ధించినవారు ఇంకెవ్వరూ లేరు. నిజానికి వారు సంప్రదాయ బ్రాహ్మణుల కంటే కూడా బ్రాహ్మణవాద విశ్వాసంలో బాగా మించి పోయారు. మార్క్సువాద బ్రాహ్మణులు ఆర్. ఎస్. ఎస్. బ్రాహ్మణుల కంటే కూడా చాలా ప్రమాదకరమైనవారని నిర్ధారించుకున్నారు.” (పేజి - 24)

భిన్నాభిప్రాయాలు ఎన్నైనా ఉండవచ్చు కానీ, భారత దేశంలో బ్రాహ్మణవాదం పోషించిన అవకాశవాద దుర్మార్గకర పాత్రను ధైర్యంగా విశ్లేషించిన ఈ రచన ప్రతి సామాజిక కార్యకర్త తప్పని సరిగా చదవాలనేది నా అభిప్రాయం. మన భావదారిద్ర్యం కారణంగా తెలుగులో ఈనాటి వరకూ ఈ పుస్తకం పూర్తి అనువాదం లేదు. సీరియస్ ఆలోచనాపరుల కోసం

భీమన్న అనువాదం చేసిన స్వేచ్ఛానుసరణ పుస్తకం స్కాన్డ్ కాపీ, జ్ఞాన్ పబ్లిషింగ్ హౌస్, న్యూఢిల్లీ వారు ప్రచురించిన ఇంగ్లీషులో సాఫ్ట్ కాపీ పంపుతున్నాను !

(2012 లో వచ్చిన ఈ పుస్తకం ఆయనతో ఎప్పుడూ చెప్పలేదు కానీ, మిత్రులు, పెద్దలు పసల భీమన్న గారు రాసిన పుస్తకాలు అన్నింటిలోకీ నాకు వ్యక్తిగతంగా నచ్చే అనువాదం ఇది. తెలుగులో కులనిర్మూలన కోసం పాటుపడే చిన్న సంస్థలైనా పాతిక పేజీల ఈ చిన్న బుక్లెట్ ని పునర్ముద్రించాలని కోరుతూ భీమన్న గారి కాంటాక్ట్ నంబర్ తో సహా ఇతర వివరాలతో ఈ చిన్న రైటప్.)

# ఒక మంచి పుస్తకానికి 22 సంవత్సరాలు !

## డా.నందమూరి లక్ష్మీపార్వతి 'శ్రమణకం'!!

## (చారిత్రక ప్రాధాన్యతగల బౌద్ధ నవల)




"చీకటి వెలుతురులో లీనమవుతున్నట్లు ఇంద్రియాలు మనసులో లయిస్తున్నాయి. మనస్సు బుద్ధిలో మమేకమవుతున్నది. తెలియని అగాథంలోకి జారిపోతూ బుద్ధి పట్టు కోసం ప్రయత్నిస్తున్నది. అంతఃకరుణ చతుష్టయం పంచీకరణంలో మిశ్రమమై లోకాద్యవస్థ నుండి లోకాతీత స్థితికి చేరు కుంటున్న వేళ.అవస్థాత్రయం ఏకమై సంగ మానికి ఆనందంతో సమాయత్త మవుతున్న ఆ శుభసమయం""ఒక్క ఘడియకాలం సమస్తం నిశ్శబ్దం. అక్కడ జననమరణాలు సుఖదుఃఖాలు ఏవీలేవు ఋతు వర్తనాలు, గ్రహసంచారాలు, పొంగే సముద్రాలు, క్రుంగే పర్వతాలు, కదిలే కాలం, నడిచే జీవజాలం అన్నీ ఏకీకృతమై జడీభవించి ఘనీభవించిన ఆ ఒక్కక్షణం"

"చిరుదివ్వెగా లేచి పెనువెల్లువై సాగి అణువ ణువునా ఆవిర్భవిస్తున్న మహాప్రళయ విస్ఫోటనాల కాంతివలయమై సాగిసాగిపరిసరాల్ని ముంచెత్తే మహా ప్రవాహమై నదులు,నదాలు, కొండలు, గుట్టలు, అరణ్యాలు – విశ్వాన్నే కబ ళించే గొప్ప కాంతి సమూహం సముద్రమంత విశాలమై, గగనమంత విస్తారమై అండపిండ బ్రహ్మాండాలను తనలో ఇముడ్చుకున్న ఆ వలయంలో అస్తిత్వాన్ని కోల్పోయిన గౌత ముని శరీరంలో విద్యుద్ఘాతాల ప్రకంపనలు. ఎన్నడూ అనుభవానికిరాని ఆనంద ప్రహేళికలు."

"సమస్త భావనలంతరించి తనలో విశ్వాన్ని, విశ్వంలో తననీ ఆవహింప చేసుకున్న సుమధుర క్షణం. సిద్ధార్ధునిలో జ్ఞానోదయ మయింది. పరుచుకున్న కాంతి వలయంలో తన మార్గం సుగమమయింది."

"ఆ అనుభూతిలో ఎంతసేపున్నాడో తెలి యదు. విచిత్రంగా మనస్సు పూర్తి ప్రశాంత స్థితిలో వున్నది. ఏ వికల్పాలు, సంకల్పాలు లేవు."

"శోకమూలం కరతలామలకమయింది."

"సిద్దార్థుడు బుద్ధుడయ్యాడు. గయ బుద్ధ గయ గా సార్థక్యాన్ని పొందింది. అప్పుడది వట్టి బోధికాదు. మహాబోధి. ఏ గురువు ద్వారానో,ఈశ్వరుని వల్లనో కాక స్వబుద్ధి ద్వారా పొంది నందున బౌద్ధధర్మం'స్వబోధనం' అయింది."

డా. నందమూరి లక్ష్మీపార్వతి 22 ఏళ్ళ క్రితం 2002 లో డా. ఎన్. టి. ఆర్. ఎడ్యుకేషనల్ సొసైటీ తరపున ప్రచురించిన 250 పుటల అద్భుతమైన నవల "శ్రమణకం"లో ఆదివాసీ అమ్మాయి 'సుజాత'మాటలతో ప్రభావితమైన సిద్ధార్థుడు స్వీయసాధన ద్వారా జ్ఞానోదయం పొందిన విధానాన్ని ఆమె వర్ణించిన తీరే పైది. ఎందుకనో ఆనాటి నుండి ఈనాటి వరకూ ఈ నవల నన్ను ఆకర్షిస్తూనే ఉంది !

పింగళి – కాటూరి సౌందరనందం కావ్యం లోని సుందరి పాత్రతో ప్రభావితమైన రచయిత్రి చారిత్రక ప్రాధాన్యత కలిగిన కల్పనల్ని ధీటు గా మలిచిన తీరు ప్రసంశ నీయం. వేరే ఏ భాషలో ఇది వెలువడినా కచ్చితంగా పుర స్కారాలు దక్కేవి. వ్యక్తుల్ని రాజకీయ కళ్ళ ద్దాలతో చూసే మన పురుషా ధిక్య వ్యవస్థలో ఇంతటి అంశాన్ని ఒక మహిళ మొట్టమొదటి సారిగా నవలగా రచించినా జరగాల్సిన చర్చ జరగలేదు !

నవలలోని లోపాలు,చారిత్రక ఆధారాలజోలికి నేను పోబోవడం లేదు. కానీ, సగటుమనిషికి, సాహిత్య రసజీవులకీ, ఆలోచనాపరులకీ తెలుగులో వచ్చిన ఈ పుస్తకం ఎందుకు కాక పోయిందో నాకైతే అర్ధం కాలేదు. ఎన్. టి. ఆర్. కి అంకితం ఇవ్వ బడిన ఈ పుస్తకం వీలైతే ఒకసారి చదవండి. పుస్తకం లోతుల్నీ, లోపాల్ని చర్చించండి.బౌద్ధంకోసం ఉ ద్దేశించిన ఒక యత్నాన్ని మనస్ఫూర్తిగా హర్షించండి !

ఏదేమైనప్పటికీ, బౌద్ధంలో గృహస్థ సాంప్ర దాయం ఎలా మొదలైందో తెల్సుకోడానికి, ఎవరొప్పుకున్నా లేకున్నా తెలుగులో వచ్చిన మంచినవల 'శ్రమణకం'. ఇది అంగీకరించ డానికి మనకి అనేక అభిజాత్యాలు అడ్డు పడవచ్చు. పూర్వ నిశ్చితాభి ప్రాయాల ప్రభా వం కూడా ఉండొచ్చు. ఐనా, పదేళ్ళకి పైబడి చదివిన హృద్యమైన ఒక బౌద్ధ కాల్పనిక కృతి గురించి బుద్ధ పూర్ణిమ సందర్భంగా ఈ చిన్న రైటప్ !)

# భయమెరుగని యోధురాలు

## "బీబీ అమ్తుస్సలామ్"




"ఆమె దృఢ విశ్వాసి అయిన ముస్లిం. ఆమె ఖురాన్ పఠించడంలో ఎన్నడూ క్రమం తప్పలేదు. తన ఆరోగ్యం సహకరించినప్పుడల్లా ఆమె రంజాన్ ఉపవాసాల్ని కచ్చితంగా పాటిస్తూనే ఉంటుంది. చడీచప్పుడూ లేకుండా ఎందరో ముస్లింలకి ఆమె సేవ చేస్తూ ఉంది. ఆమె ధైర్యశాలి

ఈ హత్యలు ఆగకపోతే ఆమె తన ప్రాణాల్ని అర్పించాలని అనుకుంటోంది.

ఆ పని చెయ్యమని నేను ఆమెని మనస్పూర్తిగా ప్రోత్సహించాను.....

ఆమెని మించిన దృఢచిత్తుడైన లేదా సమున్నతుడైన మగవాడుకానీ ఆడమనిషి కానీ నా దగ్గర లేరు. ఇస్లాం గౌరవాన్ని కాపాడటానికి, హిందువుల్ని సేవించడానికి తన ప్రాణాల్ని అర్పించాలని ఆమె కోరుకుంటే, ఆమెకి నా ఆశీస్సులు అందించడం నా బాధ్యత అని నేను భావిస్తాను." (పేజి 317)

సింధ్ లో శాంతి స్థాపన కోసం బీబీ అమ్తుస్సలామ్ ని పంపుతూ హాజీ అబ్దుల్లా హరూన్ రషీద్ కి రాసిన లేఖలోని వాక్యాలివి!ఒక ఉన్నతమైన సాంప్రదాయ ముస్లిం కుటుంబంలో పుట్టి ఛాందసాలన్నింటినీ కాదని జీవితాంతం సమతా సాధనలో
వెనుదీయని వెలిగే సమిధగా పనిచేసిన మహోన్నత వ్యక్తిత్వం బీబీ అమ్తుస్సలామ్.
జీవితాంతం అనారోగ్యాలు, అవాంత రాలతో అహర్నిశలు పోరాడుతూనే హిందూ - ముస్లిం ఐక్యత కోసం చిట్టచివరి క్షణం వరకూ వెచ్చించిన అసమాన, అసాధారణ మూర్తిమత్వం బీబీ అమ్తుస్సలామ్.

"పరుల కోసం తపించడమే ఋషిత్వమైతే ఆమె ఋషిక !
దైవం తరపున సైతాన్ శక్తులతో పోరాడటమే జిహాద్ అయితే ఆమె జిహాది!
ఫలితంతో సంబంధం లేకుండా కర్తవ్యాన్ని నిర్వహించడమే కర్మయోగమైతే ఆమె కర్మయోగి!
లోకస్తుల పాప విమోచన కోసం బలికావడానికి సిద్ధపడటమే అర్హత ఐతే అమే దైవ తనయ!నమ్మిన ఆశయానికి ప్రాణాలు అంకితం చేయడమే విప్లవమైతే, ఆమె విప్లవకారిణి!"

(పేజీ 520)

పాటియాలాలో పుట్టి మొట్టమొదటి ముస్లిం మహిళగా సబర్మతీలో చేరి సేవాగ్రాంతో

మొదలెట్టి ఢిల్లీ దాకా, సింధ్ తో ఆరంభించి పఠాన్ సీమ వరకూ, పంజాబ్ నుండి బెంగాల్ దాకా ....దేశం నలు చెరుగులా నమ్మిన ఆశయం కోసం అనితరసాధ్యమైన కృషి చేసిన మానవతామూర్తి అమ్తుస్సలామ్. తెలుగులోనే కాదు మరే ఇతర భాషలోనూ అమ్తుస్సలామ్ గురించి ఇంత వివరణాత్మక పరిశోధన, పుస్తకం వచ్చిందని అనుకోను. మతోన్మాదం, పురుషాధిపత్యం వ్యవస్థలో గాఢాంధకారంతో అలముకుంటున్న వేళఅమ్తుస్సలామ్ని గురించి ఆరొందల పుటలతో పుస్తకం ప్రచురించి తెలుగు సాహిత్యానికేకాదు, హిందూ, ముస్లిం సమైక్యతకే "జై భారత్" ఒక వెలుగు ప్రసరింపజేసింది! లేఖల పైనా, ఇతర భాషల్లోని చిన్న చిన్న ప్రయత్నాల పైనా, ముఖ్యంగా గాంధీజీ రచనల పైనా ఆధారపడి బీబీ అమ్తుస్సలామ్ వ్యక్తిత్వాన్ని పునర్నిర్మించిన ఈ రచనలో అంతర్వాహినిలా గాంధీ, ఇతర గాంధేయవాదుల జీవితాల్ని పరిచయం చేస్తూ ప్రతిబింబింపజేసిన తీరు ప్రసంశనీయం.

దేశ విభజన సమయంలో కుటుంబం పాకిస్తాన్కి వెళ్ళిపోయినా, ఉక్కు సంకల్పంతో ఏక వ్యక్తి సైన్యంగా నిల్చి ముష్కర మూకల మధ్య శాంతి స్థాపన కోసం పనిచేసిన తీరు చదివి తీరాలి. ప్రస్తుత కల్లోలిత కాలంలో హిందూ ముస్లిం ఐక్యతెంత ప్రాధాన్యతాకల అంశమో అర్థమైతే అమ్తుస్సలామ్ కి మనసులోనే సలాం చేస్తూ నివాళులు అర్పించకుండా ఉండలేం. పుస్తకం కావాలనుకుంటే వివరాలు ఫొటోలతోపాటు ఇచ్చాను.

(గాంధీ బొమ్మల ఫోజులు, విగ్రహాల భజనల కంటే బీబీ అమ్తుస్సలామ్ గురించి ఈ మధ్యనే తెలుగులో వచ్చిన రమణమూర్తి రచననిలా ఈరోజు పరిచయం చేయడం అర్ధవంతమైనదని అనిపించింది. అందుకే ఈ చిన్ని రైటప్)

# అజరామర విలువల చిరునామా

## "భగత్ సింగ్ వీలునామా..!"



"వాస్తవం చెప్పుకోవాలంటే నా నాస్తికత్వం ఇటీవలిది కాదు.నేను ఎవరకీ తెలియని అనామకుడయిన ఒక యువకుడిగా ఉన్న రోజుల్లోనే దైవాన్ని విశ్వసించడం మానివేసాను."

(పేజి : 14)

"...నా నిర్దిష్ట జీవితంలో ఒక మూల మలుపు ఏర్పడింది. "అధ్యయనం" అవసరమన్న ఆవేశం నా మనసులో ప్రతిధ్వనించడం ఆరంభించింది. ప్రతికూలురు తెచ్చే వాదనలను ఎదుర్కొనాలంటే అధ్యయనం ఒక్కటే మార్గమనిపించింది. సిద్ధాంతం సరియైనదని నిరూపించుకోవాలంటే, అధ్యయనం చేసి వాదనలకు అవసరమైన పరిపుష్టిని చేజిక్కించుకోవడం అవసరం."

(పేజీ : 16)

"1926 సంవత్సరం ముగిసేనాటికి ఈ జగత్తును సృష్టించి నడుపుతున్న సర్వాంతర్యామి ఒకడున్నాడన్న విషయానికి ప్రాతిపదిక లేదని నేను విశ్వసించడం ఆరంభించాను. ఈ విషయాన్ని గురించి నా మిత్రులతో చర్చించడం మొదలుపెట్టాను. దానితో నేనే ఖచ్చితమైన నాస్తికుడనయ్యాను."

(పేజి 17)

"నేను ఎలాగూ ఉరిశిక్ష కు ఆహుతికాక తప్పదు కాబట్టి ప్రతిరోజూ రెండు సార్లు ప్రార్ధనలు జరుపుకోవలసిందని పోలీసులు నాకు సలహా ఇచ్చారు. అప్పటికే నేను నాస్తికుడను. శాంతి గాను, సరదా గాను ఉన్నప్పుడు నేను నాస్తికుడనని గర్వంగా చెప్పుకోవచ్చు కానీ కష్ట సమయంలో కూడా ఆ సూత్రానికి కట్టుబడి ఉండగలనా అనేదే కీలక సమస్య. ఈ సమస్యను గురించి బాగా ఆలోచించుకున్న తర్వాత దేవుడిని ప్రార్ధించరాదనే నిర్ణయానికి వచ్చాను. అది నిజానికి పరీక్షా సమయం. ఆ పరీక్షలో నేను దృఢంగా నిలవగలిగాను."

(పేజి 18,19)

"దైవత్వం పైనా పరలోకంలోని సుఖ భోగాల పైనా నమ్మకం ఉండి ఉంటే మరణం ఆనందకరంగానే ఉండేది. కానీ ఆ మైకంలో నేను ఉండ దల్చుకోలేదు. నేను వాస్తవిక వాదిని. హేతువాదం సహాయం పైననే నేను నిలబడదలిచాను.."

(పేజి 21)

"దేవుడిని నమ్మడం ఆయనను నిత్యం ప్రార్ధించడమూ అత్యంత స్వార్ధ పూరితమైన విషయమని నేను భావించుతాను. ప్రార్ధించడం
ద్వారా దేవుడి నుండి ప్రయోజనం పొందాలనుకోవడం మానవుని నైతిక పతనానికి నిదర్శనం. అనేక కష్టాలను ధైర్యంతో ఎదుర్కొన్న నాస్తికుల జీవితాలను నేను చదివాను. కనుక నేను కూడా ఒక మనిషి వలె చివరి వరకు నా ఆశయాల కోసం మనోనిబ్బరంతో నిలబడటానికి చివరికి ఉరి కంబం ఎక్కడానికి కూడా సంసిద్ధంగా ఉన్నాను."

(పేజి : 29, 30)

.......................................................

భగత్ సింగ్ పేరు చెప్పి భజన చేసే భక్తులు, ఆయన ఫొటోలతో ఫోజులిస్తూ దేశభక్తి నటనలు వెలగబెట్టే వారి మొహాన చెళ్ళున చరిచే అక్షరాల భాస్వరాలు భగత్ సింగ్ రచనలు.

అతిచిన్న వయసులోనే పరిణితి చెందిన భౌతికవాదిగా, పదార్థవాదిగా, తార్కిక ఆలోచనశీలిగా జైల్లో ఉన్నప్పుడు సూటిగా ఆయన "నేనెందుకు నాస్తికుడ్ని"(why I am an Atheist?) అనే రచన చేసాడు. పైవి మచ్చుకు కొన్ని వాక్యాలు మాత్రమే.

హిందూ , ముస్లిం, క్రైస్తవ మతాల దుమ్ము దులుపుతూ చార్వకుడి నుంచి చార్లెస్ డార్విన్ వరకూ జీవం ఎలా ఏర్పడిందనే దానిపై తిరుగులేని స్పష్టతతో చర్చించిన ఆధునిక భారతీయ భౌతికవాద రచన అది!

బ్రాహ్మణత్వాన్ని తీవ్రంగా నిరసిస్తూ పురోహిత వర్గాన్ని సునిశితంగా విమర్శిస్తూ మతాధిపతుల తాటతీసి, మనిషి పక్షాన నిలిచి " నేను నాస్తికుడ్ని" అంటూ ఎలుగెత్తి చాటిన భగత్ సింగ్ రాసింది ఒకరకంగా, 'మానవీయ మ్యానిఫెస్టో'!

అంతేకాదు, అతి చిన్న వయసులో 'మనిషి జీవితానికి హేతువాదమే మార్గదర్శక సాధనం కావాలని' చెప్పిన ఈ రచన ఒకరకమైన "రేషనలిస్ట్ మ్యానిఫెస్టో" కూడా అని నా అభిప్రాయం!

అక్కడితో ఆగలేదు. సమాజంలోని ఇంతెత్తున అసమానతలు, అన్యాయాలు, దోపిడీ, పీడన ఉంటే చూడలేని దేవుడ్ని ఏకంగా నియంతయిన నీరో చక్రవర్తితో పోల్చి మార్క్సిస్టు మేధావిగా పేదలపక్షాన ప్రశ్నించిన ఈ రచన "సోషలిస్ట్ మ్యానిఫెస్టో" కూడా!

"భగత్ సింగ్ వీలునామా!" పేరిట అతడి మరొక వ్యాసంతోపాటు కలిపి చరిత్రకారుడు బిపిన్ చంద్ర అద్భుతమైన ముందుమాటతో ప్రజాశక్తి బుక్ హౌస్ ఎన్నడో ప్రచురించిన ఈ చిన్ని పుస్తకం సాఫ్ట్కాపీ కావాల్సినవారికి పంపగలను.

ఇతరేతర ప్రచురణ సంస్థలు కూడా ఈ రచనని అనేక దశాబ్దాలుగా ప్రచురిస్తూనే వచ్చాయి. మతోన్మాదులు, మూఢభక్తులు కూడా ఆయన వారసులమంటూ భుజాలు ఎగరేసుకుంటున్న సమయంలో నిజమైన భగత్ సింగ్ భావాలను బతికించుకోవడం మనందరి కర్తవ్యం. నిజంగా పాలకులకి చిత్తశుద్ధి ఉంటే భగత్ సింగ్ రాసిన ఈ చిన్న వ్యాసాన్ని పాఠ్యాంశంగా పెట్టాలి! ఆయన భావాలకి వారసులమని చెప్పుకొనేవారు ఈ రచనని విస్తృతంగా ప్రచారం చేయాలి! అన్నిటికీ మించి ఆయన ఆశయాల సాధనలో నిజాయితీగా భాగస్వాములవ్వాలి! (రెండు పదుల వయసులో సర్దార్ భగత్ సింగ్ రాసిన "నేనెందుకు నాస్తికుడ్ని?" రచన పై ఈనాటికీ సంతృప్తికరమైన చర్చ జరగలేదని నా అభిప్రాయం. పిల్లలకు, యువతకూ భగత్ సింగ్ రాసిన ఈ వ్యాసం గురించి ప్రస్తావిస్తూ పరిచయం చేయడం కనీసం ఆయన జయంతి సందర్భంగా ఈ రోజు ఆ ధీరోదాత్తునికిచ్చే నిజమైన నివాళి కాగలదు. అందులో భాగమే చాలా రోజులనుండి రాద్దామని అనుకుంటున్న ఈ చిన్ని రైటప్.)

# రాజకీయ కథలు

## (పుస్తక పరిచయం)




"నా జుట్టుని పోషించుకోవటంలోనూ, నిర్లక్ష్యం చెయ్యటంలోనూ ఎంతమంది పెత్తనం చేశారు. ఆడదాని జుట్టు మీద ఇన్ని ఆంక్షలు, నియమాలు, పెత్తనాలు ఎందుకొచ్చాయ్. ఆడదాని జుట్టునింత గట్టిగా పట్టుకున్న సమాజం ఆడదాన్ని ఇంకెంత గట్టిగా పట్టుకుంటుంది..."

(సీత జడ)

"ఆడవాళ్ళ కళ్ళ వెంట నీళ్ళు తొందరగా రావాలిట. ...ఆడవాళ్ళకి ఊరికూరికినే ఏడుపు రావాలిట. నాకెందుకో కోపం వస్తుంది కానీ ఏడుపు రాదు. నన్ను ఊరికే తిడితే నాకు కోపం వస్తుంది."

(కళ్ళు)

"అప్పుడు నేను చిన్నపిల్లను కాదు, మనిషినీ కాదు, ప్రాణిని కూడా కాదేమో, ఒక యోనిని. అంతే. అదొక్కటే. ఒక చిన్న కంతను. ఆ కంత కావాలి అక్కడికి వచ్చేవాళ్ళకు. వాళ్ళ రోగాలు అక్కడ పూడ్చి వెళ్ళిపోతారు. నేను, నేను ఎవరు? నేను ఏమిటి? అన్నం కలిపే చెయ్ నేనా? అన్నంతినే నోరు నేనా? అన్నం చేరగానే నిండే పొట్ట నేనా? ఈ అన్నం నాకు పెట్టే ఆ యోనే నేనా?"

(అయోని)

"పెళ్ళి పిల్లల కోసమేనా? ఆడది పుట్టి పెరిగేది పిల్లల్ని కనడం కోసమేనా? మగవాడికి పిల్లల్ని కనివ్వటమేనా ఆడదాని జన్మ సాఫల్యం? ఆడదంటే ఒక గర్భసంచి, రెండు ఓవరీలేనా? .."

(ఒక రాజకీయ కథ)

"నేను కాస్త మంచాడినయ్యే సరికి నీకు ఒళ్ళూ పై తెలియడం లేదు ...నేను ఆడంగి వెధవలా యింట్లో పిల్లల పీతిగుడ్డలు మారుస్తూ వాళ్ళ ముక్కులూ, మూతులూ తుడుస్తూ కూచుంటే నువ్వు ఆఫీసులో ఉద్యోగం వెలగబెడతావా? "

(కేసు)

"మేం కన్న పిల్లలే పెరిగి మగవాళ్ళయి మా హక్కుల్ని కాలరాస్తారు. మేం కన్న పిల్లలే మగవాళ్ళయి మమ్మల్ని మనుషులే కాదంటారు. 'మీరు చెప్పిన పన్లన్నీ నోరుమూసుకు

చేసినన్నాళ్ళూ మమ్మల్ని అమ్మ అంటారు. తల్లి అంటారు. దేవత అంటారు. ఇల్లాలు అంటారు. చెల్లెలంటారు. మేం మీకు లొంగక నిలబడ్డామో? అంతే– మాకే హక్కూ లేదు.

మేం తల్లులం కాదు. ఆవులం.

మేం చెల్లెళ్ళం కాదు. గేదెలం.

మేం ఇల్లాళ్ళం కాదు. పందులం.

మేం దేవతలం కాదు. పొలాలం.

మాకే హక్కూ లేదు. మా మీద మాక్కూడా హక్కు లేదు. మేం పెళ్ళాడాలన్నా మా యిష్టం కాదు. పెళ్ళిని కాదనాలన్నా మా ఇష్టం కాదు. అంతెందుకు మా మీద సర్వహక్కులూ మీవే. మా రక్తం మీద, మా కోర్కెల మీద, మా ఆలోచనల మీద, మా మీదా – అన్నిటిమీదా, మీకే హక్కు.

మేం ఆడవాళ్ళం."

(ఆర్తి)

ఓల్గా రాజకీయ కథలు వచ్చి సుమారు 28 ఏళ్ళు. నిజానికి ఇందులోనివి అన్నీ మనం రోజూ చూసే వ్యధలే. ఈ మధ్య కాలంలో స్త్రీల మీద హింస, ఆధిపత్యం, దాడులు, అత్యాచారాలు, నిర్భంధాలు ఎందుకు మరింత పెరిగాయానే ప్రశ్నని మనం నిజాయితీగా వేసుకోగలమా?

ఏదైనా సంఘటన జరిగినప్పుడు ఆవేశపట్టం మినహా, సమానత్వాన్ని నిత్య జీవితంలో నిర్మించుకునేంత విలువా, లింగ సమానతని ఒక హక్కు గా పాటించేంత తెగువా ఇంకా వ్యవస్థకి రాలేదనడానికి సమకాలీన సమాజమొహ తిరుగులేని సంకేతం!

స్త్రీ ప్రతి అవయవం మీదా, ఆలోచన మీద, అభివ్యక్తి మీద సాగుతున్న మగపెత్తనాలని కళ్ళకు కట్టినట్లు చూపించే ప్రయత్నం ఈ కథలు చేసాయ్. సాఫ్ట్ కాపీ ఎవరివద్ద ఐనా ఉంటే పంపొచ్చు. హార్డ్ కాపీ బయట పుస్తక కేంద్రాల్లో దొరుకుతుంది. తప్పక చదవండి.

# చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి కాశీయాత్ర

## (పుస్తక పరిచయం)




"నేనీ పొత్తమును సర్వసాధారణమైన వ్యావహా రిక భాషలోనే వ్రాస్తాను. 64 వత్సర ములు నిండు వయస్సులో వ్రాస్తూ వున్న దీనిని చూచి, నన్ను "తుదకబ్బెరా తురక భాష" అని నా మిత్రులూ, శిష్యులూ లోనగు వారు కొందరు నిందింతురని నాకు తెలిసిన్నీ, నేనిట్టి భాషను సమర్థించు వారిలో చేరిన వాడను కాక యుండిన్నీ, ఇందులో వ్రాయుట కు కారణము, నాకు ఈ భాష అంటే అంతగా యిష్టం లేకపోయినా, ద్వేషం కూడా అంతగా లేదని లోకులకు తెలియజేయటమే నా ముఖ్యో ద్దేశ్యము....!"

1942 లో 80 ఏళ్ళ క్రితం మొదటిసారి, 2002 జూన్ లో 20 ఏళ్ళ క్రితం రెండోసారి ప్రచురిం చిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి (తిరుపతి వేంకట కవులు) కాశీయాత్ర పుస్తకంలోని ప్రారంభ వాక్యాలివి. 'వ్యావహారికాన్ని' తురక భాష అంటూ చిన్నచూపు చూసే పరిస్థితి ఎంత స్థాయిలో ఉందో చూపిస్తుంది. రెండో సారి అక్కిరాజు రమాపతి రావు గారి సంపాద కత్వంలో శ్రీ కందుకూరి శివానంద మూర్తి సద్గురువర్యుల ఆశీస్సులతో అంటూ, "తెలుగు వారి సాంస్కృతిక చారిత్రక సాహిత్య సదవగాహన మా ఆశయం' అని ప్రకటించుకున్న సుపథ ప్రచురణలు తరపున ప్రచురించిన 60 పేజీల ఈ చిన్న పుస్తకం తర్వాత మళ్ళీ ప్రచురించ బడిందో లేదో తెలీదు కానీ తెలుగు వారి కాశీ యాత్ర ల గురించిన సమాచారంతో రమాపతిరావు గారు దీనికి "చెళ్ళపిళ్ళవారూ - తెలుగు నాడూ" పేరిట చక్కని మున్నుడి రాసారు !

సందేహమేం లేదు. పక్కాగా సాంప్రదాయిక వాసనే, కానీ చరిత్రను అధ్యయనం చేసే వారకి ఒకనాటి ఆచార వ్యవహారాలు, నాటి సమాజ చిత్రాలు స్ఫురిస్తాయ్. మొత్తం సామాజిక గమనానికి సంబంధించిన సారమంతా అనను కానీ, నాటి వ్యవస్థను రేఖామాత్రంగా తడిమిన అనేక ఆసక్తికరమైన విషయాలు ఇందులో చూడొచ్చు. నాకు తట్టిన మరొక భావన ఏంటంటే కొద్దోగొప్పో కలిగిన అగ్రవర్ణాలు, ముఖ్యంగా బ్రాహ్మణులు కాన కాశీ యాత్ర గురించి వారికే పరిమితం అయిన అక్షరాస్యత ను ఇలా వినియో గించుకున్నారు కానీ మరి అసంఖ్యాకంగా కడుపు కోసం కష్టాన్ని మాత్రమే నమ్ముకుని సుదూర ప్రాంతాలకు వలస

పోయిన బడుగుజీవుల బతుకుల్ని అక్షరబద్ధం చేసే ప్రయత్నం అసలెన్నడైనా చరిత్ర చేసిందా ? చూడాలి!"కాశీ సత్రాల్లో భోజనము పెట్టుటయే కాక ప్రతి రోజున్నూ తాంబూలము కూడా విధిగా ఇస్తారని వినియుండుటచే కాశీ వెడదామని బలవత్తరమైన కోరిక వుదయించింది."(పేజి 4)"అప్పటికి రైలు బెజవాడ వరకూ వచ్చింది. బెజవాడ నుండి కాశీ సుమారు పద్దెన్మిది రూపాయిలు రైలు చార్జీ..." (ibid)

'ప్రయాణ ముహూర్తమే పెండ్లి ముహూర్తం' కావడం నుండి ఉందుర్రు, గణపవరం, శనివారప్పేట, నిడమర్రు, గుండుగొలను, ఏలూరు, బెజవాడ, బోనగల్లు, వత్సవాయి గ్రామం, జగ్గయ్యపేట, మక్కపేట, సికింద్రా బాద్, ధోండు, జబల్ పూర్, ప్రయాగ మీదుగా మొత్తానికి కాశీ చేరిన క్రమం ఆసక్తి గొలుపు తుంది. అక్కడితో అవదు. కాశీలో బస, భోజనం చిక్కులు, చదువు ఇంకా అనేక విషయాలు ఉన్నాయి! "

"ఒక రోజున క్రొత్త విద్యార్థులను విచారించేట ప్పుడు కృష్ణశాస్త్రి గారి ఇంటిపేరు కందుకూరి వారు అని తెలిసేటప్పటికి కందుకూరి వారు వెల్నాటి బ్రాహ్మణులని యెరిగి యుండ వలసినదే అయిననూ "వీడు పాషండుడు రోయ్" అని మొదలు పెట్టినారు. తరువాత ఎట్లో ఆయనను నమ్మించి ఆ చిక్కు వదల్చు కొన్నాము. " అంటూ బ్రాహ్మణుల్లో ఇంకి పోయిన శాఖాబేధాల కులతత్వం తాలూకు ఊసులు చెబుతూ, "కాశీని తిట్టడానికి తగిన కాలం" పేరిట తన గోడు వెళ్ళ బోసు కుంటారు !

ఇంకా, కూని రాగపు గాలి సంగీతం, వేష ధారణ ప్రయత్నం, బ్రాహ్మణార్ధపు ధన సంపాదన, భంగు పాన యోగం వంటి శీర్షిక లతో ఆసక్తికరంగా సాగే ఈ పొత్తంలో చివరికి, అలా కలకత్తా, పూరీల మీదుగా మళ్ళీ గంజాం, బర్హంపురం, గోవిందా పురం, శ్రీకూర్మం, సింహాచలం, వుప్పమాక, విజయ నగరం, తుని, పిఠాపురం, చామర్లకోట, కాకినాడ, యానము వరకూ కాశీ నుండి కావెడి యాత్ర చేసిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు వారు పాట్లూ, అగచాట్లనిలా అక్షరబద్ధం చేసారు !

చాలా గొప్ప పుస్తకం అనను కానీ తెలుగులో యాత్రా సాహిత్యం పట్ల ఆసక్తి కలిగి పర్యట నల్ని అధ్యయనం చేసే వారికి ఒకనాటి విశేషాలు అబ్బురమనిపిస్తాయి. ఇప్పుడు ఇది అందుబాటులో ఉన్నదో లేదో తెలియదు. ఏనుగు వీరాస్వామయ్య కాశీయాత్ర మొదలు కొని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి ఈ కాశీ యాత్ర ల వరకూ తెలుగులో కాశీయాత్ర చరిత్ర ల గురించి ఒక పరిశోధనాత్మక విశ్లేషణ జరిగితే బాగుంటుంది. కానీ ఆ ఆసక్తి ఉన్న వారెవరూ...?

(ఎన్నడో ప్రచురించిన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి కాశీయాత్ర పుస్తకం గురించిన రైటప్ ఇలా..)

# పిలక రాయుళ్ళు !

## (గౌరిబోయిన పోలయ్య గారి రచన)




"వేదము దేవునిచే చెప్పబడినదని ఆర్య బ్రాహ్మణులు చెప్పుదురు. ముస్లిం మత గ్రంథమగు ఖురాన్ దేవునిచే వ్రాయ బడినదని మహమ్మదీ యులందురు. క్రైస్తవ మత గ్రంథమగు బైబిలు దేవునిచే యివ్వ బడినదని క్రైస్తవులు చెప్పుదురు. సర్వజ్ఞుడు, సర్వ శక్తి వంతుడు అగు దేవుడు తన బిడ్డలకు ఒకే ధర్మ గ్రంథమును వ్రాసి యివ్వ వలయును గాని సామాన్య మానవుని వలె ముందొక గ్రంథమును వ్రాసి తదుపరి దానికి వ్యతిరేక ముగా మరొక గ్రంథమును వ్రాయుటతగునా? ఇది దేవుని పనియేనా? లేక మానవ కల్పితమా?"

"ఆసేతు హిమాచల పర్యంతము పూర్తిగా స్వాధీనము చేసికొన్న పిలకరాయుళ్ళకు శత్రు భయము పూర్తిగా తగ్గినది. అందుచే వేద కాలపు వర్ణవ్యవస్థను మార్చుచూ స్మృతులు వ్రాయ మొదలిడిరి. ఈ స్మృతులలో నాలుగు వర్ణముల వారు ఒక వర్ణము నుండి వేరొక వర్ణము లోనికి మారకుండా యుండుట కును, ధిక్కరించు మిగతా వర్ణముల శిక్షించుటకును శాసనములను నీచముగాను క్రూరముగాను సిగ్గులేక వ్రాసిపెట్టిరి."

"కులనిర్మూలన చేయనిదేయ కులకక్షలుపోవు.కులకక్షలు పోనిదే మత సామరస్యము చక్క బడదు. మత సామ రస్యము చక్క బడనిదే దేశము బాగుపడదు. కనుక మన దేశము బాగు పడవలెనంటే మనలో నున్న కులములు వాని నంటిపెట్టు కొనియున్న మూఢాచారాలు మంటగలసి పోవాలి. ఆనాడే ప్రజలందరు అన్నదమ్ములవలె మెలగుదురు. దేశము బాగుపడును."

గౌరిబోయిన పోలయ్య గారు యాభైయ్యవ దశకంలో రాసిన 'పిలక రాయుళ్ళు' ఆయన మూడో రచన. పురాణాల్లో బూతు, విమర్శ రామాయణం మొదటి రెండూ. ఆవుల గోపాల కృష్ణమూర్తి గారు ముందుమాట రాసిన 24 పుటల ఈ చిన్న పుస్తకంలో ఆచార వ్యవహారా లను ప్రశ్నించడం కనిపిస్తుంది. ఆర్య ద్రావిడ వాదాన్ని బలంగా రచయిత చెప్పిన తీరు ఆసక్తి కరంగా ఉంటుంది. అసలీ చిన్న రచనకి పెట్టిన శీర్షికే ఒక సాహసం !

"స్వరాజ్యము అక్కరలేదని నేను చెప్పను.ప్రస్తుతము మనము సంపాదించుకొన్న స్వరాజ్యము నూటికి తొంబది యేడు జనాభా కలిగిన మనము మన దేశము పై పెత్తనము చేయవలయును

గాని నూటికి ముగ్గురు గల ఆర్య బ్రాహ్మణులు మన మీద పెత్తనము చేయరాదని నా పట్టుదల..” అని స్పష్టంగా చెప్పిన పోలయ్య, “మన ప్రభుత్వంలో శ్రీయుత అంబేద్కరుగారు ‘హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ బిల్లు’ ను సవరణ చేయుచుండ తమ కొంప లెచ్చట కాలిపోవునో యనియు, తమ సనాతన ధర్మము లెచ్చోట చట్టుబండ లగునో యనియు హిందూ మతోన్మాదులు దానిని ధిక్కరించుటకై సత్యాగ్రహము జరిపించిరి..” అంటారు ! ప్రాచీన భౌతికవాద రచనలను ఇప్పటి వారికి అందించాలనే ఉద్దేశంతో ఈ చిన్న పుస్తకం పునర్ముద్రించడం జరిగిందని ప్రచురణ కర్తలైన చార్వాకా శ్రమం వారు ప్రకటించారు. ఆసక్తి ఉన్న వారికి సాఫ్ట్ కాపీ పంపుతున్నాను. ఒకనాటి కాలంలో సంఘ ర్షించిన వ్యక్తులను ఆమేరకు స్మరించుకోవడం మన ముందడుగుకి చిహ్నం. అలా పోలయ్య గారి అలనాటి ఈ రచనను మళ్ళీ పునర్ముద్రించిన చార్వాకాశ్రమం వారిని అభినందిస్తూ, ఈ చిన్న రైటప్ !

# గురజాడ జీవితంలో బౌద్ధం

## (చారిత్రాత్మక గురజాడ లేఖకు వందేళ్ళు)


మహాకవి గురజాడ
150వ జయంతి
(1862-2012)

గురజాడ జీవితంలో బౌద్ధం
(చారిత్రాత్మక గురజాడ లేఖకు వందేళ్ళు)

టి. రవిచంద్

బుద్ధపూర్ణిమ ప్రచురణ
మిళింద ప్రచురణలు
బాపట్ల
2012

మహాకవి, మహామానవుడు గురజాడ 150 జయంతిని పురస్కరించుకొని మిళింద ప్రచురణలు సంస్థ పదేళ్ళ క్రితం ప్రచురించిన ఎనిమిది పేజీల చిన్న పుస్తకం "గురజాడ జీవితంలో బౌద్ధం''. ఒంగోలుకి చెందిన ముని సుబ్రహ్మణ్యానికి గురజాడ రాసిన చారిత్రక లేఖకి వందేళ్ళ పూర్తయిన సందర్భంగా ప్రచురించిన చిన్న పొత్తమిది ! ఈ లేఖలో గురజాడ,"బౌద్ధం అణగదొక్కబడి నప్పుడు భారతదేశం మతపరంగా ఆత్మహత్య చేసుకుంది." అనే అభిప్రాయం వెల్లడించారు. చారిత్రాత్మకంగా గురజాడ వారి భావానికి ఉన్న విశిష్టతను మిత్రులు టి. రవిచంద్ విశ్లేషిస్తూ ఈ కరపత్రంలో వివరిస్తారు. గురజాడ రాసిన ఈ లేఖను మానవ ప్రణాళిక (Humanist Manifesto) గా మనం పరిగణించాలంటారు !

కలకత్తా పాలిటెక్ట్స్ సొసైటీకి చెందిన బెంగాలీ బౌద్ధ పండితుడు, పాళీ భాషావేత్త, నేపాల్ లోఎంతో పరిశోధన చేసి బౌద్ధ వ్మాయాన్ని వెలికితీసిన పండిట్ హరిప్రసాద్ శాస్త్రితో ఉన్న సన్నిహిత సంబంధాలు మొదలుకొని, కళింగ దేశ చరిత్రలో బౌద్ధం పాత్రను వెలికితీయటం కోసం స్వయంగా గురజాడ చేసిన కృషి కూడా బౌద్ధం పట్ల ఆయన ఆసక్తికి సంకేతాలే ! "సజీవమైన విశ్వాసంగా బుద్ధుడు ఉపదేశిం చినది నిజమైన ప్రేమ, మానవుని పట్ల ప్రేమ." అని ఇదే లేఖలో గురజాడ పేర్కొన్న పదాల లోతు బౌద్ధాన్ని ఆయన అధ్యయనం చేసిన తీరుకి నిదర్శనం. బౌద్ధ తాత్వికతని మానవీయ దృక్పథంతో పరిశీలించినపుడు మాత్రమే ఈ రకమయిన భావ వ్యక్తీకరణ సాధ్యమని నా అభిప్రాయం !

తెలుగు జాతి సారస్వత చరిత్రలో అత్యంత విశిష్టమైన స్థానం గురజాడది. అలాంటి గురజాడ బౌద్ధం గురించి వ్యక్తపరిచిన భావాల పై తెలుగు సమాజంలో ఈనాటి వరకూ చర్చ జరగలేదు. ఆసక్తి ఉన్న వారి కోసం ఈ పుస్తకం స్కాన్డ్ కాపీ ఇలా పంపుతున్నాను. ఆలోచనా పరులు అంతా తప్పక చదివి అర్థం చేసుకుని, చర్చించి తీరాల్సిన విషయమిది !

# కుసుమ ధర్మన్న - మద్యపాన నిషేధం!

## (తొలి దళిత కవి విరచిత విశేష రచన)




"మద్యము ప్రకృతిలోనుండు పదార్థము కాదు. అది కుళ్ళి పోయిన పదార్థములో నుండి వచ్చును. మద్యము చాలా తీవ్రమైన విషము. పరి శుభ్రమైన సారాయి తక్షణము మనుష్యుని జంపును. ఏలుగు పామును గానీ, చేపను గాని నూటికొక పాలు సారాయి యున్న నీటిలోవేసిన చని పోవును"(పేజి 13)

"మద్యపానము ప్రాణప్రదము లగు మెదడు, కడుపు, ఊపిరి తిత్తులు, కండరములు, గుండె మొదలగుముఖ్యావయ ములను జెరుపును. అనేక ఘోర వ్యాధుల పాలు జేయును. రోగము అడ్డు పెట్టగల శరీరశక్తిని మద్యము పాడు చేయును. మద్య పానము వలన పక్ష పాతము, అన్నకోశము, కార్జము, మూత్ర జనితములు, ఉబ్బుట, క్షయ, ఉబ్బసము, న్యూమోనియా, పిచ్చితనము, రక్తనాళములు జబ్బుపడుట, ద్వండము, కలరా, బొబ్బ, జిగట విరోచనములు మొదలగు రోగములు తెచ్చిపెట్టును.."

(పేజి 14)

"ఒక్కడోసుతో చిలుకపలుకలు, రెండవదానితో గోరింక కేరింత లు, మూడవదానితో కొంగ జపము,నాలుగవ దానితో ఆంజనేయ కుప్పిగంతులు, అనగా (కోతిచేష్టలు),ఐదవ దానితో రావణ బ్రహ్మ ప్రతాపములు, ఆరవదానితో దానకర్ణుడు, ఏడవదానితో కుంభకర్ణుడు. మద్యపానము చేయువాడీ యేడవ తారములు అవతరించుట తప్పదు." (పేజి 14) "త్రాగుడు యిల్లూ,వళ్ళును గుల్లచేయును. సంసారము లను నేలగూల్చును. కూటికి గుడ్డకి దూరము చేయును. భార్యా పిల్లలను గొల్లు మనిపించును. అప్పులపాలు జేయును. పరపతి పాడుజేయును. పరువుప్రతిష్టలను భంగ పరుచును. ఆలి మెడలో పుస్తెల మ్మించును. త్రాగుడు పార్టీలు పుట్టించును. స్నేహి తుల నెడబాపును. కోర్టు గుమ్మ మెక్కించును. కారాగృహ వాసమునకు నడిపించును. ఉరిశిక్షలకు దారితీయును. త్రాగుడు రంకు, బొంకులకు రాచబాట. కన్నము,కలహములకు కన్నతల్లి. కూనీలకు కులదేవత.పాపములకు పుచ్చపాదు. చేతబడులకు, భూతప్రేత పిశాచములకు హుషారు. అమ్మవారి కొలువులకు భలే జోరు.". (పేజి 15)

"త్రాగుడుముందు – చల్ల, పెరుగు, పాలు, నేయి సాటిరావా? ఇవి దేహారోగ్య మును

రక్షింప జాలవా? చీములు, జెర్రెలు, తేళ్ళు, ఈగలు, దోమలు, బల్లులు, తొండలు, ఎలుకలు, పాములు, యెన్నో పురుగులు పడి చచ్చి కుళ్ళిపోయిన కల్లును త్రాగుటకు నీకళ్ళు, నీ ముక్కు, నాలుక యెట్లు సహించుచు న్నవో తెలియదు. నీ కళ్ళు చూచి సహించలేక పోయినను, నీ ముక్కు ఆ వాసన భరించక పోయినను, నీ నాలుక దానిని రుచింపక పోయినను మనస్సును ఒప్పించి ఈ విషము నీవు మ్రింగి మిడుకు చున్నావు..” (పేజి 15)
“మాకొద్దీ నల్లదొరతనం” అనే సంచలన గేయం ద్వారా పాలకుల ఆధిపత్యాన్ని నిరసించిన తొలితెలుగు దళిత కవీ,సంఘసంస్కర్త, అభ్యుదయ రచయిత కుసుమ ధర్మన్న గారు తూ.గో.జిల్లా ‘మద్యపాన నిషేద సంఘము’ వారి పోటీ పరీక్ష కోసం చేసిన ఈ రచనకి ప్రథమ బహు మానం దక్కి, బంగారు పతకం వచ్చిందనీ ఆలమూరు కి చెందిన నరసింహ దేవర సత్య నారాయణ ముందు మాటలో పేర్కొన్నారు. ప్రత్యక్షంగా సమాజంలో మద్యం బారిన పడి నాశనం అవుతున్న వ్యక్తుల్ని చూస్తే కానీ ఇంతటి ఆవేదనతో కూడిన రచన సాధ్యం కాదు.

కొన్ని భిన్న భావాలున్నప్పటికీ మద్యపాన వ్యసనం కోసం  కుసుమ ధర్మన్న వంటి ప్రజాకవి రాసిన ఈ కరపత్రానికి కచ్చితంగా చారిత్రక ప్రాధాన్యత ఉంది. ఏడేళ్ళ క్రితం ప్రజాశక్తి బుక్ హౌస్ ప్రచురించిన ఈ పొత్తం మద్యపాన ప్రచారోద్య మానికో దిక్సూచి . ఆసక్తి ఉన్న మిత్రుల కోసం ఈ స్కాన్డ్ కాపీ పంపుతున్నాను.ప్రచురణకర్తల మాట, వి. బాలసుబ్రహ్మణ్యం గారి ముందుమాట ఈ స్కాన్డ్ కాపీలో లేవు. తెలుగు నేల మీద తొలి అంబేదర్కరిస్టుగా కుసుమ ధర్మన్న మద్యపాన నిషేధం కోసం వ్యక్తపరిచిన భావాల పై ప్రస్తుత పరిస్థితుల నేపథ్యంలో ఆలోచనాపరులంతా పూనుకుని చర్చించాల్సిన అవసరం ఉంది.

# పెరియార్ ఇవి రామస్వామి స్ఫూర్తితో

## డా.జయగోపాల్ ఆలోచనాత్మక రచన

## కులనిర్మూలన - భారత రాజ్యాంగం




సరిగ్గా 30 ఏళ్ళ క్రితం కీ. శే. జయగోపాల్ ఆంగ్లంలో చేసిన Annihilation Of Caste : Indian Constitution అనే రచనకి డా. మలయశ్రీ నవ్యసాహిత్య పరిషత్ తరపున ప్రచురించిన తెలుగనువాదమే "కుల నిర్మూలన - భారత రాజ్యాంగం" అనే ఈ చిన్న పుస్తకం. 17 వ రాజ్యాంగ సవరణ లక్ష్యంగా కులాన్ని నిషేధించాలంటూ 1973 లో 50 ఏళ్ళ క్రితం పెరియార్ రామస్వామి సభాముఖంగా పెద్ద ఎత్తున చేసిన ఉద్యమ డిమాండ్‌కు స్పందించి, దానికి మద్దతుగా విశాఖపట్నంలో 'భారత నాస్తిక సమాజం' ఆద్వర్యంలో 1980 లో 'అఖిలభారత కులనిర్మూలన మహాసభ' నిర్వహించడం జరిగింది. అలాంటి మేధో చర్చల ఫలితంగా ఏర్పడిన డిమాండ్ ఇది !

నవ్యసాహిత్య పరిషత్ వ్యవస్థాపకులు, భౌతికవాది పత్రిక సంపాదకులు డా. మలయశ్రీ తెలుగు చేసిన ఈ పుస్తకానికి స్వేచ్ఛాలోచన సంపాదకులు, మానవ వికాస వేదిక నేత బి. సాంబశివరావు, మిళింద ప్రచురణల నుండి టి. రవిచంద్ విశ్లేషణాత్మక మున్నుడులు రాసారు.కరీంనగర్ కళా భారతి లో వంగ పండుకు సాహితీ పుర స్కారాన్ని అందజేసిన సందర్భంలో దీనిని మిత్రుడు జీడి సారయ్య ఆవిష్కరించినట్టు ఇందులో ఉంది. డా. జయగోపాల్ ఈమధ్యే మరణిం చారు. అలాగే, రాజ్యాంగం గురించిన అనేక సంవాదాలు మళ్ళీ చర్చకు వస్తున్న సమయంలో ఈ అంశం మీద బుద్దిజీవులు దృష్టి సారించాలని నా భావన !

కులనిర్మూలనకు అనుసరించాల్సిన మార్గాల పట్ల ఎవరికైనా ఎన్నైనా భిన్నాభిప్రాయాలు ఉండవచ్చును కానీ 'కులనిర్మూలన' ఉమ్మడి మానవ లక్ష్యం కావాలి. ఆధునిక యుగంలో నాగరిక మానవుడు అంతమొందించాల్సిన అమానవీయ అంశాల్లో మొట్టమొదటిది కుల వ్యవస్థ. అందుకు పాటించాల్సిన విధానాల్ని సమిష్టిగా నిర్ణయించుకుందుకు ముందడుగు వేయడమే నేటి మానవోద్య మాల ధ్యేయం అవాలి. అందులో భాగంగా పెరియార్ ఇవి. రామస్వామి 50 ఏళ్ళ క్రితం మొదలెట్టిన ఈ ఉద్యమ డిమాండ్‌ని తెలుగు బుద్ధిజీవుల

ముందు పెట్టి కూడా 40 ఏళ్ళు అవుతోంది. ఆ సందర్భంగా కుల నిర్మూలన కోసం ముందు కొచ్చే యువతరానికి ఆహ్వానం పలుకుతూ పెద్దలు జయగోపాల్‌కి నివాళిగా ఈ రైటప్ !

(కాలక్షేపం కోసం కాకుండా కాస్త సీరియస్నెస్ ఉన్న వారు నా వాట్సప్ నంబర్ 90320 94492 కి రిక్వెస్ట్ పెడితే ఈ పుస్తకం స్కాన్డ్ కాపీ పంప గలను. 1995 లో పంజాబ్‌లో జరిగిన మానవ తావాద రచయితల సంఘం వార్షిక సంచికలో మొదట ప్రచురించబడిన ఈ చిన్న వ్యాసం "కులనిర్మూలనను కోరుకుం టున్న మేధావులు, ప్రజా ఉద్యమ కారులు, దళిత సంఘాల ఎదుట రాజ్యాంగ సవరణను చేపట్ట వలసిన అవస రాన్ని విన్నవించు కున్నాను. ఈ ఆలోచన నాది కాదు. కులనిర్మూలనా మహెూద్యమకారుడైన పెరియార్ ఇవి రామస్వామి గారి పోరాట ఫలమిది. సామాజిక న్యాయం సాధనలో కులనిర్మూలన లక్ష్యంగా ఉండాలని మనం ఉద్యమించాలి" అన్న జయగోపాల్, 'సామాజిక రోగలక్షణం కాబట్టి కులనిర్మూలన లక్ష్యంగా కుండా అంటరానితనం నిర్మూలన హేతుబద్ధం కాదు.' అంటారు. చదివాక అభిప్రాయాలు, విమర్శలకు ఆహ్వానం !)

– గౌరవ్

# మేల్కొలిపే కళారూప నినాదాలు

## యాసలపు జనపదాలు !

## (కామ్రేడ్ యాసలపు సూర్యారావు స్మృతిలో)




"...వీరిలో ఏ ఒక్కరూ ఏ సంగీత విద్వాంసుని వద్ద రాగతాళ పద్ధతులు నేర్చుకున్నవారు కారు. తరతరాల నుండి వీరు చదువుకోలేదు. ఆర్థికంగా, సామాజికంగా అణిచివేయ బడినా, నిరక్షరాస్యులైనా, కళ పట్ల విశ్వాసంతో ఇన్ని తరాల నుండి ఆ కళను బతికించుకు రావ డానికి వీరికి ఉన్న నైపుణ్యానికి అంతగా పేరు పొందక పోవడానికి అత్యంత ప్రధాన కారణం వీరు దళితులు కావడమే ! కళా కారులకు, కళకు కూడా కులవివక్ష తప్పడం లేదు అనేది వీరిని చూస్తే అర్థమవుతుంది. ఇదే కళను ఎవరైనా అగ్రకులాల్లో అభ్యసించి ఉంటే ఇంత నిరాదరణకు గురై ఉండేది కాదేమో !". (పేజి నెం : 10)

జముకు కథకుల వ్యథల కథ వ్యాసంలో కీ.శే. యాసలపు సూర్యారావుగారు వెలిబుచ్చిన విలువైన అభిప్రాయం ఇది. " జానపద కళ జాతి జీవనాడి. అది పుట్టింది, పెరిగింది పల్లెతల్లి గుండెల్లోని శ్రమజీవుల జీవన వేదం నుంచి. ప్రాచీనకాలం నుండి ఆ వరవడినే కొనసాగిస్తూ ఉన్నాయి. శ్రమజీవుల దైనందిన పోరాటంలో ఆయాసాన్ని మర్చిపోయేందుకు దోహద పడుతున్నాయి. వాటిలో ఎన్నో రకాల కళలు మరెన్నో రీతుల్లో చక్కగా జనంలో ఒక సుస్థిర స్థానాన్ని సంపాదించు కున్నాయ్. ఆదరించేవారు కరవై అనేకం కాలగర్భంలో కలిసిపోయాయి. "(పేజి నెం:12) అంటారు !

గరగ నృత్యం, జముకుల కథ, పంబలాట పగటివేషాలు, పల్లె సుద్దులు, థింసా నృత్యం, వీరనాట్యం, సాముగారడీ, గంగిరెద్దులాట, పులివేషం, రుంజకళ, కోల సంబరం, దొమ్మర మేళం, తోలుబొమ్మ లాట, తప్పెట గుళ్ళు, గడసానాని ఆట, మాస్టిన్లు ..మొదలైన జానపద కళా రూపాల కోసం లోతుగా అధ్యయనం చేసి పరిశోధించి సులువైన పదాలతో సామాన్యుల కోసం జనగానం పత్రికలో రాసిన వ్యాసాలివి. యాసలపు సూర్యారావు గారి ప్రథమ వర్ధంతి సందర్భం గా సాహితీ స్రవంతి, ప్రజానాట్య మండలి పెద్దాపురంశాఖ సరిగ్గా పదేళ్ళక్రితం జూన్, 2013 లో వెలువరించిన ఈ పుస్తకం

సంస్కృతినీ, ముఖ్యంగా జానపద కళా రూపాల్ని అధ్యయనం చేసేవారికి గొప్ప సాధనం !

"..చాలామందిని మనం జాతర్ల గురించి కదిపితే అదంతా అనాగరికులు జరిపేవని, వీరు చాలా అజ్ఞానులు అనే విధంగా మాట్లాడటం మనం చూస్తాం. వీరు జాతర్లలోని ప్రజలను, వారిలోని ఆప్యాయత, అనురాగాలను,వారు ఎంతగా ప్రేమిస్తున్నారో నాగరికులం అని చెప్పుకునేవారు గ్రహించరు. ఇప్పటికీ మనం జాతరలను సందర్శించి నపుడు అక్కడ గ్రామీణ ప్రజలువాడే అచ్చమైన తెలుగు భాషకు చెందిన గొప్పతనం, భాషలోని భావం, ప్రకృతి సౌందర్యాన్ని పులకింపజేసే సహజ సౌందర్యాన్ని ఆ ప్రజల మధ్య అరమరికలు లేని పలకరింపులను మనం చూస్తాం. ప్రాంతాలవారీగా వినసొంపుగా ఉండే తెలుగు మాండలికాల మాధుర్యం చెప్పనలవి కాదు." (పేజి నెం : 33)

యాసలపు సూర్యారావు గారు సామాన్య సైకిల్ మెకానిక్కై కూడా  పెద్దాపురం పట్టణంలోనే కాదు, చుట్టు ప్రక్కల గ్రామాల్లో కూడా అసామాన్యమైన సాంస్కృతికోద్యమ కృషి చేసిన కమ్యూనిస్టు. రాష్ట్రంలో నలుచెరుగులా మరుగునపడిన అనేక కళారూపాల గురించి, దీనస్థితిలోనున్న ఆయా కళాకారుల కుటుంబాల గురించి ఎంతో శోధించి వివరాలు నమోదు చేసిన క్రియాశీలక కళాకారుడు, సుమారు పది పుస్తకాలు రాసిన ప్రజా రచయిత. అందుకే, "భారత దేశ కళా సంస్కృతులకు ప్రతిబింబాలు మన జానపద కళారూపాలు. దేశంలో ఏ రాష్ట్రమైనా, ఏ ప్రాంతమైనా అక్కడ ప్రజల సమైక్య జీవన సౌందర్యం నుండి ఉద్భవించినవే జానపద కళారూపాలు. కష్టజీవుల సమస్త మానవ అవసరాలైన వస్తువుల ఉత్పత్తిలో,  నిరంతర జీవన సంఘర్షణలో అలుపును మర్చిపోవడం కోసం అలవోకగా, ఆశువుగా వాడిన మాటలు పాటలై, పాటలు కళారూపాలై రూపు కట్టుకున్నాయి.." ( పేజి నెం : 34) అంటాడు !

"ఆయన చనిపోయినప్పుడు ఆయన సంస్మరణ సభకు రాజకీయ బేధాలతో సంబంధం లేకుండా ఓ మంచి మనిషితో తమకున్న జ్ఞాపకాలను కలబోసుకున్న క్షణాలు..మోయవల్సి వస్తే మన గుండె తట్టుకోలేదు. ఏకవాక్యంగా 'సూర్యారావు గురించి బాధాతప్త హృదయంతో పెద్దాపురం ఊరు ఊరంతా కన్నీటిని స్రవించింది.' అంటే, అది నిష్కల్మషంగా పార్టీలో తన గమనానికి నిలువెత్తు సంకేతం. వామపక్ష ఉద్యమం, కమ్యూనిస్టు సిద్ధాంతం ఒక రకంగా కొంత వెనుక పట్టు పట్టిన ప్రపంచీకరణ విష కాలంలో తుషార బిందువులాగా యాసలపు సూర్యారావు శాశ్వతంగా నిలిచి ఉంటారు. మనిషి పుట్టడం, చావడం జీవశాస్త్ర పరిభాషలో పెద్ద విలువైె నవేమీ కావు. ఆ రెండింటి మధ్య ఎలా జీవించాము ? ఎందరి జీవితాలను ప్రభావితం చేశాము? ఎందరి జ్ఞాపకాల్లో చిరస్థాయిగా నిలిచి ఉన్నామన్నది మాత్రమే ఒక మనిషికి సంబంధించిన కొలమానాలు. ఈ కొలతల్లో సూర్యారావు ఎర్రజెండా అంత గొప్పవాడు.." అన్న జనగానం పత్రిక సంపాదకుని మాట అక్షరాలా నిజమని ఈ

పుస్తకం పూర్తిగా చదివాక అనిపిస్తుంది !

(నలభై పేజీల ఈ చిన్న పుస్తకాన్ని పరిచయం చేయడానికి ఈ అక్షరాలు సరి పోవచ్చేమో కాని నలుదిశలా వ్యాపించాల్సిన సూర్యారావు గారి ఆదర్శ జీవన విధానాన్ని నేటి యువతరాల దరికి చేర్చడానికి ఎన్ని యత్నాలు కావాలో. జీవించి ఉన్నప్పుడు కూడా ఆయనతో నాకు వ్యక్తిగత పరిచయం లేదు. "సంస్కృతి:సంక్షోభాలు - సంవాదాలు" గ్రంథం సంకలనం చేసినప్పుడు మాత్రం ఆయన నిబద్ధతకీ, కృషికీ అబ్బుర పడ్డాను.అందుకే ఆ సంకలనం లో సూర్యారావు గారి వ్యాసం తీసుకున్నాం. నమ్మిన ఆదర్శానికి కట్టుబడిన ఆయన జీవనయానానికి నా వంతు నివాళిగా త్వరలోనే సూర్యారావు గారి సమగ్ర రచనల్ని ప్రచురించి, ఈనాటి తరాలకి అందించాల్సిన బాధ్యత మనందరి మీదా ఉందని గుర్తు చేస్తూ, ఈ నెల 22 ఆయన వర్ధంతి సందర్భంగా చిన్న రైటప్.)

# బౌద్ధం అంటే ఏమిటి ?




"బుద్ధిమయం అయింది బౌద్ధం.
బుద్ధి అంటే మేల్కొని వున్నదనిబీ
బుద్ధుడు అంటే మేల్కొని వున్న వ్యక్తి అని.
కనుక బౌద్ధం అంటే అప్రమత్తత అని.
నిద్రించక మేల్కొని వుండటం అంటే కళ్ళు మూయబడక తెరవబడి వుండడమే కాదు, తెరిచి వున్నట్లు వ్యక్తి గ్రహించి వుండాలి. కళ్ళు తెరిచి వున్నా తెరిచి వున్నట్లు గ్రహించ లేనపుడు ఆ వ్యక్తి మేల్కొని ఉన్నట్లు కాదు.
అందువల్ల కళ్ళు తెరచి మేల్కొని వున్న వాళ్ళంతా బుద్ధులు కారు." డా. సంజీవదేవ్

డా. బి. ఆర్. అంబేద్కర్ ను అమితంగా ప్రభావితం చేసిన ఆంధ్రుడు, హేతువాది, బౌద్ధ తాత్వికుడు ప్రొఫెసర్ పోకల లక్ష్మీనరసు నూటారు సంవత్సరాల క్రితం రచన %ఔష్ట్రఫ్ అం దీబసఎస్త్రఅంఎ% ? గ్రంథానికి ప్రముఖ మార్క్సిస్టు మేధావి, చరిత్రకారులు కీ.శే. ఏటుకూరి బలరామమూర్తి గారి అనువాదం "బౌద్ధం అంటే ఏమిటి ?" రవిచంద్ గారి మిళింద ప్రచురణగా పాతికేళ్ళ క్రితం 1996 లో తెలుగులో వచ్చింది!
ఏటుకూరి బలరామమూర్తి గారి చివరి అనువాదం ఇది. ఎంతో హృద్యంగా సాగుతుంది. బౌద్ధం గురించిన విలువైన విశ్లేషణ తో పాటు మానవీయ మార్గంగా మానవాళికి బౌద్ధం చూపిన దార్శనికత గురించిన వివరణాత్మక సంవాదం కూడా ఇందులో కనిపిస్తుంది.
ఈ తెలుగు తర్జుమా కి సంజీవ్ దేవ్ రాసిన అద్భుతమైన ముందుమాట "బౌద్ధం అంటే?" లోనివే పై ప్రారంభ వాక్యాలు! "జ్ఞాన సంపాదనకు మానవ మేధస్సు చాలుననీ, అదే సరైన సాధన అని బౌద్ధం విశ్వాసం. మతం అనే సాంప్రదాయాన్ని కొనసాగించడం, ఒక ప్రత్యేక సౌకర్యంగా, హక్కుగా బౌద్ధం భావించదు. జ్ఞాన సేకరణకు సాంప్రదాయం సృష్టించిన భావచిత్రాలు తప్పనిసరి అని భావించడం మానుకోవాలి. ప్రతి వ్యక్తి తనకు తెలిసిన దాని కంటే ఉన్నతమైన జ్ఞానాన్ని పొందే అవకాశం కల్పించాలి. కనుక బౌద్ధం ప్రారంభం నుండి కూడా ప్రచారక మతం." పేజి – 82
ఆధిపత్య మతాల స్థానే ప్రత్యామ్నాయ సాంస్కృతిక ప్రచారక మతాలు మొదటి నుండి భారతదేశంలో అత్యంత ప్రభావశీలంగా వెలుగొందుతూనే వచ్చాయి. అటువంటి శ్రమణక

మతాల సారమే బౌద్ధ జైనాలు. అందుకే అవి ప్రజానీకంలో అంతగా ఆదరణ పొందాయి. ఆధిపత్యానికి వ్యతిరేకంగా ఆలోచనకి ప్రాధాన్యత ఇవ్వడం ఈ మతాల్లో మనకి కనిపిస్తుంది. అందుకే,"మొదటి నుండి బౌద్ధిక వికాసమే బౌద్ధానికి జీవగర్ర. కనుక శాస్త్ర విజ్ఞానానికి, ఆధునిక పరిశోధనా ఫలితాలకు విరుద్ధమైనదేదీ బౌద్ధంలో లేదు. అజ్ఞాత సత్యం కొరకు ఓపికగా నిష్పక్షపాతంగా అన్వేషణ చేయడమే బౌద్ధం లక్ష్యం. బోధి అని బౌద్ధులు దేనినైతే పిలుస్తు- న్నారో అది నిష్పాక్షిక సత్యాన్వేషణే..." అంటారు పి. ఎల్. లక్ష్మీ నరసు ఇందులో! బౌద్ధం అంటే ఏమిటి? అనే ఈ అనువాద గ్రంథం ద్వారా లక్ష్మీ నరసు తెలుగు వారనే విషయంతో పాటు డా. బి. ఆర్. అంబేద్కర్ ని ఆయన ప్రభావితం చేసారనే రవిచంద్ గారి పరిశోధన వివరాలు తెల్సుకుని గగుర్పాటుకి లోనౌతాం. అంతేకాదు, అంబేద్కర్ బౌద్ధాభిమానానికే కాక, ఆయన కుల నిర్మూలన పై కూడా లక్ష్మీ నరసు 'స్టడీ ఆన్ క్యాస్ట్ ' పుస్తకం ప్రభావం ఉన్నట్లు తెలుస్తుంది. సరిగ్గా వందేళ్ళ క్రితం 1922 లో వచ్చిన స్టడీ ఆన్ క్యాస్ట్ ఇప్పటికైనా తెలుగులో వస్తుందని ఆశిద్దాం!

ఇవన్నీ ఒకెత్తయితే కమ్యూ నిస్టు మేధావైన ఏటుకూరి బలరామమూర్తి గారు అత్యంత సరళంగా ఎప్పటి కప్పుడు ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా ప్రచురణ కర్త కి అందుబాటులో ఉ ంటూ, బౌద్ధం పై అమితా భిమానంతో చివరి రోజుల్లో ఆరోగ్యం సహకరిం చకున్నా ఈ అనువాదం పూర్తి చేసి చనిపోయే రెండ్రోజుల ముందు ముద్రణకి పంపడమనే సంగతి చదివిన మనకి కళ్ళు చెమర్చక మానవు. చివరి దశలో ఆయన మొదలుపెట్టిన బౌద్ధం పై స్వతంత్ర గ్రంథం ఆ మేరకైనా బయటకొస్తే బాగుంటుంది!

ఈ పుస్తకం ప్రచురించిన తరువాత మిసిమి పత్రికలో జరిగిన చర్చను సైతం జిరాక్స్ ప్రతిగా సరిగ్గా పదేళ్ళ క్రితం రవిచంద్ గారు పంపగా ఎంతో ఆసక్తిగా చదివేసాను. అప్పటి నుండి ఎక్కడో పోయింద నుకున్న ఆ నకలు ప్రతి మొన్న పుస్తకాలు సర్దుతుంటే కనబ డింది. ప్రతి ఒక్కరు తప్ప కుండా చద వాల్సిన పుస్తకం ఇదని నా అభిప్రాయం!

అప్పట్లో పునర్ముద్రణ కోసం మిత్రుల ద్వారా ప్రయత్నించగా ఏవో అవాంతరాల వలన కాలేదు. క్వాలిటీ గల సాఫ్ట్ కాపీ కూడా లేదు. మిత్రుల సహకా రంతో నా దగ్గర ఉన్న జిరాక్స్ ప్రతినే స్కాన్ చేసాను. అంత స్పష్టంగా లేదు కానీ మరీ అస్పష్టంగా కూడా లేదు. కావాలన్న ఔత్సాహికుల కోసం ఈ స్కాన్డ్ కాపీ పంపుతున్నాను !

( 25 ఏళ్ళ క్రితం వచ్చిన ఈ అర్థవంతమైన గ్రంథం చాలా కాలంగా తెలుగులో అందుబాటులో లేదు. కాన, ఆలోచనా పరులకు అందించాలనే తపనతో చాన్నాళ్ళకి దొరికిన ఈ పుస్తకం పై ఈ చిన్న రైటప్.)

# కశ్మీర్ విముక్తి కాంక్షకు పర్యాయపదం!

## మక్బూల్ భట్ (ఒక విప్లవకారుడి సంక్షిప్త పరిచయం)

కశ్మీర్ విముక్తి కాంక్షకు పర్యాయపదమే
మక్బూల్ భట్
రమాసుందరి



"నేను బానిసత్వానికి, కేప్టిలిజా నికి, దోపిడీకి, క్రూరత్వానికి, కపటత్వానికి వ్యతిరేకంగా పోరాడిన మాట నిజమే. సామ్రాజ్యవాద బిడ్డ లైన పాకిస్తాన్ పాలకులు దానిని కుట్ర అంటే స్వీకరించ డానికి నాకు ఎలాంటి వెనక డుగూ లేదు. ఇలాంటి కేసులు మాకు కొత్తేమీ కాదు. దోపిడీని, బానిస త్వాన్ని ప్రశ్నిస్తే దానిని కుట్ర అనటం మామూలే. అయితే, నిజానికి, అబద్దానికి మధ్య జరిగే యుద్ధంలో పీడితులదే విజయం అని చరిత్ర రుజువు చేసింది. ఈ అణిచివేతను సమూలంగా నాశనం చేసేది మేమే. నా జీవితంలో అన్ని సందర్భాలలో ప్రజా ఉద్య మాలకు మద్దతు ఇవ్వడమే కాదు, వాటిల్లో నేనూ పాల్గొ న్నాను. చరిత్ర కొక్కదానికే విప్లవాల మీద తీర్పు చెప్పే హక్కు ఉంది..."

మక్బూల్ భట్, భారత్ – పాకి స్తాన్‌ల మధ్య తన మాతృ భూమి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం జీవితాంతం అవిశ్రాం తంగా పోరాడిన వ్యక్తి. ఎనభై ఆరేళ్ళ క్రితం పుట్టి పెరిగిన కాశ్మీర్ కోసం చేయని నేరానికి నలభై ఏళ్ళ క్రితం భారత్‌లో ఉరితీయబడ్డ ఉద్యమ కారుడు. ఆజాద్ కాశ్మీర్ నినాదాన్ని ప్రాణాలకు తెగించి ప్రపంచానికి చాటిన విప్లవ యోధుడు. సామ్రాజ్యవాదపు ఎత్తుగడల్ని, కుతంత్రాల్ని దగ్గర గా చూసి, అర్థం చేసుకుని సొంత భూభాగం మీద శాంతి కోసం అడుగడుగునా ధిక్కా రాన్ని ప్రకటించినవాడు. చని పోయి 38 ఏళ్ళు అవుతున్నా కూడా ఇంకా పార్థివ దేహంగా కూడా స్వగ్రా మానికి చేరుకోని మృత సైనికుడు . అన్నిటికంటే ముఖ్యంగా, తన ప్రజల ప్రజా తంత్ర ఆకాంక్షల్ని వ్యక్తీకరించిన నాయకుడు !

ఆ ఆకాంక్షలతోనూ, అవి వ్యక్తమయిన విధానంపట్లా ఎవరికైనా సవాలక్ష భిన్నాభిప్రా యాలు, అభ్యంతరాలు ఉండ వచ్చు. కానీ, అసల లాంటి అభిప్రాయాలను కలిగి ఉండ టమే నేరంగానూ,దేశ ద్రోహం గానూ చిత్రించ బడేచోట ప్రజాస్వామిక విలువలకు కనీసంగానైనా చోటుంటుందా అనే ప్రశ్నే ఈరోజు మన ముందు ఉన్న పెద్ద సవాలు. తెలుగు సమాజంలోని భావో ద్యమ రంగంలో తనకున్న పరిమితుల్లోనే బలంగా పని చేస్తున్న ప్రగతి శీల రచయిత్రి రమా సుందరి గారు రాసిన చిన్న పరిచయ పుస్తకం అలాంటి ఒక ప్రజాతంత్ర 'చోటు' కోసం, ప్రజల ఆకాంక్షల మేరకు లౌకిక స్వరాలన్నీ కూడగట్టాల్సిన మద్దతు కోసం

జరిగే ప్రయత్నంలో భాగమేనని గుర్తించాల్సి ఉంది. ఎందుకనేది పుస్తకం ముగింపులో అన్నట్లుగా,"కశ్మీర్‌లో భారత, పాకిస్తాన్ వర్గాలు ఎన్ని కుట్రలు చేసినా, భారత ప్రభుత్వం ఎన్ని లక్షల సైన్యాన్ని దించినా, ఎన్ని లక్షల మందిని చంపినా, ఇప్పటికీ కశ్మీరీలు తలవంచకుండా పోరాటాలు చేస్తున్నారంటే, వారు తీసుకున్న స్ఫూర్తి మక్బూల్ భట్ నుండి అంది నదే. ప్రపంచ జాతీయ విముక్తి నాయకుల సరసన మక్బూల్ భట్‌ను నిలబెట్టుకోలేక పోవ డానికి కారణం, కశ్మీర్ స్వాతం త్ర్యం పట్ల ఇరుదేశాలకు ఇష్టం లేకపోవడమే..కశ్మీరీలు తమ మాతృ భూమి విముక్తి కోసం ఆయుధం పట్టుకుని తీవ్ర వాదులని అనిపించుకున్నారు. తమ పై సైన్యం చేస్తున్న అఘాయిత్యాలను ప్రతిఘటిం చడానికి రాళ్ళు పట్టుకుని టెర్రరిస్టుల ముద్ర వేయించు కున్నారు. పెల్లెట్లను, బుల్లెట్లను ఖాతరు చేయకుండా వారు సాగించిన నిరంతర సంగ్రామం దేశద్రోహ చర్యగా భారత ప్రజలకు మన మీడియా ద్వారా పరిచయం అయ్యిం ది.ప్రపంచ వ్యాప్తంగా పొంగి పొర్లుతున్న ఇస్లామో ఫోబియా కూడా కశ్మీరీల పోరాటం పట్ల ప్రజల్లో సరైన స్పందన రాకుం డా చేస్తోంది. కశ్మీరీలు ముస్లిం లు అవడం యాదృచ్ఛికమనే జ్ఞానం చాలా తక్కువ మందికి ఉంది. ముస్లిం లు అవటం వలన వారి పోరాటానికి ధర్మబద్ధత లేదని అనడం ఎంత అసంబద్ధమో, కశ్మీరీలు ముస్లింలు అవటం వలన ఆ పోరాటం చేస్తున్న వాళ్ళు తీవ్రవాదులు అనటం కూడా అంతే అభ్యంతరకర విషయం. "

("స్వప్నాలు ఫలించాలంటే/ పంజరాలు అదృశ్యమవ్వాలి/మంచు కాకుండా పర్వతాలు కరిగితేనే/మనకలలు సాఫల్యం అవుతాయ్." అనే మక్బూల్ పాటతో ప్రారంభమై, ఇరవై పుటల్లో మక్బూల్ భట్‌నూ, కశ్మీరీల న్యాయమైన ఆకాంక్షలను, వారి పై క్రూరంగా అమలవు తున్న నిర్భందాన్ని చిత్రించిన తీరుకి అభినం దనలు తెలుపుతూ, ఆసక్తి ఉన్న మిత్రులకి పుస్తకం సాఫ్టాపీ పంపుతున్నాను.)

# ప్రశ్నించే స్త్రీల అనుభవ కథనాలు – "ట్రోల్"!




"అధికార సంస్కృతి మాయ కమ్మిన వ్యక్తులో చేసే విచక్షణారహిత నిందారోపణలకు, అసంబద్ధ,అసహన వ్యాఖ్యలకు – ప్రజా స్వామ్య ఆచరణలో ఉన్నవాళ్ళ సంభాషణకు మధ్య గీత చెరిగిపోవటం ప్రమాదకరం కాదా అన్నది ప్రశ్న.స్థూలంగా ఒక ప్రజాస్వామిక చట్రంలో ఉన్న వాళ్ళే అప్రజాస్వామిక సంభా షణకు ఉత్సాహ పడితే అది ఫాసిస్టు శక్తులు పండగ చేస్కోటానికే ఉపయోగ పడు తుంది." (పేజి 13)

**– కాత్యాయనీవిద్మహే,కె.ఎన్.మల్లీశ్వరి**

"ఆమె దేహపు ప్రతీ మూలనూ సెక్సువలైజ్ చేసి అమ్ముకునే దళారీ పురుషస్వాములు దేశం అంతా పేట్రేగిపోతుంటే, స్త్రీ తాను మాత్రం జీవి తానికి అవసరమైన నిర్ణయాలు తీస్కోవడం ఆలోచనలు చెప్పడం, మనిషిగా హక్కుల కోసం మాట్లాడ్డం నేరంగా చిత్రీ కరించే ద్వంద్వ నీతుల సమాజం నన్ను చెడిపోయింది అంటే , బాధ పడేంత పాతివ్రత్యం నాలో లేదు." ( పేజి 27)

**– అరుణ గోగులమండ**

"సత్యాన్ని చెప్పాలనుకోడం కూడా యుద్ధం లాంటిదే. అందులో ఒక మహిళ ప్రస్తుత సమాజంలో ఉన్న ధోరణులను, ప్రభు త్వాలను,సామాజిక అంశాలను, మూఢ నమ్మకాలను, ప్రశ్నిస్తూ పబ్లిక్‌గా సామాజిక మాధ్యమాల్లో పోస్ట్ పెట్టడం వలన వచ్చే విమర్శలను ఎదుర్కోవడం చాలా సాహ సంతోపాటు రాజకీయ చైతన్యం ఉండాలి." (పేజి 40).

**– కాగుల శ్రీదేవి**

"మన రాతని ఎదుర్కోలేక బూతుని ఆశ్రయించే మూక సంస్కృతిని తప్పకుండా వ్యతిరేకించాలి.ధైర్యంగా రాయడంతోపాటు ఈ బూతులకు భయపడకుండా ఉండటం నేర్చుకోవాలి. బూతులతో అవమానిస్తే మహి ళలు రాయడం ఆపే స్తారని, మాట్లా డటం మానేస్తారని అనుకోవడం వారి అజ్ఞా నం." (పేజి 69)

**– కొండవీటి సత్యవతి**

"ఆడవాళ్ళ మీద ట్రోలింగ్ జరగడానికి మొదటి కారణం జెండర్. ఆడవాళ్ళు అణిగి మణిగి ఉండాలి. ఫేస్‌బుక్ లాంటి సోషల్ మీడియాలో ఉంటే, మహా అంటే చీరలు

వంటలు లాంటి వాటి గురించి మాట్లాడు కోవాలి. అంతేగాని, రాజకీయాలు ఉద్య మాలు భావజాలాలు స్వతంత్ర ఆలోచనలు అంటే ఎలా? అదంతా మగ వాళ్ళ టెరిటరీ. చాలామంది మగవాళ్ళ ఆలోచన ఇదే." (పేజి 98). **– దీప్తి సిర్ల**

"పితృస్వామ్యం, అసూయ, పేరు రావాలనే తపన మగవాళ్ళలో మాత్రమే ఉండదు కాబట్టి ఆడవాళ్ళు కూడా ట్రోల్స్‌లో భాగం అవుతారు.కొందరు స్త్రీలు సాటి స్త్రీల అస హాయతని అడ్డంపెట్టుకొని పైకి ఆక్టి విస్టులుగా చలామణి అవుతూ, అడ్డమైన దార్లు తొక్కుతూ నిజాయితీగా పనిచేసే వాళ్ళ మీద బురద చల్లుతూ కుల,మత విద్వేషాలని రెచ్చగొడుతూ ఆధిపత్యాన్ని కొనసాగిస్తారు." (పేజి 149)

**– సూరేపల్లి సుజాత**

"సోషల్మీడియా అనేది సమాజానికి వికృత ప్రతి బింబం. అనామకంగా ఉండి ఏదైనా వాగవచ్చు అనే భరోసా ఇస్తుందది. మామూ లుగా బయట మర్యాదస్తులుగా చలామణి అయ్యే వాళ్ళు, పెద్దగా మాట్లాడకుండా ఒం టరిగా ఉండేవాళ్ళు కూడా సోషల్ మీడి యాలో చెలరేగి పోతుంటారు. ఒకరకంగా వాళ్ళ ఫ్రస్ట్రేషన్ వెలి గక్కడానికి ఇదొక మార్గం" (పేజి 157).

**– స్వాతి వడ్లమూడి**

ట్రోల్ : ప్రశ్నించే స్త్రీల అనుభవ కథనాలు 15 మంది పూర్తిస్థాయి వ్యాసాలతో మరొకన్ని అభిప్రాయాలతో కె. ఎన్. మల్లీశ్వరి, కాత్యా యని విద్మహే సంపాదకులుగా 179 పుటలతో ప్రరవే,మలుపు సంయుక్త ప్రచురణగా వచ్చిన విలువైన సంకలనం. నాకు తెలిసీ తెలుగులో జరిగిన మొదటి ప్రయత్నం ఇది. సామాజిక ఆలోచనాపరులు,పాత్రికేయకార్యకర్తలు,బుద్ధి జీవులు వెలిబుచ్చిన ఎన్నో అభిప్రాయాలు ఉన్నాయి. ప్రతీఒక్కరూ చదివి చర్చించాల్సిన పుస్తకం. ఎందుకంటారా? ముందుమాటలో సంపాదకులు చెప్పినట్లు,

"బాధ, దుఃఖం, ఆగ్రహానికి గురౌతూ కూడా తాము నమ్మిన విలువలు,విశ్వాసాల వ్యాప్తి కోసం, నిలిచి పోరాడుతున్న స్త్రీలతో సంభా షణకు తలుపులు తీస్తుంది ఈ పుస్తకం. ఏక మత రాజ్య స్థాపన కోసం భిన్నాభిప్రాయాల ను బుల్డోజ్ చేసుకుపోతున్న వర్తమాన అధి కార రాజకీయాల అంధకారంలో ఆశను వాగ్దా నం చేస్తుందీ పుస్తకం."అలాంటి గొప్ప ఆశలో భాగ మవడం మనందరి కనీసబాధ్యత కదా. సంపాదకులకి, రచయితలకి, ప్రచురణకర్తలకి అభినందనలు !

# ఉచిత నిర్భంధ విద్య

## మోహన్ తలారి, హాస్టల్ లైఫ్ !




**తిండి :** "...కంచంలో ఏత్తె హస్తానికో ఈగ పడింది నా కంచంలో ఆటిని అక్కడే ఏరి ఇని రేని పొప్పు పెట్టించ్చుకున్నా. గబాగబా పరు గెత్తి డైనింగ్ హాల్లో కూర్చుని ముద్ద కలుపు తుంటే చూపుడేల్లో సగం పొడుగున్న పెంకు పురుగు తగిలింది." (పేజీ 29)

**దొడ్డి :** "..అయిదొందల మంది పిల్లల మల ఇసర్జనాల బాజ్జత ఎవురిది ?..అందుకే మా గురుకుల పాటసాల్లన్నీ మనిష న్నా ఓడెవడూ దరిదాపుల్లో తిరగంచోట ఊళ్ళకి దూరంగా ఓ రకంగా అడవుల్లో కట్టారు. ముప్పయెకరాల కాంపస్. పెన్సింగ్ దాటితే చుట్టూతా ఇంకో ముప్పై నలభై ఎకరాల ఖాళీ స్థలం, పంట పొలాలు. అయ్యే మాయందర్నీ ఒళ్ళోకి జేర్చుకునే లావెట్రీలు." (పేజి 32)

**స్నానం :** "..తానానికి ఎల్లినోడు ముందో మొగ్గు నీళ్ళు సంపాయించుకోవాల ఏదో రకంగా. ఆ మొగ్గెట్టి మొకం కడిగేసుకున్నాక, కడ్డాయరుతోనే నీళ్ళు ధారలాగా పోత్తన్న టాప్ కింద ఒంగోవాల.ఒళ్ళంతా తడుత్తాది కదా. ప్రతీసారీ తడవాలని గారంటీ కూడా లేదు...ఆ తడిసిన ఒంటికి గబ గబా సొబ్బెట్టుకుని మళ్ళీ టాప్ కింద ఒంగుంటే సక్సెస్‌ఫుల్‌గా తానం అయిపోయినట్టే." (పేజి 33)

**స్కూలు :** "స్కూల్లో ఉన్న అందరు మాష్టార్లు చచ్చేదాకా కొట్టేవోళ్ళే, ఒక్క లైబ్రరీ సుగుణా రావు, తెలుగు మాష్టారు ఉండి శ్రీనివాసరావు గారు తప్ప. ఆల్లెందుకు కొట్టరు అంటే... పాపం ఆళ్ళూ మాల, మాదిగోళ్ళే. ఇక్కడే ఏదో గురు కులంలో చదువుకొచ్చినోళ్ళే. మిగతావోళ్లంతా శూద్రులు, బ్రాహ్మలు. ఆళ్ళకి మట్టుకు మా ఆస్టల్లలో ఉండటం, మా బాగోగులు చూట్టం, మేము పీల్చే గాలే పీల్చటం ఆళ్ళ బతుకు తెరువు కోసం కాదు. మమ్మల్ని ఉద్ధరిం చటానికి చేసే గొప్ప త్యాగం." (పేజి 36)

**హత్య :** "సురేష్ గాడి జేబులో పోలీసులకి ఓ చిన్న కాయితం ముక్క మాత్రమే దొరికిం దంట.దాని మీద ఆడు రాసిన ఆఖరి మాటలు, 'అమ్మా ! చెల్లిని మట్టుకు ఆస్టల్‌లో ఎయ్యకు!' (పేజి 54)

**కాలం :** "పిరిడు మొదలై ఎన్ని నిమిషాల య్యింది ఇంకెన్ని నిమిషాలుంది, ఇంకెంత సేపట్లో గంట మోగుద్ది అన్న జ్ఞానం చేరిన రెండో వారంలో వచ్చేస్తాది ఆరో తరగతిలో

జేరిన పిల్లోడికి కూడా. ఎందుకంటే పొద్దున్న అయిదుగంటలకి నిదరలేపే గంట తర్వాత ఏదో కారణానికి గంట గంటకీ మోగుతానే ఉంటది..” (పేజి 55)

**జీవితం :** “నడవగా నడవగా రైలు గేటొచ్చే సింది.రోడ్డొదిలి అలా పక్కకి నడుసుకుంటా ఎల్లి రైలు పట్టా మీద తలకాయ పెట్టి పొడుకున్నాం. సచ్చి పోతే దేవుడు దగ్గరికే ఎలతాం కదరా అన్నాడు. నమ్మకం లేని నేను నవ్వూరుకున్నాను. దూరంగా కూతేసు కుంటా రైలొస్తంది. ఇద్దరం ఒకడి చెయ్యి ఒకళ్ళం పట్టుకుని గట్టిగా కళ్ళు మూసు కున్నాం. (పేజి 76)

“గజ్జల్లో పుండ్లరసి – గుదంలో రాత్రి చేసిన గాయం,
కడుపు బరువు దించుకోబోతే అట్టలుకట్టి
మొరాయించిన షరాయిలో రాలే పీతి చిరక
నెలకోసారి దొరికే సెంట్రల్‌జెయిల్ ములాఖాత్
అమ్మ చేతినుంచి అందుకున్న అరిసెలసంచి కోసం,
నడిరాత్రిలో జరిగే హైవే దకాటీలూ
మాస్టార్ల రూపంలో సంచరించే మఫ్టీక్రైం బ్రాంచీలు..
బతుకులు మారడం అవకాడ మాట...
బ్రతికుండటమే గగనం అయ్యే గడ్డుకాలాన్నే చదువు అంటా రనే నమ్మకాన్ని కలిగించేదాకా వదలని పీడన నిజంగా ఉచిత ‘నిర్భంధ’ విద్యే!”. (పేజి 10)

కొన్ని పుస్తకాల్లోని అక్షరాలు మాట్లాడవు మనల్ని ప్రశ్నిస్తాయ్. ఎక్కడో దాక్కున్న చీకట్లని కర్కశంగా చీల్చిచెండాడతాయ్. గుండెల్లోని మనిషితనాన్ని ఉన్నావా, చచ్చావా? అని నిలదీస్తాయ్. ఈ దేశపు నిర్భంధ విద్యావిధానం అమలయ్యే తీరును, హాస్టళ్ళలోని జీవితాన్ని నిలేసి నిలబెట్టిన రచన ‘హాస్టల్ లైఫ్’. ఏవో కొన్ని ముక్తాయిం పులు రాసేను కానీ చిన్నదే అయినా చాలా అవసరమైన పుస్తకం. ఎందుకంటారా,

“మీరొకవేళ ఈ దేశం అత్యంత ఘనంగా చెప్పు కునే ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నట్లైతే ఈ పుస్తకాన్ని ఎత్తి మీ బ్యాగ్గులో పెట్టుకోండి. ఏ పేజీలో మీరు చేసిన ఏ పాపం ఉందో ఎర్రింకుతో అండర్లైన్ చేసుకుని వీ.వీ.ఐ. యం.పి. అని మార్కు చేసుకోండి. మీ నోటి నుండి అలవోకగా వచ్చే ప్రతీమాట జీవి తాంతం గుర్తుంచుకుని మిమ్మల్ని సమాజం ముందు గుడ్డలూడదీసి నించోబెట్టే తలారు లు మీ తరగతుల్లో కలాలు నూరుతూ ఉన్నారని గుర్తెరగండి.” (పేజి 20)

(Hostel Life (Hostile Life) మోహన్ తలారి హాస్టల్జీవితం. మొదటి రచనే ఐనా గుండెల్ని పిండేసిన అనుభవాల్లోంచి వచ్చిన అక్షరాలు కనుక సూటిగా పాఠకుల గుండెల్ని

తాకు తాయ్. 136 పుటల పుస్తకం పర్‌స్పెక్టివ్స్ ప్రచురణగా వచ్చి రెండేళ్ళైంది. కులం కుళ్ళును నెత్తిలో పెట్టుకుని నిత్యం సంక్షేమం మీద వాంతులు చేసుకునే వారికి ఈ దేశపు విద్యావ్యవస్థలో సగటు విద్యార్థి పడుతున్న అవస్థ పట్ల ఏమాత్రం ఇంగిత జ్ఞానం లేదనే నిజాన్ని మరొక్కసారి తేటతెల్లం చేసిన గొప్ప రచన ఇది. విద్యార్థి,ఉపాధ్యాయుడు, సామాజిక కార్యకర్త, విద్యావేత్తనే కాదు ప్రతి ఒక్కరూ చదివి వారి పరిధిలో చర్చించాల్సిన పుస్తకం గురించి ఆలస్యంగా ఐనా ఇప్పటికి లా చిన్న రైటప్ !)

# ఒక అవిశ్రాంత బాటసారి మనస్సంగీతం !

## రాఘవశర్మ "తిరుమల దృశ్యకావ్యం !"

## (ఆరుపదుల ఔత్సాహికుడి అక్షరకళారూపం)




"అడవిలోకి వెళ్ళడమంటే కొండల అందాలను దర్శించ డమే కాదు, రకరకాల చెట్లు, మహా వృక్షాలు, జంతు జాలాన్ని చూడటం, జీవ వైవిధ్యాన్ని అర్థం చేసుకోవడం, సహజమైన ప్రాణవాయువును పీల్చడం, ఆరోగ్యాన్ని పొంద డం, మనసు ఉత్సాహం తో ఉరకలేడం, ఆనంద తాండవం చేయడం. అడివిని చూడ్డానికి అలవాటు పడితే బద్ధకం వదిలి పోతుంది. అడివంటే ప్రేమ పుట్టుకొస్తుంది. అడివి తల్లి చల్లని కనురెప్పల నీడల్లో సేదదీరుతున్నట్ట నిపిస్తుంది. అందుకే, అడివిలో నడక ఎంత మహాద్భుతమో, అంత మహదానందం !" (పేజి 10)

"ఈ ప్రాంతంలో చిరుతల సం చారం ఉన్నా ఎప్పుడో తప్ప కనిపించవు. మనం ఒంటరిగా కనిపిస్తే తప్ప దాడిచేయడానికి సాహసించ వు.ఎక్కువ జన సంచారం కనిపిస్తే ప్రాణభయం తో చిరుతలు కూడా పారి పోతాయ్. చిరుత ల్లాంటి అడవి జంతువులను క్రూర జంతువులని భావిస్తాం. మన పైన దాడి చేస్తాయని భయ పడతాం. నిజానికి మనని చూస్తే వాటికే ఎక్కువ భయం. వాటి నివాసాలైన వనాలను
మనం ఆక్రమిస్తూ, మన ప్రాం తంలోకి చిరుతలు వచ్చాయని గగ్గోలు పెడతాం. మానవులైన మనం కూడా వాటి దృష్టిలో దురాక్రమణదారులమే !" (పేజి 27)

"ఏనుగులు కనిపిస్తే ఏం చేయా లి?' మాలో భయ సందేహం! 'ఏనుగులు మన వెంటపడితే ఎత్తైన ప్రాంతానికి మాత్రం పరిగెత్తకూడదు. అవిఎత్తుకు వెళ్ళినంత వేగంగా కొండ దిగ లేవు. బరువుకు పడిపోతా మన్న భయం. వాటి చూపును మరల్చే విధంగా కొండ దిగువ కు వంకరటింకరగా పరిగెత్తితే మనను అనుసరించ లేవు. తప్పించు కోవచ్చు. మన లాగా వాటికి ఈ దిక్కు నుంచి ఆ దిక్కుకు (180 డిగ్రీల కోణం లో) చూసే చూపు లేదు. మనంత వేగంగా శరీరాన్ని పక్కకు తిప్ప లేవు. మనం తెల్ల దుస్తులేసు కుంటే వాటికి చాలా చికాకు.' " (పేజి 51,52)

"పుస్తకాలు,హోంవర్కులు,క్లాసు వర్కులు, ఆన్లైన్ క్లాసులు, ఒక టేమిటి బాల్యాన్ని చిదిమేయ డానికి ఎన్ని అవకాశాలు ఉన్నా యో అన్నిటినీ ప్రయోగిస్తు న్నారు. పిల్లలకు విశ్రాంతి లేదు, బాల్యమూ లేదు. ఇలా అమ్మ నాన్నలతో అడవిలోకి రావడం ఎంత హాయి! బాల్యాన్ని

ఎంత బాగా అనుభవిస్తున్నారు! నిజమే వారికి దొక మధురమైన జ్ఞాపకం. అడవిలో ట్రెక్కింగ్ చేయడం, ఒత్తిడిని జయించ డానికే.” (పేజి 67)
“మహిళలు ట్రెక్కింగ్‌కు రావడం వల్ల దైనందిన జీవితంలో కని పించని సాహసం ఇక్కడ కని పిస్తుంది. పురుషుల కంటే ఏ విధంగానూ తీసిపోమన్న భావన వారిలో కలుగుతుంది. నిద్రా ణంగా ఉన్న మహిళల శక్తియుక్తులు బైటికి వస్తాయి. జంకుబోయి నిస్సంకోచంగా, నిర్భయం గా సంచరించ వచ్చున్న ధైర్యం ఏర్పడు తుంది.” (పేజి 68)
తిరుమల అనగానే భక్తిభావం తలెత్తే వారికి అందుకు భిన్నం గా ఒక రసజ్ఞత కలిగిన భౌతిక వాది శేషాచలం కొండల ఆదు పాదుల్ని కాలి నడకన దర్శించి మనకందించిన అపురూప మైన రచన రాఘవశర్మ గారి “తిరుమల దృశ్య కావ్యం” అనే ఈ పుస్తకం. వామపక్ష ఉద్యమాల్లో తిరిగింది మొదలు సీనియర్ పాత్రికేయుడుగా వివిధ పత్రికల్లో పని చేయడం వరకూ ఎన్నోరకాల అను భవాల్ని మూటకట్టుకున్నా యన పాతిక సంవత్స రాలుగా శేషాచలం కొండల్లో తన అనుభవాలకు అక్షర రూపం ఇవ్వడం నిజంగా ఆహ్వానించదగ్గది !
తాంత్రికలోయతో మొదలెట్టి శిలాతోరణం, రామ కృష్ణతీర్థం, తుంబురు తీర్థం, కుమారధార, చక్ర తీర్థం, శేషతీర్థం, తొలి చరిత్ర దశ మానవుడు గీసిన ‘యుద్ధగళ’, సాహసోపేత గుంజన జల పాతం, బ్రహ్మ గుండం, తలకోన, నెలకోన, నామాలగవి, పుల్లుట్ల దారి, విష్ణుగుండం ,మార్కండేయ తీర్థం, నారాయణతీర్థం,గుర్రప్ప కొండ..అంతుచిక్కని రహ స్యాలను ఇముడ్చుకున్న అనేక లోయల లోతుల్ని,అడవి దారుల్ని పలకరించొచ్చి 150 పుటల్లో, దాదాపు అన్నే ఫొటో లతో చేసిన శేషాచలం కొండల ఈ వినూత్నమైన పరిచయం ప్రకృతి ప్రేమికులకే కాదు సత్యాన్వేషకులకూ, జిజ్ఞాసువులకూ కూడా పనిమట్టు వంటిదని నా అభిప్రాయం !
టోక్యో అనే జపాన్ పేరు పెట్టు కున్న వ్యక్తి నేపథ్యం, వెంగ మాంబ గుహ దగ్గర దిగంబర స్వామిగా బతికిన సుబ్బారావు విషాదాం త గాథ, మానవపుర్రె రూపం లో చెట్టుకి మొలిచిన విచిత్ర మైన కంకాళం, కాల క్రమంలో మారిన శ్రీవారి మెట్టు కథ, ట్రెక్కర్లే పేరుపెట్టిన “మానవ తీర్థం”, సుబ్బారాయుడు, రాధేయ, చెంచయ్యల అడవి కథలు, ఆర్ద్రత కలిగించే పెద్ద బండల చేను స్మృతి చిహ్నం, తిరుపతి ట్రెక్కింగ్ క్లబ్ విశేషాలు, చంద్రగిరి దుర్గం నుండి గుడిమల్లం ప్రాసత్యం వరకూ చదువరుల్ని ఓలలా డించి సాగిన ఈ దృశ్య కావ్యం, కరోనా కాలంలో ఎందరో అభాగ్యుల్ని కాపాడిన ప్రాణదాతలైన వైద్యుల స్మృతి లో ‘పండు పబ్లికేషన్స్’ ప్రచురిం చిన ఈ కృతి, తెలుగుజాతి గర్వించదగిన చరిత్రకారులు ఇంగువ కార్తికేయ శర్మ గారి నివాళి వ్యాసంతో ముగిసింది !

ఆచార్య వకుళాభరణం రామ కృష్ణ గారి నుండి తాడి ప్రకాష్, ఏ. ఎన్. నాగేశ్వరరావు, కుసుమ కుమారి గారు రాసిన ఆప్త వాక్యాలు అదనపు ఆకర్షణ. ఏడుపదులకు దగ్గరౌతున్న రాఘవ శర్మ గారు స్వయంగా ఇచ్చిన ప్పుడు తెలీలేదు కానీ ఆయనలో జ్వాజ్వల్య మానంగా వెలిగే గమన కాంక్షకి వయసు, అలుపు రెండూ లేవు. మిత్రులు, పెద్దలు రాఘవశర్మ గారి 'తిరుమల దృశ్యకావ్యం' చదవడం సజీవమైన అవ్యక్తా నుభూతి. ప్రతీ ప్రయాణం, ప్రతీ ఫొటో మనల్ని కూడా ఆయా విశాలమైన అటవీప్రాంతం లోకీ,పర్వతసానువుల్లోకి లాక్కుపోతాయ్. తేరుకు చూసేసరికి చదవడం ఐపోతుంది. ఎందుకనేది స్పష్టం, పుస్తకం ప్రారంభంలోనే అన్నట్లు,

" గలగలా పారే సెలఏర్లు.. జల జలా దూకే జలపాతాలు.. పక్షు ల పలకరింపులు..అక్కడక్కడా నీటి తటాకాలు...అడవి జంతువుల స్వేచ్ఛా విహా రాలు..దట్టమైన అడవిలో పచ్చదనం పరుచు కుని తూర్పు కనుమల్లో భాగంగా అలరారుతున్న శేషాచలం కొండలు... 'పదివేల శేషుల పడగలమయమో' అన్న అన్నమయ్య భావుకతకు వాస్తవరూపాలే తిరుమల తీర్థాలు."
రచయిత కి అభినందనలు!

# ప్రత్యామ్నాయ చిత్రాల పై విలువైన వీక్షణం !

## శివలక్ష్మిగారి,'రియలిస్టిక్ సినిమా' పుస్తకం!!

## (ఓ ప్రజాపక్ష రచయిత్రి సంవేదనా సౌరభం!!!)




"కినిమా అంటే పురోగమ నమని అర్థం. దాని సమానార్థ కమే 'సినిమా'.ప్రపంచ సాహి త్యంలో వెల్లి విరిసిన భావ పరంపరల వ్యక్తీకరణ సాహిత్య మైతే దాని విస్తృత దృశ్యీకరణే సినిమా. కదులుతున్నదృశ్యాల తో కథ చెప్తుంది సినిమా. వంద మాట లతో చెప్పలేనిది ఒక్క దృశ్యం తో చెప్పవచ్చు. ఒక దృశ్యం మనసులో తిష్ఠ వేసిం దంటే ఇక అది మాటిమాటికీ జీవితాంతం గుర్తుకు వస్తూనే ఉ ంటుంది.." (పేజి 27)

"హీరోలకోసమే కథల్ని వండి వారుస్తున్నారు మన రచయి తలు. ఎప్పుడైతే హీరోలు నేలమీది నుండి కాక ఆకాశం నుండి ఊడిపడ్డట్లు చిత్రీ కరించడం మొదలయ్యిం దో అప్పటినుంచి మన తెలుగు సినిమా భ్రష్టుపట్టిపోయింది. నిజమైన కళ అనేది బ్రహ్మాం డంగా అమర్చబడిన అట్ట హాసాలతో కాకుండా మనం దరికీ తెలిసి నట్లుగా జీవితం లోని సార్వత్రిక సరళతలను పరిశీలించే చిత్రాల నుండి వస్తుందంటారు ప్రపంచ ప్రఖ్యాత ఇరాన్ దర్శకుడు మాజిద్ మాజిది.." (పేజి 28)

"చీకటి థియేటర్‌లో సినిమా చూడటం ఒక ధ్యానం లాంటి ది. నా దృష్టిలో ఇంకే కళా రూపం ఇలాంటి అను భూతిని ఇవ్వలేదు.చికాకులు,మానసిక ఒత్తిడితో ఒంటరి దీవులుగా మారి పోయిన నేటి మానవ కుటుంబాన్ని సమైక్యపరిచే ఏకైక శక్తి సినిమా' అం టారు ఆదూర్ గోపాలకృష్ణన్, సమ సమాజం కోసం ఆలోచించే వారు అద్భుతమైన చిత్రాల్ని రూపొందిస్తూ ప్రపంచ వ్యాప్తం గా ఉన్న మనుషు లందర్నీ తమ సినిమాల ద్వారా సంఘ టిత పరిచే పనిలో భాగమవు తున్నారు." (పేజి 29)

"ఐసెన్‌స్టీన్, ఆయన ఎవరి మెప్పు కోసమూ సినిమా తీయలేదు. సమాజంలోని అట్టడుగు మనుషులు, జంతు వుల కంటే హీనంగా చూడ బడుతున్న మనుషుల పక్షం వహించి, వారిపట్ల ఆయన కున్న నిజాయితీ, నిబద్ధతలను చాటి చెప్పాడు. మన పక్షం వహించిన ఇంత అద్భుతమైన వ్యక్తి ఈ భూమి మీద ఒక ప్పుడు సంచరించా డంటేనే మనసు సంతోషంతో నిండి పోతుంది. ఇంకో వెయ్యి సంవత్సరాలైనా మనదేశంలో ఇటువంటి సినిమాని ఆశించ లేం.ప్రేక్షకుల హృదయాల్లో లేని జుగుప్సాకరమైన అభిరుచుల్ని వెలికితీసి రెచ్చగొట్టే మన

దర్శక నిర్మాతలు కళ ప్రజల కోసం అని గుర్తించి ఎప్పటి కైనా ఇంతటి ఉత్తమ విలువ లను పోషించే చిత్ర నిర్మాణం చేయగలరా?" (పేజి 65,66)

Art has to be severe. It cannot be commercial..I have lost all my money.They are not commercial. But I am glad to lose it this way for the pictures like Bicycle Thieves అంటారు విక్టోరియా డి సికా. మన దర్శక నిర్మాతలు మనం బతికుండగా ఇలాటి సినిమా లు ఎలాగూ తియ్యలేరు. కనీ సం విక్టోరియా డిసికా చెప్పిన మాటలు విని ఆలో చించినా బాగుండును."(పేజి 89)

"మహిళలు తరతరాలుగా ఆర్జించిపెట్టి ఈ సమాజానికి అందించిన జ్ఞానం, మాతృ స్వామ్య వ్యవస్థ నుంచీ ఇంటి పెద్దగా వారి పాలనా అను భవం,శక్తిసామర్థ్యాలు, అందం, అధికారం అనేకరకాల స్వభా వాలతో ఈ ప్రపంచాన్ని అర్ధ వంతం చేస్తున్నారు. అయి నప్పటికీ, ప్రపంచంలోని అగ్ర రాజ్యాలతో సహా ఏ దేశం లోనూ మహిళల్ని మానవులు గా సమాజంలో సగభాగంగా భావించడంలేదు." (పేజి 117)

శివలక్ష్మిగారి "రియలిస్టిక్ సినిమా" శీర్షికే ఒక సాహసో పేతమైన వ్యక్తీకరణైతే ప్రపంచ సినిమా చరిత్రని పీడితుల దృక్కోణంలో విశ్లేషిస్తూ సోదాహరణంగా తెలుగులో 250 పైచిలుకు పుటలతో 'కుహూ & విరసం' తరపున సంయుక్తంగా ప్రచురించడం, దానికి వి.వి. వంటి దార్శని కుడు ఏకంగా పది పేజీల ముందుమాట రాయడం నాకు తెలిసీ మొట్ట మొదటి సారి జరిగింది. అందుకే నేమో మొదలెట్టగానే ఏకబిగిన చదివించగల శైలితో దేశదేశాల ప్రత్యామ్నాయ ప్రజా పక్ష చిత్రాల్ని పదుల సంఖ్యలో తడుముతూ సాగింది !

ఐసెన్‌స్టీన్ సినిమాల నుండి అంబేద్కర్ సినిమా వరకూ అనేక సినిమాల్లోని హృద్యమ యిన దృశ్యాల్ని, ఆయా పాత్ర ల్లోని ప్రాణాన్ని, సారాన్ని అంది పుచ్చుకుని రచయిత్రి చేసిన ప్రతి విమర్శా ఈ గ్రంథానికి ఒక సాధికారతను చేకూర్చింది. ముఖ్యంగా శ్రమ జీవుల సంస్కృతి వికాసం లో కళగా సినిమా నిర్వర్తించా ల్సిన ఉన్నతపాత్ర ను ఔపోసన పట్ట బట్టే, అడుగడుగునా అందరి కోసం ఒక్కరూ, ఒక్కరి కోసం అందరూ అనే మానవతా స్పృహ ఈసమీక్షల్లో స్పష్టం గా కనిపిస్తుంది !

సత్యజిత్ రే మలిచిన చిరస్మర ణీయ పాత్ర 'ఇందిర్ ఠాక్రూన్' కోసం చదివి చలించ కుండా ఉండలేం. పీటర్ జాన్ డయ్యర్ అనే వ్యక్తి న్యూయార్క్ లోని Film & Filming పత్రికలో ఆమె గురిం చి రాసిన 'దిగ్భ్రాంతి కలిగించే అద్భుతమైన నటి' (A fantas tic old actress) ప్రశంస ఎంత నిజమో అనిపిస్తుంది.ఈ వ్యాసం చదివాక ఉత్తమ నటి విభాగంలో భారతదేశం లోనే మొట్టమొదటి అవార్డు గ్రహీత గా ఆమెను మరొక్కసారి

మనసులో స్మరించుకోకుండా ఉండలేం !

ల.లి.త.గారి మున్నుడి నుండీ నందగోపాల్ గారి 'సినిమాగా సినిమా' గురించి చివర్లో రచయిత్రి చేసిన పరిచయం వరకూ ప్రతీ సమీక్షా చదివి ప్రేమగా మరోసారి పరికించడం కోసం దాచుకో వలసిన వాక్యా లెన్నో . ప్రతీ విభాగానికి పెట్టిన శీర్షికలు కూడా ఎంతో ఆకర్షణీ యంగా ఉన్నాయి. మంచి సినిమా గ్రూప్ బాధ్యుల్లో ఒకరి గా ప్రపంచ సినిమా పై సాధి కార స్వరంగా, శివలక్ష్మి గారి ఈ రచన తెలుగు లో అరుదైన 'వాస్తవిక సినిమా' గూర్చిన విలువైన గ్రంథం అనడంలో నాకెటువంటి సందేహం లేదు. ఆత్మీయ మిత్రులు, పెద్దలు శివలక్ష్మి గారి కృషికి మరోసారి మనసారా అభినందనలు !

# అమరజీవి పొట్టి శ్రీరాములు పోరాటకథ!

## (అసాధారణ త్యాగశీలి ఆత్మార్పణ గాథ)




"ప్రస్తుతం హరిజనోద్ధరణ కార్యక్రమాన్ని పట్టాను. కొంతకాలం తర్వాత నాకు ఇప్పుడు లభిస్తున్న ప్రోత్సాహం లభించకపోవచ్చు. నా కార్యక్రమానికి పరిస్థితులు అనుకూలంగా లేవని తెలుసు. నా కార్యక్రమాన్ని హర్షించలేక పోతున్న నా బంధువులు తిండిపెట్టి, ఆశ్రయ మివ్వడానికి నిరాకరించవచ్చు. ఐనా, నేను నిరుత్సాహ పడను. బిచ్చమెత్తయినా నా ప్రచారాన్ని కొనసాగిస్తాను..." (పేజి 40)

1944 అక్టోబరు 2
గాంధీజీకి రాసిన లేఖలో...

"ఒకవైపు నిరాశ, నిస్పృహ తనను కమ్ము కుంటున్నా, పొట్టి శ్రీరాములు కార్యక్రమాలు కుంటుపడనీయలేదు. 22 సం.రాల వితంతువు కి, 35 సం.రాల వ్యక్తిని ఒప్పించి పొట్టి శ్రీ రాములు పునర్వివాహం జరిపించారు. ఈ సందర్భంగా నిర్వహించిన కులాంతర విందు భోజనానికి ధనవంతులతో పాటు పేదవారైన హరిజనులను కూడా ఆహ్వానించారు. పెళ్ళి కానుకగా వధువుకు ఎర్రవాడ చరఖా బహుమతి గా ఇచ్చారు. మిగిలిన భోజనాన్ని యానాదులకు ఇచ్చే ఆచారాన్ని గౌరవిస్తూ వారికీ విందు భోజనం అందరితో బాటు ఏర్పాటు చేశారు." (పేజి 44)

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో పుట్టాడు. మహ రాష్ట్రలో చదివి, ఉద్యోగం చేసాడు. బీహార్ మొదలు గుజరాత్‌వరకూ అనేక ప్రాంతాల్లో సామాజిక కార్యకర్తగా రాటుదేలాడు.వైద్యుల పర్యవేక్షణలో ప్రపంచంలోనే జరిగిన తొలి నిరాహారదీక్షకి ఆద్యుడయ్యాడు. ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కేరళ, కర్ణాటక, బీహార్, గుజ రాత్, మహరాష్ట్ర వంటి భాషాప్రయుక్త రాష్ట్రాల ఆవిర్భావానికి నాంది పలికి భారత దేశ చిత్రపటాన్ని పునర్లిఖించిన దార్శనికుడు శ్రీ పొట్టి శ్రీరాములు !

ఆయన జీవితం,అలుపెరుగని కృషి,ఆనాటి పోరాటాన్ని నేటి తరానికి పరిచయం చేస్తూ మిత్రులు డా. నాగసూరి వేణుగోపాల్ రెండు అపురూపమైన గ్రంథాల్ని రచించారు. ఒకటి సమగ్రమైన పరిశీలనతో 'అమరజీవి బలి దానం' కాగా, రెండు 'అమర జీవి' పేరిట పొట్టి శ్రీరాములు పోరాట జీవిత కథ. ముఖ్యంగా శ్రీ రాఘవేంద్ర ప్రచురణల

తరపున 100 లోపు పుటలతో 50/- రూపాయల్లో 17 అధ్యాయా లుగా సుమారు 40 ఫొటోల్తో తీసుకువచ్చిన అపురూపమైన పుస్తకం ఇది. ఆసక్తి ఉన్న వారు ఇక్కడిచ్చిన ఫొటోల్లో వివరాలు ఉన్నాయి చూడొచ్చు !

హిందూ ముస్లిం సమైక్యత నుండి పారిశుధ్య కార్మికులతో కలిసి జీవిస్తూ వారి సమస్యలపై ఉద్యమించడం వరకూ, మద్యపాన నిషేధం నుండీ రెల్లి కులస్తుల పురోగతి దాకా, జైళ్ళ సంస్కరణలతో మొదలులెడితే, దళిత బహుజన (ఈరోజు హరిజన పదాన్ని తీవ్రం గా నిరసించినప్పటికీ) హితం కోసం దేశంలో ఎక్కడా లేని విధంగా నిరసనను ఆమరణ నిరాహార దీక్ష రూపంలో వ్యక్తపరచి ఏకంగా మూడు చట్టాలు (హరిజన్ టెంపుల్ యాక్ట్, హరిజన్ సివిల్ డిసెబిలిటీస్ యాక్ట్, హరిజన్ సేవా దినోత్సవ్ యాక్ట్) రావడానికి కారణమైన పోరాటశీలి పొట్టి శ్రీరాములు !

(అత్యంత పేదరికంలో పుట్టి తిరుగులేని పోరాట యోధుడిగా ఎదిగిన పొట్టి శ్రీరాములు జీవితం ఒక గొప్ప ఆశయం కోసం కొనసాగి మహోన్నత లక్ష్యానికి అంకితమైంది. తెలుగుజాతి అస్తిత్వం ఆయన ప్రాణ త్యాగం తో చారిత్రాత్మకంగా నిలిచింది. దౌర్భాగ్యం ఏమిటంటే, అంతటి మహావ్యక్తి ఈ దేశంలో అత్యంత విస్మరణకు గుర య్యాడు. మరే ప్రాంతంలోనైనా శ్రీరాములు గారి లాంటి మహామానవుడు జన్మిస్తే ఆవ్యక్తి జాతి 'ఐకాన్' గా మారి ఉండేవాడు. తెలుగు జాతికి మొదటి నుండీ అలవాటైన మౌఢ్యం పొట్టి శ్రీరాములు వంటి త్యాగిని, ఉద్యమశీలి ని,మానవీయ తాత్వికుడ్ని, అపార ఆచరణ వాదినీ ఇప్పటికీ పూర్తిగా వెలుగులోకి రానివ్వలేదు. ఈ రోజు ఆయన వర్ధంతి సందర్భంగా ఈ రైటప్ !)

# నిబద్ధతగల కమ్యూనిస్టు కుడిపూడి !

## కె. ఎస్. స్మృతిలో 'డియర్ కామ్రేడ్' !!

## (విశిష్ట వ్యక్తి గూర్చి వ్యాస సంకలనం)




"మానవతావాదులు కమ్యూనిస్టులు కావాల నేమీ లేదు. కమ్యూనిస్టులు మాత్రం మాన వతా వాదులు కావాలి. శ్రమను గౌరవిస్తూ నిరంతరం ప్రజల కోసం ప్రజలతో మమేకం కావాలి. ప్రేమపూర్వకమైన మానవ సంబం ధాలు, పరిపూర్ణ మైన నైతికవిలువలు కలిగి ఉండాలి. పత్రికలు, పుస్తకాలు చదవటం అలవర్చు కోవాలి. మార్క్సిజం వంట పట్టించు కోవడానికి సాధన చేయాలి." పీపుల్స్ వార్‌లో కే. యస్. గా కొండపల్లి సీతా రామయ్య ఎంత ప్రసిద్ధో కాకినాడ లో కే. ఎస్. గా పీపుల్స్ లీడర్‌గా కుడిపూడి సూర్య నారా యణ కూడా అంతే ప్రసిద్ధి. జీవితం త్యాగాల మయం చేసుకున్న ఆయన్ని 'ఇంద్రపాలెం సుందరయ్య' అని కూడా అంటారు. ఆయన గతించిన సుమారు రెండు దశాబ్దాల తర్వాత ఆయన మిత్రులు, ఉద్యమ సహచరులు రాసిన దాదాపు పాతిక విలువైన వ్యాసాలతో తీసుకొచ్చిన వ్యాస సంకలనం 'డియర్ కామ్రేడ్' !

"ఆమె అతడికి అర్ధాంగి కాదు, సంపూర్ణాంగి, అందుకే అతడి జీవనకావ్యం ఆమెకే అంకితం, సరస్వతీ సూర్యనారాయణకు నీరాజనం" అంటూ పుస్తకం తిప్పగానే కనిపించిన వాక్యాలు భార్యాభర్తల అన్యోన్యతకు నిదర్శనంగా ఉన్నాయి. అర్ధవంతమైన కామ్రేడ్‌షిప్‌కి ఉదాహరణగా నిలిచిన వారిరువురి గాఢ అనుబంధాన్ని పాఠకులకు తెలిపేలా ఉన్నాయి. అసలు పుస్తకం శీర్షికే కొత్త చైతన్యాన్ని రగిలించేలాఉంది. చదవాలనే ఆసక్తిపాఠకుల్లో కలిగించేలాగ ఉంది ! కామ్రేడ్ కె. ఎస్. గా అంతా ప్రేమగా పిల్చుకునే కుడిపూడి సూర్యనారాయణ సాధారణ స్థాయి నుండి అసాధారణ స్థాయికి ఎదిగిన ప్రజాతంత్ర కార్యకర్త. సామాజిక ఆలోచనాపరులు. ఒక నిబద్ధతతో జీవితాన్నిగడిపిన ఆచరణశీలి. తిరుగులేని వామపక్షవాది. అచంచలమైన ఆద ర్శాల్ని అణువణువునా జీర్ణించుకున్న వ్యక్తనేవిషయాన్ని ఈ సంకలనం తేటతెల్లం చేస్తుంది ! అభ్యుదయ వేదిక స్థాపన మొదలు, జన విజ్ఞాన వేదిక కార్యక్రమాల వరకూ, ఉపాధ్యాయ సంఘాల నుండీ యువజ నోద్యమ కార్యాచరణ దాకా, సాహిత్యం మొదలు సామాజిక, సాంస్కృ తిక రంగాల వరకూ , కార్యకర్తలకు ఇళ్ళు కట్టించడం, వారి బాగోగులు చూడటం,

ప్రేమ/ కులాంతర వివాహాలు జరిపించడం, కాయ గూరలు పండించడం...ఒకటా రెండా, సాటి మనిషిని నిండు హృదయంతో ప్రేమించ గలగడమే నిజమైన కమ్యూనిస్టు సారమని కె. యస్. జీవితం నిరూపిస్తుంది !

ప్రభుత్వ ఉద్యోగిగా ఉంటూనే ప్రత్యామ్నాయ భావజాలానికి బాసటగా నిలిచినా, గోర్కీ అమ్మ మొదలు అంబేద్కర్ కులనిర్మూలన వరకూ లోతుగా అధ్యయనం చేసినా, సొంత జీవితంలో విలువలకు కట్టుబడి ఆదర్శ వివాహం చేసుకున్నా, మద్యపాన వ్యతిరేకో ద్యమం నుండి మూఢనమ్మకాల నిర్మూలనో ద్యమం వరకూ క్షేత్రస్థాయిలో పనిచేసినా అవన్నీ ఆయన నమ్మిన సిద్ధాంతానికి ప్రతీకలేనని పేర్కొంటూ 'డియర్ కామ్రేడ్' గురించి ఈ చిన్న రైటప్ ! (మిత్రులు,'పుస్తకం' వాట్సప్ గ్రూప్ ముఖ్యులు కామ్రేడ్ పెద్దింశెట్టి రామకృష్ణ గారు ఇష్టంతో సంకలనం చేసి సంపాదకత్వం వహించిన విశిష్ట గ్రంథం ఇది. అంశం గురించి ఆయన ఎంచుకున్న తీరు, వ్యాసాల్ని ఎడిట్ చేసిన విధానం, బుక్ గెటప్ బావుంది. కొత్త సంవత్సరం రోజునే కుడిపూడి సంస్మరణలో జరిపిన ఆవిష్కరణ సభ కూడా అర్థవంతంగా ఉంది. ప్రజాకీయ ప్రత్యామ్నాయ ఆలోచనాపరులంతా చదవాల్సిన పుస్తకం, తెలుసు కోవాల్సిన వ్యక్తిత్వం కె. ఎస్.దని పేర్కొంటూ, ఇంత మంచి వర్క్‌ని తీసుకు రావడానికి శ్రమించిన మిత్రులు పెద్దింశెట్టికి, సహకరించిన వారి పార్టీ పెద్దలకి ప్రత్యేక అభినందనలు !)

# అనేక ప్రవాహాల ప్రయాణం : జీవన స్పర్శ !

## (ఒక తరం స్వాప్నికుడి సజీవ ప్రేమకథ)




"జీవితం అంటే కాలంతో కదలిక అన్నాడు చలం. అలా నడుచుకుంటూ పోవడం కాలధర్మం. అయినా తన బాల్యం, మనుషులు,వాళ్ళ సంబంధాలు, సంఘ ధర్మాలు, ఆదర్శాలు,వ్యక్తుల్ని నడిపిన ప్రేమ ..అన్నీ తన ప్రయాణం లో గుర్తుకు వచ్చి పై బెర్తులో ఉన్న మధు కంటి కొనల నుండి రాలిన కన్నీటికి ఎంత విలువ ఉంది?. స్వాతి వానచినుకు ముత్తెపు చిప్ప లోపడి ముత్యం అవుతుంది. కానీ, నీటి చుక్కకు ముత్యం కన్నా విలువైన మరో స్థానం ఉంది. కంటిలో కన్నీటి చుక్క అగుట..."

(పేజి 236)

రైలు ప్రయాణం కిందబెర్తులో కూర్చొని మిత్రులు గనారా గారి 'జీవన స్పర్శ' 300 పుటల నవల్ని అవిరామంగా చదివి పూర్తిచేసాక ఆవరించిన భావాలకి అంతం లేదు. కృష్ణయ్య,కృష్ణారావు, మల్లే శ్వర్రావు కాకినాడ, రాజమండ్రి, పెదబ్రహ్మ దేవం, ఇప్పటికీ నదిలా ప్రవహిస్తున్న ఎందరో వ్యక్తుల్నీ, చరిత్రల్నీ, కళ్ళ ముందు కదలాడే ప్రాంతాల్ని, ముఖ్యంగా గోదావరి జిల్లాల ట్రేడ్ యూనియన్,బ్యాంకు ఉద్యోగుల ఉద్యమ ప్రస్థానాన్ని, ఒక తరం స్వరూప స్వభావాల్ని ఎంత లోతుగా నమోదు చేసారో !

"జీవితం ఉద్వేగాలమయం కాకపోతే దానికి పరిపూర్ణత ఏముంది?"(పేజి 116) అంటాడు రచయిత. అందుకు తగ్గట్టే తన ప్రయాణంలో తారసపడిన ఉద్వేగాలన్నింటికీ ఉజ్వలమైన అభివ్యక్తితో ప్రకాశవంతం చేసాడు. చలం, కొ.కు, పుచ్చలపల్లి, త్రిపురనేని, గోరా, రాహుల్జీ, నాస్తికత్వం, హేతువాదం, కమ్యూనిజం...అన్నీ తెచ్చిపెట్టుకున్న వస్తువులుగా కాక సజీవ వాహికలుగా మన కళ్ళ ముందు నిలుస్తాయ్.మనల్ని కూడా ఆ జీవన వాస్తవికతతో కట్టి పడేస్తాయ్. ఎందుకనేది స్పష్టం,

"ఎన్నో కలలు
కన్నీటి అలలు
ఆనవాళ్ళ మడుగులో కనిపిస్తావు
ఘళ్ళుమన్న నీ కాలి అందె

గుచ్చుకున్నప్పుడుజి
గుండెను తాకిన ధ్వని
వెచ్చని కన్నీరవుతుంది.” (పేజి 228)

(మధు, రాధ, శక్కూ, సలీంల ప్రేమకథతో పాటూ అమలిన స్నేహాలూ, మౌన త్యాగాలు, ఎన్నో ఆక్రందనలు, అకళంకిత అనురాగాలు, మౌన ఘోషలూ, ప్రేమదారులూ…గోదావరి జిల్లాల నేపథ్యంలో దాదాపు ఎనిమిదేళ్ళు శ్రమించి రాసిన నవల ‘జీవన స్పర్శ’. భాషా లోపాలు, సమన్వయ దోషాలు నవలలో సాధారణమే కాన విడిచిపెడితే ఒకనాడు బ్యాంకింగ్ వ్యవస్థ లో, కార్మిక రంగంలో తలెత్తిన తొలినాటి మార్పులకు గాఢమైన చిత్రణగా ఈ ప్రయత్నం నిలుస్తుందనడంలో సందేహం లేదు. గనారా గారికి అభినంద నలతో ఈ చిన్న రైటప్!)

# చరిత్ర మరిచిన చిత్తరువు !

## కామ్రేడ్ పడాల శ్యాంసుందరరావు (నిజాయితీ కలిగిన కమ్యూనిస్టు కథ)




"నేను పడాల వీరస్వామిగారి మనువడను, రామస్వామి గారి కుమారుడనైన పడాల శ్యామసుందర్ రావును. అసలు మా పూర్వీకులు రాజమహేంద్రవరమును పాలించిన రాజరాజ నరేంద్రుని కొలువులో రెడ్డికులస్తులు. ఆ రోజుల్లో ఉన్న కులతత్వాన్ని సహించని పడాల రామిరెడ్డి గారు హరిజన వాడల్లో నివసిస్తూ వాళ్ళను సంఘటితపరిచి కులతత్వానికి వ్యతిరేకంగా పోరాడి ఆయనే స్వయంగా హరిజన యువతి ని పెళ్ళాడి హరిజనుడుగా మారిన మహనీయుడు.."(పేజి - 29)

కామ్రేడ్ పడాల శ్యాంసుందర రావు గారి జీవిత చరిత్ర "చరిత్ర మరిచిన చిత్తరువు' ఈ వాక్యాల్లో ప్రారంభమవుతుంది. రెండో ప్రపంచ యుద్ధం సమయంలో బర్మా నుండి కాలినడకన అడవుల్లో ప్రయాణిస్తూ, ప్రకృతి వైపరీత్యాలు, శత్రు విమానాలు, బందిపోటు దొంగలు, అడవి మృగాలు, కరువు కాటకాలు, ఆకలి అనారోగ్యాల్ని అధిగమించి భారత దేశం చేరిన తీరు చదివి ఒళ్ళు గగుర్పొడుస్తుంది !

"నేను పెద్దగా చదువుకోలేదు. మార్క్సిజాన్ని పూర్తిగా చదివేసాననిగానీ తెలుసుకు న్నానని గానీ చెప్పను. కానీ,నాకున్న కొద్దిపాటి రాజకీయ అనుభవంతో చెప్పేదేమంటే కమ్యూనిస్టులు ప్రజా విశ్వాసాన్ని కోల్పో యారు. కమ్యూనిస్టులు మావాళ్ళు అని ప్రజలు భావించే రోజులు పోయాయి..." (పేజి 208)

1996, సెప్టెంబరు 29, ఆంధ్రభూమి పత్రికతో మాట్లాడుతూ పడాల అన్న మాటలివి. ఊరికే పైపైన వచ్చినవి కాదు. గుండె లోతుల్లోనుంచి బాధతో వచ్చినవి. ఒక ఉన్నతమైన ఆదర్శాన్ని ఆచరణలో కొనసాగించిన తిరుగులేని వ్యక్తి విచారంతో వెల్లిబుచ్చినవి. ఎందుకు ఈ స్థితి దాపురించింది ? "నేను చిన్నతనం నుండి కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తగా, పార్టీ క్రమశిక్షణ కలిగిన వ్యక్తిగా, పార్టీ సిద్ధాంతాలను తు.చ.తప్పకుండా నడుచుకునే వ్యక్తిగా ఉ ండి కూడా పార్టీలోని జిల్లాస్థాయి, రాష్ట్రస్థాయి నాయకులు వ్యవహరించే విధానాలకు అనేకసార్లు మనస్తాపం చెందిన రోజులు కూడా ఉన్నాయి.అన్ని పార్టీలవలె కమ్యూనిస్టు పార్టీలో కూడా కుల,మత,ఆర్థిక పరమైన విభేదాలు వచ్చాయి. ఇందువల్లనేమో నేను పార్టీలో కొనసాగలేక పోయాను..." అంటారు. (పేజి 75)

రెండు సార్లు శాసనసభ్యుడిగా చేసి పిల్లల చదువుకోసం తీవ్రమైన ఇబ్బందులు పడ్డ వ్యక్తి వెలిబుచ్చిన అభిప్రాయా లివి. పూరి గుడిసె తప్ప, కనీసం సొంతిల్లు కూడా సంపాదించు కోని నిజాయితీగల నేత తల్లివంటి పార్టీలో తలెత్తిన అసాంఘిక పోకడల పై వాపోయిన వాక్యాలివి. ఎలాంటి యోధుడాయన ?

"ఒకటి చెప్పగలను. ఒక కమ్యూనిస్టు ఎలా బ్రతకాలో అలా బ్రతికిన ఒక నమూనా జీవితం అతనిది. తాను ఎక్కడ ఏ స్థలకాలాలలో ఎలా రాజకీయ ప్రస్థావన మొదలుపెట్టాడో అక్కడే అదే విలువల పునాదిగా ఒక తరం గుర్తు పెట్టుకొనే ఆచరణ ఈ కాలానికి ఇచ్చాడు. తన చుట్టూ పెరుగుతున్న ముళ్ళకంచెలు చూస్తూ కూడా తాను మాత్రం పరిమళం వాడని ఎర్రజెండా లాగే తలెత్తుకుని బ్రతికాడు. అందుకే, శ్యాంసుందరరావు జీవితం నుండి ఈతరం నేర్చుకోవా ల్సిన విలువలు ఉన్నాయి, త్యాగం ఉంది, నిలువెత్తు నిబద్ధత ఉంది."(పేజి 20,21) అన్న సంపాదకుని మాటలు ఎంత నిజాలో పుస్తకం చదూతుండగానే మనకు తెలుస్తుంది !

ఆకలి బాధ తాలలేక కూలిపనులకెళ్ళింది మొదలు ప్రాణప్రదంగా "అంబేద్కర్ " పేరుపెట్టి పెంచుకుంటున్న ఆవుదూడని డబ్బుల్లేక అమ్మాల్సి రావడం వరకూ, అజ్ఞాతంలో ప్రమాదపు టంచులకి వెళ్ళి రావడం నుంచి రాజకీయ నాయకులతో ఐన పరాభవాల వరకూ, శ్యాం సుందరరావు గారు సంక్షిప్తంగా చెప్పిన జీవనచిత్రణ, తదనం తరం ఆయన అసెంబ్లీ డిబేట్స్, ముఖ్యుల అభిప్రాయాలు, ఫొటోలతో సుమారు 350 పుటల పుస్తకం ఇది.ఇంతకాలం ఎందుకువిస్మరించడం జరిగింది అనే కదామీ ప్రశ్న. జవాబు ధవళ సత్యం గారి మాటల్లో, "..పార్టీ పని అంటే ఇతర పనులన్నీ పక్కనపెట్టి వచ్చినవాళ్ళకు , పార్టీ పనులకు ప్రాధాన్యత ఇచ్చేవారు. అది ఆయన కమిట్మెంట్. నా దృష్టి లో కమ్యూనిస్టు పార్టీలో అత్యంత నిజాయితీ పరుడు. అత్యంత ప్రజాస్వామికవాది. నా దృష్టి లో ఆయన డాక్టర్ జివాగో లాంటివారు. ఒకటి నిజం. చరిత్ర పుటలు తిరగేస్తే పడాల శ్యం సుందరరావు గారి స్థానం ఎక్కడ ? కారణం ఏమిటి ? దళితులు నాయకత్వ స్థానంలో ఉండకూడదా ? అదొక విషాదం." (పేజి 222)

(చరిత్ర మరిచిన చిత్తరువు : కామ్రేడ్ పడాల శ్యాంసుంద రరావు, డా.గుర్రం సీతారాములు, డా. పడాల సమతా రోష్నీ సంపాదక త్వంలో వచ్చిన గ్రంథం. సమసమాజం కోరుకునే ప్రతి ఒక్కరికీ అంకితం ఇవ్వబడిన ఈ పుస్తకంలో విలువైన ఆయన స్వీయచరిత్రతోపాటు మరో పదిమంది వెలిబుచ్చిన అంతే విలువైన అభిప్రాయాలు ఉన్నాయి. ఈమధ్యనే వచ్చిన ఈ ప్రచురణ నిరాశ నిండిన వాతావరణంలో ఆశతో కూడిన ఆక్సిజన్ వంటి ప్రయత్నమని భావిస్తూ ఈ చిన్న పరిచయం.)

# వెన్నెల ఊసులు - వన్నెల బాసలు !



"నీ రాకతో
పునరుత్థానమయ్యానుజి
ఇక బ్రతుకులో
చావవసరం లేదు"

"ప్రతీరోజూ
చచ్చిపోతున్నప్పుడుజి
ఆమె సమక్షంలో
మరణం సుఖం కదూ"

విప్లవకారుడు కచ్చితంగా ప్రేమికుడై తీరతాడు. విప్లవం, ప్రేమా రెండూ వేర్వేరు కాదు. ఒకటి దిక్కూ, మరోటి దిక్సూచి. ఒకటి ప్రమిద, మరోటి వెలుగు. ఒకటి మధనం, మరోటి మార్గం!

ఆమె ఒక ఆశ. ఆపేక్ష. ఆకాంక్ష. ఆశయాల కొనసాగింపు. ఒక సమిష్టి స్వప్నం. వ్యక్తులవి కలలు. సమాజానిది స్వప్నం. స్వప్నాలన్నీ స్వీకారాలే. స్వీకర్త కవి కాంతుడు. మన రవి కాంతుడు!

"నీ శ్వాసతో
ఈ నేల జీవం పోసుకుంది
ఆ గాలిలో
నేను బంధీ అయ్యాను"

"చూపులు
నిశ్చలంగా ఉన్నాయి
లోపలజి
నిరంతర చలనం"

రాత్రి వెన్నెల్ని రాజేసి అక్షరాలు గా మలిచాడు. ఆమె వన్నెలకి బాసల్ని దిద్దాడు. ఆ అనంత ప్రేమ కల్లోలాన్ని మనందరి ముందూ ఉంచాడు. ఏం చేస్తాం, ఇక తప్పించుకోలేం!

పుస్తకం అంతటా ఆక్రమించిన 'ఆమె' ఒక సజీవమైన చైతన్య స్రవంతి. అనేక కోరికలకి

అక్షర కొలువు. అందుకే కవి భావుకతకి మనం కూడా కదిలిపోతాం. చివరి వరకూ ఆ ఆర్తితోనే ప్రయాణిస్తాం!

"స్వేచ్ఛ ప్రేమికుల లక్షణం
ఆమె స్వేచ్ఛ ప్రేమకు వ్యక్తీకరణం"
"గుర్తించిన మొదటి పేరు నేను
ఆమె పెట్టిన తొలి సంతకం ముద్దు"

జీవితాన్ని ప్రేమమయం చేసుకోవడం ఒక కళ. ప్రేమ కోసం జీవితాన్ని అర్పించే ధైర్యం ఉన్నప్పుడే అది అలవడుతుంది. అలాంటి ప్రేమే ఎప్పటికైనా నిలబడుతుంది!

"వెన్నెల ఊసులు - వన్నెల బాసలు" మిత్రుడు రవికాంత్ రెండో నానీల ప్రేమ గుచ్ఛం. ప్రఖ్యాత రచయిత, మిత్రులు సూర్యవంశీ అలాగే ఆచార్య ,డా.ఎన్. గోపీ ల ముందు మాటలతో వచ్చి ఈ మధ్యే ఆవిష్కరణ జరుపుకుంది!

"ప్రేమ
ఒక గొప్ప అనుభూతి
అది ధర్మంగా మారితే
ఆమె నా సఖి"
"ప్రేమ పొందిన
జీవులు ధన్యులు
మమతల రాజ్యంలో
కొలువు తీరుతారు"

క్షేత్రస్థాయి ప్రత్యామ్నాయ రాజకీయ కార్యాచరణ నుండి ప్రస్తుత అంబేద్కరిస్టు బహుజన రాజకీయాల వరకూ లోతైన అవగాహన ఉన్న ఉద్యమకారునిలో ఇంత ప్రేమ గాఢత ఆశ్చర్యం గొల్పుతుంది!

దశాబ్దాల క్రితం నాటిదే ఐనా ఆమె లాగే ప్రేమ కూడా పాతబడదనడానికి ఈ పుస్తకమే ఒక నిదర్శనం. కావాల్సిన వారు ఫోటో లో ఇచ్చిన వివరాల్లో ఆయన్ని సంప్రదించవచ్చు. రవి కాంత్ కి ప్రత్యేక అభినందనలు!

**(ప్రపంచ కవితా దినోత్సవం సందర్భంగా రాద్దామని అనుకున్నా కానీ తీవ్రమైన పని ఒత్తడి, స్ట్రెస్ కారణంగా కాస్త ఆలస్యంగా ఐనా మిత్రులు, ఉద్యమ సహచరులు, ఆత్మీయులు రవికాంత్ ప్రేమాక్షరాల్నిలా హృదయానికి హత్తుకుంటూ ప్రేమతో ఈ చిన్న రైటప్.)**

# ఆలిండియా కుంభకోణంగాళ్ళ సంఘం!

## (రిజిస్టర్ నంబర్ - 420) సంచలన రచయిత ఇంద్ర వ్యంగ్యాస్త్రాలు.




"గొర్రెల పెంపకానికి భారతదేశం చాలా అనువైన వాతావరణం కలిగి ఉంది. కాశ్మీరు నుండి కన్యాకుమారి వరకు గొర్రెల్ని ఎక్కడైనా ఏపుగా పెంచవచ్చు. గొర్రెల ఆహారమైన 'నిరక్షరా స్యత, మూర?త్వం, మతపిచ్చి, మూఢవిశ్వాసాలు, అవివేకం, పూనకాలు, వాస్తు, జాతకాలు, జోతిష్యాలు, ముహూర్తాలు' అనే చక్కని రకరకాల హైబ్రీడు గడ్డిరకాలు భారతదేశంలో విస్తృతంగా పెరగడానికి అనువైన నేలలు విస్తారంగా ఉండటంవల్ల గొర్రెల ఆహారానికి లోటు ఉండదు. ఇన్నిరకాల గొర్రెల గడ్డిరకాలు ప్రపంచంలోకెల్లా ఒక్క భారతదేశంలోనే విస్తృతంగా పెరగడం, మన గొర్రెల పెంపకందార్ల అదృష్టం అనే చెప్పాలి..."

(ఈ గొర్రెకు సర్వం బొచ్చు! పేజి31)

"ఈ దేశంలో ధర్మం అంటే దోచుకునేవాళ్ళకి ఏది లాభి స్తుందో అదే ధర్మంరా అబ్బిగా. అంటే, కాకుల్ని కొట్టి గెద్దలకి వెయ్యడమే ధర్మం. ఆ ధర్మాన్నే ఈ పవిత్ర భూమి నేలిన చక్రవర్తులు, రాముళ్ళు, రాయుళ్ళు అంతాపాటించారు. రాయల పాలన లో ఉండే వందలరకాల పన్నుల మోత భరించలేక పేదలు, నిరు పేదలు, రైతులు ఊళ్ళూ, పొలాలు వదిలిపెట్టి పారి పోయారని చరిత్ర చెబు తోంది...రాతి విగ్రహాలకి మణు గుల కొద్దీ వెండి బంగారాలు, పచ్చల పతకాలు దానం చేస్తే ఆ దేవాలయాల మెట్లమీద అడుక్కుతినే వేలాది బిచ్చగాళ్ళకేమైనా ఒరుగు తుందా బడుద్దాయ్ ? ప్రజల సంపద గుళ్ళకీ బోడిగుళ్ళకి దోచిపెట్టిన రాయలకీ - ఇవాళ తిరుపతి గోపురాల్ని స్వర్ణ మయం చెయ్యడానికి ప్రజల్ని నిలువుదోపిడీ చేస్తున్న ప్రజాస్వామ్య ప్రభువులకీ, సారంలో ఏమైనా తేడా ఉందా..?"

(రావాలిరావాలి,రాయలవారిపాలన,పేజి43)

"దేశ ఆర్థికాభివృద్ధికి దన్నుగా ఉపయోగ పడాల్సిన టన్నుల కొద్దీ బంగారాన్ని ఇలా మన నెత్తిమీద కిరీటాలుగా నగలుగా వ్యర్థం చేస్తుంటే దేశానికేం లాభం? అయినా స్వామివారికి ధనం మీద అంత కాపీనం ఎందుకు చెప్పు? రోడ్డుమీద బిచ్చగాడు జనాలు విసిరే చిల్లర కోసం పెట్టుకునే సత్తు కంచానికీ, స్వామివారి హుండీకి నాకేం తేడా కనిపించడం లేదు. రెండూ అడుక్కునేందుకే. అసలు దేవుళ్ళకి ధనం ఎందుకు చెప్పు ?"

ోయింద!గోయింద! గోయిందా! పేజి57)

“..మనుషుల హక్కులకు భంగం కలిగిస్తే మానవులు మానవ హక్కుల సంఘానికి మొరపెట్టుకుంటారట. మనల్ని నిద్రపోని వ్వకుండా విశ్రాంతి తీసుకోనివ్వకుండా, కాపురాలు చేసుకోనివ్వకుండా ఇలా నిర్భంధించి టిక్కెట్టు పెట్టి మనల్ని ఇక్కట్లపాలు చేస్తూ సొమ్ములు చేసుకునే ప్రబుద్దుల మీద మనం ఏ సంఘానికి మొర పెట్టుకోవాలి? దేవుళ్ళం దరం కలిసి దేవుళ్ళ సంఘం పెట్టుకొని నిద్రహక్కు, సంసార హక్కుల కోసం పోరాడాలా మనం ? అపుడు కరెంటు కోసం, మంచి నీళ్ళ కోసం అడిగే అమాయక జనాల మీద కాల్పులు జరిపినట్టే ఈ ప్రబుద్దులు మన మీదా కాల్పులు జరుపు తారేమో! జగదానందకారకా అంటూ నామీద పాటలు కట్టి భజనలు చేస్తారు. మన కెక్కడ ఆనందం ఏడ్చింది ఈ బందిఖానా బతుకుల్లో?”

(ళాకుళిద్రొస్తోందిదేవీ, కుంచెంజళుగు,పేజి91)

“.ఈ చట్టం ‘అత్యాచారం’ అనే పదం అసహ్యంగా ఉందికాబట్టి దాన్ని నిషేధిస్తోంది.రేప్ అనేది సదా (నిత్యమూ) జరిగే ఆచారం కాబట్టి అత్యాచార పదాన్ని ‘సదాచార’ పదంగా మారుస్తున్నాం. రేప్ని జాతీయ సదాచారంగా ప్రకటి స్తున్నాం.. రేపిస్ట్ ల్ని ఇకనుండి ‘సదాచార పరులు’గా పేర్కోవాలి. ఆ సదాచార పరుల్ని నేషనల్ హీరోలుగా గుర్తించి ఉద్యోగాల్లో రిజర్వేషన్లు కూడా ఇస్తాం. రేపిస్ట్ ల్ని,సారీ, సదాచార పరుల్ని ప్రేమించండి. వాళ్ళూ మనుషులే. ఠీక్ హై? ఇట్స్ ఓకే.”

(ఠీక్ హై. ఇట్స్ ఓకే, పేజీ 108)

‘బలహీనుడి ధర్మాగ్రహమే వ్యంగ్య రచనోత్పత్తికిమూలం” అనే జ్ఞానం కలిగిన సీనియర్ రచయిత డి. ఆర్.ఇంద్ర సుమారు మూడు దశాబ్దాల పాటు సామాజిక, రాజకీయ అపసవ్య ధోరణుల పై వివిధ పత్రికల్లో రాసిన వ్యంగ్య రచనలని ఇలాఇన్నాళ్ళ కొక చోటికి చేర్చి ప్రచురించారు. అదే, ఆలిండియా కుంభ కోణంగాళ్ళ సంఘం (రి.నెం :420).33 వ్యంగ్యా స్త్రాలతో సెటైరికల్ గా, ఎంత హాస్య చతురతో, అంతే తీవ్ర మైన సామాజిక చింతనతో కడుపుబ్బా నవ్విస్తూనే, మెదడ్ని మెలిపెట్టే ఆలోచ నాత్మక వ్యంగ్య ధోరణితో వచ్చిన 144 పుటల ఈ గ్రంథం వర్తమాన వ్యవస్థ పై సూటిగా ఎక్కుపెట్టిన తిరుగులేని అక్షరాయుధం ! “ఇవి ఎవరి మనోభావాలు దెబ్బతీసేందుకు పనిగట్టుకు రాయలేదు. రాయడం రాజకీయ సామాజిక అవసరం కాబట్టి రాసాను. ఎవరి మనో భావాలకి వారే కారకులు. ఇవి నచ్చితే చదవొచ్చు, మెచ్చు కోవచ్చు. నచ్చకపోతే విమర్శిం చవచ్చు, విసిరి కొట్టావచ్చు. నచ్చని పుస్తకాల్ని చదవడం మానేయాలి.ఎవరూ బలవం తంగా చదివించరు. అంతే గానీ, నచ్చకపోయినా చదివి, మనోభావాలు దెబ్బతిన్నాయ ని కేసులు పెట్టడం యేవిటి

దరిద్రంగా.దైవమత విశ్వాసాల నీ, రాజకీయ సిద్ధాంతాలనీ నమ్మడం వాటిని ఆచరించడం ఎలాటి ప్రాథమిక హక్కో,అవి నచ్చకపోతే వాట్నితిరస్కరించి, విమర్శించడమూ అంతే ప్రాథమిక హక్కు. భావ ప్రకటనా స్వేచ్ఛనీ, హక్కునీ మానవ పుట్టుకే ఇస్తుంది కానీ రాజ్యాంగాలూ, ప్రభుత్వాలూ ఇవ్వ(లే)వు..." అంటూ కుండ బద్దలు కొట్టి చెప్పడం ఘాటు గానే అనిపిస్తుంది మరి !

పుస్తకం అట్ట చివర్నిచ్చిన "ఈ దేశానికి సైన్స్లో నోబుల్ బహు మతులు ఎందుకు రావంటే అందుకు కారణం ప్రభుత్వాలే స్వయంగా మతదృక్పథాన్ని ప్రోత్సహిస్తూ, శాస్త్రీయ దృక్పథాన్ని కించ పరుస్తూ శాస్త్రీయ స్పృహ కలిగిన వైజ్ఞానిక వాతావర ణాన్ని నిర్మూలించ డమే." అనే ప్రముఖ శాస్త్రవేత్త కీ. శే. డా. పి. ఎమ్. భార్గవ మాటలూ, "అత్యాధునిక జీవనశైలిలో బతుకుతున్న ఈతరం మానసి కంగా మాత్రం ఇంకా ఆటవిక దశలోనే వుంద" నే ప్రముఖ సైన్సు రచయిత కీ. శే కొడవటి గంటి రోహిణీప్రసాద్ మాటలు రచయిత దృక్పథాన్ని చెప్పకనే చెబుతాయ్ !

బెకబెకలాడండనే వర్షాల కథ మొదలుకొని  నీ పిండం పిల్లు లకు పెట్టా అనే రిటైర్డ్ ఉ ద్యోగి సంభావనల సరికొత్త కథ వరకూ,పోయిన పుట్టబాబా స్థానాన్ని భర్తీ చేయడానికి అంధప్రదేశ్ కి కొత్తబాబా కావాలని ఏలినవారుప్రకటించే 'కావలెను బాబాలూ, భక్తులూ కావలెను' నుండీ, జ్యోతిషం ఒక సైన్స్! కాదన్నవాడ్ని కాల్చిపారేస్తా! దాకా ప్రతీ రచన ఒక అస్త్రమే. "పొట్టకోస్తే అక్షరం ముక్కలేని పీఠాధిపతుల, మఠాధిపతుల, స్వామీజీల పాదధూళి శిరస్సున ధరించి తరించే విద్యాధికులకు సగౌరవంగా అంకితం" అంటూ ఈడ్చి కొట్టినట్లున్న అక్షరాలు పాఠకుల కాలరు పట్టుకొని ప్రశ్నిస్తుండగా ముగింపు కవితనిలా తల్చుకుంటూ ఈ చిన్న రైటప్!

"పదండి పదండి వెనక్కి వెనక్కి
వలసపాలకుల
నిత్య అశ్వ గోమాంసభక్షక వేదరుషుల
భూత కాలానికి
అశ్వమేధ,నరమేధ,వాజపేయ,
పౌండరీక అతిరాత్ర రోత యాగాల విషధూమాలలోకి
గెంతండి గెంతండి!
..............................
చీకట్లోంచి కటిక చీకట్లోకి !
అజ్ఞానంలోంచి పరమ అజ్ఞానంలోకి !

బ్రహ్మసత్యం జగన్మిధ్యల విషపురొంపిలోకి

తరించండి తరించండి !

(మిత్రులు డి. ఆర్. ఇంద్ర కొన్ని నెలల క్రితం ఈ పుస్తకం గురించి చెప్పి నన్ను ముందు మాట రాయమని అడిగారు. మీ పుస్తకానికి మీకంటే బాగా ఏ పెద్దమనిషి కూడా మాట రాయలేడని చెప్పాను. ఆ మాటను స్వీకరించిన ఆయన నా మాటను గౌరవించీ, "నాకై నేనే రాసుకున్న నా ముందు మాట" పేరిట ఈ పుస్తకం మున్నుడిని స్వయంగా రాసుకుని, "కనీస ఇంగిత జ్ఞానానికి బహుదూరం గా నానారకాల అశుభ్రతలతో బతుకుతూ, నా తాత్విక సౌందర్యమయ జీవితానికి అడుగడుగునా మళ్ళకంపలా అడ్డు పడే ఈ రోత ప్రపంచమే నాలో నిత్యం లోకం పై పేరుకుపోయే ఆగ్రహాన్నీ, అసహనాన్నీ, అసంతృప్తిని, ఖసినీ వ్యంగ్య రచనల రూపంలో వెంటిలేట్ చేస్తూన్నందుకు ఈ రోత ప్రపంచానికి కూడా నా థాంక్స్ "అంటూ, "ఇంతకన్నా బాగా యే పెద్దమనిషి రాసి పెడతాడు" అని ఆ మాటకి ముక్తాయింపు కూడా ఇచ్చు కున్నారు.ఆసక్తి ఉన్న మిత్రుల కోసం పుస్తకం సాఫ్ట్ కాపీ పంపుతున్నాను. తప్పక చదవండి !)

# నది గొంతుకతో కవి చేసిన కవాతు..!

## పద్దెనిమిదొందల పద్దెనిమిది




'నేను భీమా నదిని మాట్లాడుతున్నాను.' అని మొదలయ్యే గంభీరమైన నది స్వగతం. నేలని ముద్దాడుతూ ముందుకు ఉరికురికిపోయే ఈ దేశ గతం. ఏ నేల అది ? ఎలాంటి నేలది ?

"కాళ్ళకి చెప్పుల్లేని నేల
 సిగ్గు కప్పుకునేందుకు
 గుడ్డ పీలిక లేని నేల
 ప్రేమ తీరని నేల, చేతులెత్తి
 రాత్రింబగళ్ళని కావులించుకునే వేళ
 ఆకాశం నుంచి వివక్షల వాన కురిసేది
'నేల, ఖగోళమంతటిలో దాహపడ్డ తొలి జీవశకలం "

అలాంటి నేల తల్లి ఆక్రందనల్ని విన్న కవి కవాతైయ్యాడు. కల్లోల హృదయాల బాధని ఆర్తిగా గుండెలాన్చి వినే ప్రవాహమయ్యాడు.
కన్నీళ్ళకి కలం భరోసాతో అండగా నిలిచిన ధిక్కారమయ్యాడు. అందులోంచే,

"ఆ ఊరి పిడికెడు మట్టిలోంచి
 తొలి మానవుడి గుండె లయనై పల్లవిస్తున్నా" అనగలిగాడు. అంతేకాదు,

" పెను తుఫానుకు ముందు
 పెనుగులాడే గాలిది
 జీవన్మరణ యాతన " అంటూ,

"ఈ మౌనాన్ని బద్దలుకొట్టాలి
 ఈ వేటాడ్డాన్ని వ్యతిరేకించాలి
ఏ దేశమైనా దేవుళ్ళది కాదు, కష్టజీవులదని చెప్పాలి." అని నినదించాడు.

వక్రీకరణకు గురౌతున్న చరిత్ర పట్ల వేదన వెలిబుచ్చిన కవి,

"చరిత్ర , సంపద శయ్య పై పడుకుని
 నిరుపేద నేల చెలమల్లోకి తొంగి చూడలేదు
చరిత్ర నిర్లక్ష్యాన్ని రాసేందుకే ఒక్క వర్ణమాల చాలడం లేదు.

చరిత్ర, చుక్కల్లేని ఆకాశమై విస్తరించింది
నిస్సార వృక్ష ఛాయగా పరుచుకున్నది
చరిత్రది, ఒత్తి బానిస పోలిక
పరాధీన సౌందర్యం" అంటాడు.
అలాగని నిస్పృహ నూరిపోయడు. పైగా, "తనని తాను పోగొట్టుకోవడం
మళ్ళీ పురుడు పోసుకోవడం
ఒక్క విప్లవానికే చెందిన రసవిద్య" అంటాడు.
"సాటివాడి బ్రతుకు పై మమకారం కవితలో
ఆకారం పొందుతుంద" న్న కవి, "సంకెళ్ళు కరిగి నీరైపోవాలి/ చెరసాలలన్నీ భూకంపం వచ్చి కూలిపోవాలి." అంటాడు.
శతాబ్దాల అణగారిన వర్గాల ప్రజలగొంతుకగా
నిలిచిన భీమా నదిలోకి కవి ప్రవేశించి దానిని
ఆలింగనం చేసుకున్నాడు. మరుగునపడిన
అనేక వ్యధల్ని ఈ ప్రయాణంలో చూసాడు. ఆ పోరాటంలో తాదాత్మ్యం చెందాడు. అందుకే,
"నీ గుండెలవిసిపోయే లోపు
నా ధర్మాగ్రహంతో
దాహం తీర్చుకోవే ఇండియా !
కాస్త తెరిపిన పడు" అనగలిగాడు.
పద్దెనిమిదొందల పద్దెనిమిది హోరు ప్రచురణగా వచ్చిన శ్రీరామ్ పుప్పాల దీర్ఘ కవిత. భీమా కోరేగాం నేపథ్యంలో చరిత్రని నిజాయితీగా అవలోకనం చేసుకొని రాసింది.రాజ్యహింసని ప్రశ్నించడానికి ఇంతటి సీరియస్ అంశానికి దీర్ఘకవితా ప్రక్రియను ఎంచుకోవడం ఈ రచన విశిష్టతనేది నా అభిప్రాయం.
(మొన్ననో కార్యక్రమంలో కలిసిన మిత్రులు ప్రభు ఈ పుస్తకం ఇచ్చారు. కవిత్వం చదివి చాలా రోజులైందని, చదివేసి రాస్తున్న తక్షణ స్పందనే కానీ ఇదేమీ సాధికారిక సమీక్ష కాదు. నాకు సాహిత్య విమర్శ అంతగా రాదు. భీమా నదిని ప్రతీకగా తీసుకుని చరిత్రని వర్తమానంతో అనుసంధానించే పనిని కవి సమర్థవంతంగా చేసారు. పుస్తకం గెటప్, డిజైన్ కూడా బావుంది. చివరగా, పుస్తకం ముందు వెనుక పుటలు మరీ పదికి పైన అభిప్రాయాలతో నింపడం (అన్నీ బావున్నప్పటికీ) ఒకింత నాకు బరువుగా అనిపించింది. శ్రీరామ్ గారికి అభినందనలతో ఈ చిన్న రైటప్.)

# మా మంచి టీచర్ (కరదీపిక)

## (మన పిల్లలే మన వర్తమానం,భవితవ్యం !)




"మీరు టీచర్‌గా ఏదైతే అనుభూతి చెందారో (ఫీలయ్యారో)అదే పద్ధతిలో వ్యక్తం చేయ గలిగినప్పుడు మాత్రమే మీలో సజీవత (లైవ్లీనెస్) తొణికిసలాడుతూ ఉంటుంది. గాఢమైన అనుభూతే గాఢమైన అభివ్యక్తీ కరణకు తోడ్పడుతుంది. చదువు జ్ఞానంగా మారే రహస్యమిదే. మన మాటలకు – మన పనికి ఆ సజీవతే ప్రాణప్రదం.". (పేజీ – 12)

మన పిల్లలు ఎలా ఎదగాలి? సంతోషంగా ఎదగాలి. ఆరోగ్యంగా ఎదగాలి. సహజంగా ఎదగాలి. సమగ్రంగా ఎదగాలి. అందుకు వ్యవస్థ లు, ప్రభుత్వాలు బాధ్యత తీసుకోవాలి. ప్రతి జాతికి బాల్యమే అందమైన ఉషోదయం. సత్యం – శివం – సుందరమైనది పిల్లల భవిష్యత్తు. బాల్యం పట్ల నిర్లక్ష్యం వహించేవారి కృషికి అర్ధమేముంటుంది? ప్రపంచంలోని ఏ ఖండంలోని పిల్లలైనా శారీరక ఆరోగ్యం తోనూ, మానసిక ఆరోగ్యంతోనూ, సామాజిక ఆరోగ్యం తోనూ , ధార్మిక (తత్వజ్ఞాన) ఆరోగ్యంతోనూ దృఢంగా ఎదగాలని ప్రపంచ ఆరోగ్య సంస్థ (వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్) నొక్కి చెబుతున్నది." (పేజి 15)

"పిల్లల్లో ప్రశ్నలు రేకెత్తే విధంగా టీచర్ చొరవ తీసుకోవాలి. పిల్లలు అడిగే ప్రశ్నలు అన్నింటికీ టీచర్ల వద్ద సమాధానాలుండవు. అయినా, నిజాయితీగా తెలియదని ఒప్పుకోవాలి. వారు చెబితే స్వీకరించాలి. లేదా తెలుసుకుని చెప్పాలి. లేదా టీచర్ – పిల్లలు కలిసి సత్యశోధన చేయాలి. అదే జ్ఞాన సముపార్జన మార్గం. అంటే పిల్లల నుండి నేర్చుకోవడానికి సైతం టీచర్ సిద్ధంగా ఉండాలి. టీచర్ అంటే నిత్య విద్యార్థి.". (పేజి 41)

బియాండ్ ది క్లాస్‌రూమ్ (తరగతి గది ఆవల) బృందం పేరుతో గత మూడేళ్ళుగా కలిసి పని చేస్తున్న కొద్దిమంది విద్యా కార్యకర్తలు, పిల్లల ప్రేమికులు సమిష్టిగా తయారు చేసిన కరదీపిక "మా మంచి టీచర్" అనే 50 పుటల ఈ చిరు పుస్తకం. "మనిషి యంత్రాన్ని ఉపయోగించు కోవాలే తప్ప మనిషి యంత్రంగా మారకూడదు." అనే స్ఫృహతో కూర్చిన ఈ మాన్యువల్ ప్రత్యామ్నాయ మానవీయ విద్యావిధానాన్ని బలోపేతం చేసుకుందుకు ఒక మంచి ఆసరా !

చదువు నాలుగ్గోడల మధ్య నేర్చుకునేది కాదనీ,నలుదిక్కులా కదిలి, నలుగురితో మెదిలి,

నదిలా ప్రవహించగలిగినప్పుడే సార్థక విద్య సాధ్యమనే గొప్ప ఆశయంతో మహాత్మా గాంధీ,డా. బాబాసాహెబ్ అంబేద్కర్, మహాతత్వవేత్త సోక్రటీస్ మొదలగు మహనీయ మూర్తుల ప్రేరణతో ప్రకటించబడ్డ ఈ పుస్తకం ప్రతీ సామాజిక కార్యకర్త, ముఖ్యంగా ఉపాధ్యా యులు, విద్యావేత్తలు, తల్లిదండ్రులనే కాదు, పౌరసమాజంలో బాధ్యత కలిగిన ప్రతి వ్యక్తీ తప్పనిసరిగా చదివి, చర్చించి, తర్కించి, విమర్శించి తీరాల్సిన అవసరం ఉంది. ఎందుకనేది స్పష్టం, "మన పిల్లలే మన వర్తమానం, భవితవ్యం, ఆనందం !" (పేజి 3)

**(అక్కడక్కడా మార్పులు, చేర్పులు చేయాల్సిన అవసరం ఉన్నప్పటికీ, మిత్రులు పిల్లల కోసం, మంచి విద్యావిధానం రూపకల్పన కోసం తెలుగు రాష్ట్రాల్లో క్షేత్రస్థాయి లో పనిచేస్తున్న కె. శాంతారావు గారు రచించి కూర్చిన ఈ పుస్తకం ఒక్క సిట్టింగ్‌లో చదివేంత సులువుగా రాసారు. ఆయనకి ప్రత్యేక అభినందనలు. ప్రతీ విద్యా రంగ, సామాజిక కార్యకర్త, ఆలోచన పరులూ కచ్చితంగా చదవాల్సిన ఈ కృతి ఆసక్తిపరుల కోసం సాఫ్ట్ కాపీ పంపుతున్నాను. ఇంకా ఈ అంశానికి సంబంధించి విషయాలు తెలుసు కోగోరేవారు శాంతారావు గార్ని సంప్రదించవచ్చు !)**

# దొమ్మేటి సత్యనారాయణ బోధి పదో వర్ధంతి !

## బౌద్ధ చింతన : రేడియో ప్రసంగాలు !!

## (బౌద్ధ బహుజన రచయిత విశిష్ట రచన!!!)




"జీవరాశినంతటినీ ప్రేమించే అలవాటుకన్నా మించిన గొప్ప "నీతి" మరొకటిలేదు. మనః శాంతికి మించిన సంతోషం లేదు. సహజ సిద్ధంగా కంటికి కనబడే సత్యాన్ని అవగాహన చేసుకోకుండా కనబడని దానికోసం ప్రాకులాడటం అవివేకం. నీతికంటే అభివృద్ధి చెందుతున్న విజ్ఞానానికి మించిన గొప్ప మతమేదీ లేదు. కళ్ళముందు సహజసిద్ధంగా
ఫలితాల్ని, వాస్తవాల్ని నిరూపించగలిగిన దానికంటే మించిన సిద్ధాంతమేదీ లేదు."

(పేజి 11)

"హేతుబద్ధంగా ఉండటానికి కావలసిన గుణా లన్నీ ఈ మతానికున్నాయి. అది భావితరాల వారి ఆలోచనలకు కూడా సరిపడతాయి. ఈ మత సూక్తులు శాస్త్రీయంగాను, హేతుబద్ధం గానూ, అభివృద్ధి కరంగానూ ఉంటాయి. ఈ ఆధునిక ప్రపంచంలో ఏ వ్యక్తయినా నేను ఈ మతావలంబిని అని చెప్పుకుని గర్వించదగ్గ విషయం. నిజంగా ఇది శాస్త్రోక్తానికి మించిన శాస్త్రీయత, సామ్యవాదానికి మించిన సామ్య వాదం, ప్రగతిశీలభావాలకి మించిన ప్రగతిశీలత ఈ మతం ఆధ్యాత్మిక చింతనలో మనకు గోచరిస్తుంది.". (పేజి 14)

"...బుద్ధుడు చెప్పిన మేరకైతే బౌద్ధాన్ని మతం అనడానికి వీలులేదు. మతం అనగానే మనకు గుర్తొచ్చేవి ఏమిటంటే ? దేవుడు, దయ్యం, పూజలు, క్రతువులు, పవిత్ర గ్రంథాలు, పూజారి,గుడి మొదలైనవి. ఇవి ఏవి ఆది బౌద్ధంలో అంటే, బుద్ధుని జీవిత కాలంలో లేవు. ఇస్లాం మతానికి ఖురాన్ పవిత్ర గ్రంథం. హిందూ మతానికి ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత, సిక్కు మతానికి గ్రంథ్ సాహెబ్ ఉన్నట్లుగా బౌద్ధానికి పవిత్ర గ్రంథం అంటూ ఏదీ లేదు. అందుకని బౌద్ధాన్ని ఈ అర్థంలో మతం అనటానికి వీలులేదు. ఒక జీవన ప్రణాళికను మతమని మనం పిలువదలిస్తే బౌద్ధం ఒక ధర్మబద్ధ జీవన ప్రణాళిక కనుక దానిని మతం అనవచ్చు.". (పేజి 17)

"సమానత్వాన్ని బోధించి, వర్ణవ్యవస్థను ఖండించి, పీడిత ప్రజలకు ధైర్యవిశ్వాసాలను,

ఆత్మస్థైర్యాన్ని కలిగించిన ఆది బౌద్ధం – భారత చరిత్రలో అభ్యుదయకర పాత్రను నిర్వ హించింది. దీనిని విప్లవకర పాత్ర అన్నా అతిశయోక్తి కాదు. బౌద్ధం సామాజిక, తాత్విక తిరుగుబాటుకు సంకేతం. ప్రతీదీ మారుతుంది.ఏదీ శాశ్వతం కాదు. వర్ణవ్యవస్థ కూడా అంతే.వందలాది ప్రసంగాలలో బుద్దుడు వర్ణవ్యవస్థను ఖండించాడు. రాచరికాన్ని, అసమానత్వాన్ని, అగ్రవర్ణ అహంకారాన్ని నిరసించాడు.". (పేజి 25)

"..ప్రపంచ శాంతిని నెలకొల్పాలంటే మాటలతో కాదు. మంత్ర తంత్రాలతో కాదు. బలప్రయోగం తో దేశదేశాలను జయించి నంత మాత్రాన అసలే కాదు. కేవలం మనలో నిండుగా ఉన్న స్వార్థాన్ని జయించిన నాడే ప్రపంచ శాంతిని నెలకొల్ప గలుగుతాం... బౌద్ధులమనే లేబుల్‌తో బౌద్ధుల సంఖ్యను పెంచుకొని తృప్తిచెందే పద్ధతి బౌద్ధ విధానమే కాదని గుర్తించాలి. యుద్ధాలకు వ్యతిరేకంగా, రాగ ద్వేషాలకు తావు లేకుండా, నగరాన్ని, నాగరికతను హత్య చేసే దుష్ట శక్తులకు వ్యతిరేకంగా నిర్భయంగా, నిస్సం కోచంగా, తమగళాన్ని వినిపించే మానవోత్త ముల సంఖ్యను పెంచటానికి ప్రయత్నించాలి.

(పేజి 80)

"ప్రపంచంలో బౌద్ధ ధర్మ ప్రచార క్రమంలో ఎక్కడా ఒక్క రక్తపు బొట్టు చిందించలేదు. ఈ సమతా భావమే మతోన్మాదానికి పరిష్కారం అని తేలినప్పుడు ఇటువంటి ఆశయాల మేరకు సామ్యవాద రాజ్య స్థాపన జరిగే వరకు మతోన్మాదానికి వ్యతిరేకంగా ఆచరణాత్మక కార్యక్రమం లేకుంటే అది పూర్తి పొరబాటు దృక్పథమే అవుతుంది. సామ్యవాద రాజ్య స్థాపన జరిగే వరకూ కూడా మతోన్మాదాన్ని నిర్లక్ష్యం చేయడం చాలా పొరబాటే అవుతుంది.". (పేజి 140)

"ప్రజల మత భావాల్ని తమ స్వార్ధ ప్రయోజనాల కోసం వాడుకునే సంఘ వ్యతిరేక శక్తుల చర్యల్ని బహిర్గతం చేస్తూ నిబద్దులైన సంఘ సేవకులు ప్రచార ఉద్యమం చేపట్టడమే దీర్ఘకాలిక పరిష్కారం. ఆశ వీడకుండా, పట్టుదల వదల కుండా ఇటువంటి ప్రచార కార్యక్రమం చేపట్టగల సంఘసేవకులు దొరకడం కష్టం. ఈ కారణం వల్లనే అడ్డూ అదుపూ లేకుండా స్వార్ధపర శక్తులు పెట్రేగిపోతున్నాయి...కానీ ఏదో ఆశ ఇంకా మిగిలే ఉందనిపిస్తుంది. సాధారణ ప్రజలు మతోన్మాదులు కాకపోవటమే ఇంకా ఆశ మిగిలి ఉ ండటానికి కారణం. (పేజి 141)

ఆచరణాత్మక బౌద్ధ బహుజన మేధావిగా, అటు బెంగాల్ మొదలుకొని ఇటు మహారాష్ట్రం వరకూ బహుజన బౌద్ధ ప్రచారం కోసం నిత్యం సంచి చేతబూని సంచరించిన నిబద్ధతగల కార్యకర్తగా మసిలిన సత్య నారాయణ బోధిగారి మహత్తర జీవితాన్ని గురించి యువ కార్యకర్తలు తెలుసుకోవడం సామాజిక అవసరం. బహుజన బౌద్ధ సంఘాలు సైతం

ఆయన క్రియాశీలక జీవితాన్ని గురించిన చర్చను నిత్యం సజీవంగా ఉంచగలగాలి. అదే బౌద్ధ ధర్మం కోసం, సమసమాజ నిర్మాణం కోసం అవిశ్రాంతంగా పనిచేసిన ఆయన కృషికి తగిన నివాళి !

The Middle Path అనే జాతీయ పత్రిక ఏకంగా అప్పట్లో బోధిగారి ముఖచిత్రంతో ప్రత్యేక సంస్మరణ సంచికగా వెలువడింది. లే బుద్దిస్ట్ సంఘంలో ఆయన నిర్వహించిన కార్య క్రమాలను విశ్లేషించారు. నేనెందుకు బౌద్ధుడి నయ్యాను? మొదలు ఎన్నో విలువైన రచనల్ని ఆయన చేసారు. బాధాకరమైన విషయం ఏమిటంటే ఆయన తదనంతరం ఆ కృషి, స్ఫూర్తిని కొనసాగించడం జరగలేదు.అంతటి అసాధారణ బుద్ధిజీవి, మేధావి, ఆలోచనాపరుడు, ఆచరణశీలయిన బౌద్దుడు సహజంగానే అసూయద్వేషాలకినిలయమైన తెలుగు నేలమీద గుర్తించబడటం అరుదు !

మిత్రులు, పెద్దలు కీ. శే. ధర్మప్రియ దొమ్మేటి సత్యనారాయణ బోధి గారి బౌద్ధ ప్రసంగాల పరంపర ఈ 'బౌద్ధ చింతన' పుస్తకం.సుమారు దశాబ్దం క్రితం ఆయన్ని కలిసినప్పుడు ప్రేమగా కొన్ని గ్రంథాలతో పాటు అప్పుడే ప్రచురించిన దీనిని కూడా ఇచ్చారు. జీవితాంతం బౌద్ధం కోసం వెచ్చించిన ధన్యజీవి. రానున్న ఏడాది ఆయన శతజయంతి సంవత్సరం. బౌద్ధ, బహుజన, ప్రగతిశీల మిత్రులు పూనుకుని ఏదైనా కార్యక్రమం రూపొందిస్తే బావుంటుంది.కనీసం ఆయన విలువైన బౌద్ధ రచనల్ని తిరిగి మళ్ళీ పునర్ముద్రించినా అది బహుజన హితమనేదే నా అభిప్రాయం. అందుకే, ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఈ చిన్న రైటప్ !

# కోడూరి శ్రీరామమూర్తి గారి విశిష్ట రచన !

## బెర్ట్రాండ్ రసెల్ - జీవితం బీ దృక్పథం !!

## (ఓ సత్యాన్వేషి సంక్షిప్త జీవిత కథనం !!!)




"తత్వశాస్త్రవేత్తలలో రెండు తరహాలవారు ఉంటారు. ఒకరు పడకకుర్చీ మేధావులు. వీరు సిద్ధాంతాలు ఏవో చెబుతారు కానీ, కార్యాచరణకు పూనుకోరు. ఇక రెండో తరహా వారు తమ ఆలోచనలను వ్యక్తం చేయడం మాత్రమే కాకుండా, స్వయంగా కార్యాచరణకు పూనుకుంటారు. ఇట్లాంటి కార్యాచరణ గల తత్వవేత్త బెర్ట్రాండ్ రసెల్." (పేజి - 10)

98 ఏళ్ళ సుదీర్ఘ జీవనప్రస్థానం.ఒడిదుడుకుల సావాసం. మతాలకీ, మతాధికారులకి బద్ధ విరోధి. అక్కర్లేని నైతికతకి ఆగర్భ శత్రువు. Marriage and Morals రచనతో ప్రపంచం లోనే అసభ్యకర రచయితగా ప్రకటించబడిన అత్యంత వివాదాస్పదుడు. Beacon School స్థాపించి అసాంఘిక విద్యావిధానాన్ని ప్రచారం చేసాడనే అపఖ్యాతి మూటకట్టుకున్న వాడు !

Why I am not a Christian అంటూ మత తత్వాన్ని ఎంతగా నిరసించాడో Why I am not a Communistఅంటూ మార్క్సిస్టుతత్వాన్ని కూడా అంతే వ్యతిరేకించాడు. లెక్కలేనన్ని సిద్ధాంతాల ఆదుపాదుల్ని లోతుగా పరిశీలించి జీవితాంతం మానవతావాదిగానే జీవించాడు. వోర్వలేనివాళ్ళు Philosophical Anarchist అంటే, విల్ డ్యురంట్ వంటి మహా తాత్వికుడు The Story Of Philosophy లో రస్సెల్‌ని Mystic Communist అన్నారు !

జాన్ స్టువర్ట్ మిల్ , వైట్‌హెడ్ వంటి వారితో ప్రభావితమైన రసెల్, తిరుగులేని తార్కిక హేతువాదిగా,శక్తివంతమైన అజ్ఞేయవాదిగా భాసిల్లాడు. A good life is inspired by love and guided by knowledge అని చెప్పు కున్నాడు What I Believe రచనలో."నాకు తెలిసిన మతాలన్నింటికీ నేను వ్యతిరేకిని. అన్ని మతాలూ మరణించేవే అని నా నమ్మకం" అన్న రసెల్, "చరిత్రలో చెప్పబడిన గొప్ప మతాలు అన్నింటిలోకీ నాకు బౌద్ధ మతం అంటే గౌరవం ఉంది." అని ప్రకటించాడు !

మహా మేధావి, ప్రజా తత్వవేత్త బెట్రండ్ రసెల్ గురించి గాంధేయవాద రచయిత

కోడూరి శ్రీరామమూర్తి గారు రచించిన గ్రంథం, బెర్ట్రాండ్ రసెల్ : జీవితం, దృక్పథం, ఎమెస్కో బుక్స్ ప్రచురణ. 125 పుటల ఈ పుస్తకంలో రెండు అనుబంధాలతో కలిపి 15 విభాగాలలో రసెల్ జీవితాన్ని సంక్షిప్తంగా విశ్లేషించారు. అక్కడక్కడ పునరుక్తులు, పొరపాట్లు లేకపోలేదు కానీ ఫ్లోలో కొట్టుకొనిపోయాయ్ !

"నా జీవితాన్ని మూడు బలమైన ఉద్వేగాలు నడిపించాయి. ఒకటి – ప్రేమ కోసం ఆరాటం, రెండోది – విసుగులేని విజ్ఞానాన్వేషణ, మూడు – దుఃఖిత మానవాళి పై అంతులేని ఆత్మీయత."అని స్వీయచరిత్రలో ప్రకటించుకున్న రసెల్ తన చివరి క్షణం వరకూ అలాగే బతికాడు. విశిష్టత కలిగిన వ్యక్తిగానే వికసించాడు. ఆ మహామనిషి మహత్తర కృషికి ఇన్నాళ్ళకు, ఇన్నేళ్ళకు ఎనిమిది పదులు పైబడిన గాంధేయవాద రచయిత హృద్యంగా తెలుగులో ప్రకటించిన నివాళి రచన ఇది !

Bertrand Russell Peace Foundation ద్వారా యుద్ధోన్మాదానికి వ్యతిరేకంగా ప్రపంచ శాంతి ఉద్యమానికి ఐన్‌స్టీన్ వంటి వారితో కలిసి తెరతీసిన రసెల్ పై ఎన్నో దాడులు జరిగాయి. వేధింపులు తప్పలేదు. ఉద్యోగం కోల్పోయాడు. ఏకంగా ప్రభుత్వాలే దేశద్రోహి అంటూ ప్రచారాలు చేసాయి. లాఠీ దెబ్బలు తగిలాయి. ఇన్నింటిలోకీ ఆయన్ని ధైర్యంగా ముందుకు నడిపింది బాల్యంలో నాయనమ్మ చెప్పిన బైబిల్ వాక్యం మాత్రమే. అది,

Thou shall not follow multitude to do evil'నలుగురూ చెడ్డ మార్గాన నడుస్తున్నారని నువ్వు కూడా ఆ మార్గంలో వెళ్ళాల్సిన అవసరం లేదు. "

(వ్యక్తిగతంగా నన్ను బాల్యం నుండి ప్రభావితం చేసిన వ్యక్తుల్లో రసెల్ ఒకరు. హైస్కూల్లోనే ఆబగా ఆయన పుస్తకాలతో కుస్తీ పట్టినరోజులు ఇంకా మర్చిపోలేదు. ఆరంభ రచనల్లో రస్సెల్ స్ఫూర్తి స్పష్టంగానే కనిపిస్తుంది. అలాంటి రసెల్ కోసం మిత్రులు, పెద్దలు కోడూరి శ్రీరామమూర్తి గారు పూనుకుని రాసి అభిమానంగా పంపిన గ్రంథం గురించిన ఈ చిరు స్పందన. రచయితకి అభినందనలు!)

# అమరుల స్ఫూర్తితో తెలుగువాడి ప్రయాణగాథ!

## షహీద్ భగత్‌సింగ్ - ఒక గోదావరి జ్ఞాపకం !!!

## (అన్వేషణని అక్షరబద్ధం చేసిన నాటి విద్యార్థి కథ)




ఎనిమిదేళ్ళ నాటి సంగతి. ఓ మధ్యాహ్నం రాజమండ్రి మిత్రులు భగత్‌సింగ్ గురించిన సమావేశం అంటూ ఓ పేద్ద హొటళుకి వద్దన్నా లాక్కెళ్ళారు. రామనామంతో ప్రారంభమైన ఆ సభలో పాల్గొన్న ఒక్కరంటే ఒక్కరు కూడా అసలు భగత్‌సింగ్ జీవితం, కృషి కోసం లోతుగా ప్రస్తావించింది లేదు !

ఎస్. బి. చౌదరి అనే ఆయన ఏభై సంవత్సరాల క్రితం తను విద్యార్థి దశలో ఉండగా వెళ్ళొచ్చిన భగత్‌సింగ్ ఇల్లూ, తల్లి, బంధువులు, ఆయన జీవితం కోసం చేసిన రచన అది. ఎందుకనో తెలీదు కానీ బాగా కోపమొచ్చింది. భగత్‌సింగ్ భావజాలానికి అన్యాయం చేశారననిపించింది.అంతే, ఇంటికొచ్చి ఇంత లేఖ రాసేసా !

ఉత్తరంతోపాటూ కొన్ని పుస్తకాలు కూడా పంపిస్తూ భగత్‌సింగ్ ని ఈ విధంగా ఎప్పుడూ అవమానించ వద్దంటూ కోపం అంతా అక్షరాల్లో చూపించేసా. నిజానికి ఏదో ఆవేసమే కాని ఆలోచిస్తే ఆ మాత్రం గుర్తు పెట్టుకుని ఐనా ఇప్పుడు భగత్‌సింగ్ ని గుర్తుచేసుకునే వాళ్ళెంతమంది ఉన్నారు ?

తర్వాత చాలా కాలానికి, బహుశా ప్రజాపత్రిక నిర్వహించిన సమావేశంలో పసల భీమన్న గారి పుస్తకావిష్కరణ చేస్తూ మళ్ళీ ఈ పుస్తకం రచయితను చూసాను. ఏమీ మాట్లాడలేదు కానీ ఎందుక నవసరంగా పెద్దమనిషిని పట్టుకు తిట్టానని అనిపించింది. తర్వాత కొద్ది కాలానికి ఆయన కాలం చేసారు. ఇప్పుడెందుకో ఈ పుస్తకం హఠాత్తుగా దొరికింది !

ఎన్ని గొడవలు పెట్టుకున్నా మంచి కోసం నిలబడ్డానంటే నా కోసం ఎంత దూరమైనా వెళ్ళే కెమేరా విజయ కుమార్ లాంటి మనుషులు మళ్ళీ ఈ జీవితంలో తారస పడతారా? మహొదయో, రవికాంతో, సుదర్శనో, ప్రవీణ్ కో పూరమా యించేంత కార్యక్రమాలు నిర్వహించడం మళ్ళీ జరుగుతుందా?

వెన్నెముక తప్ప మరే అండా లేని రోజుల్లోనే రాజమండ్రి రివర్ బే లో ఆలిండియా మల్టీలెవెల్ మార్కెటింగ్ సమావేశంలో ఐదువేల మందికి వ్యతిరేకంగా గొంతెత్తి, ఒక్కడ్నే

కరపత్రాలు వేసి పంచేంత తెగువ గల రోజులు మళ్ళీ వస్తాయా?ఏమో, ఎన్నెన్ని గోదావరి జ్ఞాపకాలో !

**(అమరుడు భగత్‌సింగ్ శతజయంతి సందర్భంగా రాజమండ్రి లో కమిటీ ఏర్పడి కూడా అప్పట్లో ప్రత్యేక ప్రచురణ తీసుకొచ్చి నట్లు గుర్తు. ఇప్పుడు భగత్‌సింగ్ 117 జయంతి సంద ర్భంగా చాలా కాలం నా దగ్గర ఉన్న ఈ పుస్తకం కోసం**
**ఇలా చిన్న రైటప్ !)**

# ఎకనమిక్ & ఫిలాసఫిక్ మేనుస్క్రిప్ట్స్!

## ఆర్థిక, తాత్విక రాతప్రతులు - 1844!!

## (కార్ల్‌మార్క్స్ మానవతావాద మహారచన !!!)




"రాతప్రతులు"లో మార్క్స్ మాట్లాడిన మానవతా వాదం ఒక ప్రధాన అంశం. మనిషికి మూలం దైవం అనే భావన స్థానే, మనిషికి మనిషే మూలం అనే అవగాహనని నెలకొల్పడం మానవతావాదంలో కీల కాంశం... మార్క్స్‌లో మానవతావాద కోణం ఉందని అంగీకరించడం,వర్గ పోరాట సిద్ధాంతాన్ని నీరు గారుస్తుందని 'రాత ప్రతులు' పై చర్చ సందర్భంలో ఒక వాదన లేవనెత్తారు. ఈ వాదన అప్పటికే మార్క్సిజం పట్ల ఏర్పడుతున్న యాంత్రిక, శాస్త్ర పరమైన ధోరణికి తార్కాణం. వర్గ పోరాటం ఒక మార్గం మాత్రమే. లక్ష్యం వర్గాల రద్దు. ఇది మానవతావాద లక్ష్యం కాక మరేమౌతుంది?... ...మానవతావాద మూలాలను మార్క్స్ ఎప్పుడూ త్యజించలేదు. ఈ పదాన్ని ఎక్కడ ఎన్నిసార్లు వాడాడన్నది ముఖ్యం కాదు. ఎందుకంటే, ఈ భావన మార్క్స్‌ని తన యావత్ కృషికి ప్రేరేపించిన అత్యంత మౌలికమైన పునాది. సోషలిజం, కమ్యూనిజం మానవతా వాదానికి అత్యున్నత రూపాలు..." (పేజి 14)

"మానవతావాదం ప్రకృతి పై మానవ ఆధిపత్య వాదంగా పరిణమించే ప్రమాదం ఉందని ఫ్రాంక్ ఫర్ట్ స్కూల్ ధోరణి విమర్శించింది. ఆధునిక పారిశ్రామిక వ్యవస్థ సృష్టించే ప్రకృతి విధ్వంసం నేటి పర్యావరణ సంక్షోభానికి మూల కారణంగా పరిగణించ బడుతోంది. ఇది ప్రకృతిని ఒక సాధనంగా, ఒక పని ముట్టుగా చూసే ధోరణి ఫలితం. దీని నుండి బయటపడాలంటే మనిషి భూమిని తన ఆవాసంగా, తన జీవాధారంగా పరిగణించాలి. తనని తాను ప్రకృతి బిడ్డగా తిరిగి పరిగణించుకోవాలి. మార్క్స్ ప్రతిపాదిం చిన నూతన సమాజ భావన ఈ స్పృహతో కూడుకుని ఉందని మనం చెప్పవచ్చు. (పేజి 16, 17)

"మానవాళి జీవితంలో భౌతిక సుఖ సౌఖ్యాలతో పాటు, అర్థాన్ని, ఆత్మిక సంతృప్తిని కూడా వెతుక్కుంటుంది. ఈ రెండింటినీ మతాలు , ఆధ్యాత్మికవాదాలు దైవం, పరలోకం, ఆత్మ అనశ్వరత, బ్రహ్మతో లేక అనంత తత్వంతో ఏకంకావడం లాంటి భావనల ద్వారా అందించడానికి ప్రయత్నించాయి. ఆధునికత వీటిలోని పరిమితుల్ని బహిర్గతం చేసి వాటిని బలహీన పర్చింది. ఈ భ్రమాజనిత భావనల పై ఆధార పడి కాక, వాస్తవ అంశాల పై

ఆధారపడి జీవితం లో అర్థాన్ని, ఆత్మిక సంతృప్తిని అన్వేషించాలనే గ్రహింపుకి ఇది దోహదం చేసింది. మార్క్స్ ప్రతిపాదించిన కమ్యూనిజం మానవులు అందరూ అందరితో యుద్ధం చేసే దశ నుండి , ప్రతి ఒక్కరూ ప్రతి ఒక్కరి కోసం జీవించగలిగే స్థితికి ఎదగడం....
(పేజి 18)

దాదాపు 180 ఏళ్ళ క్రితం సమాజాన్ని లోతుగా
అధ్యయనం చేస్తున్న ఒక యువ తత్వవేత్తగా మార్క్స్ చేసిన విస్తృత అన్వేషణ 'ఆర్థిక, తాత్విక రాతప్రతులు - 1844'. కమ్యూనిస్టు మేనిఫెస్టో, దాస్ కేపిటల్ తర్వాత అంతటి విశిష్టమైన స్థానం కలిగిన రచన ఇది. మార్క్స్ మానవతావాదం, పరాయీకరణ మొదలైన కీలక భావనల సారం వీటిల్లో లభిస్తుంది. సమీక్ష మిత్రబృందం ఈ బృహత్కార్యాన్ని చేపట్టి వీట్ని తెలుగు చేసి పదకొండవ ప్రచురణగా తీసుకు రావడం జరిగింది. విశ్లేషణాత్మక నేపథ్యంతో, వివరణాత్మక ముందుమాటతో పుస్తకం చివర అనువాద పదకోశం కూడా చేర్చారు. సామాజిక చింతనాపరులంతా అధ్యయనం చేయాల్సిన గ్రంథం. ఎందుకనేది స్పష్టమే. ప్రారంభంలోనే చెప్పినట్లు,

"నువ్వు పండించిన పంటను వేరొకడు అనుభవిస్తాడుబీ నువ్వు సృష్టించిన సంపదను మరొకడు సొంతం చేసుకుంటాడు బీ నువ్వు నేసిన దుస్తులు వేరొకడు ధరిస్తాడు బీ నువ్వు పోతపోసిన ఆయుధాలు , మరొకడు ఉపయోగిస్తాడు. పంటని పండించు - కాని ఏ నియంతను అనుభవించనివ్వకు : సంపదను సృష్టించు - కాని ఏ మోసగాడి సొత్తూ కానివ్వకు: దుస్తుల్ని నేతనెయ్యి - కాని సోమరి పోతులను ధరించనివ్వకు : ఆయుధాల్ని తయారుచెయ్ - నీ రక్షణకై ఉపయోగించేందుకు." **- పెర్సి బిసహీ**
షెల్లీ

"సంపూర్ణ అభివృద్ధి చెందిన ప్రాకృతిక వాదంగా కమ్యూనిజం మానవతావాదానికి సమానం అవుతుంది. సంపూర్ణంగా అభివృద్ధి చెందిన మానవతావాదంగా కమ్యూనిజం ప్రాకృతిక వాదానికి సమానమవుతుంది. మనిషికి - ప్రకృతికి, మనిషికి - మనిషికి మధ్య నెలకొన్న ఘర్షణకి కమ్యూనిజమే అసలైన పరిష్కారం. అస్తిత్వానికి - సారానికి, స్వేచ్ఛకి - ఆవశ్యకతకి,వ్యక్తికి - జాతికి మధ్య నెలకొన్న వైషమ్యానికి కమ్యూనిజమే నిజమైన పరిష్కారం. చరిత్ర సంధించిన చిక్కు ప్రశ్నకి సమాధానం కమ్యూనిజం. తానే ఈ చిక్కు ప్రశ్నకి సమాధానమనే విషయం కమ్యూనిజానికి తెలుసు. ". **- కార్ల్‌మార్క్స్**

# హాషింపురా తెలుగు అనువాదానికి ఐదేళ్ళు

## 22 మే హాషింపురా : పోలీసు హత్యాకాండ

## (విభూతి నారాయణ్ రాయ్ రచన)




"హాషింపురా కేవలం ఒక సంఘటన మాత్రమే కాదు ఏదో జరిగిపోయిందిలే అనుకునిదానిని పక్కన పెట్టేసి ముందుకు సాగి పోవడానికి. అది భారతీయ సమాజంలో ఇంకిపోయిన ఆలోచనా విధానానికి ప్రతిఫలనం. ఆ ఆలోచనా విధానమే మతహింసను ప్రేరేపిస్తుంది. ఆ హింస ప్రతిరోజూ భౌతిక రూపంలో వీధుల్లో కనిపించకపోవచ్చు. కాని ఆ భావనలు ప్రజల మనసు లోలోపల తిష్ట వేసేసుకుని వాళ్ళ చేతనా ప్రపంచాన్ని ఆక్రమిం చేస్కున్నాయి. పైకి మానవ సంబంధాలన్నీ సజావుగా వున్నట్లే కనిపించవచ్చు. కానీ కాన్సర్ కణాలు లోలోపల అవయవాలన్నింటికీ పాకి పోయినట్లు ఈ ఆలోచనా విధానం మనల్ని పట్టి పీడిస్తోంది. 'ఇతరులు' అనుకున్న వారి పట్ల ఉన్న శత్రు భావనలు ప్రతిసారీ ఇలా హింసరూపంలో బయటపడక పోవచ్చు. కానీ రోజూవారీ జీవితంలో అనేకానేక ప్రత్యక్ష, పరోక్ష రూపాలలో అవి మానవ సంబంధాలలో ప్రతిఫలిస్తూ ఉంటాయి. వాళ్ళ ఆహారపు అలవాట్ల మీద అసహనం, అంటరానితనం, నమ్మలేక పోవడం, భాషలో ఉండే వ్యత్యాత్యాల పట్ల పట్టింపు.. ఇలా ఎన్నో పార్శ్వాలలో అది వ్యక్తమవుతూ ఉంటుంది. కొన్ని వందల వేల కులాలుగా, మత శాఖలుగా, జాతులుగా చీలి ఉన్న మనదేశంలో ఇది రోజురోజుకీ తీవ్రమవుతోంది..." (పేజి 106, 107)

"మతతత్వం ప్రబలి అది భౌతిక హింస రూపంలో వ్యక్తమైనప్పుడల్లా దానిని సమర్థించడానికి, దానికి హేతుబద్ధత కల్పించడానికి ప్రయత్నిస్తారు. అది సాధించడం కోసం హింసకు పాల్పడిన మతానికి చెందిన వారు తరచూ చరిత్రలో, పురాణాలలో తమ చర్యలను సమర్థించగల కథనాల కోసం వెతుక్కుంటారు. తాము శాంతి కోరుకునే వారమే కానీ అవతలి మతం వారు సహజంగానే క్రూరస్వభావం కలవారనీ, హింసాత్మకంగా ప్రవర్తిస్తారని తమని తాము నమ్మించు కుంటారు. ఇతరులను నమ్మించే ప్రయత్నం చేస్తారు. ఇక తమ మతానికి చెందిన వారు హింసకు పాల్పడ్డారని ఒప్పుకోవలసి వచ్చినప్పుడు దానిని సమర్థించడానికి కూడా వాళ్ళ దగ్గర ఒక వాదన సిద్ధంగా ఉంటుంది. అవతలి మతం వారు దాడికి పాల్పడితే దాన్ని

ఎదుర్కొన డానికి మాత్రమే తమ మతం వాళ్ళు హింసకు దిగాల్సి వచ్చిందని అంటారు. ". (పేజి 114) "భారతరాజ్యాంగం మానవహక్కులకు విస్తృతమైన పరిధిని ఇచ్చింది. సమాజంలో కడగొట్టున ఉన్నవారిని దృష్టిలో ఉంచుకుని మరీ హక్కులను సమగ్రంగా నిర్వచించింది. చట్టంముందు అందరూ సమానమేనన్నది నిర్ద్వందంగా స్థిరపరచడం కోసం అవసరమైన అన్ని ఏర్పాట్లను చేసింది. అయినప్పటికీక్షేత్రస్థాయిలో ఆచరణను చూస్తే రాజ్యాంగం ఒక కాఫీ టేబుల్ పుస్తకంగానే మిగిలి పోయిందని అనిపిస్తుంది. చట్టాన్ని అమలు పరచాల్సిన వ్యక్తి కులమతాలకు,విశ్వాసాలకు అతీతంగా ఒక నేరస్థుడిని నేరస్థుడిగానే పరిగణించాలి. ఒకముద్దాయిని ముద్దాయిగానే చూడాలి. కానీ ప్రస్తుత పరిపాలనా వ్యవస్థలో ఆ పరిస్థితి కనిపించడం లేదు.". (పేజి 120)

కొన్నాళ్ళ క్రితం 'జనగణమణ' అని సినిమా వచ్చింది. ఇప్పుడూ నెట్లో ఉంది, చూడొచ్చు. ఒక హత్య కేసు విచారణలో అనూహ్యమైన రీతిలో ఉన్న అధికార రహస్యాల్ని, ఆధిపత్య ధోరణుల్ని వెలికితీస్తూ My Birth was my mistake అంటూ ఆత్మహత్య చేసుకున్న ఓ అణగారిన విద్యార్థిని రాసిన లేఖను కోర్టులో లాయర్ ప్రస్తావిస్తాడు. నిజానికి అది రోహిత్ వేముల రాసిన చివరి లేఖ లో వ్యక్తమైన భావన. ఈ పుస్తకం చదవగానే ఎందుకనో ఆ వాక్యం గుర్తొచ్చింది. ముస్లింలు అనే కారణం తో 42 మంది పౌరుల్ని విచ్చలవిడిగా సైన్యం కాల్చి పారేసి హత్య చేసిన 'హషింపురా' భారతీయ పౌరసమాజానికి ఇచ్చే సందేశం ఏమిటి ?

అయిదు సంవత్సరాల క్రితం 2019లోమలుపు ప్రచురణగా వచ్చిన ఈ పుస్తకం తెలుగు సామాజిక చట్రంలో ఇమిడి ఉన్న ఆధిపత్య ధోరణులను ప్రస్తావించింది. అనువాదమే ఐనప్పటికీ వరవరరావు, సుమంతో బెనర్జీ రాసిన ముందుమాటల్లో ఇదే విషయం స్పష్టంగా కనిపిస్తుంది. ఒక విధానంగా మతతత్వం పెంచిపోషించబడే తీరు తెల్సుకుని విస్తుపోకుండా ఉండలేం. దేశ విభజన తర్వాత కాలం నుండి'అధికారికంగా' ఈ దేశంలో అప్రకటితంగానే అమలవుతున్న 'మతోన్మాద రాజకీయాల్ని' అర్థంచేసుకుందుకు ఉపయోగపడే లోతైన అవగాహన కలిగిన ఆలోచనాపరుడు చేసిన పరిశీలన ఇది.

వృత్తికీ, అంతరాత్మకీ న్యాయం చేయలేదనే వేదనతోనూ, దశాబ్దాల పాటు అపరాధ భావనతోనూ రగిలిపోయిన ఒక పోలీసు అధికారి మాత్రమే సేకరించగల సమాచారం ఇది. విభూతి నారాయణ్ రాయ్ మాత్రమే పరిశోధించి రాయగల పుస్తకం ఇది. కేవలం హాషింపురా కోసమే కాదు. సంక్లిష్ట సమ్మిళిత సమాజంలో వివిధ రకాలైన ద్వేష భావనల్ని గురించి అధ్యయనం చేస్తున్నవారూ, ముఖ్యంగా, మతతత్వ హింస కోసం తెల్సుకోవాలనుకునే వారూ తప్పక చదవవలసిన పుస్తకం. వి.వి.జ్యోతి గారు చేసిన తెలుగు అనువాదం సరళంగా

ఉంది. అంతే కర్కశంగా పాఠకుల మనసుల్ని ప్రశ్నిస్తుంది. ఎందుకంటే, చివర్లో ఫైజ్ అహ్మద్ ఫైజ్ మాటల్లో రచయితే చెప్పినట్లు,

" గుండెలో ముల్లులా ఇరుక్కుంది

నిజం -

నేడు వెల్లడి చేస్తే తప్ప

ఈ సలపరం తొలగిపోదు.

# అమృతకాలం కాదిది...ఆపత్కాలం

## (మోడీ ఆర్థిక,రాజకీయ,సామాజిక విధ్వంసం)




నిజమైన ప్రజాస్వామిక వ్యవస్థ పరిఢవిల్లాలి అంటే, సామాజిక, జీవన ప్రజాస్వామ్యం సైతంఅవసరమని పెరియార్ గుర్తించాడు. ఆయనే చెప్పినట్లు, "ప్రజాస్వామ్యం అంటే ఆకలి, అవమానాలు మరియు హింస నుండి విముక్తి. ప్రజా స్వామ్యం అంటే దురహంకారాన్ని బద్దలు కొట్టడం. ప్రజాస్వామ్యం అంటే కులమత దురభిమానాన్ని తిరస్కరించడం. ప్రజా స్వామ్యం అంటే కిక్కిరిసిన బస్సుల్లో రైళ్ళల్లో ప్రయాణిం చాల్సిన ఖర్మ లేకపోవడం. ప్రజాస్వామ్యం అంటే మురికి నీరు తాగే, విషపూరితమైన గాలి పీల్చే దుస్థితి రాకపోవడం. ప్రజాస్వామ్యం అంటే మహిళల పట్ల గౌరవం మరియు పిల్లల పట్ల మృదుత్వం.

ప్రజాస్వామ్యం అంటే పరిశుభ్రమైన జీవన పరిస్థితులు. ప్రజాస్వామ్యం అంటే వైవిధ్య భరిత జీవన విధానాల పై గౌరవం. ప్రజా స్వామ్యం అంటే ఎవరూ అజేయులు కారని గుర్తించడం. ప్రజాస్వామ్యం అంటే వినయం. ప్రజాస్వామ్యం అంటే భయం నుండి స్వేచ్ఛ. ప్రజాస్వామ్యం అంటే పంచుకోవడం. ప్రజా స్వామ్యం అంటే సరైన వైద్య సంరక్షణ. ప్రజాస్వామ్యం అంటే వెనకబడిపోయిన వారికి చేయూత. ప్రజాస్వామ్యం అంటే అణిచివేతలని కూల్చే సామాజిక రక్షణ". ( పేజి 64)

"భారతదేశంలో భావ ప్రకటనా స్వేచ్ఛా క్షీణత మరియు నిరంకుశీకరణ ప్రక్రియ కొనసాగింపుస్పష్టంగా నమోదు చేయ బడింది. మీడియా మరియు సోషల్ మీడియా పై అణిచివేతలు, ప్రభుత్వాన్ని విమర్శించే జర్నలిస్టుల పై వేధిం పులు, అలాగే పౌర సమాజం పై దాడులు మరియు ప్రతిపక్షాలకు బెదిరింపులు యధేచ్ఛగా జరుగుతున్నాయి. బహుళత్వ వ్యతిరేక, హిందూ జాతీయవాద మోడీ ప్రభుత్వం విమర్శకుల నోరు మూయిం చేందుకు దేశద్రోహం, పరువునష్టం మరియు ఉగ్రవాద వ్యతిరేక చట్టాలను ఉపయోగి స్తోంది. మత హక్కుల స్వేచ్ఛను అణిచి వేయడం కూడా కొనసాగుతోంది. రాజకీయ ప్రత్యర్థులు మరియు ప్రభుత్వ విధానాలను నిరసించే ప్రజలను బెదిరించడం, అలాగే, విద్యారంగంలో అసమ్మతి గొంతు నొక్కడం ఇప్పుడు ప్రబలంగా ఉంది."

(పేజి 65)

“ప్రజాస్వామ్యం అంటే ఒక బటన్ నొక్కడం మాత్రమే కాదు...అది ఒక జీవన విధానం. ఒకరి కోసం ఒకరు, సమాజం కోసం అందరూ పరస్పరం సహకరించు కుంటూ, సర్దుకు పోతూ, సమాన గౌరవం పొందగలిగే సాంఘిక ఒడంబడిక. పరిణతి చెందిన ప్రజాస్వామ్యం అంటే పౌరులకు అవరోధాలను తగ్గించడం, తగిన జీవన సాధనాలను వారికి అందిం చడం మరియు ఇతరుల దాడుల నుంచి వారిని రక్షించడం.”. (పేజి 67)

రాంపల్లి శశికుమార్ రాసిన ‘అమృతకాలం కాదిది...ఆపత్కాలం ! (మోడీ పాలనలో ఆర్థిక,రాజకీయ, సామాజిక విధ్వంసం) నూటముప్ఫైపుటల పుస్తకం. చార్వాక పబ్లికేషన్స్ ద్వారా ఈ ఏడు ఏప్రిల్‌లో వచ్చింది. వర్తమాన కాలంలో దేశం బిజేపి బారిన పడి అనుభవిస్తున్న వికృత పరిస్థితిని సగటు పాఠకుడికి సులభంగా ఇందులో పరిచయం చేశారు. అవినీతి మొదలు అన్నిరంగాల్లో అప్రకటితంగానే అమలవుతున్న ఆధిపత్యం, అవినీతి,ఆర్థిక వైఫల్యాలు రాజకీయ సంక్షోభం తదితర విషయాల్ని నివేదికలతో సహా నిరూపించిన తీరు బావుంది. పుస్తకం మధ్యలో మూడు పుటల్లో రచయిత ఉటంకించిన మూడు పేరాల్ని మచ్చుకు ఇచ్చింది అందుకే. హైదరాబాద్ లోని ఈ రచయిత ఇనిస్టిట్యూట్ లో ఈ పుస్తకం ఇస్తున్నప్పుడు ఓ ఆసక్తి కరమైన సన్నివేశం జరిగింది. నా పక్కనే కూర్చున్న ఒక తెలుగు సినిమా దర్శకుడికి కూడా మర్యాదగా పుస్తకం ప్రతి ఇచ్చారు. శీర్షిక చూసి తిరగేసిన ఆయన వెంటనే “ఇంకా మీ మీద దాడులేవీ జరగలేదా? ఇంటిలిజెన్స్ వాళ్ళెవరూ రాలేదా? అని అడిగాడు” దానికి రచయిత, “ఇప్పటికైతే లేదు కానీ రానివ్వండి సార్, ఫర్వాలేదు.” అన్నారు. భావప్రకటన స్వేచ్ఛా స్థితి ఎలా ఉందో చెప్పకనే చెప్పే విషయం ఇది. రచయితకి అభినందనలు.

# గురజాడ మాట - ప్రగతికి బాట

## (డా.పి.ఎస్.ప్రకాశరావుగారి వ్యాస సంపుటి)




"దమ్ములున్న ప్రయోక్త అయితే భూదేవంత అరుగువేసి, ఆకాశ మంత పందిరి వేసి ఆడాల్సిన నాటకము కన్యాశుల్కం. This play is Larger than life అంటారు చాట్ల శ్రీరాములు 'జీవితానికి దర్పణం - కన్యాశుల్కం' అనే తన వ్యాసంలో. ఇంతకుమించి చెప్పేది ఏముంది కన్యాశుల్కం గురించి అని అనుకుం టామా ?కానీ,ప్రతీ తరం లోనూ, కాలంలోనూ కొంగొత్తగా గురజాడలో కనుగొనాల్సిందీ, కన్యాశుల్కం లో కనిపెట్టాల్సిం దీ ఉండనే ఉంటుంది. ఎందు కంటే, ముందే చెప్పినట్టు అది జీవితం కంటే పెద్ద నాటకం !

"ప్రత్యక్ష జీవితంలో మనం ఎదుర్కొంటున్న విషమ సమస్యలను పరిష్కరించు కునేందుకు ఈ వేద విజ్ఞానం ఒక్క పిసరు అక్కరకు రాదు."అంటారు గురజాడ సంస్కర్త హృదయం అనే కథానికలో. అలానే, "కవీ, తత్వవేత్త తమ కాలం కంటే ముందుంటారు" అంటారు సౌదామిని నవలలో. ఇవే కాదు మొత్తం ఆయన రచనల పై వివరణాత్మక వ్యాస సంపుటి ఈమధ్యే వచ్చిన డా. పి. యస్. ప్రకాశరావు గారి "గురజాడ మాట - ప్రగతికి బాట." పుస్తకం !

"గురజాడ అప్పారావు ఒక తరగని గని. రాశి రీత్యా ఆయన రచనలు చాలా ఎక్కువ కాకపోవచ్చు. కాని సృష్టించిన ఆ స్వల్ప రాశి లోనే ఆయన నిక్షిప్తం చేసిన అపార సంపదల రీత్యా ఆయన రచన లు నిత్యమూ, నిరంతర మూ కొత్త అధ్యయనానికి, కొత్త వివరణకు, కొత్త విశ్లేషణకు, కొత్త నిర్ధారణకు అవకాశం ఇస్తూనే ఉంటాయి.." అంటారు ఎన్. వేణుగోపాల్ "తరగని గనిలో మరొక అన్వేషి తవ్వకాలు" పేరిట ఈ పుస్తకానికి రాసిన ముందు మాటలో !

సుమారు పదేళ్ళపాటు రచయిత పడ్డ కష్టానికి, శోధన కీ ప్రతీక ఈ పుస్తకం. ప్రచురణ కర్తలు అన్నట్టు, 'చిన్న పాటి విజ్ఞానసర్వస్వం'. ఇందులో వరుసగా 1. మత మౌఢ్యం పై వాతలు పెట్టిన గురజాడ కథ 'మీ పేరేమిటి'?, 2. వేగు చుక్క గురజాడ 3. కన్యాశుల్కం - హేతువాదం 4.కనుమరుగైన కన్యాశుల్కం తిట్లు, 5. కన్యా శుల్కం భాషా

విశేషాలు : పదజాలం/ జాతీ యాలు /సామెతలు/వివరణ లు మొదలైన భాగాలుగా ఉంది. ముఖ్యంగా, కన్యాశు ల్కం భాష విషయం లో, ఆనాడు వాడిన పదాల చారిత్రక నేపథ్యం లోతుల్లోకి వెళ్ళి శోధించిన తీరు మాత్రం ప్రత్యేకంగా చెప్పుకోదగ్గది ! "ఈ దేశంలో పాండవులు వుండని గుహలూ, సీతమ్మ వారు స్నానమాడని గుంటలూ లేవు" అన్న గురజాడ, "అందరు దేవుళ్ళూ ఒక్కరే అయితే, ఆ పీనుగుల్ని అందరినీ ఒక్కచోటే నిలిపి అందరూ కలిసి పూజ తగలెట్టరాదా?" అంటూ చాచిపెట్టి చెళ్ళుమని కొట్టిన తీరు తెలుగు జాతి ఎప్పటికీ జ్ఞాపకం చేసుకుంటూనే ఉంటుంది. అందుకే, "అన్న దమ్ముల వలెను జాతులు మతములన్నీ మెలగవలె నోయ్.."అన్నాయన, "మతములన్నీ మాసిపోవును, జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును." అని నినదించ గలిగాడు !

".ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ యేదో రాస్తూ వుండే నాకు 'విశ్రాంతి' అనేది కల్ల.నామెదడు ఎపుడూ పనిచేస్తూనే ఉంటుం ది. ఈకృషి నుంచి నేను తప్పించు కుంటాననేది పొసగని మాట. డాక్టర్లు ఎన్ని సలహా లిస్తేనేమి! వాటిదారి వాటిదీబీ దీని దారి దీనిదీ ! శ్రమ అధికమై ఇక నేనే పనీ చేయ జాలని పరిస్థితే కలిగినప్పుడు, నాకిక బతుకుమీద ఆశే లేదు. పని చేయలేక పోవడమనేది ఒక విషమ పరిస్థితి."అన్న గురజాడ, "నాది ప్రజల ఉద్యమము. దానిని యెవరిని సంతోషపెట్టడానికైనా వదులు కోలేను."అంటాడు ! (చూడు: మహాకవి డైరీలు)

తెలుగు సారస్వతంలో శిఖర సమానుడు గురజాడ. ఆయన అజరామర కృషి కోసం ఉద్దేశిం చిన చిన్ని పుస్తకం జనవిజ్ఞాన వేదిక,కాకినాడ జిల్లా తరపున ప్రచురించింది. తెలుగు భాష మీద ప్రేమ, గురజాడ మీద అభిమానం, సమాజహితం పట్ల మక్కువ ఉన్న ప్రతి ఒక్కరూ తప్పనిసరిగా చదవ దగిన పుస్తకం ఇది. విలువైనవే అయినప్పటికీ పుస్తకం ప్రారంభంలో ఐదారు అభిప్రా యాలు,ముందుమాటలు చదవడం పాఠకులకి కొద్దిగా బరువనిపిస్తుంది !

చివరగా, 123 పుటలతో 100/- రూపాయల వెల పెట్టి మంచి గెటప్ తో, దాతల కలర్ ఫొటోలతో ముద్రించిన పుస్తకంలో 'ప్రతులకు - జనవిజ్ఞాన వేదిక, కాకినాడ జిల్లా' అని మాత్రం వేసి చిరునామా, ఫోన్ నంబరో, ఈ మెయిలో వేయటం మాత్రం మర్చిపోయినట్టున్నారు. (కనీసం ప్రముఖ పుస్తక కేంద్రాల్లో లభ్యమని ఇచ్చున్నా బాగుండేది) ఇంత మంచి కృతిని విద్యార్థులు, యువత, ఆలోచనాపరుల దరికి తీసుకు వెళ్ళాల్సిందిగా ప్రచురణకర్తల్ని కోరుతూ రచయితకి అభినందనలతో ఈ చిన్న రైటప్ !

# మనం విస్మరిస్తున్న మనతరం వీరుడు !

## కీర్తిచక్ర పందిళ్ళపల్లి శ్రీనివాస్

### (ఒక మహోన్నత యోధుడి మననం )




"..అతడు వాయు వేగంతో నా వద్దకు చేరుకున్నాడు. నా రక్తం ఉడికిపోతోంది.అతడి ఛాతీని చీల్చి అందులోంచి వేడి రక్తం ఉబికి వస్తుంటే చూసే సమ యం కోసమే నేను కాచుకుని కూర్చు న్నాను. నేను నా తుపాకి తీసుకుని అతడు ఏమి జరుగుతుందో తెలుసు కునే లోగానే కాల్చి పారేసాను. తర్వాత అతడి తలను, చేతులను కూడా నరకడం ప్రారంభించాను. నాపై మర తుపాకుల్ని ఎక్కుపెట్టా లని కోరుకున్న చేతులవే. తర్వాత నేను అతడి తలను గుర్తుగా, భద్రంగా దాచాను !" (పేజి 7) 30 ఏళ్ళ క్రితం 1993 లో ఇండియా టుడే పత్రిక్కి శ్రీనివాస్ హత్యను గురించి వీరప్పన్ స్వయంగా చెప్పిన మాటలివి. ఇంతకీ ఎవరీ శ్రీనివాస్. దేశవ్యాప్తంగా నవంబరు 10న అటవీ అధికారుల స్మృతిదినోత్సవంగా ఎందుకు జరుపుకుంటారు ? రాజమండ్రిలో రోడ్డుకీ, పార్కుకీ సరే కానీ దేశంలోనే అత్యున్నత శిక్షణా సంస్థ లైన డెహ్రాడూన్, ముస్సోరీ వంటి చోట్ల ఆయన చిత్రాలు పెట్టి జీవితాన్ని పాఠ్యాంశంగా ఎందుకు బోధిస్తున్నారు !?

కర్నాటక రాష్ట్రంలోని చిక్మంగు ళూరు ఫారెస్ట్ కాంప్లెక్స్ లో ఈ తెలుగు వీరుడి కాంశ్యవిగ్రహం పెట్టడానికి కారణం ఏంటి ? వీటన్నింటి కంటే ముఖ్యంగా, తమిళనాట వీరప్పన్ సొంత గ్రామమైన 'గోపీనాథం' లో శ్రీనివాస్ పటాన్ని శాశ్వతంగా ప్రతిష్టించుకున్న గ్రామస్తులు, మారియమ్మ దేవాలయాన్ని శ్రీనివాస్ స్మృతికి సమిష్టిగా అంకితం చేయడానికి కారణమేంటి? శ్రీనివాస్ చని పోయిన దశాబ్దాల తరువాత కూడా ఆ గ్రామం ఆయన్ని దేవుడిగా ఎందుకు పూజి స్తోంది !? "శ్రీనివాస్ తన జీవితాన్ని తాను ఎంచు కున్నాడు.తనే నిర్మించు కున్నాడు. ఒక సాధారణ యువకుడు తన ఆదర్శం పట్ల సీరియస్ గా ఉంటే, పట్టుదలగా కృషి చేస్తే, ఎంత సాధించగలడో, ఎంత మార్పు తేగలడో తన జీవితాన్ని ఎంత గా ధన్యం చేసుకోగలడో, ఒక లెజెండ్ గా మారి తన వ్యక్తిత్వంతో ఒక తరానికి ఎలా స్ఫూర్తి ఇవ్వగలడో చెప్పడానికి శ్రీనివాస్ జీవితమే ఒక ఉదాహరణ.!"

"మన తెలుగు ప్రజల దురదృష్ట మేమిటంటే,అటువంటి మహా నీయ మూర్తి త్యాగమయ, వీరోచిత జీవిత ఘట్టం సమ కాలీన చరిత్రలో మన కళ్ళ ముందే ఆవిష్కృత మైనా గుర్తించ

లేనంత అంధులమై పోయాం మనం. వర్తమాన భావితరాల యువ తరానికి అపూర్వమైన స్ఫూర్తి ని అందించగల శ్రీనివాస్ జీవితం, కేవలం ఒకరోజు పత్రిక లో మొదటిపేజీ వార్తఅయ్యింది మనదుర్భాగ్య ఆంధ్ర దేశానికి. అంతకుమించి మరేమీకాలేదు. లోకోత్తరమైన కరుణని, వెరపెరుగని పోరాటదీక్షని ప్రతిబింబించే శ్రీనివాస్ జీవితం గురించి కంటే, అలవిమాలిన దుష్ట త్వానికి ప్రతీకయిన వీరప్పన్ గురించే ఎక్కువ తెలుసు తెలుగు దేశానికి.!"(పేజి 8)

ఒక నిబద్ధత, నిజాయితీ కలిగిన IFS అటవీ శాఖా అధికారిగా, ప్రజాపక్ష ఆలోచనా పరుడిగా, సంఘ సంస్కరణా భిలాషిగా, సేవాతత్పరునిగా, అరుదైన ప్రజాహిత ఉద్యోగిగా, అకళం కిత కర్తవ్య నిర్వహణ శీలిగా, నైతిక విలువలు పాటించే గాంధేయ వాదిగా గాఢమైన ముద్ర వేసిన కీర్తిచక్ర పందిళ్ళ పల్లి శ్రీనివాస్ స్మగ్లర్ వీరప్పన్ చేతిలో అన్యాయంగా, దుర్మార్గంగా హత్య చేయ బడిన తెలుగు వాడు. ఇరవై ఏళ్ళ క్రితం జనహర్ష తన మొదటి ప్రచురణగా శ్రీనివాస్ తల్లి దండ్రులకి అంకితమిచ్చి తీసుకువచ్చిన ఏకైక తెలుగు పుస్తకం ఇది !

కీర్తిచక్ర పందిళ్ళపల్లి శ్రీనివాస్ స్ఫూర్తిని గ్రహిస్తూ ఆయన తల్లిదండ్రులకు 'మహాత్మా గాంధీ హార్మనీ అవార్డును అందించడం మొదలు, అప్పట్లో హెచ్.బి.టి వాళ్ళు ప్రచురించిన గంధపు చెక్కల వీరప్పన్ పుస్తకం మీద సాధికారిక విమర్శ వరకూ తెలుగు జాతి విస్మరించిన ఒక గొప్ప యోధుడి ఆశయాల మననం జనహర్ష ప్రచురించిన ఈ పుస్తకం.36 ఏళ్ళ వయసు లో అనితరసాధ్యమైన అంకిత భావంతో అహర్నిశ లూ ఈ దేశంకోసం పనిచేసి అసువులు బాసిన శ్రీనివాస్ స్ఫూర్తి నలువైపులా విస్తరిం చాలనీ ఆకాంక్షిస్తూ, ఆయన 32 వ వర్ధంతి సందర్భంగా మిత్రులు,పెద్దలు జైభారత్ రమణమూర్తి సరిగ్గా 20 ఏళ్ళ క్రితం 2003లో వెలువరించిన ఈ పుస్తకం కోసం చాలా ఆలస్యంగా చిన్న రైటప్ !

(చదవాలనుకునే వారి కోసం నెట్లో పుస్తకం సాఫ్ట్ కాపీ పంపుతున్నాను. Srinivas was a true Gandh ian. Lived as Gandhian, died as a Gandhian అనే మాట ఈరోజు ఎంత నిజమో యువతరంలోని గుప్పెడు మందైనా గ్రహించ గలిగితే సంతోషం. ఎందుకనేది స్పష్టం,"శ్రీనివాస్, శ్రీనివాస్. సైతాన్ క్రూర వీక్షణం పైన దైవిక శక్తుల విజయహాసం అతడు. జీవితాన్ని జెండాగా ఎగరేసిన సాహసి. ఈ భూగోళం మీద ఇప్పటివరకూ ఉ ద్భవించిన అద్భుతాల్లో మానవత్వమే,మానవత్వమే..మానవత్వమే మహోన్నతమని చాటిన మరొక ఉదాహరణ శ్రీనివాస్!." )

# మనలో మనం - తొలి అడుగులు

## (వినూత్న కవితా సంకలనం)




"ఎప్పటికప్పుడు పడిపోతాననిపిస్తుంది
నిలదొక్కుకోగలననీ అనిపిస్తుంది
భయమేస్తుంది, భరోసానూ వస్తుంది
పుట్టిన క్షణం నుంచి
భూమిమీద నాటుకున్న నిమిషం నుంచి
ఆమాటకొస్తే, అమ్మ బొజ్జలో
తొలిగా బబ్బున్న క్షణం నుంచి
నేను ఉంటానా అని భయమే
నన్ను ఉండనిస్తారా అని సందేహమే !"

అణిచివేతలోంచి వచ్చే అభివ్యక్తికి ఒక రకమైన గాఢత ఉంటుంది. మానవ సంబంధాల సుగంధాలతో వెల్లువెత్తే అక్షరాలకి ఆ సౌరభం అబ్బుతుంది. మేధావులు మెచ్చకపోవచ్చు. లబ్ధప్రతిష్ట లకి నచ్చకపోవచ్చు. ఐనా, అవి అలాగే ఉంటాయ్. గుండెల్లో మండే లావా మంటలకి రాయాలనే సంకల్పమే కానీ, లయ సంగీతాల తో పనుండదు. ఎందుకంటే, అవి వేకువ వెలుగులతో కూసే తీతువుఅరుపులు. చీకటి దారుల్ని చీల్చే ఆశల మెరుపులు. రేపటి తరాల కోసం వేసే "తొలి అడుగులు"!

"రానున్నది నవశకము/అందునున్నది కేవలం ఒకే మతం/ ఐక్యతా రాగాన్ని ఆలపిస్తూ / సమైక్యతే ఊపిరిగా నిలిచే తరం." (పేజి 53) అని 'కీలుబొమ్మలు' కవితలో రోహిణి బొమ్మన అన్నప్పుడు, "నీ ఆశయం పరొపకారార్థం ఇదం శరీరం/ అదే మాకు సర్వదా శిరోధార్యం" అని శ్వాస కవితలో జ్యోతిర్మయి జానపాటి అన్నప్పుడు ఛాయాచిత్రాల ద్వారా వారు చెప్పాలను కున్న ఆదర్శాల తీరు స్పష్టంగా పాఠకుడికి కనబడుతుంది !

ఆ కవితాత్మకత కొన్నిచోట్ల మరింత రాటుదేలి,"కాలం సమాధి పై నీవు/ రాల్చిన పున్నాగ పూలను/ ఒడిసిపట్టుకుంటూ పసివాణ్ణవు తుంటాను" అని 'లే మిత్రమా' లోనూ, "నాకు నీవు, నీకు నేనుగా ప్రారంభమైన మన కలయిక చివరికంటూ అలాగే ఉన్నామా!" అనే ప్రశ్నగా 'సుజాత,' చివరికి ఇలా మిగిలాము'లో కొనసాగింది. " జీవితాన్ని ప్రేమించడం ఎలాగో నేర్పాల్సింది ఇకమీదట అక్షరాల్ని ప్రేమించే కవులే కదా" అని సుభద్రాదేవి 'జీవన విలువలు'కవిత ప్రకటించింది !

సుజాత, బిజిలి, రమణి, స్వర్ణలత, నిర్మలారాణి అడ్మిన్లుగా మూడేళ్ళ క్రితం మొదలైన

‘మనలో మనం’ వాట్సప్ గ్రూపు క్రమంగా 42 మందితో నాలుగవ వసంతం లోకి అడుగిడిన సందర్భం ఈ చిరు ప్రచురణకి ప్రేరణ. ఆ గ్రూప్ లో పెట్టే ఫొటోలకు స్పందించిన మహిళలు కవితలు రాయడం, ఆ ఫొటో కవితల్నిలా గుది గుచ్చి కవితా సంకలనంగా తీసుకురావడం నాకు తెలిసి తెలుగులో మొట్టమొదటి సారిగా జరిగిన ఒక విశిష్ట ప్రయత్నం !

ఈసరికే అనుభవం ఉన్నవారితో పాటుగా జోత్స్న, ప్రగతి, నాగమణి, శశికళ, వసుంధర, సునీత, దీవెన, దేవకి, బాలభారతి, షహనాజ్, పల్లవి, ఉషారాణి, నాగమణి, రమాదేవి, వెంకట లక్ష్మి..ఇలా ఎందరో వారిలోని అభినివేశానికి అక్షర రూపం ఇచ్చి స్వీయ అనుభూతిలో తాదాత్మ్యం చెందారు. సామాజిక చింతనను హృదయంలోకి ఆహ్వానించగలగినపుడే ఇది సాధ్యం. ఎందుకనేది స్పష్టమే,

“మా పై జరిగే అణిచివేతలను ప్రశ్నించాలని అవును, మేము నిర్ణయించుకున్నాము
స్వేచ్ఛా, సమన్యాయం కోసం సంఘటితంగా నినదించాలని
ఎన్ని నిర్భంధాలు ఎదురైనా – ఆపలేని సూర్యకాంతి వోలె
మా పయనం ముందుకే, మున్ముందుకే !”

(భిన్న చిత్రాల గురించి వ్యక్తమైన విభిన్న సమ్మిళిత సంకలనం ఈ పుస్తకం. ఆరోగ్య కరమైన సమిష్టీకరణకి ప్రతీక. ప్రచురణ సంఖ్య 150 అనిచ్చారు కాన గత ప్రచురణల జాబితా ఇచ్చుంటే బావుండేది. అలాగే ప్రచురణ కాలం నవంబరు 2023 అని ఉంది. కారణాలు తెలీదు. కాకుంటే, నూరు పుటల్లో నలభై పేజీల వరకూ సుమారు పది ముందు, వెనుక మాటలే ఉండటం కొంచెం బరువనిపిస్తుంది. అది మినహా ‘మనలో మనం’ అద్భుతంగా ఉంది. మలి ప్రచురణల్లో మరింత శ్రద్ధ తీసుకుంటారని ఆశిస్తూ, సభ్యులు అందరికీ అభినందనలతో ఈ చిన్న రైటప్ !)

# చారిత్రాత్మక పోరాటాల అవలోకనం

## లేడీ డాక్టర్స్ (పుస్తక పరిచయం)




"చదవకుండా వంటపనిలో పడి చదువుని నిర్లక్ష్యం చేసినందుకు 13 ఏళ్ళ భార్యను చితకబాదే భర్తా, ఆడపిల్లకు చదువు నేర్పిస్తే లేచిపోతుందని నమ్మే కన్నతండ్రీ, డాక్టరుని అస్పృశ్యురాలిగా భావించి పనిమనిషి పక్కన కూర్చోబెట్టి భోజనం పెట్టిన రోగి బంధువులు, కాలేజీ చదువులో ప్రథమస్థానం పొందినాసరే ఆడపిల్లకు బంగారు పతకం ఇస్తే ఆమెను హతమారుస్తామనే మగపిల్లలు, ఇల్లు చక్కబెట్టు కోకుండా వైద్యవృత్తి చేపట్టినందుకు పతితగా ముద్రవేసిన పత్రికాధిపతులూ, బరి తెగించిన ఆడది అనే జాతీయవాదులూ, పదేళ్ళు కూడా నిండని భార్య ముందు పరాయి స్త్రీ తో కామక్రీడలు జరిపే కామపిశాచ భర్తలూ ఇందులో మనకు కనిపిస్తారు." (పేజి - 6)

2021 లో ఇంగ్లీష్ లో వచ్చిన కవితారావు గారి లేడీ డాక్టర్స్ పుస్తకానికి తెలుగులో వచ్చిన పరిచయానికి ముందుమాటలోనివి పై మాటలు. డా. పి. ఎస్. ప్రకాశరావు తెలుగులో పరిచయం చేసిన ఈ పుస్తకాన్ని డా. చెలికాని రామారావు మెమోరియల్ కమిటీ, రామచం ద్రాపురం వారు చక్కగా ప్రచురించారు. అంతేకాదు, తెలుగువారికి అమూల్యమైన కానుకగా అందించడం ద్వారా తెలుగులో లేడీ డాక్టర్స్ గురించిన మొదటి పరిచయ గ్రంథంగా ఇదో చరిత్ర అని చెప్పవచ్చు. స్త్రీల పట్ల అన్ని రంగాలలో అమలవుతున్న వివక్ష తాలూకా స్పృహని గుర్తించడానికి ఇదో సందర్భం !

ప్రపంచంలోని పేరెన్నికగన్న విశ్వవిద్యా లయాలు మొదలుకొని పేద్ద జాతీయ నాయకులుగా పేరొందిన పురుషుల వరకూ స్త్రీల విద్య, హక్కుల దగ్గరకి వచ్చేసరికి ఎంత సంకుచితంగా ఉండగలరో కళ్ళకు కట్టినట్లు చూపించే ప్రయత్నం ఈ పుస్తకం చేసింది. దశాబ్దాల క్రితం మూఢనమ్మకాలు, మత చాందసత్వం, కుల వివక్షత, పురుషాధిక్యత రాజ్యమేలుతున్న కాలంలో ఇందులోని మహిళలు చేసిన పోరాటాలు, నిజంగా అవి నూతన సమాజం కోసం వేసిన బలమైన చైతన్యవంతమైన ముందడుగులు. మానవ చరిత్రనీ, ముఖ్యంగా భారతీయ జ్ఞాన పునర్వికాశ ఉద్యమంలోనూ, వైజ్ఞానిక వికాసోద్యమంలోనూ స్త్రీల అస్తిత్వాన్ని లోతుగా దుకొల్పిన

సంఘర్షణ వెలుగులు !
"పందుల్ని పెంచితే మాంసం వస్తుంది. కుక్కల్ని పెంచితే ఇంటికి కాపలా కాస్తాయి. పిల్లుల్ని పెంచితే ఎలుకల్ని పడతాయి. స్త్రీల వల్ల ఒరిగేదేముంది" వంటి చైనా సామెతలు ప్రపంచంలోని స్త్రీల పరిస్థితుల్ని చెప్పకనే చెబుతాయనే పరిచయ కర్త (పేజి నెం - 10),
పురాణాల నుండి ఆధునిక భారతదేశ చరిత్ర వరకూ స్త్రీల పై జరిగిన అవమానాల్నీ, అఘాయిత్యాల్నీ ఓపికగా పరిశీలించి రాసుకున్న ఫుట్ నోట్సూ, మహిళా సంఘాలు ప్రచురించిన కరపత్రాల నుండి కందుకూరి, గురజాడ, మహీధర, బిపిన్ చంద్ర, బండారు అచ్చమాంబ, రాహుల్జీ వంటి మహామహుల ఆధార గ్రంథాల జాబితా చూస్తే అవడానికి ఇదో పరిచయం కావచ్చును కాని పరిచయకర్త ఈ పుస్తకాన్ని గురించి చేసిన లోతైన కృషి ఉత్తమ పరిశోధనకి ఏ మాత్రం తగ్గేది కాదనే విషయాన్ని తెలుపుతుంది !
అవడానికి ఇది లేడీ డాక్టర్స్ కథైనా నిజానికి వైజ్ఞానికోద్యమానికి దేశంలో బాటలు వేసిన మహిళల వ్యథ. అందుకు అడుగడుగునా వారు ఎదుర్కొన్న అంతులేని అవరోధాల బెడద కూడా మనకి కనిపిస్తుంది. విదేశీయానం చేయడం నుండి విశ్వవిద్యాలయాల్లో స్థానం కోసం ఈ స్త్రీలు చేసిన పోరాటం దాకా, వైద్య చికిత్సాలయాల స్థాపన గురించి ఎదుర్కొన్న సమస్యల నుంచీ దేవదాసీ వ్యవస్థను రూపు మాపడం కోసం పరోక్షంగా కారణమైన ఉద్యమం వరకూ ఎన్నో రకాలుగా ఈ దేశపు మహిళలు చేసిన సంఘర్షణ ఈనాటి తరాలకొక కనువిప్పు కావాలి. "స్త్రీలకు చదువెందుకు? చదువుకుని ఊళ్ళేలాలా, ఉద్యోగాలు చేయాలా ? అంది పురుష ప్రపంచం. కానీ ఈ మహిళలు ఊళ్ళేం ఖర్మ శాసనసభకు వెళ్ళి రాష్ట్రాన్నే ఏలారు. ఉన్నతమైన ఉద్యోగాలూ చేసారు." (పేజి - 113)అన్న పరిచయకర్త మాటలు అక్షర సత్యాలని పుస్తకం పూర్తి కాగానే అనిపించక మానదు !
ముఖ్యంగా, పుస్తకం మొత్తంలో ఎక్కడా ఒక్కటంటే ఒక్క సంక్లిష్ట వాక్యం కూడా లేకుండా చాలా తక్కువ అచ్చు తప్పులతో వీలైనంత సున్నితంగా సాగిపోయే సులభమైన భాషలో తెలుగు చేసిన పరిచయకర్త కి ప్రత్యేక అభినందనలు. పోతే నా దృష్టికి వచ్చిన ఒకట్రెండు అంశాల్ని తడిమి ఆపుతాను. మొదటిది అనేక అంశాల్ని ప్రస్తావించిన 'ప్రవేశిక'
చివరాఖరికి మహాత్మా జోతిరావు ఫూలే మహిళలకి నిర్వహించిన పరీక్షా విధానం చూడడానికని వచ్చిన మూడువేల మంది సందర్శకుల సంగతి కూడా ప్రస్తావించింది కానీ దేశంలో స్త్రీల విద్యకి మార్గాన్ని సుగమం చేసిన సావిత్రి బాయి ఫూలే, ఫాతిమా షేక్ లని ప్రస్తావించకపోవడం పొరపాటనేది (పేజి నెం 14) నా అభిప్రాయం. ఇక రెండోది తొలితరం లేడీ డాక్టర్లని కూడా సంక్షిప్తంగా పరిచయం చేసి మూల గ్రంథంలో ఉన్నటువంటి దేశంలోనే మొట్టమొదటి లేడీ సర్జన్ అయిన మేరీ లూకోస్ ను తెలుగు పుస్తకం నుండి మినహాయించడం

సరికాదు సరికదా అందుకు వివరణ ఇస్తూ ముందుమాటలో చెప్పిన “ఆరవ డాక్టరైన మేరీ లూకోస్ తండ్రి వైద్యుడు కావడం వల్ల మొదటి ఐదుగురు మహిళా వైద్యులకూ ఎదురైన కుల,మత,సంఘ కట్టుబాట్లు వివక్షలూ స్వదేశంలో ఆమెకు ఎదురవలేదు. అం దుకే ఆమె చరిత్రను ఈ పరిచయంలో మినహాయించడం జరిగింది.” అనే వాక్యాలు లింగ వివక్ష దగ్గరకి వచ్చేట ప్పటికి ఎంత మాత్రమూ సమంజసం కాబోవనే నా అభిప్రాయం !

ఆంగ్లం లోనే మొట్టమొదటి ప్రయత్నం అయిన ఈ పుస్తకం అన్ని భారతీయ భాషలలో రావాల్సిన అవసరం ఉంది. తెలుగులో ఈ ప్రయత్నం చేసిన ప్రచురణ కర్తలకూ, పరిచయ కర్తకూ మరోసారి అభినందనలు. జ్ఞానం సమిష్టి తత్వానికి ప్రతీకనే విషయాన్ని అంగీకరిస్తున్న ప్రపంచవ్యాప్త ఉద్యమకారులు, ప్రజాతంత్ర వాదులూ %జతీమఞ్అజవ జశీఎఎశీఅం% అనే ఒక భాగస్వామ్య విధానంలో భాగంగా పుస్తకాల పై పెట్టుబడిదారీ కాపీరైట్ పద్ధతులకి భిన్నంగా ‘కాపీలెఫ్ట్’ విధానాన్ని అవలంబించడం ఒక ఆరోగ్యకరమైన సాంప్రదాయం. తెలుగులో నా ప్రచురణలు అన్నీ దాదాపు ఆ కోవకి చెందినవే.

ఏ లాభాపేక్షా లేకుండా చేస్తున్న ఈ ప్రయ త్నాలకి కాపీరైట్ హక్కులు తెలిసీ పెట్టినవి కావు. కాబట్టి భవిష్యత్తు ప్రయత్నాలలో ఈ విషయం దృష్టిలో పెట్టుకుంటారని ఆశిస్తూ, ఈ పుస్తకం విద్యార్థులు, యువతలోకి విస్తృతంగా వెళ్ళాలని కోరుకుంటూ, ఆసక్తిపరులకు సాఫ్ట్ కాపీ పంపుతున్నాను, తప్పక చదవగలరు. సెలవు !

# అస్తిత్వం - చైతన్యం - కార్మికవర్గం

## (బీయింగ్ - కాన్షస్నెస్ - ప్రొలెటేరియట్)




"చరిత్ర అంటే భావాల చరిత్రేనని భావిస్తున్న రోజుల్లో మార్క్స్,ఎంగెల్స్ ఆ వాదాన్ని తిరస్క రిస్తూ చాలా రాడికల్ ప్రతిపాదనలు చేసారు. చరిత్ర అంతటికీ మొట్టమొదటి ప్రాతిపదిక సజీవ మానవ వ్యక్తుల ఉనికి, ప్రకృతితో వారి సంబంధం అని ప్రకటించారు. తమ జీవితా వసరాలను ఉత్పత్తి చేసే క్రమంలోనే మనుషులు పరోక్షంగా తమ వాస్తవ జీవితాలను రూపొందించుకొని తీర్చిదిద్దు కుంటారు. తమ జీవితావసరాలను ఉత్పత్తి చేసుకొనే విధానమే వారు తమ జీవితాలను వ్యక్తం చేసుకొనే నిర్దిష్ట రూపం. వారు తమ జీవితాలను ఎలా వ్యక్తం చేసుకుంటారో అలాగే ఉంటారు..."(పేజి 13)

"ఈ మహామానవ ప్రస్థానంలో వేలు లక్షల తరాల మానవులు తమ చమటతో ఈ భూగోళపు రూపు రేఖల్ని మార్చేశారు. ఆ క్రమంలో కోటానుకోట్ల ప్రజలు చరిత్ర రథచక్రాల కింద నలిగి నాశనమైపోయారు. ఆకలి, రోగాలు, యుద్ధాలు,ప్రకృతి వైపరీత్యాలకు బలైపోయారు. ఇలా మొత్తం మానవాళి కృషి, ఆ కృషిలో అత్యధిక మానవులు అనుభవించిన నరక యాతనలు, బలిదానాల మొత్తానికి ఎవరైనా ఖరీదు కట్టగలరా?.." (పేజి 14)

"మనుషుల నిజ జీవితం కేవలం ఆకలి తీర్చుకొనే జీవపర అస్తిత్వం కాదు. అది ఇతర జీవులకు భిన్నమైన అస్తిత్వం. అవసరాలు తీర్చే వస్తువుల సేకరణకు పరిమితమవ్వక మనిషి వాటి ఉత్పత్తికి పూనుకున్నాడు. అలా మనిషి తన అవసరాలను ఉత్పత్తి చేసే క్రమం యొక్క చరిత్ర సృష్టించినదే మానవ అస్తిత్వం."(పేజి 37)

ప్రొలెటేరియన్ అనే మాటకు అసలు అర్థం, ఏ పనీ చేయకుండా, సోమరులుగా బతికేవారు తప్ప మిగిలిన వారందరూ అని. కేపిటలిస్టు సమాజంలో ప్రొలెటేరియట్ అంటే వ్యక్తి కాదు, సమిష్టి శ్రామికుడు. ఒక్కడే కావచ్చు (చాలా అరుదు), పెద్ద సమూహం కావచ్చు. ఎవరైతే సరుకును ఉత్పత్తి చేస్తారో వార్ని ప్రొలెటేరియట్ అన్నాడు మార్క్స్. ఇందులో ముఖ్యంగా మానసిక, శారీరక శ్రమలు కలిసి ఉంటాయి. ఈ శ్రమ ఫ్యాక్టరీ లోగాని, దానికి దూరంగా గాని, ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని, పర్యవేక్షణ గాని, పాచిపని గాని ఏదైనా కావచ్చు. ఇవన్నీ సరుకల ఉత్పత్తికి సంబం ధించినవై ఉండాలి. అలా ఉత్పత్తి అయిన సరుకుల్లో చేరిన విలువ ఏ ఒక్కరిదో కాక అందరి శ్రమ ఫలితం.

ఈఆశ్రమలో పాలుపంచు కున్న వారందరూ కూడా ప్రొలెటేరియట్ లో సభ్యులే!" (పేజి 64,65)

"కార్మికవర్గం యొక్క ఈనాటి స్థితిని వివరించగల సిద్ధాంతం మార్క్స్ రచనల్లో లభించదు. వివరించగల సత్తా ఉన్న ఎలియనేషన్, ఐడియాలజీ, ఫెటిషిజం మొదలైన సిద్ధాంతాలను నేటి పరిస్థితులకు అన్వయించే ప్రయత్నాలు జరగడం లేదు. వామపక్ష కార్మిక నాయకులైతే ఇటువంటి సమస్య ఉందని గుర్తించినట్లు లేదు. కార్మికుల మనస్తత్వం పై ప్రభావం చూపగల సాంస్కృతిక రంగంలో కృషి నామమాత్రం. వికృతమొనర్చిన పెట్టుబడిదారీ మన స్తత్వాన్ని నరనరాన జీర్ణించుకున్న కార్మికవర్గం పెట్టుబడిదారీ వర్గాన్ని ఎలా కూలదొయ్యగలదు?" (పేజి 76)

"ఈ సమాజంలో చిన్నప్పటి నుంచి ఇంట్లో, గుళ్ళో, బళ్ళో అన్నిచోట్లా మనిషికి 'విధేయత' ను నూరిపోస్తారు. ఇది 'అధికారానికి విధేయత. ఇటీవలి కాలంలో 'ప్రశ్న' పంచ మహాపాత కాలనూ మించిన మహా పాపమై పోయింది. శిక్షా స్మృతిని సవరించ కుండానే ప్రశ్నించేవారిని శిక్షిస్తున్నారు. సామాజిక, రాజకీయ జీవితంలో ప్రశ్నను సహించే పరిస్థితి లేదు. ఇటువంటి పరిస్థితుల్లో తమకు హాని చేస్తున్న వారిని సైతం ప్రశ్నించ డానికి అవిధేయత చూపడానికి సాహసించ లేక పోతున్నారు.." (పేజి 77, 78)

"మరో ముఖ్య విషయం ఏమంటే మార్క్స్ 'నియతివాది' కాదు. మార్క్స్ గతితర్కంలో 'ఆవశ్యకత' (నెసెస్సిటి)లో'యాదృచ్ఛికత' (చాన్స్) ఒక భాగంగా, దాన్ని వెన్నంటి ఉంటుంది. ఛాన్స్ కు ఏమాత్రం తావులేని 'శుద్ధ ఆవశ్యకత' ఉండదు. ఆవశ్యకతకు అతీతంగా ఛాన్స్ ఉండదు..." (పేజి 82)

"..అనేక దొంతర్లున్న మన దేశంలో మెజారిటీ ప్రజలకు కులం పుట్టుకతోనే వస్తుంది. అగ్ర కులాలకు చెందిన వారు తమ కులాధిక్యత గురించి గొప్పగా ఫీలవుతారు. ఇందులో ఒక సౌలభ్యం ఉంది. వ్యక్తిగా తనకు లేని ఆధిక్యత, విలువలను కుల సభ్యునిగా ఫీలవ్వచ్చు. దోపిడీ కోసం, అధికారం కోసం వివిధ అగ్ర కులాల ధనికులు ఇతర కులాలకు వ్యతిరేకంగా తమ తమ కులస్తులను కూడ గట్టి రెచ్చగొడు తున్నారు. ఈ కులతత్వం వల్ల ఆయా కులాల్లోని బీదలకు ఒరుగుతున్నదేమీ లేదు. ఐతే, మరో కులం పట్ల ద్వేషం వల్ల వారిలోని ద్వేషాగ్నికి ఇంధనం అందుతున్నది. (పేజి 87)

"మార్క్సిజం గురించి అవగాహన లేకుంటే కమ్యూనిస్టులుగా మన ఆచరణ సత్ఫలితాన్ని ఇవ్వదు. అలాగే చాలా మంది యువ కమ్యూనిస్టులు హేతువాదం, నాస్తిక ఉద్యమాల పట్ల తీవ్ర ఆకర్షణ, అభిమానం కలిగి ఉంటున్నారు. నిజానికి చాలామంది హేతువాద, నాస్తిక ఉద్యమ నాయకులు, క్రియాశీల కార్యకర్తలు కమ్యూనిస్టు వ్యతిరేకులు. మార్క్సిజం

పట్ల వీరికి తీవ్ర అభ్యంతరాలు ఎందుకున్నాయో తెలుసు కోవాలి. ఈ క్రమంలో అస్తిత్వానికి, చైతన్యానికి ఉన్న సంబంధం గురించి మార్క్సిజం ఏం చెబుతుందో తెలుసు కోవడం చాలా అవసరం.” (పేజి 90)

అస్తిత్వం – చైతన్యం గురించిన మార్క్స్ భావనల్ని పరిచయం చేస్తూ రావు కృష్ణారావు గారు రాసిన 90 పుటల చిన్న పుస్తకం ఇది. డా. చెలికాని రామారావు స్మారక సమితి ప్రచురించిన ఈ గ్రంథం మలిముద్రణ విశాలాంధ్ర చేసింది. పుస్తకం చివర 1934లో జర్మన్ కమ్యూనిస్టు పార్టీని విమర్శిస్తూ Wilhelm Reich అనే కమ్యూనిస్టు రాసిన వ్యాసంలోని అంశాల గురించి ప్రస్తావించడం సమకాలీనంగా ఈ రోజు అవసరమని నా భావన. కాలక్షేపం కోసం కాకుండా కాస్త సీరియస్ అధ్యయనం చేసేవారు చదవాల్సిన పుస్తకం. 20/– రూపాయల నామమాత్రపు విరాళానికి విశాలాంధ్ర లో అందుబాటులో ఉంది !

# కలసి బ్రతుకుదాం

## ( సహకార భావన అంటే కలుపుగోలుతనం)

"ఒక మనిషి బ్రతకడానికి మూడు ముఖ్య అవసరాలు : 1.కడుపునిండా తిండి. 2. కట్టుకోడానికి చాలినంత బట్ట. 3. ఉండ టానికి ఇంత నీడ. మానవునికి కొన్ని అవసరాలేమో పుట్టుక తోనే ఉంటవి. మరికొన్ని అతడు పెరిగినకొద్దీ అలవాటు చేసుకుంటాడు. ఇటు వంటి అవసరాలను పూర్తి చేసుకొనటానికి మనిషి ప్రయత్నిస్తుం టాడు. ఎల్లప్పుడూ మనిషి ఏదో ఒక పనిని చేస్తూనే ఉంటాడు. మీరొక్కసారి ఈ ప్రపంచంలో ఉన్న ఒక్కొక్క మనిషి పనులను పరిశీలించి చూడండి. ప్రతిమనిషి ఏదో తొందర పడు తున్నట్టు కనిపిస్తాడు. దేనికోసమో ప్రతివాడూ పరుగు తీస్తున్నట్టు అనిపిస్తాడు.ఈ పరుగే ప్రపంచం యొక్క పోకడ. ఈ పరుగును పరిశీలించి సిద్ధాంతాలు చేసే శాస్త్రాన్ని "ఆర్థిక శాస్త్రం" అంటారు ! (పేజి 4)

తిరుగులేని కులనిర్మూలన వాది, తెలంగాణ తొలితరం భావోద్యమకారుడు, హేతువాది, సోషలిస్టు, జి.సురమౌళి 6 దశా బ్దాల క్రితం రాసిన అద్భుతమైన పుస్తకం, 'కలసి బ్రతుకు దాం', లోని వాక్యాలివి. 1958 లో భారత ప్రభుత్వం బహుకృతినొందిన ఈ పుస్తకం సహకార సమాజ స్వరూపాన్ని మన ముందు ఆవిష్కరిస్తుంది. అన్ని వయసుల వారికి సులభంగా అర్థమయ్యేలా సులువైన భాష, సుందరమైన బొమ్మలతో ప్రజాతంత్ర వ్యవస్థ నిర్మాణానికి సంబంధించిన కొన్ని విలువైన ప్రాతిపదికల్ని సచిత్రంగా మనకు అందిస్తుంది !

"ఈ పోటీ ఆర్థిక వ్యవస్థ ధనవంతులను మరీ ధనవంతులను చేస్తుంది. దరిద్రులను మరీ దరిద్రులను చేస్తుంది. డబ్బున్నవాడే తన పిల్ల లకు పెద్ద పెద్ద ఉద్యోగాలిప్పించుకుంటాడు. పెద్ద పెద్ద చదువులు చెప్పించుకుంటాడు. సీమకు కూడ పంపిస్తాడు. వాళ్ళే పెరిగి మళ్ళీ ధనవంతులు అవుతారు. ఏమాత్రం ముక్కు నుండి నీరు కారినా మంచి మంచి మందులు వేయించుకొని బాగుపడతారు. ఏ రోగమూ రాకుండా మంచి ఆహారం తింటాడు. మంచి ఇంటిలో ఉంటాడు. కాని, దరిద్రుడు కడుపు నిండ తిండే తినజాలడు. ఆరోగ్యకరమైన తిండి సంగతి అతనికి తెలియనే తెలియదు. తన పిల్లలకు చదువు సంగతి అట్లా ఉంచి కాస్త బలం వచ్చేదనుక పనిలోకి పంపిచ కుండానన్నా ఉండడు. పని చేయడానికే దరిద్రులు పుట్టినట్లు, అనుభవించడానికే ధనవంతులు పుట్టినట్లు అనిపిస్తుంది." (పేజి 9, 10)

అంతేకాదు, ఈ పోటీ ఆర్థిక వ్యవస్థ లో మోసం, కల్తీ అనేవి తప్పనిసరిగా ఎలా ఉంటాయో వివరంగా విశ్లేషించినాయన, "..మనిషికి పుట్టుకతోటే ఉన్న ఈ సహకార భావాన్ని ఈ పోటీ ఆర్థిక వ్యవస్థ వచ్చి అణిచిపెట్టింది. సహకార భావం అంటే ఏందో కాదు - కలుపు గోలుతన మన్నమాట. అది మంచిదిగా దని ఎవరంటారు ? కాని ఈ పోటీ ఆర్థిక వ్యవస్థలో అది సాగదు. మనిషిలో ఉన్న ఈ కలుపు గోలుతనాన్ని పైకి లాగితే, మనిషిలో ఉన్న మంచితనం గూడ పైకి వస్తుంది. అప్పుడు మనమందరము కలసి కమ్మగ బ్రతకవచ్చు."అంటూ మానవీయ వ్యవస్థ సారాన్ని మన కళ్ళ ముందు సాక్షాత్కరింపజేసిన తీరు గొప్పది !

"ఈ పోటీ ఆర్థిక వ్యవస్థలో బ్రతుకు అనేది శిక్షగా తయారైంది. ప్రతిదినం కోట్లమంది ప్రజలు చావును కోరుకుంటున్నారు. నిజంగా జీవితం శిక్ష కాదు. ఇది ఒక్కటే ఆనందాన్ని అనుభవించే సాధనం. బ్రతుకులో పూలు పూయించు కోవాలంటే, ఈ బ్రతుకునే మనం నందనవనం చేసుకోవచ్చు. దానికోసం ఈ పోటీ ఆర్థిక వ్యవస్థ నుంచి సమాజాన్ని మర్లించాలె...మరి దానిని ఏ ఆర్థిక వ్యవస్థ దగ్గరకు తీసుకు పోవాల్నంటే - సహకార ఆర్థిక వ్యవస్థ దగ్గరకి." (పేజి 12)

ఒక కొడుకు తండ్రికి రాసిన మూడు ఉత్తరాల రూపమయిన ఈ పుస్తకం, నిజంగా మనకి  తెలంగాణ నుడికారంతో ప్రత్యామ్నాయ ప్రజాతంత్ర వ్యవస్థ నిర్మాణాన్ని నాకు తెలిసీ జనం భాషలో తెలియజేసిన అపురూపమైన ఒక ప్రయత్నం. కొద్దిపాటి మార్పుచేర్పులతో ఇప్పటికీ ప్రగతిశీల సంఘాలు పునర్ముద్రిం చవల్సిన గొప్ప వర్క్ ఇదని నా భావం. సారం పోయిన సహకార సంఘాల బలాన్ని నేటి యువతకు తెలియజెప్పేందుకు ప్రజా సంఘాలు చేపట్టాల్సిన ఒక ప్రయత్నంలో ఈ పుస్తకం ప్రచారం చేయడం కూడా తప్పనిసరి కావాలి !

"..స్వతంత్రమంటె ఏంది అనేదాన్ని మొదలు దెలుసుకోవాలె. నాకు స్వతంత్రమున్నదని మందింటి మీద నిప్పు వెయవచ్చునా? నాకు స్వతంత్రమున్నదని నేను  విషం తాగి చనిపోవచ్చునా? ..మనం ఇన్నాళ్ళు పోట్లాడి సంపాదించుకున్న స్వతంత్రం బ్రతుకుడానికి గాని చచ్చుడానికి కాదు. గాంధీ మహాత్ముడు తన బొక్కల దేహంతోటి పోట్లాడి తెచ్చిన స్వతంత్రం మనుషులు అందరు బతుకుటానికి గాని కొందరు బతుకడానికి కాదు." (పేజి 30,31)

ఈ చిన్న పుస్తకం మళ్ళీ ముద్రించబడిందో లేదో తెలియదు. కానీ, ఈ రోజు వ్యవసాయం రంగం మొదలు ఆర్థిక రంగం వరకూ ఒక ప్రజాస్వామిక విధానానికి కట్టుబడి ఉండే వ్యవస్థను అభివృద్ధి చేసుకునే ప్రణాళికా బద్ధమైన చిత్రాన్ని రచయిత

ఇందులో ఆవిష్కరించిన తీరు నన్ను ముగ్ధుడ్ని చేసింది. చదవాలనుకునే వారికి అంత ర్జాలంలో అందుబాటులో ఉంది. లేదా వాట్సప్ నంబర్ 9032094492 కి రిక్వెస్ట్ పెడితే సాఫ్ట్ కాపీ పంపగలను !

(కొన్ని భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ, వర్తమాన సమాజంలో ఎంతో ఉపయుక్తమని వ్యక్తిగతంగా నేను భావించే సహకార వ్యవస్థకి సంబంధించిన స్వరూపాన్ని అధ్యయనం చేసే వారికోసం సుర మౌళి రాసిన ఈ చిన్న పొత్తం నల్గొండ జిల్లా సూర్యపేట్ కి చెందిన దీప్తి ప్రచురణలు తీసుకొా చ్చి 65 ఏళ్ళు అవుతోంది. ఎంతో కాలంగా సామా జిక కార్యకర్తలకి మౌఖికంగా పరిచయం చేస్తూ వచ్చిన ఈ పుస్తకం గురించి ఇన్నాళ్ళకిలా ఈ చిన్న రైటప్.)

# నాటకరంగ తరంగాలు !

## (డా.చాట్ల శ్రీరాములు పుస్తక పరిచయం)




“లలితకళల్లో ముఖ్యంగా ప్రదర్శన కళల్లో సంగీతంలో సంగీతమే ఉంది. నాట్యంలో నాట్యమే ఉంది.దృశ్య కళలైన చిత్రలేఖనంలోచిత్రలేఖన మే ఉంది. శిల్పకళలో శిల్పమే ఉంది.కాని, నాటకకళలో కేవలం నాటకమే కాదు, సంగీతం, నాట్యం, చిత్రం, శిల్పం ఆఖరికి మార్షల్ ఆర్ట్స్ అన్నింటినీ తనలో నిబిడీకృతం చేసుకున్న కళ. దర్శకుడూ, ప్రయోక్త ఒక్కరే అనుకుంటే దర్శకుడు నిర్మించిన సర్వకళల సమ్మేళనా భరితమైన దివ్యభవ్య హర్మ్యం నాటకం!”. (పేజి 16)

“తొలి నాటకాన్ని నిరక్షరాస్యులే నిర్మించు కున్నారు. అదో అద్భుతమైన జ్ఞాపకశక్తి. కాలం, జ్ఞాపకశక్తి, అనుభవం కలగలిపిన అల్లిక అది. మాటకో రూపం ఉంది. పాటకో రూపం ఉంది. ఆటకో రూపం ఉంది. తెలుగు నాటకం ఆ మూడు రూపాలతో నిర్మించ బడింది. ఒక తరం మరో తరం వారికి ఆ రూపాన్ని అందిస్తూ వెళ్ళి పోయింది. అందుకున్న తరం ఆ రూపాన్ని అభివృద్ధి చేసింది. ఏ ఒక్క మహాకవో కూర్చొని రాయలేదు. ఒక్క మాటకు వంద మాటలు కలిసాయ్. తెలుగు నాటకం అక్కడే ప్రాణం పోసుకుంది !” (పేజి 17)

“విభిన్న రుచులుగల జనులందరికీ ఏకపాత్ర సమారాధనం చేసేది నాటకం అన్నాడు మహాకవి కాళిదాసు. మనిషిని ఆలోచింప జేసేది,ఆహ్లాదపరిచేదీ, సన్మార్గాన నడిపించేదీ, మనిషి లోని తప్పుల్ని ఎత్తి చూపేదీ, అంతరాత్మని తరచి చూసు కోవడానికి మార్గదర్శి అయినదీ, ఆత్మ జ్ఞానం పెంపొందించేదీ, చివరికి మనిషిలో దేవుణ్ణి చూడగలిగేదీ నాటకం ద్వారానే సాధ్యం !” ( పేజి 25)

“వీధినాటిక ప్రక్రియ జన్మస్థలం ఆంధ్రదేశం. వేష భాషలు ధరించకుండా తిరునగరి రామాంజనేయులు రచించిన ‘వెట్టిచాకిరీ’ అనే నాటికను 1949 తెలంగాణ సాయుధ పోరాటం ఉద్యమం లో భాగంగా నల్గొండ జిల్లాలో మొత్తం 100 సార్లకి పైగా ప్రదర్శించారు. యావత్ భారతదేశం లో ప్రప్రథమంగా వీధినాటకాన్ని ప్రదర్శించిన ఘనత మనదే. సఫ్దార్ హష్మీ ఆద్వర్యంలో ప్రచురించబడ్డ The Right to Perform అనే పుస్తకంలో బెంగాల్ లో వీధినాటకం మొట్టమొదటి సారిగా ఉత్పల్ దత్ భారతదేశంలో జరిగిన రెండవ విడత సాధారణ ఎన్నికల్లో ప్రదర్శించారని వారే రాసుకున్నారు. ఇది చారిత్రక సత్యం..!” (పేజి 109)

డా. చాట్ల శ్రీరాములు చిన్న వ్యక్తి కారు. నాటక రంగంలో అపారమైన అనుభవం ఉన్న వ్యక్తి. కీ. శే. ఆవంత్స సోమసుందర్ గారు తన 90 వ జన్మదినం సందర్భంగా శ్రీరాములుగారికి పురస్కారం ప్రధానం చేసారు. ఆ తర్వాత కళాకేళి నికేతన్ (పిఠాపురం) తరపున పెద్దలు కీ. శే. గొల్లపూడి మారుతీరావు రాసిన మున్నుడితో అద్భుతమైన శ్రీరాములు గారి వ్యాసాల్ని గుదిగుచ్చి 2015 లో పుస్తకంగా ప్రచురించారు. అప్పట్లో హైద్రాబాద్ రవీంద్రభారతిలో జరిగిన సమావేశంలో ఏదో కార్యక్రమంలో భాగంగా తప్పా ఈ పుస్తకం కోసం ప్రత్యేకంగా చర్చంటూ జరగలేదు !

కథ అక్కడితో అవలేదు. డా.చాట్ల శ్రీరాములు, డా. ఆవంత్స సోమసుందర్, గొల్లపూడి మారుతీరావు గతించారు. విలువైన పుస్తకం  కోసం ఎవరూ పట్టించుకున్నది లేదు. ఎంతో ఇష్టంగా సో. సు. ప్రచురించిన పుస్తకం మరుగున పడిపోయింది. అసలు చాట్ల శ్రీరాములు గారి వ్యాసాల్ని ఆవంత్స సోమసుందర్ ఇష్టంగా పిఠాపురం, కళాకేళి నికేతన్ తరపునుంచి ప్రచురించిన విషయం కూడా తెలీకుండా పోయింది. వందలకొద్దీ ప్రింటయిన గ్రంథాలు అక్కడ  చెదలు చదూతున్నాయ్. మొన్న అనుకోకుండా చేతికొచ్చిన పుస్తకం చూసి రచయిత విద్వత్తుకు మతిపోయింది !

ఇంత మంచి పుస్తకం ప్రజల మాటటుంచి కనీసం కళల మీద, సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో అభిలాష ఉన్నవారికి, ముఖ్యంగా నాటకంకోసం ఆశక్తి కల్గినవారి దరికిచేరి, ఆ మేరకయినా కనీసం చర్చ జరిగితే మేలనే ఉద్దేశంతో సుమారు 4000 విలువ చేసే సోమ సుందర్ కొన్ని రచనలతోపాటు ఈ పుస్తకాన్ని కూడా ఆయన వర్ధంతి రోజున జరిగిన కార్య క్రమంలో వక్తలకి ప్రత్యేకంగా అంద జేయడం జరిగింది. ఈ రచన గురించి త్వరలోనే పూనుకొని నిర్మాణాత్మకమైన విశ్లేషణాత్మక సంవాదం జరగాలని ఆశిస్తూ అమూల్యమైన ఈ రచన కోసమిలా చిరు పరిచయం. ఎందు కనేది ఆయన మాటల్లోనే, "నాటకరంగంలో 'నేను' పదాన్ని విస్మరించి ఆ పదం స్థానంలో 'మేము' పదాన్ని insert చేస్తే తప్ప ఏ దేశంలోనూ నాటకం రాణించదు !" (పేజి 65)

# పునరుద్ధరణవాద ప్రమాదంలో భారతదేశం

## DANGER OF REVIVALISM IN INDIA


20వ ప్రచురణ

పునరుద్ధరణ వాద
ప్రమాదంలో
భారతదేశం

టి. రవిచంద్

మిళింద ప్రచురణలు
బాపట్ల
2023

'జనసాహితి' నిర్వహణలో పదేళ్ళక్రితం విజయవాడలో జరిగిన సమావేశంలో టి. రవిచంద్ చేసిన ప్రసంగపాఠమే ఈ పుస్తకం.రాబర్ట్ గ్రీన్ ఇంగ ర్సాల్, గోరా వంటి నాస్తిక తత్వవేత్తల నివాళితో ప్రారం భించిన ఈ ఉపన్యాస పాఠం, 1. Renai ssance (పునరుజ్జీవం, పునర్వి కాసం) 2. Revolution(విప్లవం) 3. Reform (సంస్కరణ) 4. Revivalism (పునరుద్ధ రణ, మత పునరు ద్ధరణ వాదం) (పేజీలు 3,4) మొదలైన అంశాల్ని క్లుప్తంగా విశ్లేషిస్తూ సాగింది !

“గత చరిత్రలో పునరుద్ధరణ వాద శక్తులు ఎటువంటి పాత్ర నిర్వహించాయో తెల్సి కూడా ఈ దేశంలో ప్రగతిశీల శక్తులు అప్రమత్తం కాలేదు. సంకుచిత రాజకీయ ప్రయోజనాలతో అనైక్యతతో మతవాద రాజ కీయాలకు అవకాశం కల్పిం చాం. ఇది సరిదిద్దు కోవటానికి వీలులేని చారిత్రక తప్పిదం.” అన్న రచయిత, “ఆధునిక యుగంలో ముఖ్యం గా జాతీయోద్య మ కాలంలో సంస్కరణవాదులు మాత్రమే పునరుద్ధరణవాద ప్రమాదాన్ని మొదట గుర్తిం చారు. దాన్ని తమ పరిధిలో ఎదుర్కో వడానికి ప్రయత్నించారు. (పేజి 8) అంటారు !

అలాంటి ఆధునిక సామాజిక సంస్కర్తలుగా ఆధునిక బౌద్ధు డయిన డా.బి.ఆర్. అంబేద్కర్ గౌరవించిన ఇరువుర్ని ఇందు లో పేర్కొన్నారు,1.మహదేవ్ గోవింద రనడే 2. మహాత్మా జోతిరావు పూలే. అంతేకాదు, ఈ సందర్భంలో అంబేద్కర్ 70 ఏళ్ళ క్రితం రాసిన ప్రసంగ వ్యాసం Ranade, Gandhi and Jinnah ను మరోసారి చదవ మని అభ్యర్థిస్తున్నా నంటూ వారిద్దరి గురించి విశ్లేషించారు (పేజి 8). భారతీయ సంస్కృతి పట్ల లోతైన అధ్యయనం ఇందులో కనిపిస్తుంది !

Our Cultural Heritage (మన సాంస్కృతిక వారసత్వం) పేరిట సర్దార్ పటేల్ స్మారకోప న్యాసాలు (1986) చేస్తూ భార తీయ ధర్మశాస్త్ర గ్రంథాల కోసం స్వామి రంగనాథానంద చెప్పిన విలువైన మాటల్ని ఉదహరిస్తూ వర్తమాన రాజ కీయ చిత్రాన్ని చూపించ డం బావుంది. “అభివృద్ధి పేరు తో ఒకవైపు, భారతీయ ఆధ్యా త్మికత పేరుతో

మరోవైపు అత్యధికశాతం ప్రజానీకాన్ని భ్రమల్లో ముంచడానికి ఈతరం నాయకులకుఅవకాశాలెక్కువ. కాబట్టి లౌకికవాద, ప్రజా స్వామ్య, వామపక్ష శక్తులకు ఇదిపరీక్షా సమయం. ఎంతో ఐక్యతతో, ఓపికతో మతతత్వ శక్తుల వ్యూహాల్ని ఎదుర్కొన గలగాలి." (పేజి 13) అంటారు !

పునరుద్ధరణవాద ప్రమాదాన్ని సూచించే రెండు సంకేతాలుగా 1. చరిత్ర 2. సంస్కృతం (భాష, సంస్కృతి) (పేజి 13) పేర్కొంటూ కొన్ని ఉదంతాలు చెబుతూ ముగించిన ఈ పొత్తంలో రెండు విలువైన అనుబంధాలుపొందుపర్చారు. ఒకటి కంచి కామకోటి పీఠాధి పతి జయేంద్ర సరస్వతి బీ బౌద్ధ ధర్మ ప్రతినిధి సత్యనారాయణ గోయంకాల సంయుక్త ప్రకటన. రెండు, సమకాలీన భారతీయ తత్వవేత్త, విద్యావేత్త అంత ర్జాతీయ స్థాయిలో గుర్తింపు ఉన్న ఆంధ్రుడు ఆచార్య కొత్త సచ్చిదానంద మూర్తి (1924 - 2011) శతజయంతి సందర్భం గా ఆయన కృషిని పేర్కొంటూ చేసిన పరిచయం !

(మిళింద ప్రచురణలు, బాపట్ల గతేడాది 2023 లో ప్రచురించిన 24 పుటల ఈ పుస్తకం /కర పత్రం సీరియస్ అధ్యయన పరులకు ఒక దిక్సూచి. కాల క్షేపం కోసం కాకుండా ఆసక్తి ఉన్న మిత్రుల కోసం స్కాన్డ్ కాపీ పంపుతున్నాను. పునరు ద్ధరణవాద ప్రమాదాన్ని నిత్యం ఎదుర్కొంటున్న పౌర సమాజం లో ఆయా అంశాల గురించి జరిగే నిర్మాణాత్మ కమైన దార్శనిక సంవాదాలే ఏమేర కైనా ఉన్మాదాన్ని నిలువ రించ గలవనే నమ్మకమే నా ఈ రైటప్‌కి కారణం !)

# మహామానవవాద మహత్తర దూత

## మానవ గీత

## (పుస్తక పరిచయం)




"సత్యమేవ ప్రవక్ష్యామి
సత్యం ధ్యాయామి సర్వదా
నహి సత్యాత్ పరం వాక్యం
శ్రోతుమిచ్ఛామి కేనచిత్ !"
(సత్యమునే చెప్పెదను. సదా సత్యమునే ఆలోచించెదను. సత్యము కాని వాక్యమును వినుటకు కూడా ఇష్టపడను.)

"సత్యార్థం జనసౌఖ్యార్థం
చాగ్నిమార్గే పదం మమ
సాహసమప్యజేయం సాత్
నిందాస్తుత్యోర్ద్వయోస్సమః"
(సత్యము కొరకు, జనసంక్షేమము కొరకు నిప్పుల దారిలో నా పాదముంచాను. నా సాహసము అజేయమైనది. నిందాస్తుతులు రెండూ నాకు సమానమే)

సరైన కాలమానం లేకుండా అసమానతలను వ్యవస్థీకృతం చేసేందుకు రచించబడ్డ భగవద్గీత కు ప్రత్యామ్నాయంగా సరిగ్గా 35 ఏళ్ళ క్రితం మనిషి కోసం చరిత్రలో మనిషే కేంద్రంగా "సత్యాన్వేషులకు, ధర్మ జిజ్ఞాసువులకు, సాదరపూర్వకముగా " అంకితం ఇస్తూ, ప్రవచించిన వంద శ్లోకాల "మానవగీత" లోని ప్రతిజ్ఞా విభాగః లోని ప్రారంభ పద్యాలివి. ధర్మ, అర్ధ, కామ, మోక్షాల్ని భౌతికవాద దృక్పథంతో సంస్కృత భాషలో విశ్లేషించిన మొట్టమొదటి అపురూప ప్రయత్నం ఇది. అందుకే,

"వేదాంత భావ రాహిత్యం
సత్యమార్గాను వర్తనం
ఏతత్ జ్ఞాన మితిప్రోక్తం
అజ్ఞానం యత్తదన్యదా "
(మతాసక్తి లేకుండుట, సత్య ధర్మముల పై విశ్వాసముంచుటయే జ్ఞానము అనబడును. దానికి భిన్నమైనది అజ్ఞానము.)

అని ధైర్యంగా ప్రకటించగలిగారు. ఫలశ్రుతిగా,

"గ్రంథోదయం నవాగీతా
యత్ర పాఠః ప్రవర్తతే
తత్ర సర్వాహి ధర్మాశ్చ
మాయా ముక్తిశ్చ తత్రవై "

(ఈ నూతన గీతా పాఠ ప్రవచనము ఎచ్చట జరుగుచుండునో అచ్చట సకల ధర్మములు ఉండును. మాయావిముక్తి కలుగును.)

అంటారు. సుమారు నూట యాభై గ్రంథాలు రచించి సంస్కృత ఆంధ్రాంగ్ల సాహిత్యాలలోనే కాక హిందీ మొదలు ద్రావిడ భాషలు అన్నింటినీ ఔపోసన పట్టి, పత్రికలు, సంస్థలు స్థాపించి, వేలు పెట్టని ప్రక్రియ లేకుండా నాలుగు దశాబ్దాల పైచిలుకు తెలంగాణ కరీంనగర్ కేంద్రంగా అసాధారణ సాహితీ కృషి చేస్తున్న పెద్దలు డా. మలయశ్రీ రచించిన అద్భుతమైన రచనిది. దీని ప్రభావంతోనే మలయశ్రీ మనుమడు విక్రమాదిత్య ఆరవ తరగతి చదూతున్న ప్పుడే 'దేవుడెక్కడ' అనే రచన చేయగా, 'బాలవాక్కు' పేరిట దానిని ముద్రించడం జరిగింది. నాకు తెలిసీ తెలుగులో మొట్టమొదటి బాల హేతువాద పొత్తం ఇదే !

బహుశా అందుకే ప్రముఖ అంబేద్కరిస్టు మేధావీ, తాత్వికుడు కత్తి పద్మారావు గారు ఈ పుస్తకానికి "మనుస్మృతికి ప్రత్యామ్నాయ గీతమే ఈ మానవగీత" పేరిట మలయశ్రీ కి లేఖ రాస్తూ, " మీరు రాసిన మానవగీత చదివాక నాస్తికోద్యమంలో ఇంతటి మహత్తర కావ్యం చార్వాక దర్శనం తర్వాత ఇదే అనిపిస్తుంది.", అంటూ, "మీరు సంస్కృతంలో విద్వాంసులు, పండితులు, కవులు, మనుస్మృతి కి ప్రత్యామ్నాయం రూపొందించగలిగిన ధీశాలి, మానవతావాది, హేతువాది, నాస్తిక తాత్వికులు" అంటారు !

ఇక మరొక అద్వితీయ రచన "సత్య సూక్తం" (నాస్తికత్వం అంటే ఏమిటి? అది ఎందుకు?) సరిగ్గా పాతికేళ్ళ క్రితం 1997 లో వచ్చిన చిన్న రచన ఇది. పండిత సూత్రం, పురుష సూక్తం, స్త్రీ సూక్తం, బాల సూక్తం, జన సూక్తం, మానవ సూక్తం , ధర్మ సూక్తం విభాగాలలో దేవుళ్ళనీ, మతాలనీ ఉతికారేసిన రచన ఇది. ఈ రోజు నాస్తిక, హేతువాద, భౌతికవాద, మానవవాద, ఇంకా సైన్సు ఉద్యమ సంస్థలు ఓన్ చేసుకుని ప్రచారం చేయవలసిన గొప్ప చిన్ని పుస్తకం ఇది!

ప్రముఖ పురాతత్వ పరిశోధకులూ, చరిత్ర కారులు, రచయిత, న్యాయవాది, A Source Book in Indian Materialism రాసిన కీ. శే. ఠాకూర్ రాజా రాంసింగ్ గారి ప్రేరణతో ఆయనకే అంకితం ఇవ్వబడిన చిన్న వచన గేయ కావ్యం, "అత్రి మతం" విలువైన రచన. ముగ్గురు దైవాల్నీ అంగీకరించనివాడు 'అత్రి ముని' 'అనసూయ' ఆయన భార్య అసూయ లేనిదని అర్థం. దత్తాత్రేయుడు అంటే ఈ మూడు మతాల్లోనూ విశ్వాసం లేని వ్యక్తి (అత్రి)

నుండి బహుమతిగా వచ్చినవాడు అని అర్థం ! త్రిమతాలకు అతీతమైన అత్రి మతాన్ని గురించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులతో సహా మనిషి పక్షం వాదించి, అసమానతల్ని ధిక్కరించి సమానత కోసం , తమ నూతన సిద్ధాంతం కోసం నిలిచిన అనసూయ గురించి, అన్నింటికంటే ముఖ్యంగా ఈ రోజు ఏ సనాతన ధర్మానికి వ్యతిరేకంగా తన ఆవిర్భావం జరిగిందో, అందులోనే తనని భాగం చేసి దేశంలోని అనేక ప్రాంతాల్లో వ్యాపారం చేస్తున్న దత్తాత్రేయ స్వరూపం గురించి తెలుగులో భౌతికవాద దృక్పథంతో చేసిన మొట్టమొదటి రచన అత్రి మతం !

ఇక మహాకవి అశ్వఘోషుడి 'వజ్రసూచి' సంగతి సరేసరి. ఆధునిక కాలంలో కార్ల్ మార్క్స్ 'కమ్యూనిస్టు మ్యానిఫెస్టో' కీ, బాబాసాహెబ్ అంబేద్కర్ 'కులనిర్మూలన' కి ఎంతటి ప్రాముఖ్యత ఉందో, ప్రాచీన కాలంలో అంతటి ప్రాధాన్యత కలిగి బ్రాహ్మణాధి పత్యాన్ని , కుల అసమానతలనూ బలంగా సశాస్త్రీయంగా తునాతునకలు చేసి ఖండించిన అజేయ గ్రంథం మహా బౌద్ధ పండితుడైన మహాకవి అశ్వఘోషుని వజ్రసూచి అని విజ్ఞుల అభిప్రాయం. మిళింద ప్రచురణల ద్వారా పాతికేళ్ళ క్రితం దీనిని తెలుగు లోకి గొప్పగా అనువదించినది కూడా డా. మలయశ్రీ గారే ! అమూల్యమైన ఈ నాలుగు రచనలే కాకుండా యాభై ఏళ్ళ క్రితం ప్రచురించిన 'సజీవ సత్యాల' నే నూటపది జీవన సూక్తుల్ని ఒక్క దరికి చేర్చి కూర్చిన పొత్తాన్ని కూడా 140 వ పుస్తకమైన ఈ రచనా సంపుటిలో చేర్చడం జరిగింది. దాదాపు వంద పుటలు గల వెలకట్టలేని ఈ పుస్తకానికి వంద రూపాయలు నామమాత్రపు వెల పెట్టారు. తెలుగు రాష్ట్రాలలో భావోద్యమకారుల పేరుతో దశాబ్దాలుగా కృషిచేస్తున్న వారికి అవార్డులు ఇస్తూ తన పరిమితుల్లో కృషి చేస్తున్న మలయశ్రీ గారి భావాలతో ఎవరికైనా కొన్ని భిన్నాభిప్రాయాలు ఉండవచ్చును కానీ ఆచరణాత్మక సామాజిక వైద్యులు డా. భానుప్రసాద్ గారి కుటుంబానికి అంకితం ఇవ్వబడిన ఈ పుస్తకం, తెలుగులో ప్రతి భావోద్యమ ఆలోచనాశీలి కచ్చితంగా చదివి తీరవలసిన విలువైన రచనల సంపుటం అని నా అభిప్రాయం. ఆసక్తి ఉన్న వారి కోసం డాక్టర్ మలయశ్రీ గారి కాంటాక్ట్ వివరాలు ఇస్తున్నాను. సంప్రదించవచ్చు !

**డా. మలయశ్రీ , నవ్య సాహిత్య పరిషత్**
**1 – 113/7, ఆదిత్య భవన్, వేమననగర్**
**రేకుర్తి, కరీంనగర్ , తెలంగాణ – 505451**
**సెల్ – 9866546220**

(పదేళ్ళకి పైబడిన మా స్నేహంలో ప్రతి రచన చివరా 'సెలవిప్పటికి, స్నేహమెప్పటికీ' అనే టేగ్ లైన్ డా. మలయశ్రీ గారి రచనకి ఓ బండగుర్తు. అనేక అరుదైన రచనల్ని చేతులు కాల్చుకుని కూడా ప్రచురించిన వైజ్ఞానికవాది. తెలంగాణ ప్రాంతం నుంచి 'భౌతికవాది' పత్రికను ఎన్నో ఏళ్ళు నిబద్దతగా నడిపిన బౌద్ధాభిమాని, బుద్ధిజీవి ఆయన. ఎన్నాళ్ళుగానో అనుకుంటున్నప్పటికీ మానవగీత తో సహా మలయశ్రీ గారి నాకు నచ్చిన రచనల పై ఇన్నాళ్ళకిలా ఓ చిన్న రైటప్.)

# కలలు కన్నీళ్ళ కలబోతలో పూలూ ముళ్ళూ




**డా.** ఆవంత్స సోమసుందర్ స్వీయచరిత్ర 'కలలు - కన్నీళ్ళు' తెలుగు సాహిత్యంలో విశిష్టమైన రచన. ఎనిమిది దశాబ్దాల పాటు తెలుగు సాహిత్యంతో మమేకమైన ఒక మహాకవి మనసుతో వ్యక్తీకరించిన అరుదైన ఆత్మకథ. స్వాతంత్ర్యోద్యమ పూర్వం నాటి పరిస్థితులు మొదలుకొని ఆధునిక కాలంలో వెల్లువెత్తిన అనేక అభ్యుదయ ఉద్యమాలకు సోమసుందర్ ప్రత్యక్ష సాక్షి. అందుకేనేమో వజ్రాయుధ కవిగానే కాక విలక్షణమైన విమర్శకుడిగా, కళాకేళి పత్రికా స్థాపకునిగా, కమ్యూనిస్టు ఉద్యమశీలిగా, అన్నింటినీ మించి నిరంతర స్వాప్నికుడిగానే కలకాలం జీవించారు.

కవులు జీవితచరిత్రలు రాసి మెప్పించడం అరుదు. తెలుగులో ఆ సంఖ్య మరీ తక్కువ. అలాంటిది రెండు భాగాలుగా ఆత్మకథను రాసి ముఖ్యంగా మొదటి భాగంలో అసాధారణ రచనా కౌశలాన్ని చూపిన ఘనత సో.సు. కే చెల్లుతుంది. భీమవరానికి చెందిన గన్నాబత్తుల పెదతాత, తులసమ్మ అవార్డు సందర్భంగా భాస్కర్ అనే చిత్రకారుడు సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దిన సోమసుందర్ వర్ణ చిత్రాన్ని ముఖ చిత్రంగా మలిచి, సరిగ్గా ఇరవై ఏళ్ళ క్రితం 2005లో కళాకేళి తరపున ప్రచురించిన కలలు - కన్నీళ్ళు తెలుగు సాహిత్యంలో నిస్సందేహంగా ఒక అద్భుతమైన అక్షర కళా శిల్పం.

"నాకంటూ ఒక జీవితం ఏర్పడ్డాక...మొదటి జ్ఞాపకం మా అమ్మ..మలి జ్ఞాపకమూ మా అమ్మే అందుకే మాతృవందనంతోనే దీన్ని ప్రారంభిస్తున్నాను. మా అమ్మే నిరంతర స్మృతి వీచిక...మా అమ్మ నన్ను విడిచి వెళ్ళకముందే నేను మా అమ్మను విడిచి వెళ్ళిపోయాను బీ దూరంగా...అనంతంగా...సుదీర్ఘమైన ఎడబాటుగా. బాట మారింది. ఉనికి మారింది. ఆశ్రయం మారింది. అమ్మా మారింది..." 1924 నవంబరు 18 న శంఖవరంలో పుట్టినప్పటికీ, బాల్యంలోనే దత్తునిగా పిఠాపురానికి వలస వచ్చిన పసి జ్ఞాపకాల్ని స్పృశిస్తూ ఆత్మకథలో సోమసుందర్ రాసిన ఆరంభ వాక్యాలు ఇవి. నాలుగేళ్ళ ప్రాయంలోనే తల్లి ఎడబాటుకు లోనైన పసి హృదయం బహుశా ఆనాడే కార్చిన కన్నీటిధారల్ని కవితా పంక్తులుగా మార్చే ప్రక్రియను అభ్యసించి ఉంటుంది. భవిష్యత్తులో శ్రామిక వర్గం తరపున ప్రాతినిధ్యం వహించే బలమైన వజ్రాయుధ కలం ఆవిర్భావానికి అంకురార్పణ ఆనాడే

జరిగిందేమో.

మూడొందల పుటల కలలు – కన్నీళ్ళు ఆత్మకథ అంతా ఒకెత్తయితే, దీనికి సో. సు. రాసిన ఐదు పుటల ముందుమాట ఒకటీ ఒకెత్తు. రూసో మహాశయుడి మాట, 'రెక్కల చేప కథ విప్పింది' అంటూ ప్రపంచంలోని ప్రముఖ కవులు రచయితలు మేధావుల ఆత్మకథలు అన్నిటినీ స్థూలంగా పాఠకుడికి పరిచయం చేశారు. అలా చేస్తూనే స్వీయచరిత్ర రాయటం ఎంత కష్టమో వివరించారు. గాంధీ,నెహ్రూ వంటి నేతలు మొదలు శామ్యూల్ జాన్సన్, ఎజ్రా పౌండ్, మాక్సీమ్ గోర్కీ, రడ్‌యార్డ్ కిప్లింగ్, వర్జీనియా వూల్ఫ్, జీన్‌పాల్ సార్త్రే వంటి పాశ్చాత్య మేధావుల స్వీయచరిత్రల్ని గురించి చెబుతారు. అవికాక, ఏనుగుల వీరాస్వామి, కందుకూరి వీరేశలింగం, వల్లూరి సూర్యనారాయణ, చిలకమర్తి లక్ష్మీనరసింహం, కొండా వెంకటప్పయ్య, తల్లాప్రగడ ప్రకాశ రాయుడు, దరిశి చెంచయ్య, చలం వంటి వారి ఆత్మకథల గురించి కూడా తడుముతారు. ఇన్నింటిలోకీ సో.సు.ను ప్రభావితం చేసింది మాత్రం డామ్ మోరీస్ రాసిన 'మై సన్స్ ఫాదర్'అనే ఆత్మకథ. నాకు తెలిసీ ఇన్ని స్వీయచరిత్ర ల కోసం సమీక్షాత్మకంగా ముందుమాటలో ప్రస్తావించిన ఆత్మకథ మరోటి లేదు. సోమసుందర్ అనితర సాధ్యమైన అధ్యయనశీలతకి ఈ మున్నుడే ఒక ప్రతీక. ముందుమాటకి ముగింపుగా సో.సు, "నా చేతిలోని లేఖినిని మృత్యువు తప్ప వేరెవ్వరూ అపహరించలేరని" అంటారు. అలా అన్న మాటల్ని నిలుపుకుని ఆగష్టు 16, 2016 న చివరి శ్వాస వరకూ విస్తృతమైన సారస్వత సేవ కావించిన అరుదైన ప్రజాకవి సోమసుందర్.

అల్లూరి సీతారామరాజుకి ఆశ్రయం ఇచ్చిన కుటుంబ నేపథ్యం నుండీ అల్లారు ముద్దుగా సంస్కృత శ్లోకాలు, సంగీత కచేరీలు, నాటకాలు,

సినిమాలు, కౌమార ప్రేమకలాపాలు ఇలా ఒకటేమిటి ఎన్నో వర్ణాలు మనకి సో.సు. జీవితంలో కనబడతాయి. హైస్కూల్ విద్యార్థిగా స్టూడెంట్ యూనియన్ సభలకని కోల్కతా వెళ్ళినప్పుడు హౌరా బ్రిడ్జి మీద చూసిన జీవచ్ఛవానికి కలత చెంది నవయువకుడు పట్టిన కలం, కట్టిన కవిత తెలుగు నేలమీద దశాబ్దాల పాటు వెల్లువలా సాగింది. తెలంగాణ సాయుధ పోరాటంలో నినాదమై రగిలింది. "హే నిజాం పాదుషా, ఖబడ్దార్ !" అని హెచ్చరించింది. నిషేధానికి గురై చరిత్ర సృష్టించింది. అలా మొదలైన సోమసుందర్ సాహితీయాత్ర ఎన్ని మలుపులై సాగిందో, ఇంకెన్ని తలపుల్ని మిగిల్చిందో ఇందులో చదివి ఆశ్చర్యపోతాం. "అప్పటికీ, ఇప్పటికీ తన బలం ఎదిరి బలం, పరిశీలించు కోకుండానే, వివేక భ్రష్టతవల్లనే కావచ్చు, లేదా అభిమన్యుద్రేకం అయినా కావచ్చు – ఎన్ని యుద్ధాలలోనో ఆరితేరిపోయాను. అవి రాజకీయమైనవి, సాహిత్యపరమైనవి, సిద్ధాంతపరమైనవి కూడా.ఎదిరించడంలో స్వపర భేదం లేనేలేదు. ఆత్మీయులతోనైనా సరే సమరం వస్తే

సమరమే! సమంజసమా కాదా అనే విచారణ తదుపరి!" అంటారు సో.సు. దేవులపల్లి కృష్ణశాస్త్రి మొదలు శ్రీశ్రీ వరకూ, వేదుల నుండి కాటూరి, ఆరుద్ర దాకా ఎందరెందరితో సంవాద సమరాలు సాగించారో. విద్యార్థి మహాసభల్లో సరోజినీ నాయుడు గారిచ్చిన అద్భుతమైన ఉపన్యాస ప్రారంభ వాక్యాల్ని దాదాపు ఆరేడు దశాబ్దాల తరువాత యధాతథంగా గుర్తుపెట్టుకొని రాయడం సో.సు. తిరుగులేని జ్ఞాపకశక్తికి నిదర్శనం. అలాగే, డా. సర్వేపల్లి రాధాకృష్ణన్‌ని కలిసి ముచ్చటించడం,ఆగ్రా యూనివర్శిటీలో సో.సు. ఇచ్చిన ప్రసంగానికి ముగ్ధులైన తెలుగు విద్యార్థులు ఆయన్ని సన్మానించిన అపురూపమైన సన్నివేశం, కమ్యూనిజానికి ప్రత్యామ్నాయంగా భావవాదులు వివిధ దేశాల్లో రూపొందించిన భక్తి వ్యవస్థలు, అందులో భాగంగా రాధాస్వామి దయల్‌బాగ్ వంటివి ఏర్పడ్డ విధానాన్ని సో.సు.మిత్రులకి విశ్లేషించిన విధానం చదివి ఆశ్చర్యపోతాం.సీతమ్మా, జోగయ్య పంతులు, వెంకటరెడ్డి రావు, రెడ్డి పంతులు, రెడ్డి శాస్త్రులు వంటి పేర్ల నేపథ్యం వివరించారు. గోదావరి వరద ప్రళయం నుండి ఈ పేర్లగల వ్యక్తులచేత కాపాడబడి, ఆదరించ బడిన తర్వాత తరాల్లో ఆయా కుటుంబీకులు అన్ని కులాల్లోనూ పెట్టుకున్న పేర్లే అవనీ సో.సు. ఏకంగా 'గోదావరి జలప్రళయ రక్షకుడు' అంటూ ప్రత్యేక అధ్యాయం కేటాయించి, మరుగునపడ్డ దళిత బహుజన యోధుడయిన వెంకటరెడ్డి ఉదంతం చెబుతారు. అంతేకాక, "పిఠాపురం వెలమ రాజుల ఆస్థాన ప్రదేశం కనుక దివాణం దాసీలనే ప్రత్యేక కులం ఒకటి పెంపు వహించేది.

వీరు భోగం కులం వారు కాదు, సానికులానికీ చెందరు. ఇదో ప్రత్యేక జాతి. ప్రభువుల కైంకర్యార్థం కేటాగా బ్రతికేవారు. వీరిలో పురుషులు సేవకులు కొన్నిచోట్ల 'ఖాసా నౌకర్ల'ని అనడం కూడా ఉంది. స్త్రీలు కోటలో దాసీలు. దాసీలన్న మాటలోనే కావలసిన ఉపచర్యలన్నీ చేయగలవారనే అర్థం ఉంది." అంటూ, "తెలంగాణ దేశముఖుల ఇళ్ళల్లో ఆడపాప లనే వర్గం ఉండేదని కవిమిత్రులు దాశరథి రంగాచారిగారి "చిల్లర దేవుళ్ళు" చదివేవరకూ నాకు తెలియదు... " అని దివాణం దాసీలనే ప్రత్యేక కులం కోసం వివరిస్తారు. ఇవన్నీ కాక పిఠాపురంలో ఆనాడు విలసిల్లిన సాంస్కృతిక వాతావరణం, తద్వారా వివిధ కార్యక్రమాల్లో పాల్గొనేందుకు ప్రేరణ, ముఖ్యంగా యవరాజా వారి సహృదయత, విశ్వకవి రవీంద్రనాథ్ టాగోర్ సందర్శన భాగ్యం నుండీ ఎన్నెన్నో విషయాల్ని ఎంత గొప్పగా చెప్పారో.

"కవిత్వమూ, కమ్యూనిజమూ తప్ప మరే ధ్యాసా నాకు లేదు" అని తన ఆత్మకథలో ప్రకటించుకున్న సో.సు. జీవితాన్ని ఆ రెంటికే అంకితం చేశారు. సుమారు ముప్పై మూడు భాగాల్లో ఎన్నెన్నో అపురూప విషయాల్ని నమోదు చేశారు. పిఠాపురం సంస్థానం, మహారాజా

వారి చరిత్ర, కాకినాడ, సామర్లకోట, పెద్దాపురం, రాజమహేంద్రవరం వంటి ప్రాంతాలలో సాహిత్య వాతావరణం మొదలుకొని రాష్ట్ర వ్యాప్తంగా పెల్లుబికిన అభ్యుదయ కవితోద్యమం వరకూ ఎంతో హృద్యంగా చెప్పారు. హైదరాబాదు కవి మిత్రుల నుండీ మద్రాసు మేధో సాంస్కృతిక స్రవంతి దాక, విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ శ్రీ వంటి వారితో అనుభవాలు, మిత్రులతో చేసిన ఉత్తర భారత యాత్రా విశేషాలు...ఒక్కటేమిటి తన జీవన చిత్రంలోని గాఢమైన రంగులన్నిట్నీ అక్షరాలుగా పోతపోసి ఆత్మకథ రూపంలో పాఠక లోకానికి పొందికగా అందించారు సో.సు. అయితే, ఎందుకనో తెలీదు కానీ సోమసుందర్
స్వీయచరిత్రకి రావాల్సిన గుర్తింపు సాహితీ లోకంలో సైతం రాలేదు. విశాలమైన పచ్చిక బయళ్ళ పైన పిండారబోసినట్లు "నా జీవితంలో మంచిపనులు ఎన్ని చేసానో అంతకు మించిన చెడ్డ పనులు చేశాను. అందుకే మంచిపనులు సవిస్తరంగా ఏకరువు పెట్టలేదు. చెడ్డపనులు మచ్చుకు కొన్నే చెప్పకుండా విడిచిపెట్టనూలేదు.
అసలు జీవితం అంటే ఏమిటి? చెడ్డ పనులు రహస్యంగా చేసుకుంటూ పోవడం. మంచి పనులు తక్కువే అయినా బహిరంగంగా చేయడం.." అని చెప్పుకున్న సోమసుందర్ ధైర్యాన్ని, పారదర్శకతను చదివి అంగీకరించి, స్వీకరించేందుకు కూడా కొంత సాహసం కావాలేమో అనిపిస్తుంది. బహుశా అందుకనే వృద్ధాప్యంలో డిక్టేట్ చేసి రాయించిన సో.సు. స్వీయచరిత్ర రెండో భాగం 'పూలు, ముళ్ళు' అంతగా కదిలించదు. ఏదో భారంగా రాసినట్టు సాగుతుంది. తొంభై ఏళ్ళ పైచిలుకు సో.సు. జీవితాన్ని శోధించి సాహిత్యకారులు రచించిన సోమసుందర్ జీవితకథలు ఎన్నో ఉన్నప్పటికీ, అసిధారావ్రతంగా ఆయనే తన బతుకు బాటని అవలోకనం చేసుకొని స్వయంగా రాసిన 'కలలు కన్నీళ్ళ' లో ఉబికిన హుందాతనం అందుకనే మరెందులోనూ మనకు కానరాదు.
ఇదంతా ఒకెత్తయితే ఏకకాలంలో కవిగా, కార్యకర్తగా కూడా మసిలిన ఆయన కార్యదీక్ష ఒక్కటీ ఒకెత్తు. స్వాతంత్ర్యం వచ్చే నాటికి జైల్లో శిక్ష అనుభవిస్తూ కూడా ఈ దేశంలో సోషలిజం కోసం నిబద్ధతతో కృషి చేసిన సో.సు. తర్వాత కాలంలో పూర్తిస్థాయి సాహితీవేత్తగా మారారు.సాహిత్యాన్ని ఏదో కాలక్షేపం కోసం రాసి అచ్చేసే కార్యక్రమంగా కాకుండా, నిర్మాణాత్మకమైన భావజాల వాహకంగా, అణగారిన ప్రజల విముక్తి ఆయుధంగా, కొత్త వ్యవస్థ కోసం ఉద్దేశించిన విప్లవాత్మక స్వప్నంగా తీర్చిదిద్దారు. ప్రజా చైతన్యమే లక్ష్యంగా సకల సాహితీ ప్రక్రియలను ప్రయోగించారు. లిటరరీ ట్రస్ట్ స్థాపించి ఎందరో యువకవుల్ని, రచయితల్ని పురస్కారాలతో ప్రోత్సహించారు. శతాధిక గ్రంథాల్ని రచించి తెలుగులో ఎన్నదగిన అభ్యుదయ దిక్సూచిగా భాసించారు. ఐతే, ఇన్నింటిలోకీ ఆవంత్సని అజరామరంగా నిలిపింది మాత్రం అక్షర సైనికుడిగా ఆయన సాగించిన అవిశ్రాంత

సారస్వత కృషి మాత్రమే. అదే, అద్వితీయ సాహితీ పిపాసిగా ఆయన్ని శిఖరాయమాన స్థానంలో ప్రతిష్టించింది. అటువంటి బలమైన ఆశయ దీక్షే 'కలలు – కన్నీళ్ళు' గా ఆత్మకథ రూపంలో ప్రవహించి ఆయన అంతరాత్మ ప్రబోధంగా అపురూపమైన మానవీయ వారసత్వాన్ని భావితరాలకు అందించింది. ఆ స్ఫూర్తిని అందుకుని కొనసాగించ గలగడమే మహాకవి ఆవంత్స సోమసుందర్‌కి మనం ఇచ్చే అర్ధవంతమైన ఆత్మీయ నివాళి.

(నవంబర్ 18 వజ్రాయుధ మహాకవి, కళారత్న

డా. ఆవంత్స సోమసుందర్ శతజయంతి.)

# ప్రాచీన భారతీయ చరిత్ర, సంస్కృతి, చింతన

## (డా.ఎమ్.భావనాచార్యులు పుస్తక పరిచయం)




"మాడభూషి చనిపోవడానికి ముందు హైదరాబాదులో కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావు గారి సారథ్యంలో 'ప్రాచీన భారతదేశ చరిత్ర, సంస్కృతి, తత్వ శాస్త్రీయ పరిశీలన, గతితార్కిక భౌతికవాద దృక్పథం' పేరిట బహుశా 1992లో ఒక చర్చా గోష్టి జరిగింది. ఆనాటి ప్రముఖ మార్క్సిస్టు చరిత్ర కారులందరూ నాతో సహా ఆ రెండు రోజుల్లో జరిగిన గోష్ఠిలో పాల్గొన్నారు. కామ్రేడ్ ఏటుకూరి బలరామ మూర్తి, డా. వకుళాభరణం రామకృష్ణ, కామ్రేడ్ గురువా రెడ్డి మొదలగు మేధావులు న్నారు. అందులో మాడభూషి భావనాచారి ఒకరు. ఆ చర్చా గోష్ఠి ప్రధాన ఉద్దేశం గురించి కామ్రేడ్ రాజేశ్వరరావు గారు ఏమి చెప్పారో వారి వారి మాటల లోనే చెబుతున్నాను, " మన భారతదేశం చరిత్ర, సంస్కృతి, తత్వశాస్త్రాలను మార్క్సిస్టు దృక్కోణం నుండి పరిశోధన చేయండి. అది పార్టీకి చాలా అవసరం. ఈ విషయాన్ని మనం అశ్రద్ధ చేసాం. అందుకే మనం భారత ప్రజల మనస్తత్వాన్ని, ఆలోచనా విధానాన్ని అవగాహన చేసుకోలేక పోయాము!"

డా. మాడభూషి భావనా చార్యులు రచన 'ప్రాచీన భారతదేశ చరిత్ర, సంస్కృతి, తాత్విక చింతన' గ్రంథానికి పరిచయం రాస్తూ ఆ పుస్తకం వెలువడ్డానికి కారణాల్ని చెబుతూ స్వాతంత్ర్య సమరయోధులు, సీనియర్ కమ్యూనిస్టు జర్నలిస్టు పరకాల పట్టాభి రామారావుగారు అన్న మాటలే పైనవి. భారతదేశంలో కులవ్యవస్థ లు మొదలుకొని హిందూ మతం విశ్లేషణ వరకూ, మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్ నుంచి మహాత్మాగాంధీ, వివేకానంద ల దాకా ప్రతీ అంశం గురించి విభిన్నమైన రీతిలో ఒక ప్రాథమిక పరిశోధన ఇందులో మనకు కనిపిస్తుంది. ముఖ్యంగా, పురాణేతి హాసాల్లోని విషయాల్ని సరికొత్తగా సమాజానికి అన్వయించిన తీరు , దాంతో మనం విభేదించవచ్చుకానీ ఆ విషయ సేకరణకి అబ్బురు పడక మానం. ఆ రకంగా ఇదో విలువైన పుస్తకం !

"కమ్యూనిజం భారతీయేతర సిద్ధాంతమనీ, భౌతికవాదంతో నిండి ఆస్తికతను నిరాకరి స్తుందనీ, కమ్యూనిస్టులు మాస్కో మానస పుత్రులనీ , వారి వేళ్ళు (Roots) స్వదేశంలో లేవనీ – ఇలాగే ఎన్నో విమర్శలుండేవి. భారతీయ సంస్కృతినీ, అందులోని తాత్వికత నూ అవగాహన చేసుకోవడంలో విఫలమయ్యా రన్నది ఆ విమర్శల్లో ముఖ్యమైనది. ఈ విమర్శ

లకు సమాధానంగా దేవిప్రసాద్ ఛటోపాధ్యాయ,

దామోదర్ ధర్మానంద కొశాంబి లాంటి తత్వవేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలు మార్క్సిస్టు సిద్ధాంతంలోని లోతుపాతులను సవివరంగా చర్చించారు. కమ్యూనిస్టు ఉద్యమం కూడా మేథోపరంగా ఎన్నో చర్చలను ప్రోత్సహించి, గ్రంథాలను ప్రచురించినా, చేయాల్సిన కృషి ఇంకా వుందని సి. ఆర్. లాంటి నాయకులు అభిప్రాయ పడుతుండేవారు. భారతీయ తాత్వికతలోని సామాజికాంశాలనూ, అభ్యుదయాంశాలనూ సులభంగా అర్థం చేసుకునే రీతిలో వేద, ఉపనిషత్, పురాణ, స్మృతి సాహిత్యాలనేగాక అరవిందులు, వివేకానంద మొదలగువారి రచనలను విశ్లేషించి పార్టీ కేడర్లతో పాటు, సామాన్య ప్రజానీకానికి అందించాలి. చరిత్ర, సంస్కృతు లతో పాటు వివిధ చారిత్రక విభాత సంధ్యల్లో జరిగిన ఆర్థిక సామాజిక మార్పులను విశ్లేషించాలన్నది సి. ఆర్. గారి సంకల్పం. సమావేశానంతరం సి.ఆర్. గారి ఆలోచనలకు స్పందించి రాసిన కమ్యూనిజం పత్రికలో ప్రచురించిన వ్యాసాల సంకలనం ఈ గ్రంథం! "

ప్రాచీన భారతీయ చరిత్ర, సంస్కృతి, తత్వశాస్త్రాలకి సంబంధించి సరిగ్గా 30 ఏళ్ళ క్రితం మగ్దూం భవన్లో జరిగిన ఒక చారిత్రక సమావేశాన్ని ప్రస్తావిస్తూ ప్రముఖ చరిత్రకారులు వకుళాభరణం రామకృష్ణ గారు  ఈ చిన్న పుస్తకానికి తిరుగులేని సాక్షీభూతంగా రాసిన ముందుమాటలోని ప్రారంభ వాక్యాలే పైనవి. ఆయా అంశాల్లో జరగాల్సిన లోతైన కృషిని ఈ రోజు మరింత అవసరంగా గుర్తించడం అన్ని అభ్యుదయ వామపక్ష ప్రగతిశీల శ్రేణుల తక్షణ కర్తవ్యమని నా అభిప్రాయం. ఆ రకంగా మొదట కమ్యూనిజం పత్రికలో వచ్చిన ఇందులోని వ్యాసాలతో పాటుగా, పుస్తకంలో చేర్చిన రెండు అమూల్యమైన అనుబంధాలు కూడా ఉన్నాయి. మొదటిది ప్రస్తావించబడిన ఆ చారిత్రక సమావేశంలో పాల్గొన్న సభ్యుల క్రమ సంఖ్య పేర్లైతే, రెండోది ఈ దేశ మేధావులు విస్మరించిన తొలితరం మార్క్సిస్టు పరిశోధకుడు, కుల వ్యతిరేక ప్రతిఘట నోద్యమాల తొలి అధ్యయనవేత్త, మహా మేధావి డా. కె. బి. కృష్ణ గారి "భగవద్గీత లో భౌతికవాద అంశాలు" కి సంబంధించిన సంక్షిప్త పరిచయం. సామాజిక ఉద్యమాలు, ముఖ్యంగా బౌద్ధ, భౌతికవాద, కులనిర్మూలన ఉ ద్యమాలు పట్టించుకుని అధ్యయనం చేసి తీరవలసిన విలువైన చరిత్ర ఇదని నా అభిప్రాయం!

డా. మాడభూషి భావనాచా ర్యులు చిన్న వ్యక్తి కాదు. తొలితరం కమ్యూనిస్టు నాయకులు. ప్రజా పోరాటాలలో క్షేత్రస్థాయిలో పాలు పంచు కున్న వ్యక్తి. 1947 లో ప్రభుత్వం ఈయన ఆచూకీ తెలిపితే పదివేలు బహుమతి ప్రకటించింది. నాగులాపల్లనే చిన్న గ్రామంలో ఉన్న మాడభూషి ని పట్టుకునేం దుకు ఏకంగా నాలుగు పెద్ద లారీలతో పోలీసులు రావాల్సి వచ్చిందంటే కమ్యూనిస్టుగా ఈయన స్థైర్యం ఏపాటిదో అర్దం అవుతుంది. దేశంలోని

వివిధ జైళ్ళలో రాజకీయ ఖైదీగా ఉన్న మాడభూషి తదనంతరం పార్టీతో విభేదించారు. "నాకు మార్క్సిజంలో అచంచల విశ్వాసం ఉంది. మన దేశానికి కమ్యూనిజంవచ్చి తీరుతుంది. అయితే దానిని మన భారతదేశ విశిష్ట తాత్విక చింతనకు జోడించాలి" అన్న ఉద్దేశంతో వేదాలు మొదలు కొని ఉపనిషత్తుల వరకూ లోతుగా అధ్యయనం చేసి, భారతీయ తత్వశాస్త్రాల పై డిప్లొమా పొందారు. ప్రజలతో సంబంధం లేకుండా కేవల అధ్యయనం చాలదనే ఉద్దేశంతో చెరకు రైతుల సమస్యల పై మూడు దశాబ్దాల పైబడి పోరాటాలు చేశారు. గోదావరి జిల్లా పీడిత జన పోరాటాలని ముందుండి నడిపించారు. అందుకే, "పిఠాపురంలో కవి పండిత కుటుంబీకులనందరినీ కమ్యూనిస్టు పార్టీ ఆకర్షించింది" అన్న మాడభూషి "నేను కమ్యూనిస్టు గానే పుట్టాను, కమ్యూనిస్టు గానే జీవించాను, కమ్యూనిస్టు గానే మరణిస్తాను." అని ప్రకటించి ఇరవై ఏళ్ళ క్రితం 2002లో మరణించారు. 2011 లో ఈ పుస్తకంగా ప్రచురించబడిన విశిష్టమైన ఆయన శోధనను గుర్తించి ఆ మేరకు గౌరవించడం ఈ రోజు మతోన్మాదం పెచ్చరిల్లుతున్న వేళ మరింత అవసరమనే భావనే ఈ వ్యాసానికి ప్రేరణ!

(ఎన్నో భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ భారతీయ చరిత్ర, సంస్కృతి, తత్వశాస్త్రాలకి సంబంధించిన పరిశోధనాత్మక చింతన గురించి సీరియస్ గా కృషి చేసే ఆలోచనాపరులు, బుద్ధి జీవులు విస్మరించరాని విలువైన సంవేదనాత్మక గ్రంథం ఇది. ఆయా అంశాల్లో లోతైన కృషి మరింత జరగాల్సిన అవసరం ఎప్పటికంటే ఈ రోజు ఎక్కువ ఉందనేది నా అభిప్రాయం. ఆ రకంగా ఎప్పటి నుంచో పరిచయం చేయాలని అనుకున్న ఈ పుస్తకం గురించి ఇప్పటికిలా ఈ చిన్న రైటప్.)

# 'అభివృద్ధి' పై అద్దేపల్లి అక్షర నిరసన : సీమేన్




అభివృద్ధి జీవన ప్రమాణాల్ని విస్తృతం చేయాలే కానీ విధ్వంసం చేయకూడదు. కానీ, మన పాలకుల అభివృద్ధి కార్పొరేట్ కంపెనీలకు లాభాలార్జించి బడుగుజీవుల్ని రోడ్డుమీదికి లాగేస్తుంది. అభివృద్ధి ఎవరికో, ఎందుకో తేల్చుకోలేని సంక్షోభంలోకి సామాన్యులను నెట్టి ప్రజల్ని వెర్రివాళ్ళను చేస్తుంది. అలాంటి వినాశకర అభివృద్ధిని నిరసించే అక్షర సమాహారం ప్రభు సీమేన్ కథాసంపుటి.ప్రతికథా మనిషికి అత్యాస ఎలా ప్రమాదకారో చెబుతుంది. నిజానికి వీటిల్లో ఏదీ అభూత కల్పన కాదు. ప్రతీకథా ఒకానొక యదార్థ విధ్వంసానికి ప్రతీక. అభివృద్ధి పేరిట గోదావరి జిల్లాల్లో జరుగుతున్న వినాశనానికి సాక్ష్యం.

హద్దు కథలో, "ఇది అభివృద్ధికీ, అభివృద్ధి కాకపోవడానికి సంబంధించిన సమస్య కాదు. మనిషి జీవించే పద్ధతికి సంబంధించిన సమస్య.మనిషి కాస్తంత క్రమాన్ని పాటించగలిగితే ఇలాంటి సమస్యే లేదు."అంటాడు రచయిత. ఈ కథ ముగింపు 'చిప్కో' మహోద్యమాన్ని తలపిస్తుంది.

" లోకం మనది కాకుండా పోయింద"నే రామాంజి, "చిట్టచివరి లోకం మనం ప్రేమించేలా ఉండదు. మనం లోకం ప్రేమించేలానూ ఉండలేం. మౌనమూ, ధ్యానమూ మనల్ని దేవుడ్ని చేస్తాయేమోకానీ మనిషిని మాత్రం చేయలేవ" న్న సీతక్క కొండ కథా, "సొంతూరు అనే దాంట్లో ఏదో ఉంది. పుట్టినూరు, ఆ పరిసరాలు బుర్రలో బొమ్మల్లాగుండిపోతాయి.
కానీ, అది ఒట్టి జ్ఞాపకం కాదు. కొన్ని స్పర్శలు..
కొన్ని వాసనలు, కొన్ని రంగులు, కొన్ని గాలులు,
కొన్ని రుచులు, వీటన్నింటిలోనూ ఆ ముద్రలు
పడిపోతాయి." అన్న సీమేన్ కథా మనల్ని మొదట్లోనే కదిలించివేస్తాయ్.

"కరప్షన్ అభివృద్ధికి గుండెకాయ లాంటిది" అన్న నిజాన్ని 'సిన్నాన్నా మనవేటీ సేయలేమా' కథలో చెప్పిన చౌదరి పాత్ర, "డబ్బు...డబ్బుంటే అభివృద్ధి ఉంటుంది. డబ్బుంటే కొండలేంటి, నదులేంటి, సముద్రాలేంటీ, పాతాళంలో ఉన్న గనుల్ని కూడా తవ్వి పారేయాల్సిందే."అనే 'నాగులకొండ' కథలో గోపీనాథ్ పాత్ర, " అన్నాయ్, పొలాన్ని నమ్మకు, నేలని నమ్ముకోకు,

అది నిన్ను గొడ్డుచాకిరీ చేయిస్తుంది కానీ పెంచదు." అనే సూర్యనారాయణ పాత్రా నేటి పాలకులు, దళారుల భాషని యధాతథంగా వల్లించాయ్.

పదమూడు కథలున్న ఈ సంపుటిలో మరో రెండు కథల్ని గురించి చెప్పాలి. ఒకటి అతడు మనిషి, రెండు ఇస్సాకు చిలక. కార్పోరేట్ కళ్ళతో ప్రపంచాన్ని చూస్తూ క్రైసిస్ మేనేజ్మెంట్

మొదడుతో ప్రపంచాన్ని అంచనా వేయడానికి అలవాటు పడ్డ వెంకటేష్, తుఫానులో తనకు ఆశ్రయమిచ్చిన బీద పడవవాడి నోట, "మనిషి సుఖంగా ఉన్నప్పుడు యాపారం చెయ్యొచ్చు బాబూ, కష్టంలో ఉన్నప్పుడు యాపారం చైకూడదు. రాత్రి మీరు కష్టంలో వచ్చారు. మీరు మడిసి, నేను మడిసిని . వానకు ముద్దైన పిట్ట చెట్టు మీద వాలబోతే చెట్టొద్దంటుందా..ఇదీ అంతే" అనే మాటలు విన్నప్పుడు అతడిలానే మనమూ ఉద్విగ్నతకి లోనవుతాం. ఇక, ఎలకలు పట్టే ఇస్సాకు కథ చెప్పిన తీరులో కొత్తదనం కనిపిస్తుంది.

గోదావరి పల్లెప్రాంత నుడికారాన్నీ, కట్టుబాట్లనీ లోతుగా అధ్యయనం చేసి ప్రజానీకంతో మమేకం అయితే కానీ భాష పై ఇంత అలవోకగా పట్టు సాధించాడం కష్టం. నింగీ, నేల, నీరు అంతా కంపెనీల కంపుతో కాలుష్యమయం అవుతున్న ప్రస్తుత పరిస్థితుల్లో స్థానిక సంస్కృతీ సంప్రదాయాలు గుర్తించీ వాట్ని కాపాడే కార్యక్రమాలు అవసరం. రచయిత చేసింది అదే, ఎందుకంటారా? "పిట్ట ఎగుర్తుంది.

చెట్టు మొలుస్తుంది. గాలి వీస్తుంది. దానిని ఎందుకు అని ఎలా ప్రశ్నించడం?"

# ఎగసిన అల, అరుణాంక్ అక్షర వెన్నెల




ఎంత లోతుకు పడిపోయినా మళ్ళీ అంతెత్తుకు లేచి తన ధిక్కారాన్ని ప్రకటించడం అల లక్షణం.ఎన్ని గాయాలు చవిచూసినా తిరిగి కర్తవ్యాన్ని నెత్తికెత్తుకుని దూసుకుపోవడం అక్షరాల లక్ష్యం.అలాంటి అక్షర సమాహారమే వెన్నెల. మామూలుది కాదు, మబ్బులు చీల్చుకు వచ్చిన వెన్నెల. అరుణాంక్ వెన్నెల కేవల భావోద్రేకం కాదు. అది భావాల బాధ్యతకి చిహ్నం. శతాబ్దాల నుండి గుండెల్లో ఇముడ్చుకున్న వివక్ష తాలూకు తెగింపు. సంవత్సరాల నుండీ గొంతు దాటి బయటకు రాని నిషేధిత పదాల స్వరసమరం. ఒక్కమాటలో అణచబడ్డ అక్షరాల రణన్నినాదం.

పైపైకి అదొక ప్రేమగానే కనిపించొచ్చు. పైత్యం తలకెక్కిన ఈ దేశపు ఆధిపత్యానికి మాత్రం అదొక సంధించిన ప్రశ్న. వందలేళ్ళుగా కోటల్నిపెకలిస్తున్న ప్రశ్న. స్థూలంగా అది కవి భావావేశంగానే కనబడినా నిజానికి అదొక లోతైన సవాలు.

అందుకే, "నువ్వక్కడ/నేనిక్కడ/మనమధ్య /దూరాన్ని చెరిపేస్తూ వెన్నెల" అన్నప్పుడుకానీ, "రాబోయే విప్లవాన్ని/మెరుపులతో పరిచయం చేస్తున్నట్లు/మేఘ గర్జనలు/ఆమె నవ్వులు." అన్నప్పుడు గానీ కవిలో దాగిన ఒరిజినాలిటీకి

సంబంధించిన సింబాలిజమ్ పాఠకుడికి స్పష్టంగానే అర్ధమవుతుంది. అదక్కడితో ఆగదు,

"మబ్బులు చీల్చుకు వచ్చిన వెన్నెల

బతుకువాటలో వ్యాన్‌గార్డు కన్నుల"

కవి తన వెన్నెల దృక్పథాన్ని తిరుగులేని విశ్వాసంతో ప్రకటించాడు. సినిమా సిద్ధాంతాలు, థియేటర్‌ల థియరీలే ప్రేమనుకునే తన తరానికి,

"ప్రకృతి సౌందర్యానికి పరవశించడం కదూ ప్రేమంటే/ కష్టాలు, కన్నీళ్ళు చూసి కరిగిపోవడం కదూ ప్రేమంటే/అభిప్రాయాలను గౌరవించడం/

స్వేచ్ఛను ప్రేమించడం కదూ ప్రేమంటే/ విముక్తిని

కాంక్షించడం కదూ నిజమైన ప్రేమంటే.." అంటూ

అసలైన ప్రేమని సిసలైన స్వాప్నికుడిగా అక్షరాల్లో...కాదు, కాదు, అలల్లో ఆవిష్కరించి చూపాడు.

ఆ అల కవి కల. సమిష్టి విశ్వాసాల వెన్నెల.

సుదీర్ఘ పోరాటాల కన్నుల. మిత్రుడు అరుణాంక్ అడపాదడపా ఏవో ఉద్యమ రచనలు చేస్తుంటాడని తెలుసు కానీ ఉన్నట్టుండి ఇలా అలగా ప్రవహిస్తాడనుకోలేదు. అణగారిన ప్రజల కలల్ని ఎంతో ఒద్దికగా పట్టుకుని, కవిత్వంలోనే కాదు, జీవితంలో కూడా మబ్బుల్ని చీల్చడమే పనిగా పెట్టుకున్నాడు. ఉత్తినే కాదు. ఉత్పత్తి శక్తులకి అండగా ఉండే వెన్నెల కోసం, వొట్టి వెన్నెల కాదు వసుధైక వెన్నెల, తరతరాలుగా గరీబులు స్వప్నిస్తున్న శ్రమైక జీవన సౌందర్యంతో మమేకమైన మానవీయ వెన్నెల.

"మబ్బులు చీల్చుకు వచ్చిన వెన్నెల " అరుణాంక్ మొదటి కవితా సంపుటి. తెలుగు సాహిత్యంలో తెలంగాణ ఉద్యమ వారసత్వానికి జవసత్వాలతో కూడిన కొత్త కొనసాగింపు అరుణాంక్. అతడి అలకి అయినంతలో కలలో భాగమై వెన్నెల వేడుకని తిలకించడం మనందరికీ మరో మనోబలం.

# నేనూ నా దేశం !

## మహోన్నత సందేశం!!




తెలుగులో ఆత్మకథలు, స్వీయచరిత్రల అంతగా లేదు. రాసే ధైర్యం ఉన్నవారు కూడా అరుదే. కానీ, వచ్చిన వాటిలో తప్పనిసరిగా చదవాల్సినవి కొన్ని ఉన్నాయి. అందులో చెంచయ్యగారిది ఒకటి. తన ఆత్మకథని "బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఉరికొయ్య కెరయైన అమరజీవి సర్దార్ బలవంత సింగుకు, ఆయన భార్య కు " అంకితమిచ్చిన చెంచయ్య 'నేనూ – నా దేశాన్ని ' చారిత్రక డాక్యుమెంట్ గా మలిచారు.

"తాను రచయిత ను కాదన్న సంకోచం శ్రీ చెంచయ్య గారికి వున్నట్టుంది. కాని, ఆయన సూటిగా ఆలోచిస్తారు. సూటిగా బ్రతుకుతారు. అందువల్ల సూటిగానే వ్రాయగలరు. రచయిత కావడానికి దీన్ని మించిన అర్హత నా మట్టుకు నాకు తెలియదు." అంటారు పీఠిక లో నార్ల వెంకటేశ్వరరావు గారు. లాలాహర్ దయాళ్ అనార్కిజంతో మొదలై గదర్ వీరోచిత పోరాట నుండి స్వాతంత్రోద్యమం వరకూ పరుగులు చేస్తూ సాగిపోతుందీ రచన.

నెల్లూరు జిల్లా కనిగిరిలో పుట్టి, ఉన్నత విద్య కోసం అమెరికా వెళ్ళి అక్కడ గదర్ పార్టీలో చేరి క్రియాశీల కార్యకర్తగా చారిత్రక పాత్ర నిర్వహించిన ఏకైక ఆంధ్రుడాయన. ఢిల్లీ, కన్ననూర్, లాహోరు, కలకత్తా, నెల్లూరు, కోయంబత్తూరు, సింగపూరు, బేంకాక్ జైళ్ళలో ఉన్నారు. ఎనిమిదేళ్ళ జీవితం చెరశాలలో గడిచిపోయింది. స్వాతంత్ర్య పూర్వ భారతదేశపు ముఖచిత్రం మొదలుకొని స్వాతంత్ర్యానంతరం స్వాతంత్ర్యానంతరం సమాజ మార్పు కోసం వెల్లువెత్తిన వివిధ ఉద్యమాల వరకూ అనేక విషయాలు, విశేషాల సమాగమం దర్శి చెంచయ్య గారి 'నేనూ నా దేశం'. "నా చేతిలో మిగిలివున్న కొద్ది ధనాన్ని నేనెంతో పొదుపుగా వాడాల్సిన స్థితి ఏర్పడింది. అందువల్ల రోజూ హారిసన్ కంపెనీలో రొట్టెను కొనుక్కుతిని, కొళాయి నీళు ృ తాగుతూ కొన్ని వారాలు గడిపాను." (పేజి 171)

"అసలు ఇతరుల ఆర్థిక సహాయాన్నర్థించి జీవించడం ఆత్మగౌరవాన్ని చంపుకోవటమేనని నా అభిప్రాయం. కాబట్టి జట్కా బండి తోలుకొని స్వతంత్రంగా జీవించినా గౌరవప్రదమేనని నిశ్చయించుకున్నాను." (పేజి 172) అంటారు. "వైశ్యులు ఎంతో ధనం సంపాదించుకున్నారు. ప్రజల సొమ్ము వారి హస్తగతమవుతోంది. వారేమో అధిక భాగ్యవంతులవుతూంటే ప్రజలు

మరీ బీదలవుచున్నారు. ధనార్జనయందు తాపత్రయమేకాని సంస్కారమందు కోరికే కనబడదు వైశ్యుల్లో."(పేజి 258) కంచె ఐలయ్య మీద పడేడ్చే కోమట్లు, వైశ్యుడిగా పుట్టి విశ్వనరునిగా ఎదిగి దశాబ్దాల క్రితం మొహం పగిలేలా చీవాట్లు పెట్టిన చెంచయ్య గారు జీవితాంతం కులాన్ని అసహ్యించుకున్నారని గ్రహించాలి. వైశ్యుల్లో మొదటి వితంతు వివాహం ప్రోత్సాహకర్తగా ఉన్నాయిన, " ఇండియాలో అన్ని కులాల్లాగే వైశ్య కులం కూడా వైదిక బ్రాహ్మణుల ఆధిపత్యం కింద అణిగిమణిగి ఉంది ...(పేజి 190) అన్నారు.

కాంగ్రెస్ , సోషలిస్ట్, కమ్యూనిస్ట్ పార్టీ ల నేపధ్యంతోపాటూ ఆర్.ఎస్.ఎస్. క్రూరత్వాన్ని కూడా దగ్గర్నుంచి చూసారాయిన. " గాంధీ గారి హత్యతో కొందరు సంతోషపడుతున్నారనే విషయం నాకెంత విషాదాన్ని కలిగించిందో వ్రాయలేదు"( పేజి 358) వీరేశలింగం శతవార్షికోత్సవాన్ని మద్రాసు లో జరిపించడంలో చెంచయ్య గారి పాత్ర ఉంది.

"విద్యాధికులైన సభ్యులలో పెద్ద మార్పు రాసాగింది. అదేమంటే పదవీ వ్యామోహం (కెరియరిజము) ఈ దుర్గుణం ఇండియాలో ప్రతి రాజకీయ పార్టీలోను ప్రవేశించి ఆ పార్టీ లను నాశనం చేస్తున్నది. కమ్యూనిస్టు పార్టీలో పొడచూపిన ఈ దుర్గుణాన్ని వెంటనే అణచివేయకపోతే పార్టీ నైతిక దృష్టి క్షీణించిపోతుంది.(పేజి 365) అన్నాయన

"నేను కమ్యూనిస్టు పార్టీ లో సుమారు పది సంవత్సరాలున్నా వాస్తవంగా కమ్యూనిస్టు కాలేకపోతిని...." (పేజి 366-67) లో నిజాయితీగా రాసుకున్నారు."

వ్యక్తిగత కారణాలతో రాజకీయాలకు దూరమైన ఆయన,"సంపాదించడమనేది కష్టజీవులను దోచుకోవడమేననే భావం నాలో కలిగినందుననే సంపాదన మానేసాను. ...భోజనం ఖర్చు తగ్గించుకొంటూ వచ్చాము. పాలు, నెయ్యి, నూనె, కూరగాయలు, పండ్లు వగైరా తగ్గించాము. ఇంతచేసినా ఆర్థికంగా సవరించుకోలేకపోయాము.......ఆర్థికంగా తీరని కష్టాలు కూడా రాజకీయ జీవితాన్ని మానుకొనుటకు ఒక కారణం"(పేజి 368)

తదనంతరం సాహిత్య సేవ చేయడానికి నిర్ణయించుకున్న వారు జీవితాంతం సమాజం హితం కోసమే మసిలారు. మొట్టమొదటి భారతీయ అనార్కిస్టు (?) లాలా హర్ దయాల్ అసాధారణ జీవితసంగతులు మొదలుకొని

మొట్ట మొదటి మార్క్సిస్టు ఇండాలజిస్టు కాట్రగడ్డ బాలకృష్ణ అసామాన్య పాండిత్యం వరకూ ఎన్నో ఎన్నెన్నో చారిత్రక ప్రాధాన్యత కలిగిన సంగతుల విలువైన గ్రంథం దర్శి చెంచయ్య గారి "నేనూ, నా దేశం". అంతా తప్పనిసరిగా చదవాల్సిన పుస్తకం.

# పత్రికలు

## 30 వసంతాల 'ముందడుగు' ఒక సమాలోచన




'నువ్వు బుద్ధిగా చెప్పిన మాటల్లా వింటూంటే నిన్ను సురేంద్రదనాథ్ బెనర్జీ అంతగొప్పవాణ్ణి చేస్తాను'. 1 అంటాడు గిరీశం వెంకటేశంతో. కన్యాశుల్కం ప్రధమాంకంలోనే బెంగాల్ గురించి అప్పటికే రెండుసార్లు ప్రస్తావించిన గురజాడ మానసపుత్రుడు గిరీసం చాత సురేంద్రనాథ్ బెనర్జీ గురించి పలికించిన వాక్కులవి. ఇవేవో ఊరికే కాల్పనికత కోసం రాసినవి కావు. ఆ రోజుల్లో దేశం మెత్తానికి బెంగాలు సాంస్కృతికోద్యమ కేంద్రంగా ఉండింది. సంస్కరణావాద ఆలోచనలు మొదలుకుని విప్లవోద్యమం దాకా అనేక దృక్పధాలకి నెలవుగా ఉంది. ఆ క్రమంలో తెలుగుదేశం మీద కూడా ఆ ప్రభావం పడింది. 2'మొన్న బంగాళీ వాడు యీఊర్లో లెక్చరిచ్చినప్పుడు ఒక్కడికైనా నోరు పెగిలిందీ?' అని గురజాడ ప్రశ్నించింది తెలుగుజాతి నిర్లిప్తతనయితే,స్తుతించి శ్లాఘించింది మాత్రం వంగజాతి సారస్వత స్రవంతిని. అలాంటి అఖండమయిన సాంస్కృతిక చ్కైతన్యానికి విశేషంగా కృషిచేసి దేశంలో అన్ని ప్రాంతాలు పర్యటించి కోల్‌కతాలోని బేరక్‌పూర్‌లో 1925లో సరిగ్గా వందేళ్ళ క్రితం చనిపోయాడు సురేంద్రనాథ్ బెనర్జి. అంతకు ముందే మంగళపాండే ఆద్వర్యంలో జరిగిన 1857 తిరుగుబాటుకి కూడా అదే ప్రాంతం కేంద్రబిందువని గుర్తుంచుకోవాలి. 3 అలా దేశాన్నంతా మేలుకొలిపిన బెంగాలులోని బేరక్‌పూర్ ప్రాంతంలో ఉత్తరాంధ్ర నుండి వలసపోయిన వేలాది మంది కుటుంబాల నడుమ కొందరు చ్కైతన్యవంతులయిన యువత ఆలోచనల్లో పుట్టి 1990 లో రాతపత్రికగా ప్రారంభమై 2020 నాటికి ముప్ఫై సం.రాలు పూర్తిచేసుకొంటున్న సాహిత్య దీపిక 'ముందడుగు'!

"హే పేదరికమా! నువ్వే నన్ను ఉన్నతంగా మలిచావు' (You have made me great, O poverty!) అంటాడు కజీనజ్రుల్ ఇస్లాం. 4 మనిషికి బీదరికాన్ని మించిన బోధకులు, పేదరికం కంటే ప్రభోదకులు ఎవరూ లేరు. పొట్టచేత పట్టుకుని అనేక సంక్షోభ సమయాల్లో దేశంలోని వివిధ ప్రాంతాలకు వలసపోయే అభాగ్యుల చరిత్ర ఈనాటిది కాదు, అలా బ్యారక్‌పూర్ ప్రాంతంలోని తాల్పకూర్‌లో జూట్‌మిల్లులు మొదలుకుని వివిధ పనుల్లో రోజువారి ఉపాధి అవకాశాల కోసం పాటుపడుతూనే కళాసాంస్కృతిక రంగాలలో అభిరుచి

పెంపొందించుకున్న కొద్దిమంది యువసాహితీ మిత్రుల ఆలోచనలు ఆచరణగా రూపుదాల్చి "ముందడుగు" రాత పత్రికగా వెలువడింది.నాటినుండీ ఆటుపోట్లను ఎదురుకుంటూ మధ్యలో కొన్నాళ్ళు ఆగిపోయినా మళ్ళీ ఉత్సాహంతో లేచి ముందడుగు వేసింది ముందడుగు.

90 వ దశకం దేశవ్యాప్తంగా యువత అనిశ్చిత పోకడలపై సాంస్కృతికంగా పోరాడుతున్న స్థితి.సరళీకరణ ఆర్థిక విధానాలు మొదల్కై భారత పాలకులు వాళ్ళ మేలిముసుగులు తొలగించి ప్రపంచ దోపిడీ పెట్టుబడిదారులకు తలుపులు బార్లా తెరుస్తున్న కాలం. మతోన్మాదం రాజకీయశక్తిగా ఎదిగేందుకు తీవ్రంగా పన్నాగాలు పన్నుతుంటే, మరోవైపు ప్రగతిశీల ప్రజాతంత్ర శక్తులు ఎక్కడికక్కడ "పూని ఏద్కెనాను ఒక మేలు కూర్చిజనులకు చూపవోయి!" అనే స్ఫూర్తితో ప్రయత్నాలు చేస్తున్న రోజులు.అప్పటికి దశాబ్దాలుగా ప్రపంచవ్యాప్త పీడితులందరికీ ఒక చెరగని ఆశగా నిర్మితమయిన సోవియట్ రష్యా, పతనానికి దగ్గరగా ఉంది. 5 అమెరికా సామ్రాజ్యవాద కూటమి అందుకోసం ఎప్పట్నుంచో గోతికాడనక్కలా ఎదురు చూస్తోంది.అలాంటి పరిస్థితుల్లో పుట్టింది ముందడుగు.

"చలేతో సారే జమానేకో సాత్ లేకర్ ఛలో" అంటాడు మగు?ం. ముందుకు పోవాలంటే జనాన్ని మనతో తీసుకుపోవాలి..... పోరాడాలంటే అన్నివర్గాల వారిని వెంటబెట్టుకుని పోవాలి" అంటూ సగటు సామాజిక చైతన్య కార్యాచరణ ఎలా ఉండాలో చెప్పిన పెద్దలు.సి.రాఘవాచారి "కవి రాబిన్‌సన్ క్రూసో కాకుడదంటారు.6 సిద్ధాంతం ఎంత గొప్పదయినా తేలాల్సింది ఆచరణ లోనే. అందుకే 'ముందడుగు' పడటానికి వెనుక చారిత్రకంగా పేర్కొన్న నేపథ్యం ఉంది.సమిష్టి కార్యాచరణ ద్వారానే మార్పు సాధ్యమనే స్పష్టత ఉంది.సమాజ చైతన్యం కొరకు ఉన్న పరిమితుల్లోనే పత్రిక రూపొందదు.అందుకు ఆర్థిక వనరులు, మానవ వనరులు కూడా అవసరం. ఆ ఇబ్బందుల్ని అధిగమిస్తూనే పత్రిక ముందుకు సాగింది.పడుతూ లేస్తూనే పురోగించింది. కొద్దిమంది ఔత్సాహికులయిన యువత 'ముందడుగు' ని ప్రతిసారి వెనకుండి రూపొందించేవారు.ప్రచురణాభారం కనుక తప్పులు లేకుండా రాయడం, ప్రూఫులు చూడటం, బట్వాడా చేయడం వరకూ రచనలూ, సేకరణ... సాంకేతికత ఇంతగా అభివృద్ధి చెందిన ఈ రోజే యంత్రసాధనాలుంటుండగా ప్రచురణ ఎంతిబ్బందో అనిపిస్తుండగా, తొంభ్కైదశకంలో కేవలం సాహిత్యం మీద అభిరుచితో సామాజిక భాధ్యతగా తలచి పరాయి రాష్ట్రంలో ధైర్యంగా ఒక రాతపత్రిక ప్రారంభించి నడపడం అబ్బురమనిపిస్తుంది.వ్యవస్థ గురించి పట్టించుకోవాలనే ఆదర్శం సమున్నత స్థాయిలో ఉంటే తప్పా ఈ రకమయిన పురాకులన్నింటినీ భరించడం కష్టం.

నిజానికి ముందడుగుకి ముందు 60 దశకంలోనే ఆ ప్రాంతంలో తెలుగులో రెండు రాతపత్రికలు నడిచాయ్. 1) రాష్ట్రేతర ఆంధ్రజ్యోతి 2) వికాసం. ఐతే, ముందడుగుకి ఒక

విభిన్నమయిన ప్రజాతంత్ర దృక్పధం ఉంది.బీహార్‌లో ఉద్యోగవశాత్తూ ఉన్న ఐకా బాలాజీ గారు నిరంతరాయంగా ముందడుగుని నడిపించారు. కారణాంతరాలవలన 2003 లో ఆగిపోయిన పత్రికని పున:ప్రచురించాలనే పట్టుదలతో 2015లో 25 సం:రాలు పూర్తిచేసుకున్న "ముందడుగు" రజతోత్సవ ప్రత్యేకసంచికగా వెలువడి నేటి వరకూ కొనసాగుతోంది.మహాశ్వేతాదేవి మొదలుకొని మృణాల్‌సేన్ దాకా బాబ్రీమసీదు కూల్చివేత నుండి ప్రత్యేక సినిమాల సంచిక వరకూ నాటినుండి విభిన్నతకు చోటు కల్పిస్తూనే ముందుకు సాగుతోంది ముందడుగు.ఈ రోజు మొత్తం దేశం విపత్కర స్థితిని ఎదుర్కుంటోంది.లౌకిక రాజ్యంగా వృద్ధి చెందని భారతదేశం ఎలాంటి భయంకర పరిస్థితిని మతోన్మాదం నుండి ఎదుర్కోవాల్సి వస్తుందని నాటి ప్రజానేతలు భావించారో సరిగ్గా అదే పరిస్థితి వ్యాప్తి చెందుతోంది. కులతత్వం, మతోన్మాదం, పురుషాధిపత్యం, సామ్రాజ్యవాదం రోజురోజుకి పెరుగుతున్నాయి.విద్వేషం పడగవిప్పి బుసకొడుతోంది.ఇలాంటి సంక్లిష్ట కాలంలో ముందడుగు నిర్వహించాల్సిన చారిత్రక కర్తవ్యం మరింత పెరిగింది.విద్వేషానికి విరుద్ధంగా పీడిత ప్రజల పక్షం వహించే గొంతులు, రాతల సంఖ్య రోజురోజుకి తగ్గిపోతున్న పరిస్థితుల్లో పరిమితంగానైనా, పటిష్టంగా నిర్దిష్టమయిన ప్రజాతాత్వికతతో కూడిన ఒక సాంస్కృతిక సాహితీ సౌరభాన్ని ముప్పై సం:రాలుగా వెదజల్లుతున్న "ముందడుగు" మరెన్నో ముందడుగులు వేయాలనీ, మార్పుకి దోహదం చేస్తున్న శక్తులకు ఆసరా ఇవ్వాలని ఆశిస్తూ.... ఆకాంక్షిస్తూ, అభినందనలు.

**ఫుట్ నోట్స్:**

1. సురేంద్రనాథ్ బెనర్జీ (1848-1925) ప్రఖ్యాత జాతీయ నాయకుడు.ఇండియన్ నేషనల్ అసోసియేషన్ స్థాపకుడు, కాంగ్రెస్‌వాది. 1919 లో కాంగ్రెస్ నుండి విడివడి ఇండియన్ నేషనల్ లిబరేషన్ ఫెడరేషన్ స్థాపించిన ఈయన 'ది బెంగాలీ (the Bengalee) అనే పత్రిక కూడా నడిపాడు.రెండు సార్లు కాంగ్రెస్ అధ్యక్షునిగా చేసిన బెనర్జీ A Nation in making పేరిట ఆత్మకథ ప్రచురించాడు. దేశమంతా విస్తృతంగా తిరిగి ప్రజలందర్నీ ఒక్కతాటిపైకి తీసుకురావడానికి కృషిచేసిన బెనర్జీ దేశవ్యాప్తంగా మేధోజీవులకు స్ఫూర్తిగా నిలచాడు.మహాకవి గురజాడ అప్పారావు గారు రచించిన కన్యాశుల్కం నాటకంలో గిరీశం నోట సురేంద్రనాథ్ బెనర్జీని స్తుతించారు.అంతేకాదు కన్యాశుల్కం ప్రధమాంకంలో గిరీశం డాబుగా చెప్పిన "ది ఇలెవన్ కాజెస్ ఫర్ది డిజనరేషన్ ఆఫ్ ఇండియా" పూనా కాలేజీ ప్రసంగం సురేంద్రనాథ్ బెనర్జీ చేసిందేననే వాదన కూడా ఉంది.

2. ఆరోజుల్లో బెంగాలు సాంస్కృతికోద్యమానికి పెద్దదిక్కుగా ఉండేది.దాని ప్రభావం దేశమంతటా పడింది.గురజాడ దానిని అందుకోవడమే కాక నాటి బెంగాలు మేధావుల

తో ఉత్తర ప్రత్యుత్తరాలు సైతం జరిపారు.

3. 1857, మార్చి 29న బారక్‌పూర్‌లోని 34వ పటాలానికి చెందిన మంగళపాండే బ్రిటీష్ సైనికాధికారి బాగ్‌ని కాల్చి చంపడంతో మొదటి స్వాతంత్ర్య సంగ్రామం ఆరంభమైందని చరిత్ర.

4. వివరాలకు చూడు selected Nazrul, the singer of equality నజ్రుల్ సంస్కృతి పరిషద్ ప్రచురణ కోల్‌కతా, సంపాదకత్వం: మితాతన్ నహోర్, నిర్మల్ సాహా, పేజీ–30, పావర్టీ కవిత, అనువాదం: ఎం.డి. ఫజ్లే ఖాదర్.

5. అసంఖ్యాక త్యాగాలు అవిస్మరణీయ కష్టాలలోంచి జనించిన ప్రపంచంలోని మొట్టమొదటి కమ్యూనిస్టు ప్రభుత్వం సుమారు డెబ్బైనాలుగేళ్ళ తర్వాత బూర్జువాల ద్రోహాలతో పాటు అనేక కారణాల వల్ల కూలిపోయింది. ఐతే, ప్రత్యామ్నాయ శ్రామికరాజ్యం ఆచరణాత్మకంగా సాధ్యమేనని ఈ ప్రయోగం రుజువుచేసింది.

6. వివరాలకు చూడు: అక్షరాల్లుఅనుభవాలు: సాహితీ ప్రముఖుల ఇంటర్వ్యూలు, సాహితీ స్రవంతి ప్రచురణ –2004, ఇప్పుడు నిర్వేదానికి తావులేదు, సి.రాఘవాచారి ఇంటర్వ్యూ, పేజీ - 62.మొన్నీ మధ్యనే రాఘవాచారి మరణించారు. బహుముఖ ప్రజ్ఞశాలిగా, సామ్యవాదిగా, నడిచే విజ్ఞాన సర్వస్వంగా పరిచయమున్న వాళ్ళు ఆయన్ని పేర్కొంటారు.

# జనభావ చైతన్య ద్వైమాసిక దీపిక

## భౌతికవాది పత్రిక !




సరిగ్గా పదేళ్ళ క్రితం 2013 లో షహీద్ భగత్ సింగ్ వర్ధంతి, మహాత్మా జోతిబాఫూలే, బాబాసాహెబ్ డా. అంబేద్కర్ ల జయంతిని పురస్కరించుకొని "తెలంగాణ నుంచి వెలువ డుతున్న నాస్తిక సాహిత్య పత్రిక" టేగ్ లైన్ తో మిత్రులు డా.మలయశ్రీ ఆరంభించిన భావోద్యమ పత్రికే 'భౌతికవాది!' కరీంనగర్ లోని మేడమీద తన ఇంట్లో ఎవరి గోల లేకుండా తన పని తాను చేసుకుపోయే మలయశ్రీ చాలా కాలం ఒంటరిగానే పత్రిక నడిపించారు. ఎన్నో అపురూప రచనల్ని అందించారు. అయినా ఒక్కడిగా అంతటి భారాన్ని, శ్రమనీ భరించలేక కోవిడ్ తరువాత ఇక పత్రిక ప్రచురణ ఆపేసారు ! భౌతికవాది ప్రారంభ సంచికలో ఆంధ్ర నుంచి అచ్చయిన ఏకైక వ్యాసం యం. యన్. రాయ్ గురించిన నా కరపత్రం. తర్వాత మరో సంచిక లో తాపీవారి దేవాలయాల... ? పుస్తకానికి మూలమైన ఒక రచన గూర్చి నేను రాసిన ఉత్తరం దొరికింది. ప్రశ్నార్థకానికి కూడా ఆనాడు ప్రత్యేకంగా నే పట్టించు కునిచ్చిన ప్రాధాన్యత !

నలువైపులా తిరుగుబాటు స్ఫూర్తిని వెదజ ల్లిన తెలంగాణ ప్రాంతం ఈ రోజు మతోన్మాద మూక దాడులకు నెలవైంది. అ లాంటి పరిస్థితుల్లో ఒకనాడు అవిశ్రాంత భావోద్యమ దీపికగా వెలుగొందిన అక్షర రూపాల్ని తలుచుకుందుకు, ఆ దిశగా నేటి యువత కదలాలని ఆశిస్తూ ఈ రైటప్ !

(అనేక విలువైన వ్యాసాలను వెలుగులోనికి తీసుకొచ్చిన భౌతికవాది పత్రికలోని అరుదైన రచనల్నయినా ఇప్పుడు అందుబాటులోకి తీసుకొస్తే బావుంటుంది. అలాగే, సగంలో ఆపేసిన మలయశ్రీ స్వీయచరిత్ర కూడా త్వరలోనే వెలవడి, తెలంగాణ సాంస్కృతిక వారసత్వాన్ని వికసింపజేయాలనేదే నా కోరిక.)

# సమస్త మానవ సంఘర్షణల సమాహారం

## తాత్విక : అంతర్జాల త్రైమాసిక పత్రిక




"వేసినదారంట వెళ్ళిపోవడం సులభం. అంతే కాదుపదిలం.నలుగురికీ తెలిసిందీ, చిరకాలం నించీ నలిగిందీ ఒకదారి సిద్ధంగా సుప్రసి ద్ధంగా ఉంటూనే ఉన్నప్పుడు వేరే ఒక కొత్త దారి వెదకడం అవివేకం, ప్రమాదం అని అంటారు కొందరు. కాని పురోగమనానికి కొత్త దారులే రాచబాటలు. అలుపులేని అన్వేషణ గతానుగతికత్వాన్ని సహించలేదు.కాలిబాట లోనే మానవుడు తృప్తిపడిపోయి ఉంటే వ్యోమాయానాలు సాధ్యమై ఉండేవి కావు. ఆ కాలిబాట కూడా ఒకప్పుడు శతాబ్దాల క్రిందట అగమ్యాలైన అరణ్యాలను భేదించి సాధించ డానికి మానవుడు చేసిన యత్నమే, వేసిన మార్గమే అని మనం మర్చిపోకూడదు."

**– గురజాడ సాహిత్యం పై శ్రీ శ్రీ సమీక్ష.**

తెలుగులో ఉన్నతస్థాయి తాత్విక చర్చలు తక్కువ. ఆ జరిగినవి కూడా హుందా అయిన పద్ధతిలో కాక,ఏవో కుస్తీ పోటీల్లాగా, బలాబలాల నిరూపణ కోసం అన్నట్టు జరుగుతాయ్. ఒక హేతుబద్ధమైన దార్శనిక సంవాదానికి ఆస్కారం ఇవ్వాల్సిన ఆలోచనా స్రవంతులు, కొద్దిమంది బుద్ధిజీవులకు మాత్రమే పరిమితమైన గుంపులుగా మిగిలిపోవడం బాధాకరమైన సందర్భం. అలాకాకుండా ఉండాలంటే, పౌర సమాజంలో తాత్వికత పట్ల ఆసక్తి కలిగించాలి.అదేదో మానవ జీవితానికి భిన్నమైనది కాదనీ మన బతుకులో అంతర్భాగమనే దృక్పథం నిర్మించగలగాలి. అదిగో, అందుకోసం ఒక ప్రయత్నమే ఈ "తాత్విక" పత్రిక ! సోక్రటీస్ నుండి శ్రీశ్రీ వరకూ, బుద్ధిజం మొదలు స్టాయిసిజం వరకూ, గ్రీకు నుంచీ జపనీస్ దాకా విభిన్న తాత్వికాంశాల విశ్లేషణ ఇందులో మనకి కనిపిస్తుంది. ముఖ్యంగా, చాలాకాలం క్రితం ఎన్నడో తాత్విక చర్చ పట్ల వ్యక్తిగతంగా నాలో సాగిన నిరంతర అంతర్మథనం, ఆ అన్వేషణలోసత్యాన్వేషణ మండలి మొదలు తక్షణం వరకూ మిత్రులతో జరిగిన సంవాదాలు, అప్పట్లో ప్రచురించిన ఆవేశ ప్రచురణలు ఎందుకనో జ్ఞాపకం వచ్చాయ్. తెలుగులో ఒక ఆరోగ్యకర తాత్విక వీక్షణానికి ఎంతోకొంత దోహద పడుతుందనే ఆశే తప్పా వ్యక్తిగతంగా సంపాదకులతో నాకు పరిచయం లేదు !

తాత్వికత అనగానే అదేదో కొత్త మతం అనో లేదా సాధారణ ప్రజలకి సంబంధించినది

కాదనో అనుకునే వైఖరి ఈసరికే ఉంది. కానీ, అది నిజం కాదు. కాకపోగా తాత్వికత సమస్త మానవాళి మూలాలకి చెందిన అంశం. తాత్వికత సకల జీవులను గురించి మనిషి జరిపే సత్యాన్వేషణ లకి తోడ్పడే సారం. తాత్వికత సగటు మనిషి ఉనికికి ఆధారం. ఆధునిక తాత్విక చింతనను అడ్డుకున్న రెండు ధోరణులు 1.ఆర్ధికత 2. ఆధ్యాత్మికత. మొదటిది మనిషిని యాంత్రికంగా మారిస్తే, రెండోది మేధో పరాయీకరణకి గురి చేసింది. దీనివలన ప్రస్తుతం ఇక్కడ మొత్తంగా సాంస్కృతిక స్తబ్ధత రాజ్యమేలుతోంది !

దానిని బద్దలుకొట్టే బాధ్యను నెత్తికెత్తుకున్న సమూహాలు అక్కడక్కడా వారి పరిమితుల్లో పనిచేస్తున్నాయ్. నిరాశతో నిండిన నిర్లిప్త వాతావరణంలో ఆశను నిర్మించే ఆచరణా త్మక విలువలే తాత్విక వైరాగ్యాన్ని తరిమేసే కొత్త శక్తుల్ని ఉద్దీపింపజేస్తాయ్. అలాంటి ఒక చిన్న బృందం మొదట్లో 'తాత్విక అధ్యయన వేదిక" గా ఏర్పడి ఇదిగో ఇలా అంతర్జాల త్రైమాసిక పత్రికగా వెలువడుతోంది. తెలుగు సమాజంలో వివిధ తాత్విక ధోరణుల మూలాల్లోని సంవాదాలకి కళల్ని, కవిత్వాన్నీ కూడా కలుపు కుంటూ సరికొత్తగా తెరతీసే సదుద్దేశంతో ప్రారంభమైన ఈ "తాత్విక" అందుకనుగుణంగా కొనసాగాలని కోరు కుంటూ, తాత్విక టీమ్ కి అభినందన లతో ఈ చిన్న రైటప్ !

# ఏటికెదురీదడమే నేటి మహిళ లక్ష్యం!




1991 అంటే సరిగ్గా 30 ఏళ్ళ క్రితం "ఏటికి ఎదురీదటం మార్క్సిస్ట్-లెనినిస్ట్ సూత్రం" టేగ్ లైన్ తో ఉ.సాంబశివరావు, కె.జి.సత్యమూర్తి, పి.రవిమారుత్, ఎ.శరత్ సంపాదకులుగా ప్రచురించిన "ఎదురీత" రాజకీయ మాసపత్రిక ఇది!

'మార్చి 8 మహిళా ఉద్యమ కర్తవ్యాలు' శీర్షికతో సంపాదకీయం, అలాగే ఇదే సంచికలో 1990 డిసెంబరు28 నుండి 31 వరకూ కేరళలోని కాలికట్ లో జరిగిన 4వ 'జాతీయ మహిళా సదస్సు' కి సంబంధించిన రిపోర్టు, "దళిత స్త్రీ దృష్టిలో మహిళా కాన్ఫరెన్స్" విమర్శలు కూడా వచ్చాయి. సంపాదకీయం ఫొటో రిలవెన్స్ అనిపించి పెడుతున్నాను!

ఆసక్తికర విషయం ఏంటంటే, సావిత్రీబాయి ఫూలే, జ్యోతిబా ఫూలే కి 1856, అక్టోబర్ 10న రాసిన ఒక చారిత్రక లేఖ, "నా స్వామి దగుల్బాజీ బ్రాహ్మలతో తలపడుతున్నాడు" పేరిట

సింధూ అనువాదంగా ఇందులో ప్రచురించారు. దళితులకి చదువు చెబుతున్నందుకు వారు ఎదుర్కొన్న కష్టాలు ఎలాంటివో ఇది చదివితే తెలుస్తుంది. మార్చి 10 సావిత్రి బాయ్ ఫూలే వర్ధంతి కాన ఆ లేఖ కూడా పెడుతున్నాను!

అలాగే 1992 మార్చి 8 సంచికలో కొన్ని నినాదాల్ని బాక్స్ ఐటెంగా ప్రచురించారు. ఈనాటికీ వాటి అవసరం ఉంది కాన వాటినిక్కడ రాస్తూ, ఆ పత్రిక కవర్ పేజీ, చివరి పేజీ ఫొటోల్నిలా పెడుతున్నాను!

"1. మగ పెత్తనానికి వ్యతిరేకంగా పోరాడదాం!

2. రాజ్యహింసను, కుటుంబ హింసనూ ప్రతిఘటిద్దాం!

3. పితృస్వామిక అణిచివేతకు, విలువలకూ వ్యతిరేకంగా పోరాడదాం!

4. అసమాన శ్రమ విభజన రద్దు కోసం పోరాడదాం! స్త్రీల కుటుంబ శ్రమకు, సామాజిక శ్రమకు తగిన గుర్తింపును డిమాండ్ చేద్దాం!!

5. హిందూ ఫాసిజాన్ని ప్రతిఘటిద్దాం!

6. నయావలస దోపిడీని అంతం చేసేందుకు మరో స్వాతంత్ర్య పోరాటాన్ని ప్రారంభిద్దాం!

7. అగ్రకుల కౌటిల్య పితృస్వామిక దోపిడీ రాజ్యాన్ని కూల్చివేసేందుకు బలమైన స్త్రీ విముక్తి ఉద్యమాన్ని నిర్మిద్దాం!

8. బాలికల పట్ల వివక్షతను అంతం చేద్దాం! పిల్లలందరినీ సమానంగా చూద్దాం!!

9. పిల్లలు మాత్రమే 'ప్రత్యేక వర్గం'(privileged class) గా ఉండే వర్గరహిత సమాజాన్ని నిర్మించేందుకు పోరాడదాం!

10. సంకెళ్ళను బద్దలు కొడదాం! స్త్రీల ఆగ్రహాన్ని బ్రహ్మాండమైన విప్లవ శక్తిగా ప్రజ్వలింప చేద్దాం!"

( ముప్పై ఏళ్ళనాటి పాత పత్రికలు జాగ్రత్తగా దాచి ఉంచిన మానవ హక్కుల వేదిక మిత్రులు ఆకుమర్తి రవి (అమలాపురం) కి కృతజ్ఞతలతో , ఏటికెదురీదే తరాలు తయారు కావాలనే సంకల్పంతో నాటి "ఎదురీత" స్ఫూర్తినిలా స్మరిస్తూ...)

# ఇంగ్లీష్ పుస్తకాలు
# సమస్త మానవాళి మనుగడ కోసం...
# స్మాల్ ఈజ్ బ్యూటిఫుల్ (small Is Beautiful)




**ఈ.** ఎఫ్.షుమేకర్ ఆర్థిక నిపుణుడు. 1911లో జర్మనీలో పుట్టినాయన ఆక్స్‌ఫర్డ్ లో చదివాడు, కొలంబియా యూనివర్సిటీలో అధ్యాపకునిగా పనిచేశాడు. ఇంగ్లాండ్ నుండి ఇండియా వరకూ అభివృద్ధి చెందుతున్న దేశాల ఆర్దిక రంగాల్ని లోతుగా అధ్యయనం చేశాడు. బౌద్ధ దార్శనికత, గాంధీ సిద్ధాంతాల పట్లా ఆకర్షితుడయ్యాడు.

1973 లో ఆయన రాసిన Small Is Beautiful విడుదలైంది. అప్పటిదాకా అలవాటైన పద్దతులకి భిన్నంగా ప్రజలే కేంద్రంగా ఆర్థిక వ్యవస్థని షుమేకర్ విశ్లేషించిన తీరు అద్భుతం. టైమ్ పత్రిక ఈ గ్రంథాన్ని An eco bible అంటూ ప్రసంశించింది.

అభివృద్ధి పేరిట వినాశనాన్ని కొని తెచ్చుకుంటున్న ఆధునిక మానవుడి జీవన శైలిని చాచి లెంపకాయ కొట్టి మరీ ప్రశ్నిస్తుంది ఈ పుస్తకం. ప్రపంచవ్యాప్తంగా ఎన్నో పర్యావరణ ఉ ద్యమాలకు ఊతం అందించిన గ్రంథం ఇది.

ఈ రోజు విధ్వంసక అభివృద్ధి మీద చర్చను అనేక సిద్ధాంత స్రవంతుల  వారు చేస్తుండవచ్చు కానీ సమస్త మానవాళి పక్షాన నిల్చి తిరుగులేని స్పష్టతలో మనిషి పట్ల ప్రేమ, ప్రకృతి పై అభిమానంతో ఇంత విస్పష్టమైన విశ్లేషణని అందించిన పుస్తకాలు అరుదు.కొన్నేళ్ల క్రితం అమెరికా నుండి సోషలిస్టు మిత్రులు సోమయ్యగారు తెప్పించి కానుకగా ఇచ్చిన ఈ పుస్తకం పై ఎంతో ఇష్టంగా ప్రచురించాలనుకుని తయారుచేసి రాసి పెట్టుకున్న నోట్స్  పోయింది. ఆనాటి నుండి ఎంతో మందికి రిఫర్ చేసాను.తెలుగులో దీని అనువాదం వచ్చిందో లేదో తెలీదు. కానీ కొద్దో గొప్పో ఆంగ్లం చదవడం వచ్చిన ప్రతీ ఒక్కరూ కష్టపడి ప్రయత్నం చేసైనా చదవదగ్గ మంచి పుస్తకం small is beautiful అని నా అభిప్రాయం.

ఆయన అభిప్రాయాలు అన్నింటితో ఏకీభవించకపోవచ్చు కానీ ఇప్పటిదాకా ఉన్న మన ప్రాపంచిక దృష్టి కోణాన్ని మార్చడానికి ఈ పుస్తకం కచ్చితంగా ఉపయోగపడుతుం

దనడంలోనూ ప్రస్తుత పరిస్థితులలో ఈ గ్రంథం ప్రాసంగికత మరింత పెరిగింద నడంలోనూ నాకు ఏ విధమైన సందేహం లేదు. తప్పక చదవాల్సిన, చదివించాల్సిన, చర్చించాల్సిన ఈ పుస్తకం గురించి చాలా రోజులుగా అనుకుంటున్న ఈ చిన్న రైటప్.ఆసక్తి ఉన్న మిత్రులకోసం సాఫ్ట్ కాపీ పెడుతున్నాను.

# "'మా అక్కకి నేను పెట్టిన పేరు - 'నిశ్శబ్ధం'"

(I named my sister Silence)




Modern industrial enterprises are a type of carnage. Industrial cartels subject others to death for profits, and these destructive endeavors are persevering. Governments contribute to this carnage. And this carnage is invisible despite having longstanding effects

'జల్ ధూత్' అనే ఓడ కెప్టేన్ అలోక్ దత్ డైరీలో రాసుకున్న వాక్యాలివి. జాత్యహంకార హింస,కుల, మతోన్మాద హింస, ఆర్థిక హింసల్ని పచ్చిగా వర్ణించిన అక్షరసమాహారం మానవ సంహారాన్ని కళ్ళకి కట్టిన తీరు తెలుసు కోవాలంటే చత్తీస్‌గఢ్ బస్తర్ లోని మారుమూల గ్రామం 'బాసామూరా' తో మొదలెట్టి, గుజరాత్ లోని భావనగర్ దగ్గరున్న 'ఎలాంగ్' అతిపెద్ద నౌక విధ్వంసక కేంద్రం వరకూ మనమూ పయనించాలి !

పిల్లాడికి ఏనుగంటే ఇష్టం. పదేళ్ళప్పుడు ఊర్లోకి వచ్చిన ఏనుగునీ, మావటివాడ్నీ వెంబడిస్తూ అడివిలోకి వెళ్ళాడు. వేటకుక్కల గుంపు చేసిన ఆటవిక హింసకు ఆ రాత్రి ఒక సాక్ష్యం. అలాగే అక్కంటే చాలా ఇష్టం. అక్క ఎంచుకున్న మార్గంలో ఆమెని వెతుక్కుంటూ అడివి లోకి వెళ్ళాడు. సమూహాలు జరిపిన హింసకు అతనే ఒక సాక్ష్యం !

ఇంతకీ వాళ్ళ అక్క ఏమైంది ? అడివిలోకి సాగిన ఆ ఆదివాసీ యువకుడి అన్వేషణ ఎలా ముగిసింది ? ఇంతకీ, ఆమెకి 'నిశ్శబ్ధం' అని ఎందుకు పేరు పెట్టాడు ?సాక్ష్యం లేని గతానికి చరిత్ర పేరుపెట్టి మురిసి పోయే మనిషి, గతచరిత్రకి తాను చేసిన గాయాలకి సాక్ష్యం లేకుండా చేయడమే చరిత్ర రచన అనుకుంటాడు !

నేలని నెత్తురుతో నింపినమనిషి, శాంతికోసం సముద్రాన్ని ఆశ్రయిస్తాడు. ప్రశాంతత కోసం ప్రతీక్షణం అన్వేషిస్తాడు. దక్కని సంతృప్తి కోసం తనని తాను దహించుకుంటాడు మనిషి చరిత్ర అంతా హింస తోనే నిండి ఉంది. మానవాళి గతమంతా మారణహోమం తోనే ముడిపడి ఉంది. మన అస్థిత్వం అంతా అంతరాత్మని చంపుకోడంలోనే ఉంది !

ఎందుకంటారా ? జననాన్ని జయించడానికి మనిషి పడే తపన జీవితాన్ని ప్రసాదిస్తుంది.అప్పుడది 'ఇర్మా కాకూ' అని ఎంతోమంది ప్రేమగా పిల్చుకునే తన అక్క దాచి అందించిన పండిన నేరేడు పండులా ఉంటుంది. మరణించిన అమరుల విగ్రహాల్లో తన

విగ్రహాన్ని చూసుకున్న యువకుడి అన్వేషణ పూర్తయ్యా, మరణాన్ని అధిగమించిన మనిషి అంతరాత్మలో నుంచి వచ్చే మాటల గాఢత మానవాళికి భవిష్యత్తు పై ఆశను ఎలా కల్పిస్తుందో కనిపిస్తుంది. అదెలా అంటారా ?

»»%I put One jamun into my mouth, and when I was done sucking its pulp and the seed remained, a thought crossed my mind. In the midst of all that violence and destruction, love had managed to survive.

(మనోజ్ రూప్డా 'కాలే అధ్యాయ్' 2015లో వచ్చిన నవల.సౌవేంద్ర సర్కార్ I named my sister Silence పేరిట ఇంగ్లీష్‌లో onlineలో కొనుగోలుకి అందుబాటులో ఉంది. పుస్తకం చిన్నదే అయినా, నాగరికత నిర్మాణంలో పునాది గా ఉన్న సమాధులు ఎందరు అభాగ్యులవి? అని ఘాటుగానే ప్రశ్నిస్తుంది. ఆ అక్షరాలు ఆక్రోశింపజేస్తాయ్. ఆందోళనకు గురిచేస్తాయ్. అవకాశం ఉన్న వాళ్ళు తప్పక చదవాలి. దీనిని చర్చించడం అవసరంగా గుర్తించాలి !)

# ఇంట్లో దొరికిన 'టామ్ మామ ఇల్లు'!




కొన్ని జ్ఞాపకాలు నిరంతరం వెంటాడతాయ్. ఎడతెగని ఆలోచనలతో గడిపిన అసంఖ్యాక ఒంటరి రాత్రుల్ని గట్టిగా తట్టి లేపుతాయ్. నవ్విస్తాయ్. ఏడిపిస్తాయ్. ఓదారుస్తాయ్. కడుపు చేత్తో పట్టుకొని కాళ్ళకి రెక్కలు కట్టుకుని కొత్త వెలుగుల కోసం దారంతా వెతుక్కుంటూ సాగిపోయిన కొన్ని రోజుల్ని గుర్తు చేస్తాయ్!

2007 వ సంవత్సరం. చెన్నై లోని పాడి దగ్గర రిలయన్స్ కాల్ సెంటర్ లో పని చేస్తున్న రోజులు. రెండు నెలలకి మించి లేను. అప్పుడు స్పెన్సర్ లో హారియట్ బీచర్ స్టోవ్ పుస్తకం, అంకుల్ టామ్స్ కాబిన్ కొనుక్కు న్నాను. ఆ మరుసటి ఏడాది రాజస్థాన్ లోని జోధ్పూర్లో దానిని పూర్తి చేసినట్లు రాసుకున్న జ్ఞాపకం!

ఇప్పుడంటే మామూలుగా అనిపిస్తోంది కానీ వంద రూపాయలు పుస్తకానికి కేటాయిం చడం, సమయాన్ని కేటాయించలేక ఐదొందల పేజీల ఆ గ్రంథాన్ని దఫదఫాలుగా చదువుతూ ఏడాదికి వేరే చోట పూర్తి చేసి తృప్తిగా ఊపిరి పీల్చుకోవడం ఎప్పుడు తల్చుకున్నా నాకు అబ్బురంగా అనిపిస్తాయ్!

మనుషుల్లోని అమానుషత్వాన్నీ, సంఘంలోని అసాంఘికత్వాన్నీ మానవ స్వభావాల్లోని క్రూరత్వాన్ని దగ్గరగా పరిచయం చేసిన రోజులవి. బానిసత్వానికి వ్యతిరేకంగా వచ్చిన ఆ చారిత్రక గ్రంథం చూపిన ప్రభావం చిన్నది కాదు. ఆలోచనల్నీ, ఆచరణని నిర్దేశించు కోడానికి ఊతమిచ్చినవి ఇటువంటి అక్షరాలే. అందుకే వాటికి సదా వినమ్రుడ్ని!

ఎప్పటి నుంచో కనబడకపోయే సరికి పోయిందని అనుకున్నాను. కానీ, పంచేస్తున్న పాత పుస్తకాల్లో నిన్న దొరికింది. దాదాపు 15 ఏళ్ళ నాటి జ్ఞాపకం. అంటరాని వసంతం లో కళ్యాణరావు గారన్నట్లు,"జ్ఞాపకం గతం కాదు!"ఆ నా జ్ఞాపకాన్నిలా మీతో పంచుకుంటూ...

వంద సంవత్సరాల క్రితం మహత్తర రష్యా విప్లవం మొత్తం మానవాళి మీదా, ముఖ్యంగా భారతదేశం మీదా కూడా కలిగించిన ప్రభావం చిన్నది కాదు. పీడిత ప్రజల ఆశాదీపంగా తిరుగులేని తాత్వికతతో ముందుకు వచ్చిన ఆ మహా మార్పును ప్రపంచం అంతా కళ్ళింతలు చేసుకుని చూసింది !

భారతదేశంలో కూడా జరిగిన చర్చోపచర్చలు చిన్నవేం కావు. అటు బుద్ధి జీవులు మొదలు కొని, ప్రజా ఉద్యమ కార్యకర్తల వరకూ, వివిధ శ్రేణుల రాజకీయ నాయకుల నుండి సామాన్య ప్రజానీకం వరకూ ఎంతో కొంత ఉత్సాహంతో రష్యా పరిణామాల పట్ల ఆసక్తి కనబర్చిన వారు ఉన్నారు!

ఈ క్రమంలో అనేక వాదాలు, వాదనలు, వివాదాలు, విధానపరమైన చర్చలు కూడా ముందుకు వచ్చాయి. మార్క్సిస్టు భావజాల పట్ల కాసింత శ్రద్ధ కలిగిన బుద్ధి జీవులు ఇతరేతర ప్రజాతంత్ర వాదులు నాటి నుంచి నేటి వరకు విప్లవాన్ని, విప్లవానంతర పరిణామాల్ని ఇంకా విశ్లేషిస్తూనే ఉన్నారు. విజయాప జయాలకు అతీతంగా విశిష్టత కలిగిన అంశం రష్యన్ విప్లవం !

అలాంటి మార్పు పై జరిగిన సాధికారిక కృషిని ఒక్కదరికి చేర్చేందుకు చేసిన ప్రయత్నమే ఈ The Russian Revolution And India అనే నూటెనభై పుటల చిన్న ఆంగ్ల పుస్తకం.ఇల్సాయి మెనియన్, వి. రాజేష్ ల సంపాదకత్వంలో Rutledge & Aakar సంయుక్తంగా ప్రచురించిన ఈ సంకలనం భారతీయ సమాజం పై రష్యన్ విప్లవ ప్రభావం గురించిన వివిధ పాశ్వాల్ని తడుముతుంది !

అనేక విలువైన వ్యాసాలతో కూడిన ఈ గ్రంథం సంపాదకుల్లో ఒకరైన రాజేష్ చండీగఢ్ యునివర్సిటీ ప్రొఫెసర్ గా ఉన్నారు. మిత్రుడు భారతి ద్వారా పరిచయం. తొలినాటి భారత కమ్యూనిస్టు ఉద్యమానికి సంబంధించి అధ్యయనం చేస్తున్నారు. ఆయన్ని గత ఏడాది కలిసినప్పుడు ఈ సాఫ్ట్ కాపీ పంపారు!

నేనైతే ఇతరేతర పనుల ఒత్తిడి కారణంగా ఇంకా పూర్తిగా చదవలేదు కానీ భారతీయ వామపక్ష ఉద్యమ చరిత్రకు సంబంధించిన తులనాత్మకమయిన వివరణాత్మక పరి శోధన, అధ్యయనం చేస్తున్న వారు తెలుగు సమాజంలో కూడా ఉన్నారు. ఇదే అంశం పై ' భారతదేశంలో వందేళ్ళ కమ్యూనిజం : విధానాలు – వైఖరులు' అనే వ్యాస సంకలనం గతంలో చార్వాకాశ్రమ ప్రచురణ గా మేం తీసుకొచ్చాం !

కాబట్టి, కాలక్షేపం కోసం కాకుండా సీరియస్ ఆలోచ నాపరులు, ఔత్సాహికులు నా వాట్సప్ నంబర్ 9032094492 కి రిక్వెస్ట్ పెడితే మాత్రమే ఈ పుస్తకం సాఫ్ట్కాపీ పంపగలను. దయ చేసి మీ నంబర్లు మెసేజ్ చేసి పుస్తకం పంపమని అడగ కండి. అలా

ఒక్కొక్కరికీ పంపడం ఇబ్బంది అవుతోంది. అర్థం చేసుకోవడానికి ప్రయత్నించండి!

(గతేడాది నుండి పెండింగ్ లో పెట్టి సమీక్ష చేద్దామనుకున్న పుస్తకం ఇది. అదెలాగూ ఆలస్యం జరిగింది కాన భారతీయ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర కి సంబం ధించిన సాధికార యత్నంగా దీనిని గురించి ఇప్పటికిలా ఈ చిన్న రైటప్.)

# ఒక సత్యాన్వేషి నిత్య సంఘర్షణ

## "నివేదన"




గోవాలోని ఒక వెనబడిన ప్రాంతంలో సాంప్రదాయిక కుటుంబంలో జన్మించి జ్ఞానం కోసం బిక్షాటన చేస్తూ వివిధ ప్రాంతాలు పర్యటించి, లెక్కలేనన్ని ఒడిదుడుకులు తట్టుకు నిల్చి, ప్రపంచంలోనే అత్యుత్తమ బౌద్ధ తాత్వికుడిగా ఎదిగిన ధర్మానంద కౌశాంబి స్వీయచరిత్ర "నివేదన".

మడ్ గావ్లో పుట్టిన ఒక మామూలు వ్యక్తి సంస్కృతం నేర్చుకోవడం కోసం పూనా, కాశీలు వెళ్ళడం మొదలు బౌద్ధం అధ్యయనం కోసం పాళీ భాష పై పట్టు కోసం, బౌద్ధ ప్రచారం కోసం సిక్కిం, నేపాల్, శ్రీలంక, బర్మా, అమెరికా,ఫ్రాన్స్, జపాన్...విస్తృతంగా తిరిగిన క్రమం చదివి తీరాలి.

There is nothing as dreadful as ignorance in this world అని ఈ ప్రపంచంలో అజ్ఞానంకంటే భయంకరమైందిఏదీ లేదంటూ, ఉద్ఘాటించినాయన, నిజమైన జ్ఞానార్జన మరణంతోనే ముగుస్తుంది(The limit for acquiring knowledge is death; do not stop until you die..) (Page- 41, 42) అంటారు.

గడ్డకట్టే చలిలో నెత్తురోడే పాదాలతో బౌద్ధం పట్ల ఆసక్తితో హిమశిఖరాల మధ్య ప్రయాణించి నేపాల్ చేరితే అక్కడ బౌద్ధం పరిస్థితి చూసి కలతచెందింది మొదలు దక్షిణ భారతదేశ మొదటి కమ్యూనిస్టు పార్టీ నాయకుడు సింగరవేలు చెట్టియార్ తో ఎదురైన పరాభవం వరకూ ఎన్నో అనుభవాలనిందులో చదవచ్చు.

బొంబాయి నుండి బరోడా దాకా, బెంగాల్ నుండి చెన్నై వరకూ ఉత్తర, మధ్య భారతం మొత్తం అతి సాధారణంగా ప్రయాణిస్తూ ప్రజలతో మమేకమై సమాజాన్ని లోతుగా అధ్యయనం చేసినవి ఈ అక్షరాలు. అందుకే, I felt extremely dejected by the pitiable ignorance of people in the country in which Buddhism grew (page - 132) అంటారు.

ఒకనాడు జ్ఞాన ప్రవాహంగా ఉండిన సాధు సన్యాసులు, భిక్షువులు దొంగ సన్నాసులుగా మారి దేశాన్నెలా నాశనం చేసారో చెప్తూ, "%In the age before printing, sanyasis were the walking talking-books of our country. Free

of the preoccupations of a family, they travelled everywhere, and acquired and disseminated knowledge. What brilliance Bharat-bhumi had attained at the time is testified to by Chinese travellers like Hiuen Tsang and Fa-hien in their travelogues. But these same sanyasis are impending our progress today! And it would not be inaccurate to say that to an extent it is they who are responsible for our distressing condition.అంటారు.

(Page 140)

మహా బౌద్ధ చింతకులుగా పరిగణించే రాహుల్ సాంకృత్యాయన్, ఆనంద కౌసల్యాయన్, భిక్షు ధమ్మరక్షిత, జగదీస్ కశ్యప్ బోధానంద మహాథేరా వంటి ఎందరికో ధర్మానంద కొశాంబి మార్గదర్శి.డిగ్రీలకు అతీతంగా హార్వార్డ్, లెనిన్ గ్రాడ్ విశ్వవిద్యాలయాల్లో బౌద్ధం గురించి పరిశోధన చేసి ఎన్నో విలువైన అంశాలను వెలికితీసిన మహా శోధకుడు.అనేకానేక ప్రాంతాలలో బౌద్ధ ధమ్మ వ్యాప్తి కై అహర్నిశలు శ్రమించిన నిజమైన శ్రమణుడు.

ధర్మానంద కొశాంబి "బుద్ధ - ధమ్మ - సంఘ", " భగవాన్ బుద్ధ" మొదలైన గ్రంథాల తెలుగు అనువాదం ధర్మ దీపం ఫౌండేషన్ ఈసరికే ప్రచురించింది. ఒక్క తెలుగులోనే కాదు, అనేక దేశ విదేశీ భాషల్లోకి కొశాంబి అనేక రచనలు అనువాదమయ్యాయి.దేశ విదేశాల్లో ఎంతోమంది జిజ్ఞాసువులకి మార్గ దర్శకాలుగా ఉపయోగపడ్డాయి.

భండార్కర్, సత్యేంద్రనాథ్ ఠాగోర్,పోకల లక్ష్మీనరసు , గాయక్వాడ్ మహారాజా, ఖపార్డే,సుమంగళాచార్య, ధర్మపాల్.... ఇలా ఇందులో ఎందరో మేధావులు ఎదురౌతారు. మరాఠీ, గుజరాతీల్లో 20 కి పైబడి రచనలు చేసిన ధర్మానంద "భగవాన్ బుద్ధ" పుస్తకం ఆనంద కౌశల్యాయన్ సింహాలంలోకి అనువాదం చేసి శ్రీలంకలో ప్రచురించారు. డా.అంబేద్కర్ పై ఈ పుస్తకం ప్రభావం ఉందనేది సుఖాంతాంకర్ అభిప్రాయం.ప్రముఖ మార్క్సిస్టు గా (తెలుగులో బాలగోపాల్ చేసిన పరిచయం మొదలు కొన్ని గ్రంథాలు ఉన్నాయి)మనకి తెలిసిన డి.డి.కొశాంబి ఈయన కుమారుడే.

గోవా నుండి ప్రచురించబడే "భారత్" అనే మరాఠీ/పోర్చుగీస్ పత్రికలో ధారావాహికగా వచ్చిన ఈ ఆత్మకథ 1924లో మొదటిసారి గ్రంథంగా వచ్చింది. 2011 లో మీరా కొశాంబి (కొశాంబి మనమరాలు) ఇంగ్లీష్ అనువాదం చేయగా

190 పేజీల ఈ చిన్ని పుస్తకాన్ని permanent black ప్రచురించింది.మళ్ళీ 2018 లో పునర్ముద్రణ జరిగింది.

బౌద్ధ నైతికత, గాంధేయ తాత్వికత, సోషలిస్టు ఆదర్శాల్ని పుణికిపుచ్చుకుని బ్రిటీష్ పాలిత భారతదేశంలో యాత్రికుడిగా, పాళీ నేర్చుకోవడం కోసం విద్యార్థిగా శ్రీలంకకి, బిక్షువుగా బర్మాలోని కొండ గుహలో, సన్యాసిగా అనేకచోట్ల పర్యటించి ఎనలేని అనుభవ సారాన్ని అక్షరాల్లో నిక్షిప్తం చేసి, భారతదేశంలో బౌద్ధాభివృద్ధే జీవిత లక్ష్యం గా సాగిన విశ్వజనీన కృషి ఆయనది.

బౌద్ధ యోచనాశీలిగా లండన్ లో ఉన్నప్పుడే ఒక డచ్ మిత్రుని ద్వారా కార్ల్ మార్క్స్ గురించి తెలుసుకున్న కొశాంబి, బౌద్ధ మేధావిగా, సోషలిస్టుగా, గాంధేయవాదిగా, మానవతావాదిగా సంపూర్ణంగా జీవించానని తలచి జైనంలోని "సాల్లేఖన" అనే విధానానుసారం నెలరోజులు స్వీయ ఉపవాసం చేసి వార్ధాలోని గాంధీజీ ఆశ్రమంలో మరణించారు. "ధర్మానంద అస్తిత్వంతో ఆశ్రమం 'పావనం' ఐందని, కొశాంబీ మౌనంగా పనిచేసుకుపోడాన్నే ఇష్టపడేవారనీ..." గాంధీజీ అన్నారు.

బౌద్ధంతో సంబంధం ఉన్న దాదాపు ప్రతి ప్రాంతంలో తన కాలుమోపి అక్కడి స్థితిగతుల్ని వంద సంవత్సరాల క్రితమే నమోదు చేసిన ఈ గ్రంథం అవకాశమున్న ప్రతి ఒక్కరూ చదవాలి. పాతిక పేజీల ముందుమాట తో 18 అధ్యాయాలుగా 192 పేజీలున్న ఈ పుస్తకం ఖరీదు 395 రూపాయలు. Amazon లో అందు బాటులో ఉంది. సాఫ్ట్ కాపీ నాకైతే నెట్ లో దొరకలేదు ఎవరైనా ప్రయత్నించి పెడితే సంతోషం.

( నిజానికి ఈ గ్రంథాన్ని అనువాదం చేయాలనిపించింది.కానీ ఇప్పుడున్న పరిస్థితులకు జంకి ఈ పరిచయానికే పరిమితమౌతున్నాను. అక్టోబర్ 9 ధర్మానంద కొశాంబి జయంతి సందర్భంగా చాలా రోజులనుండి అనుకుంటున్న ఈ చిన్ని రైటప్.)

# కబీర్ నిలబడ్డాడు కర్ర పట్టుకొని బజార్లో !

కబీర్ నిలబడ్డాడుబీ
కర్ర పట్టుకొని బజార్లో !
ఇళ్ళు తగలెట్టుకునే
వాళ్ళంతా తరలిరండి!!

**Kabira Khada Bazaar Mein**
A Call for Local Action in the Wake of Global Emergency
T. Vijayendra
Ecologise Hyderabad

పర్యావరణానికి సంబంధించిన ఒక ఆచరణాత్మక చర్చకి చక్కని కరదీపిక టి. విజయేంద్ర , ఉషారావ్ రాసిన వ్యాసాల పొత్తం,Kabira Khada Bazaar Mein (కబీరు బజార్లో నిల్చున్నాడు); A call for Local Action in the Wake of GlobalEmergency Ecologise Hyderabad 2019 లో ప్రచురించిన ఈ పుస్తకం సామాజిక కార్యకర్తలు విశాలమైన ప్రాపంచిక దృక్పథంతో స్థానిక కార్యాచరణని ఎలా నిర్మాణాత్మకంగా ఏర్పరచుకోవాలో, ఏ దిశగా నిర్దేశించు కోవాలో చెబుతుంది !

Rebuilding community and restoring ecology on the basis ofequity and sustainability అంటూ ఒక మహత్తరమైన లక్ష్యాన్ని రూపొందించడం ఎంత సులువో, దానిని సాధించడానికి ప్రయత్నించడం అంత కష్టం !

ప్రకృతి విషయంలో మనిషి చేసిన నేరాలు సామాన్యమైనవి కావంటూ, వాటిని తన మనుగడ కోసం చక్క దిద్దుకునే అవకాశం కూడా ఎంత తక్కువగా ఉందో వివరిస్తూ మొత్తం ఒక సమాజ నిర్మాణ ప్రణాళికని మన ముందు పెడతారు విజయేంద్ర !

ఐతే, సమస్య ఎంత తీవ్రమైందో చెబుతూనే అందులో మన ప్రమేయం ఎంత ఉందో కూడా, We Are Part Of The Problem: Ecological Degradation and Us వ్యాసంలో చక్కగా చెప్పారు ఉషారావ్ !

ఇక "వెనక్కి లాగడమనే" వ్యవస్థ స్వరూపం Pichhoun Taan (pull from behind%) (బెంగాళీ) అనే చివరి వ్యాసంలో వివరిస్తూ సామాజిక కార్యకర్తలకి సాధారణంగా ఎదురయ్యే ఇబ్బందుల్ని వివరించారు !

30 పేజీల ఈ చిన్ని పుస్తకం 20 రూపాయలు మాత్రమే. హార్డ్ కాపీల కోసం కావాలంటే, హైదరాబాదులో "మంచి పుస్తకం" వార్ని సంప్రదించొచ్చు. సాఫ్ట్ కాపీ ఐతే, నెట్లో కూడా ఉంది !

కావాల్సిన మిత్రులు,నా ఫ్రెండ్ లిస్టులో ఈసరికే ఉన్నవారు, అలాగే పుస్తకం కావాల్సిన వాట్సప్ నంబర్లు ఉన్న మిత్రులంతా కూడా వాళ్ళు నా వాట్సప్ నంబర్ 9032094492 లేదా మెయిల్ gouravmeka@gmail.com కి రిక్వెస్ట్ పెడితే నేను కూడా సాఫ్ట్ కాపీ పంపగలను. FBలో మీ నంబర్లు, రిక్వెస్టు పెట్టి ఇబ్బంది పెట్టకండి !

**(పర్యావరణ దినోత్సవం సందర్భంగా...)**

# పిరికిపందల దేశంలో పిసరంత ధైర్యం

We are a Nation of Cowards !




ఎమర్జెన్సీ కాలంలో సెంట్రల్ పాయింట్, హైదరాబాద్ ప్రచురించిన సుబ్రహ్మణ్యం ఆంగ్ల కవితా సంపుటి "వి ఆర్ ఎ నేషన్ ఆఫ్ కోవర్డ్స్" 18 కవితలుకల ఈ సంపుటి నాటి యువతలోని చైతన్యపూరిత ఒరవడికి ఒక ప్రతీక. విచిత్రమైన గెటప్తో శీర్షిక తో కవి ఫొటోతో పాటు no regrets పేరుతో రాసిన ముందుమాటతో ఒకరకమైన మందపాటి దళసరి కాగితంతో ఆకర్షణీయమైన అక్షరాలతో కట్టిపడేసే శైలి. 1965 నుండి రాసిన ఇందులోని కవితల్లో మూడు కవితలు దిగంబర కవిత్వం లో భాగంగా తెలుగులోకి వచ్చాయంటాడు కవి.

walls, walls
within and without
man cries
for life humane

అనే may be కవితలోని పదాలు జ్ఞాపకముండిపోయాయ్. beloved, abhorrence, కవితలు కూడా ఇదే కోవలోవి. ప్రసిద్ధి చెందిన చెరబండరాజు కవిత 'నన్నెక్కనివ్వండి బోను' ని let me get into the dock పేరిట అనువదించారు.

Democratic parliament hunger justice అనే కవితలో అసమాన సమాజ చిత్రాన్ని కళ్ళకి కట్టినట్లు చిత్రించిన కవి, మహాప్రస్థాన మహాకవిని Sri Sri గురించి కవిత రాసాడు. నగ్నముని "జైలులో సముద్రం" కవితని the ocean behind the bars' పేరిట అనువదించాడు.

We are a nation of cowards లో జాతి దుమ్ముదులిపిన కవి, that' s why I hate them, vasectomy, tubectomy, dreams, you are not alone%, వంటి కవితలు అన్నింటా స్పష్టంగా తన ఆక్రోశాన్ని వెళ్ళగక్కిన తీరుకి ఒళ్ళు గగుర్పొడుస్తుంది. నగ్నముని మరో కవితని epic of pornography గా రాస్తే , వ్యక్తిగతంగా నాకు నచ్చిన కవిత beasts are still rummaging for blood . ఇందులో..

Newtonian physics
Einsteins relativity
Secrets of atom
Science extending its hand to celestials
but beasts are still rummaging for blood

ఈనాటికీ ఎంత నిజమో కదా అనిపించక మానదు. పుస్తకం చివర్న కవితల వరుస క్రమం ఇవ్వడం, ప్రతీ పేజీ నంబరు రాయడం, మొత్తంగా ఈ కవితాసంపుటిని చదవడమంటే, నాటి యవత ఆవేదనని మన అంతరంగంలోనికి ఆవాహన చేసుకోవడమే !

# మనుషుల్ని ద్వేషించేది మతమే కాదు !




ఖాళీ దొరికితే ఢిల్లీ లో వాలిపోయి గల్లీలన్నీ తూనీగలా తిరుగుతూ చిరుతిళ్ళు తింటూ ఉండేవాడిని. అలా ఓరోజు భాషా భాయ్ తో మహాకవి గాలిబ్ సమాధి చూడటానికి వెళ్ళాను. అప్పుడే Ghalib Academy ప్రచురించిన మరో కవి Iqbal గురించిన గ్రంథం తీసుకున్నాను. మూడొందల పై చిలుకు పుటల సంకలనం, ఎనభై రూపాయలకి ఇచ్చారు. అనేక మంది వ్యాసకర్తలు ఇక్బాల్ గురించి రాసిన లోతైన పరిశోధనాత్మక వ్యాసాలు.

అసులూబ్ అహ్మద్ అన్సారీ సంపాదకత్వంలో 1978లో వెలువడిన ఈ పుస్తకం లో కవిగా, తత్వవేత్త గా, రాజనీతిజ్ఞుడిగా, మానవాళి ప్రేమికుడిగా ఆయన నిర్వహించిన పాత్రలు మొదలుకొని గోథే, డాంటే మొదలగు కవులతో ఇంకా మార్క్సిజంతో ఇక్బాల్ ని పోలుస్తూ రాసిన వ్యాసాలు (అనేక భావాలతో నేను అంగీకరించ లేకపోయినా) ఆసక్తికరంగా ఉన్నాయి.

"సారే జహా సె అచ్ఛా..." అంటూ బాల్యంలోనే స్కూల్లో అర్థం తెలీకుండానే ఆలపించిన అద్భుతమైన గీతం సృష్టికర్త. అంతకుమించి ఆయన గురించి చెప్పుకోవడానికి, గుర్తు చేసుకోడానికి చాలానే ఉంది కానీ ముస్లిం లీగ్ నాయకుడవడం వల్లా, పాకిస్థాన్ జాతీయ కవి అవడం వల్లా మన కాషాయ కళ్ళద్దాల మేధావులకు సహజంగానే అలా తలుచుకోవడం నచ్చదు. "మజహబ్ నహీ సిఖాతా...ఆపస్ మె బైర్ రఖ్ నా" అంటో మతం ప్రేమించడం కోసమే కానీ ద్వేషించడం కోసం కాదనే మహత్తరమైన సందేశాన్నిచ్చిన ఇక్బాల్ ప్రాసంగికతని మత సమైక్యత కోసం కృషి చేసేవాళ్ళు ఈ రోజు గుర్తించాలి.

నిజమే. నిజ జీవితంలో ఆయన పట్ల అనేక విమర్శలున్నాయి. పాకిస్తాన్ ఆలోచనని మొదట తలపెట్టింది కూడా ఇక్బాలేనంటారు. ఇక్బాల్ జయంతి పాకిస్తాన్లో జాతీయ సెలవుదినం. ఐనప్పటికీ మానవాళి పట్ల అకళంక ప్రేమని వ్యక్తం చేసిన వ్యక్తిగా ఇక్బాల్ స్మరణీయుడు. ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ ఆశయాలతో జనించిన ఖుదాయి కిద్మత్ గార్ (దైవ సేవకుల సైన్యం) ఈ నాటి సమాజంలో ఎంత ముఖ్యమో గుర్తించి ఆ ఆశయాలని పునస్థాపించడానికి మతోన్మాదానికి వ్యతిరేకంగా మత సమైక్యత కోసం కృషి చేస్తున్న ఆ సంఘం జాతీయ కన్వీనర్, మిత్రుడు ఫైసల్ ఖాన్ ను ఒక మధుర లోని హిందూ దేవాలయంలో నమాజ్

చేసినందుకు గాను యు.పి. పోలీసులు అరెస్టు చేశారు.

గుడిలో సమావేశం ముగిసిన అనంతరం నమాజు సమయం కావడంతో బయటకు వెళు తున్న అతడితో "నువ్వున్నది కూడా దేవాలయమే కదా...ఇక్కడే మీ ప్రార్థన ముగించండి" అంటూ అక్కడి హిందూ మిత్రులు అనడంతో గుళ్ళో ఒక మూల నమాజ్ ముగించాడు. ఆ తర్వాత ఓ పూజారి ఫైసల్ పై "మనోభావాలు గాయపర్చడం", " మత విశ్వాసాలను కించపర్చడం", "వివిధ సమూహాల మధ్య ద్వేషాన్ని పెంపొందించడం" వంటి సెక్షన్లతో కేసు పెట్టగా అరెస్టు చేసి మధుర జైలుకి తరలించారు. ఆయనకి కోవిడ్ 19 పాజిటివ్ రాగా చికిత్స కూడా అందిస్తున్నట్లు పోలీసులు చెబుతున్నారు.

దేశ వ్యాప్తంగా అనేక ప్రజా సంఘాలు ఈ అరెస్టుని ఖండించాయ్. మత సమైక్యత కోసం దేశ వ్యాప్తంగా 'సబ్ కా ఘర్'(మనుషులందరి ఇల్లు)లు ఎన్నో స్థాపించి, అనేక పాదయాత్రలు, సైకిల్ యాత్రలు, సభలు, సమావేశాలు, కార్యక్రమాలు నిర్వహిస్తూ నిత్యం ఒక సామరస్యపూరిత సమాజం కోసం కృషి చేసే వారి గొంతులు కూడా ఈ విధంగా నొక్కేయడం పెట్రేగిపోతున్న నియంతృత్వ పోకడలకి సంకేతం.

ఫైసల్ భాయ్ త్వరలోనే విడుదలవ్వాలని ఆశిస్తూ, మత సమైక్యత కోసం మనుషుల ఐక్యత కోసం మనుషులైన ప్రతి ఒక్కరూ ఆయనకు మద్దతు తెలపాల్సిన సమయం ఇదని పేర్కొంటూ మహాకవి ఇక్బాల్ జయంతిని పురస్కరించుకొని మతాలు మనుషుల కోసమే కాని మనుషులు మతాల కోసం కాదనే స్పృహ ఈ దేశానికి ఎన్నటికి కలుగుతుందోనని విచారిస్తూ....ఇంతటితో ముగిస్తున్నాను.

(ఇక్బాల్ పుస్తకం ఫొటోలు, బిల్లు, ఆయన చిత్రం. అలాగే ఫైసల్ ఖాన్ అరెస్టుకు సంబంధించిన వార్తల లింక్స్. )

# ఎప్పటికీ తలొంచని ఆత్మగౌరవ స్ఫూర్తి

## ఆన్ అవర్ నీస్ నెవర్




**జూ**లియస్ ఫ్యూజిక్ ' నోట్స్ ఫ్రమ్ ది గేలోస్' తో పోల్చదగిన చిన్న పుస్తకం రోడ్రిగో రోజాస్ ' ఆన్ అవర్ నీస్ నెవర్ ' . 1975 లో నోవొస్టి ప్రెస్ ఏజన్సీ, మాస్కో , రష్యా లో ప్రచురించబడిన 92 పేజీల ఈ పుస్తకం ఫాసిజం అంతర్ముఖం ఎంత అమానవీయంగా, భయంకరంగా ఉంటుందో కళ్ళకు కట్టినట్లు చూపించే ప్రయత్నం చేసింది. చెకోస్లోవేకియన్ కమ్యూనిస్టు పత్రిక సంపాదకుడిగా, ఫ్యూజిక్ నోట్స్ ఫ్రం ది గేలోస్ లో అధికారం, ఆధిపత్యం కోసం ఎంతకైనా తెగించే క్రూరత్వాన్ని ఎలా చిత్రీకరించాడో, 1930 లో దక్షిణ చిలీలో పుట్టిన రోడ్రిగో రోజాస్ కూడా కమ్యూనిస్టు నాయకుడిగా తీవ్రమైన నిర్బంధాన్ని , హింసను ఎదుర్కొని అనేక సార్లు చావును వెంట్రుకవాసిలో తప్పించుకుని తన అనుభవాలకి ఇచ్చిన అద్వితీయ అక్షర రూపం, ON OUR KNEES NEVER !

తెలుగులో ఈ పుస్తకం వచ్చిందో లేదో తెలియదు. మిత్రులు ఎవరైనా పూనుకుని అనువదిస్తే బావుంటుంది.నా పుస్తకాలు సర్దుతుంటే కనబడింది. పుస్తక దినోత్సవాన్ని పురస్కరించుకుని ఈ చిన్ని రైటప్ రాస్తున్నాను.

# మిగిలిన నమ్మకాన్ని బతికించుకుందాం !




మనిషి ఎన్ని రూపాలయినా ఎత్తనివ్వండి, సారం మాత్రం లాభమే. ఎన్ని పరిశ్రమలైనా పెట్టనివ్వండి జరిగేది మట్టుకు శ్రమ దోపిడీయే. జీవించే అవకాశం ఇచ్చిన ప్రకృతిని విధ్వంసం చేయడం మానవాళి చేసిన అతిపెద్ద నేరం. అందుకు శిక్ష అనివార్యం. అప్పుడప్పుడు ఏదో రూపంలో దానిని అనుభవించడం తప్పదు. కనీసం భవిష్యత్ తరాలకు కాస్త స్వచ్ఛమైన జీవన వనరుల్ని అందించడానికి ఈ రోజు మన జీవన విధానాన్ని క్రమబద్ధీకరించుకోగలమా? అనేది ఈరోజు అన్ని వ్యవస్థ ల ముందు ఉన్న ప్రశ్న.

Hope Beneath Our Feet : Restoring our place in the Natural World ఒక విశిష్టమైన ప్రయత్నం. Martin Keogh వేసుకున్న ఒక ప్రశ్నబీ పర్యావరణ సంక్షోభ సమయంలో మనమెలా జీవించాలి ? (In a time of environmental crisis, how can we live right now) దానికి ప్రపంచవ్యాప్తంగా కొద్దోగొప్పో ఉన్న బుద్ధిజీవులు, సామాజిక కార్యకర్తలు, రచయితలు, పాత్రికేయులు, సామాన్యులు పెద్ద పెద్ద సూత్రీకరణలేవీ లేకుండా క్లుప్తంగా, స్పష్టంగా చెప్పడానికి చేసిన నిజాయితీ కలిగిన ప్రయత్నం ఈ సంకలనం.

జండర్, రేస్ తదితర అంశాల పై కూడా కార్యక్రమాలు చేపట్టే The Dancing Ground అనే సంస్థ నిర్వాహకుడిగా, రచయిత అయిన ఈ సంపాదకుడు, ఈ గ్రంథాన్ని North Atlantic Books, Berkeley, California తరపునుండి ప్రచురించడం జరిగింది. ఎనిమిది భాగాలుగా ఉన్న ఇందులో 50 కి పైబడ్డ అరుదైన స్పందనలున్నాయ్. ఏ మాత్రం వీలైనా తప్పనిసరిగా చదవాల్సిన పుస్తకం ఇది. తెలుగులో ఈ తరహా నిర్మాణాత్మక ప్రయత్నం సమిష్టిగా జరిగితే ఎంత బావుంటుందో కదా!

## ఎల్లలు లేని విశ్వనరుడి జీవనయానం
# "ఏరియల్"




పెర్సీ బైషి షెల్లీ !
పేరు కాదిది, ప్రజా హితం కోసం పసివయసులోనే చెలరేగిన పెను ఉప్పెన తాలూకా వ్యక్తిత్వపు హోరు.రెండు వందల ఏళ్ళ క్రితం మనిషి పక్షాన నిల్చిన యోధుడ్ని తల్చుకొంటూ Prometheus Unbound (ప్రమథనాధుడి బంధవిముక్తి) రచించిన యువకుడి హుషారు.
మూడు పదుల వయసు నిండకుండానే తిరుగులేని స్పష్టతతో సాధికారికత నిండిన స్వరంతో సమాంతర అక్షర సైన్యాన్ని సృష్టించిన సెలయేరు. అతడే షెల్లీ. ఒక కాలంలో ఫ్రెంచ్ లో రాయబడి ఇంగ్లీష్ లోకి అనువదించబడిన నవలలు అద్భుతంగా ఉ ంటాయనే నమ్మకం ఉండేది. చాలా వరకూ అది నిజం కూడా. అలా ఫ్రెంచ్ లోంచి ఇంగ్లీష్ లోకి వొచ్చి గొప్ప సంచలనం సృష్టించిన రచన "ఏరియల్", (ఎ షెల్లీ రొమాన్స్). ఆంద్రే మోరొ ఎంతో పరి శోధన చేసి ఫ్రెంచ్ లో రాసిన ఈ నవలని ఎల్లా డి ఆర్సీ అద్భుతంగా ఇంగ్లీషులో అను వదించారు. ,1924 లో పెంగ్విన్ పాకెట్ బుక్ గా మొట్టమొదట దీన్నే ప్రచురించిందంటారు. తెలుగులో సోమసుందర్ అనువాదం తో బాటు మరోకట్రెండు ప్రయత్నాలు జరిగాయి. నేనైతే అవి చదవలేదు.
ఐతే, వీలున్న ప్రతివాళ్ళూ ఇంగ్లీష్ లో చదవాల్సిన గొప్ప పుస్తకం ఇది. ససెక్స్ లో ఉన్నత కుటుంబంలో జన్మించిన షెల్లీ, అద్వితీయ కవితా మాంత్రికుడిగా, హద్దుల్లేని ప్రేమికుడిగా, ప్రకృతి ఆరాధకుడిగా , తిరుగుబాటుదారుడిగా, అంతిమంగా అజరామర స్వాప్నికుడిగా ఎదిగిన క్రమాన్ని చదివితీరాలి.
సుకుమారుడైన బాలుడిగా థేమ్స్ నదితో పంచుకున్న జ్ఞాపకాల నుండి,ఈటన్ కాలేజీలో గాయపర్చిన పోట్లాటల దాక, Political Justice వివాదస్పద రచయిత గోడ్విన్ శిష్యునిగా, సాంప్రదాయ మత ఛాందస మూసలో మూలుగుతున్న విశ్వవిద్యాలయం ప్రాంగణంలో " నాస్తికత్వ అవసరం" (The Necessity of Atheism)కరపత్రం ప్రచురించి దుమారం రేపి ప్రపంచ ప్రసిద్ధ ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ నుండి బహిష్కరణకు గురైన విప్లవకారుడిగా, హేరియట్ ప్రేమికుడిగా,సాహిత్య కవిత్వ తత్వవేత్తగా ఇలా ..ఎన్నో కోణాలు షెల్లీలో చూడొచ్చు.

వ్యక్తిగతంగా ఒక కాలంలో నేను చాలా ఇష్టపడి చదివిన కవి షెల్లీ. కార్ల్ మార్క్స్ మొదలుకుని టోల్స్టోయ్ వరకూ బెర్నార్డ్ షా నుంచి బెట్రండ్ రస్సెల్ దాకా షెల్లీ ప్రభావం అపారం. షేక్స్పియర్ "ది టెంపెస్ట్" ఆధారంగా ఏరియల్ అనేది ఈ నవలకి ఎంచుకున్న పేరు. అలల తాకిడికి సంద్రంలో పడవతోపాటు మునిగి జేబులో కీట్స్ కవితల పుస్తకం ఉంచుకుని అకాల మరణం చెందిన షెల్లీ సమాధి రోమ్ లోని ఒక పురాతన పిరమిడ్ దగ్గర్లోగల ప్రొటెస్టంట్ శ్మశానం లో ఉంది. దాని పై కూడా ఏరియల్ పాటలోని ఒక భాగం ఉంటుంది, "అతడెప్పటికీ జ్ఞాపకంగా చెరిగిపోడు, సముద్రంలా సజీవంగానే ఉంటాడు. వింతగొలిపే గాఢతతో మరింత ఉన్నతంగా ఎప్పటికీ వెలుగొందుతూనే ఉంటాడు"
దశాబ్దం క్రితమే యవ్వనోత్సాహంతో ఇంగ్లీష్ లో ఆద్యంతరం ఆబగా చదివిన ఏరియల్ ,(ఏ షెల్లీ రొమాన్స్) అప్పట్లో తెలుగు అనువాదంలో ఎంతో ఇష్టంగా సో.సు.తో పాలుపంచుకున్నాను. కానీ , అది స్వతంత్రంగా నేనే చేయాలనే కోరిక గాఢంగా ఉండేది. ప్రొమీథియస్ అన్ బౌండ్ కూడా అప్పట్లో ఆరంభించి ఆపేసాను. ఆ కావ్యం వొచ్చి 200 సంవత్సరాలు ఐన సందర్భంగా, అలాగే ఏరియల్ ప్రచురించబడి 95 ఏళ్ళవుతున్న సందర్భంగా నాకెంతో స్ఫూర్తినందించిన ఆ యువ కవి ధీరత్వాన్నిలా స్మరిస్తూ, ఈ రైటప్. ( ఎక్కువ భాగం గుర్తుంచుకుని రాసిందే. పొరపాట్లేమైనా ఉంటే సూచించొచ్చు. ఇంగ్లీష్ సాఫ్ట్ కాపీ పెడుతున్నాను. కుదిరిన వాళ్ళు తప్పకుండా చదవండి. నచ్చి తీరుతుందని కచ్చితంగా చెప్పగలను.)

# చింతనాత్మక ఆత్మకథ - "పదాలు"




In any case, I worked over the words; I had to try them out, to decide what they meant. The playing at culture cultivated me in the long run.

(P - 72)

ప్రముఖ అస్తిత్వవాదిగా , మార్క్సిస్టుగా ప్రపంచవ్యాప్తంగా పరిచయమున్న పేరు జీన్ పాల్ సార్త్రేది. వాడుకలోనున్న చెత్తపెత్తందారీ సంస్కృతి కి వ్యతిరేకంగా కొత్త భావాల సంఘర్షణను నిరంతరం కొనసాగే ఒక సమన్వయవారధిలా నిర్మించడానికి జీవితాంతం కృషి చేసిన తాత్వికుడు. ఆయన స్వీయచరిత్రే 'పదాలు' (The Words).బాల్యం నుండి ఒకరకమైన ఆధిపత్యపు ఛాయల్ని చూసిన అనుభవంతో 'In the struggle between generations, children and old people often join forces (p-30) అన్న సార్త్రే పుస్తకాలు, గ్రంథాలయం తనకెలా ఆరాధ్యమో చెప్తూ, I had found my religion: nothing seemed to me more important than a book. I regarded the library as a temple (p - 59) అంటాడు.

ప్రసిద్ధవిప్లవకారిణి,సంచలన 'సెకెండ్ సెక్స్'రచయిత్రి సిమొన్ ద బువా సహచరుడిగా కృత్రిమ విలువలన్నింటినీ నిరసించారు. ఈ క్రమంలో సార్త్రే స్వీయచరిత్ర %ఒష్ట్రవ ఔశీతీఎం% (పదాలు) పేర్తో చాలా హృద్యంగా రాసారు. అనేక అనుభవాల చిత్రణతో రమ్యంగా మల్చినది ఈ ఆత్మకథ. The order of the world concealed intolerable disorders (p - 82) అన్న సార్త్రే The more absurd the life, the less bearable the death ( p- 97) అంటాడు. చారిత్రక ప్రాధాన్యత కలిగిన స్వీయచరిత్ర ఇది. ఆంగ్ల సాహిత్యం, ముఖ్యంగా ఆత్మకథలంటే ఇష్టమున్నవారు తప్పక చదవాల్సిన పుస్తకం. ఔత్సాహికుల కోసం ఈ సాఫ్ట్ కాపీ.

# ది ట్రయల్ ఆఫ్ భగత్‌సింగ్

(THE TRIAL OF BHAGAT SINGH)




16 ఏళ్ళ నాటి సంగతి. ఢిల్లీలో చిన్న ఉద్యోగంలాంటిది చేస్తున్న రోజులు. ఉదయం పేపరు తిరగేస్తుంటే ఒక ప్రకటన కనిపించింది. అంత క్రితం, ఆ తర్వాత కూడా ఆ పేరు ఆకర్షిస్తూనే ఉంది, ఉంటుంది. సుప్రీంకోర్టు ఆధ్వర్యంలో సుప్రీంకోర్టు మ్యూజియంలో మూడ్రోజుల (?) పాటు జరగనున్న ఒక అపురూపమైన ప్రదర్శనకి సంబంధించిన చిన్న ప్రకటన అది బీ The Trail Of Bhagat Singh భగత్‌సింగ్ గురించి, రెండు పదుల అతడి జీవితంలో సాధ్యమైన అద్వితీయమైన కార్యక్రమాల గురించి సుమారు 15 విశిష్ట సంస్థల సహకారంతో భారతప్రభుత్వం ఏర్పాటు చేసిన గొప్ప ప్రదర్శన అది. భగత్‌సింగ్ వస్తువులు, పుస్తకాలు, కేసు కాగితాలు, నోట్స్, ఇంకా బట్టలు, సామాన్లె న్నింటినో చదూతూ చూడటం ఎప్పటికీ గుర్తుండి పోయే జ్ఞాపకం !

అసలే అంతంతమాత్రపు పని మనది. చేసేదేదీ లేకపోయినా హాజరుమాత్రం ఉండి తీరాలి. ఐనా, ఎలాగోలా అనుమతి మ్మని అడిగి మరీ సాయంత్రం గబగబా బయలుదేరాను. మ్యూజి యం ముందు దిగి లోపలికి పరుగెత్తాను. అదిగో అప్పుడు తీసుకున్నదే ఈ చిన్న పుస్తకం. సుప్రీం కోర్ట్ ఆఫ్ ఇండియా ప్రచురణ . ఆనాటి నుండి దాచుకున్న ఓ ఆకర్షణ శక్తి ! ఇన్నాళ్ళకిలా వెలికితీత సాధ్యమైంది. ఆసక్తి ఉన్న మిత్రులు స్కాన్డ్ కాపీ పంపు తున్నాను. సుమారు 40 పుటల ఇంగ్లీషు పుస్తకం లో ఫొటోలతో సహా ఎన్నో విషయాలు, విశే షాలు ఉన్నాయి. భగత్‌సింగ్ జీవితం, కృషి పట్ల ప్రేమ, ఆయన భావజాలం పట్ల సారూప్యత ఉన్న ప్రతి ఒక్కరూ చదవాల్సిన పుస్తకం !

# మేమెందుకు దేవుడ్ని నమ్మం..?




లేటు m. సుబ్బారావు గారు హైదరాబాద్ నుండి Rationalist voice పత్రికను నడిపేవారు. నాకు ప్రత్యక్ష పరిచయం లేకపోయినా కులనిర్మూలన గురించిన నా ఆంగ్ల కరపత్రం (డెస్టినీ ఆఫ్ దళిత్స్) పై అప్పట్లో స్పందిస్తూ అమూల్యమైన సూచనలు చేసారు. బుద్ధిజం, సెక్యులరిజం, హ్యూమనిజం, అంబేద్కర్ గురించి ...ఇలా అనేక ప్రత్యేక సంచికలు వెలువరించి భావోద్యమాలకి తన వంతు తోడ్పాటు అందించారు. ముఖ్యంగా బౌద్ధం గురించిన ప్రత్యేక సంచిక పేర్కొనదగింది.

Rationalist Voice కొన్ని సంచికల్లో ' మేమెలా హేతువాదులుగా లేదా నాస్తికులుగా మారాం" / " మా పూర్వీకుల మతాన్ని నేనెందుకు విడిచిపెట్టాను" శీర్షిక తో భగత్సింగ్, రాయ్, డా.కోవూర్ ,చే గువేరా మొదలుకొని అనేకమంది ప్రముఖులు , మేధావుల రచనల్ని సీరియల్ గా ప్రచురించారు. భావోద్యమకారులెవరైనా వాటిని ప్రచురించగలిగితే గొప్ప గ్రంథం అవుతుందని నా అభిప్రాయం.ప్రస్తుత విషయానికొస్తే, ప్రఖ్యాత భావోద్యమకారుడు పెరియార్ రామస్వామి స్థాపించిన ద్రావిడర్ కజగంలో ఎన్నదగిన ఉద్యమకారుడు కె.వీరమణి సంపాదకత్వంలో వచ్చిన చిన్న పుస్తకం, %ఔష్ట్రఎ × ఎశీ అశీ దీవశ్రీఱవజవ in God (దేవుడి మీద నాకెందుకు నమ్మకం లేదు?). అనిబిసెంట్, చార్లెస్ బ్రాడ్లా, బెట్రండ్ రస్సెల్, రాబర్ట్ ఇంగర్సాల్, ఇంకా పెరియార్ ఇ.వి. రామసామిల వ్యాస సంకలనం ఇది.

1997లో అంటే ఇరవై మూడేళ్ళ క్రితం ద్రావిడర్ కజగం ప్రచురించిన ఈ పుస్తకంలో why I do not believe in god - Annie Be a sent, A plea for Atheism - Bradlaugh, Remember your humanity and forget the rest -Bertrand Russell, Forget god and Respect Man - Periyar Ramasami,
An Honest god is the noblest work of Man - Ingersoll వ్యాసాలున్నాయి.
విడివిడిగా ఎప్పుడైనా వచ్చి ఉండచ్చునేమో కానీ ఈ మొత్తం పుస్తకం తెలుగులోకి వచ్చినట్లు నాకైతే తెలీదు. ఔత్సాహికులెవరైనా స్పందించి అనువదిస్తే బావుంటుంది.

# భూమిని స్వర్గం చేసుకోగలమా?




2009 లో వచ్చిన టి. విజయేంద్ర పుస్తకం Regaining Paradise: towards a fossil fuel free society. 2013 లో వికారాబాద్ దగ్గర జరిగిన ఒక వర్ షాప్ లో peak oil కి సంబంధించి సాగర్ ధారా, విజయేంద్ర ల్ని కలవడం ఆ పుస్తకం చదవడం జరిగింది. Oil politics కి సంబంధించి, గాంధియన్ అనార్కిజంతో మొదలై క్వేకర్ మెథడ్ వరకూ ఆసక్తికరంగా సాగే పుస్తకం సామాజిక కార్యకర్త లంతా తప్పనిసరిగా చదవాలని నా అభిప్రాయం. Alternative Library/Literary movements మొదలుకొని అనేక ప్రజా ఉద్యమాలతో క్షేత్రస్థాయిలో పనిచేసిన విజయేంద్ర రాసిన ఈ గ్రంథంలోని రెండు భాగాలను peak oil premier ఇంకా Cuba without isms% అప్పట్లో జన విజ్ఞాన వేదిక చిన్న బుక్ లెట్స్ గా ప్రచురించింది కూడా. ముఖ్యంగా క్యూబా ఈ సంక్షోభాన్ని ధైర్యంగా ఎలా ఎదుర్కొని అధిగమించిందో బాగా చిత్రించడంతోపాటు the power of community : how Cuba survived peak oil అనే డాక్యుమెంటరీ చిత్రం చూసి చర్చించడం కూడా జరిగింది. ( ఆసక్తి ఉన్నవారు యూట్యూబ్ లో చూడొచ్చు.) ఆ ప్రభావంతోనే "ప్రజా రవాణా వ్యవస్థను కాపాడుకుందాం " పేరిట కరపత్రాలు విస్తృతంగా ప్రచురించి, "ప్రజా రవాణా పరిరక్షణ సమితి" తరపున పంపిణీ చేయడం జరిగింది.

ప్రపంచ ప్రఖ్యాత మిల్టన్ రచన 'ప్యారడైజ్ లాస్ట్ ' లానే సామాజిక ఉద్యమాల్లో ముఖ్యంగా పర్యావరణ ఉద్యమాల్లో పనిచేసేవారికి peak oil అంశాలు తెల్సుకోగోరేవారికి ఈ re-gaining paradise పుస్తకం అంతే ముఖ్యమైంది. ఇందులో చివరి అధ్యాయం అకిరా కురొసావా రూపొందించిన చిత్రం డ్రీమ్స్ లో 8 వ భాగం, village of water mills ని నీటిమరల గ్రామం పేరిట తెలుగులో అనువదించాను. అప్పట్లో గ్రీన్ క్లైమేట్ పత్రికలో ప్రచురించిన అది తదనంతరం ప్రకృతి - శాస్త్రం - సమాజం పొత్తంలో కూడా చోటుచేసుకుంది.

నిన్న ప్రసాద్ గారి ప్రసంగం విన్నవాళ్ళు ఈ subjectమీద పుస్తకాలు ఏవైనా ఉంటే చెప్పమని అడిగారు. వాళ్ళకోసం ఈ సమాచారం ఇస్తున్నాను. Regaining Paradise PDF ఇస్తున్నాను.

# ఒక స్వప్నం - ఒక సత్యం

## కామ్రేడ్ అండ్ లవర్...




చాలా ఏళ్ళ క్రితం సంగతి. వామపక్ష సాహిత్యం కొద్దోగొప్పో మింగేస్తోన్న రోజులు, పగలు, రాత్రనే తేడా లేకుండా ఒక ఎడతెగని అన్వేషణ. ఆ రోజుల్లో చదివిన ఒక మంచి పుస్తకం "కామ్రేడ్ అండ్ లవర్".రోజా లగ్జంబర్గ్ లియో జాగ్చీస్ కి రాసిన లేఖలు. ఎలిజిబితా ఎటింగెర్ అనువాదం.అనేక ధిక్కార భావాల సుడిగుండాల మధ్య రెండు చిన్ని మనసుల సంఘర్షణ. ఎన్నో విరామాల నడుమ ఒక స్నేహగీతం. efforts that fail to produce visible results deserve ridicule not respect. To achieve the maximum result with minimal effort - that s the right principle. ve already put it to use . working peacefully, with ease, without getting upset. Without devoting too much time to one issue - that s my system (Letter12,Berlin,June 24,1898,p-45) కార్యాచరణ పట్ల ఎంత స్పష్టత...మూడేళ్ళ క్రితం విలియం లిబ్నిక్ The Spider and the Fly అనువాదం చేస్తున్నప్పుడు మళ్ళీ రోజా కృషి గుర్తొచ్చింది. నమ్మిన ఆదర్శాల కోసం చివరి వరకూ నిలిచిన ఆమెకి ఎన్నిసార్లు నివాళులర్పించినా తక్కువే. విప్లవకారినిగా, ఉద్యమ కార్యకర్తగా మాత్రమే పరిచయమైన రొజా ఈ లేఖల్లో కొత్త కోణం లో కనబడుతుంది. మానవతా దృక్పధం కలిగిన ఆమె గుండె ఘోష వినబడుతుంది. you ask what it is that I lack. Life, precisely that ! I feel as though something has died inside me. I feel no fear, no pain , no loneliness; I am just a corpse. Its as if I were an entirely different person...and even in my thoughts, the I if that time seems like a different person (Ibid - page no : 46) MIT press, 1979లో ప్రచురించిన పుస్తకం ఇది. పుస్తకం లేదు కానీ ఏనాడో రాసుకున్న నోట్స్ లోని వాక్యాలివి. మానసికంగా ఎంత కల్లోరం లేకపోతే ఆ మాటలనగలిగింది..? " నేనో చచ్చిన శవాన్నం"టూ నిటూర్చగలిగింది..? ఉద్యమం ఉన్నంతవరకూ లిబ్నిక్, రోజా లగ్జంబర్గ్ ల హత్యలకు ప్రశ్నలు వస్తూనే ఉంటాయి. నేను డిస్కార్డ్ లో ప్రసంగం వినలేదు కానీ రోజా ఇతర రచనలు చూసి నా అభిప్రాయాలు పంచుకోవాలనిపించింది. పి.డి.ఎఫ్. నెట్ లోది పంపారేమో తెలీదుకానీ తప్పనిసరిగా అంతా తెలుసుకోవాల్సిన రోజా గ్రంథం ఇదని నా భావం.

# మహా మానవవాదికి మానవీయ నివాళి !

## మానవేంద్రనాధరాయ్ విస్మృత రచన !!

## (ఒక అద్వితీయ బుద్ధిజీవి ఆత్మీయ స్మృతి)

ఈరోజు యం. యన్. రాయ్ 70 వ వర్ధంతి. ఈ దేశానికే కాదు, ప్రపంచ భావోద్యమ చరిత్రలోనే రాయ్ అంటే తరగని గని. మానవోద్యమాన్ని కొత్త పుంతలు తొక్కించిన మేధావి. అరుదైన బుద్ధిజీవి. ఈరోజు రాయ్ రాసిన అతి ముఖ్య మైన గ్రంథాన్ని పరిచయం చేయాలి. కారణం తెలీదుకానీ ఎందుకనో వర్తమాన సామాజిక పరిస్థితుల్లో విశిష్టమైన ఈ రచన మనకి వెలుగులోకి రాలేదు. అదే, Humanism, Revivalism and The Indian Heritage !




మత పునరుద్ధరణ వాద ప్రమాదాన్ని లోతుగా అధ్యయనం చేసేవారు, ముఖ్యంగా ఇండియాకి సంబంధించిన బుద్ధిజీవులు విస్మరించరాని కృషి ఇది. రాయ్ సూత్రీ కరణలు కొన్ని గాంధీజానికి, కమ్యూనిజానికి విరుద్ధంగా ఉండవచ్చు. ఐనా,ఒక సుదూరమైన భవిష్యత్తును దర్శించగల ఆయన వైజ్ఞానిక దృష్టి కోణాన్ని కాదనలేం. ఈ దేశంలో ఫాసిజం ఏయే రూపాల్లో, మార్గాల్లో నెలకొందో దాని గుట్టు విప్పిన తాత్వికుల్లో ఎన్నదగ్గ ప్రధాన వ్యక్తి మానవేంద్రనాధ రాయ్ ! న్యాయం చేయలేనేమో అనే సందేహంతోనో, పని భారానికి భయపడి ఎన్నాళ్ళ నుండో తెలుగు చేద్దామనుకున్న ఈ చిన్న పుస్తకాన్ని అలాగే ఉంచేసాను. ఆసక్తి, సీరియస్‌నెస్ ఉన్న మిత్రులెవరైనా ఆ దిశగా ప్రయత్నం చేస్తామంటె నా బుక్ జిరాక్స్ తీస్కోవచ్చు. నెట్లో దొరికితే చూడొచ్చు. వర్తమాన రాజకీయాల్లో మత పునరుద్ధరణ వాద ప్రమాదానికి వ్యతి రేకంగా,సాంస్కృతిక పునర్వికాశం కోసం పనిచేస్తున్న ఎవరైనా ఇది కచ్చితంగా చదవాలి !వర్తమాన రాజకీయల్లో మతం పోషిస్తున్న వినాశనాత్మక పాత్రకు దశాబ్దాల క్రితమే రోగ నిర్ధారణ చేసిన సామాజిక వైద్యుడు రాయ్. అనేక కారణాల వలన ఈ రోజు ఆయన కృషి విస్మరించడం జరగవచ్చు. కానీ, వైజ్ఞానిక, లౌకిక, ప్రజాతంత్ర, మానవవాద శక్తులన్నీ రాయ్ అక్షరాల్ని ఎత్తిపట్టే కాలం రావాలని నా భావన. ఈ దేశంలో మత పునరుద్ధరణ వాదానికి వ్యతిరేకంగా సాంస్కృతిక పునర్వికాసాన్ని ప్రతిపాదించిన అరుదైన తాత్విక చింతనా పరుడు రాయ్. ఆయన 70 వ వర్ధంతి సందర్భంగా (పాత వ్యాసం లింక్ కామెంట్స్‌లో ఇచ్చాను) ఈ చిన్న రైటప్ !

# కట్టిన దుస్తులు పసుపు !

## పట్టిన జెండా ఎరుపు !!

## రాహుల్ సాంకృత్యాయన్ !!!




ఆస్ట్రేలియా లో సాంప్రదాయ క్రైస్తవ కుటుంబం లో పుట్టి 18 ఏళ్ళకే బౌద్ధునిగా మారిన వ్యక్తి ఎస్. దమ్మిక అనేక దేశాలు తిరిగి ప్రసిద్ధ బౌద్ధ పండితుడు అంగారక ధర్మపాల ఆఖరి శిష్యుని గా అవిశ్రాంత సంచారిగా, బౌద్ధ ప్రసంగీకుడిగా పేరొందారు. మహాపండిత్ రాహుల్ సాంకృ త్యాయన్ శత జయంతి సందర్భంగా 1993 లో ప్రచురిం చేందుకు రాహుల్జీ జీవితం గురించి కృషి చేసి 1990 – 91 మధ్య కాలంలో Yellow Robe - Red Flag పేరిట చిన్న జీవిత చరిత్ర రాసారు! ఐతే, అప్పట్లో దానినాయన ఎక్కడో పోగొట్టు కున్నాడు. మళ్ళీ అది గతేడాది అంటే, 2021 ఏప్రిల్‌లో లేటు వాళ్ళమ్మ గారి పేపర్లలో దొరికింది. అప్పట్లో చేసిన ఆ రచన నకలు ఒక కాపీ వాళ్ళమ్మగారికి పంపిన విషయమే ఆయన మర్చిపోయారు. ఈ లోపు రాహుల్జీ జీవితం గురించి కొన్ని వ్యాసాలు, రచనలు వచ్చాయి. వాటిని కూడా పరిగణలోకి తీసుకొని బంతే ఎస్. ధమ్మిక గారు రాహుల్జీ సంక్షిప్త జీవితగాథని నెట్ లో ఉంచారు! కేదార్‌నాథ్ పాండే ఏ సాధు రామ్ ఉదార్ దాస్ ఏ ఖున్నా చేవన్ ఏ దామోదరాచారి కేదార్ నాథ్ విద్యార్థి ఏ రాహుల్ సాంకృ త్యాయన్ అనే వివిధ పేర్లతో జీవించిన రాహుల్జీ జీవితా నికి సంబంధించిన అనేక ఆసక్తికరమైన విష యాల్ని కేవలం 40 పేజీలలో పొందుపరిచి అందించిన ఈ పుస్తకం ఒక్క సిటింగ్ లో చదవదగ్గది! మహా మానవుడిగా, మహా సంచారిగా రాహుల్జీ ఎదిగిన క్రమాన్ని కూలంకషంగా అధ్యయనం చేసి ఇందులో ఫొటోలతో సహా ఆ వివరాలు రాసారు. ఉత్తర భారతదేశం మొదలుకొని ప్రపంచంలోని అనేక దేశాలు, ప్రాంతాల వరకూ అవిశ్రాంతంగా సాగిన ఆయన అన్వేషణ కి ఒక అర్థవంతమైన అక్షర రూపం ఇచ్చారు!

ప్రాథమిక విద్య కూడా లేని రాహుల్జీ ప్రపంచంలో ని రెండు అత్యుత్తమ విశ్వ విద్యాలయాల్లో ఆచార్యునిగా పనిచేసిన విషయం మనకి తెల్సిందే. ఐతే, టిబెటన్ లఢాఖీ విద్యార్థులకు టీష్టన్ పున్షోంగ్ అనే వేత్తతో కల్సి వ్యాకరణ పుస్తకాల్ని, టిబెట్ బాలశిక్షని

రూపొందించడం, ఈమధ్య కాలం వరకూ అక్కడి పాఠశాలలకు అవే పాఠ్య పుస్తకాలు అవడం అపురూపమైన విషయం!
ఒకసారి కొలంబోలో ఒక బౌద్ధ సంఘం రాహుల్జీ ని విందుకి ఆహ్వానించారట. మొత్తం అన్ని ఆహార పదార్థాలు శాకా హారానివే ఆయన ముందు ఉంచారట. వాటన్నింటినీ పరికించి చూసిన రాహుల్జీ వారితో, " సరే, ఇదంతా పశువులు తినేది. మరి మన భోజనం ఏదీ?" అన్నారట. మాంసాహారాన్ని చులకన చేసేలా మాట్లాడిన ఈనాటి సన్యాసులకి చెంపపెట్టు తిరుగులేని సన్యాసి అయిన రాహుల్జీ మాటలు!
రాహుల్జీ మొదటి రచన బైస్వీ సాదీ ( 22వ శతాబ్ది) పుస్తకాన్ని ఆయన జైల్లో ఉంటూ ఆరోగ్యం బాగాలేక హాస్పిటల్ లో రాసాడు. దాని ప్రూఫ్ ని నేపాల్ మీదుగా వెళుతుండగా చూస్తూ జపాన్ చేరి పూర్తి చేసాడట. బొత్తిగా స్థిరత్వం లేని తీవ్రమైన సంచార జీవితం రాహుల్జీ ది అనడంలో సందేహం లేదు! టిబెట్ లో అరుదైన గ్రంథాల సేకరణ కోసం వెళ్ళిన రాహుల్జీ ని భారత ప్రభుత్వం అసలు పట్టించుకున్నది లేదు.నాటి బీహార్ రాష్ట్ర ప్రభుత్వమైనా కాస్తో కూస్తో స్పందించింది కానీ భారత ప్రభుత్వం మాత్రం నిమ్మకు నీరెత్తినట్లు ఉంది. ఆఖరికి ఇలాంటి శోధనల పై ఏ మాత్రం ఆసక్తి లేని ఇటలీ ఫాసిస్టు ప్రభుత్వం కూడా టిబెట్ లోని సంస్కృత గ్రంథాల కోసం నాడు 'ప్రొఫెసర్ టుక్కీ ' కి నిధులు మంజూరు చేసిందట!
రాహుల్జీ ఏక వ్యక్తి సైన్యంగా సాధించిన పురోగతి ప్రపంచంలోని బుద్ధి జీవుల్ని నివ్వెర పరిచింది. కలలో కూడా ఊహించ డానికి సాహసించనన్ని అత్యంత విలువైన సారస్వత సాహిత్యాన్ని మానవాళికి అందుబాటులో కి తీసుకుని వచ్చి, సాంస్కృతిక సుసంపన్నానికి కృషి చేసిన రాహుల్జీ ఎందరికో ఆరాధ్యుడు, ప్రేమా స్పదుడు అయినట్లే కొందరికి కంట గింపు కూడా అయ్యాడట!
ప్రపంచవ్యాప్తంగా ఎంతో మందిని ప్రభావితం చేసిన రాహుల్జీ పై అందుకే ఈ దేశ మేధా వులు కొందరు విషం కక్కారు. విదేశీ విశ్వవిద్యా లయాలలో సైతం బోధకుడిగా ఘనత సాధించిన మహా పండితుడ్ని ఇండియా లోని ఏ ఒక్క యూనివర్సిటీ కనీసం ఆహ్వానించక పోవడం ఈ దేశంలో విద్య పేరిట అమల వుతున్న నిర్బంధ బానిసత్వానికి, అల్ప త్వానికో స్వల్ప ప్రతీక మాత్రమే !
చాలా కాలం పాటు రాహుల్జీ ని పసుపుపచ్చ బట్టల మార్క్సిస్టని పార్టీలో పిలిచేవారట, కొన్ని సందర్భాలలో ప్రేమగా, మరికొన్ని సందర్భాల్లో భయంతోనూ. ఎవరేమ నుకున్నా రాహుల్జీ మాత్రం చిట్టచివరి వరకూ కూడా తన జీవితం మొత్తాన్ని సమాజానికే ధార పోసాడు. అణగారిన వర్గాల ప్రజల కోసమే అంకితం చేశాడు!
1956 లో 2500 వ బౌద్ధ ఉత్సవాలు నేపాల్ రాజధాని ఖాట్మాండు లో జరిగినప్పుడు ఆ

సమావేశంలో భారతదేశం తరపున ఇద్దరే వ్యక్తులు విశిష్ట ఉపన్యాసకులుగా నిలిచారు. ఒకరు బాబాసాహెబ్ అంబేద్కర్ కాగా, రెండో వ్యక్తి మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్. ఇరువురూ పీడిత ప్రజల పక్షాన జీవితాంతం కృషి చేసిన వారే !

ఇలాంటి ఎన్నో సంగతుల చిన్నపాటి ఈ పుస్తకాన్ని తెలుగులో అనువాదం చేద్దామని అనుకున్నాను. ఐతే, budblooms కాపీరైట్ హక్కుల కొరకు స్రవస్తి ధమ్మిక గారితో సంప్రదింపులు జరిపడం అవసరం అని తెలిసింది. కాన ఆ వ్యాయా మం అంతా చేయలేక ఈ సంక్షిప్త పరిచయం చేస్తున్నాను!

ఆసక్తి ఉన్న  మిత్రుల కోసం ఆ పుస్తకాన్ని ఇలా పంపుతు న్నాను. రాహుల్జీ జీవితం పట్ల ఆసక్తి ఉన్న వారంతా తప్పకుండా చదవాల్సిన పుస్తకం మాత్రమే కాదు, చదివించాల్సిన పుస్తకం కూడా అని నా అభిప్రాయం. అందుకే, ఈ చిన్న రైటప్!

# విస్తరించిన అవిస్మరణీయ స్రవంతి !

## అధివాస్తవికతా ప్రణాళికకు వందేళ్లు !!

## (ధోరణులు, దృక్పథాలు, భావనలు !!!)




అభివ్యక్తిలో అధివాస్తావికత ప్రవేశం ఒక విప్లవం. ప్రపంచ యుద్ధం తర్వాత అన్ని రంగాల్లోనూ పెల్లుబికిన సృజనాత్మక ప్రవంతుల శక్తికి "సర్రియలిజం" ఒక బలమైన ప్రతీక. నాటి నుండి దాని ప్రభావం ఉంది. ముఖ్యంగా తెలుగు సాహిత్యంలో అధి వాస్తవికతను ఆశువుగా ప్రయోగించిన సందర్భాలు ఉన్నాయి. అలా భారతీయ సినిమా చరిత్రలో, ముఖ్యంగా బెంగాలీ సినిమాలో ఈ చైతన్య ప్రవంతిని ఉపయోగించి చేసిన పలు ప్రయోగాలు, విధానాల పరిచయమే సర్రియలిస్ట్ మేనిఫెస్టో ప్రచురించి వందేళ్లు పూర్తి చేసుకున్న సందర్భంగా (1924 - 2024) డా. అరుప్ రతన్ ఘోష్, డా. ఆశిం రతన్ ఘోష్ల సంపాదకత్వంలో సంయుక్తంగా తీసుకొచ్చిన Hundred years of Surrealist Manifesto : Views Reviews Interviews, Journal of Theory,Criticism and Praxis.

Andre Breton నూరేళ్ళ క్రితం తెచ్చిన మేని ఫెస్టో మొదలుకుని భారతీయ సినిమా లో అధివాస్తవిక ధోరణి ప్రవేశించిన విధానం, అనుసరించిన వైఖరులు తదితర అంశాలపై చర్చనీయ వ్యాసాలు ఇందులో ఉన్నాయి. కళా సాంస్కృతిక వెల్లువలో సర్రియలిజం విశ్వవ్యాప్తమైన విధానం, అలాగే చిత్రకళ మొదలు కుని చలనచిత్ర నిర్మాణం వరకు ఎదిగిన తీరు సునీల్ గంగోపాధ్యాయ, బిమల్ సమంత, చంద్రనిరాయ్ తదితరులు ఇందులోని వ్యాసాల్లో రాశారు. ఆశ్చర్యకరంగా ఒక్క బెంగాల్లో తప్పితే మరే ప్రాంతంలోనూ దీని గురించి ఈ మాత్రమైనా చర్చ లేదు. వేరే భాషా ప్రాంతాల్లో జరిగిందేమో నాకైతే తెలీదు. ప్రధానంగా పుస్తకంలో బిమల్ సమంత రాసిన Artistic Odyssey: A Century of Transformative Movements వ్యాసంలో Cubism (1907 - 1920), Futurism (1909-1944), Dadaism (1916 - 1924), Surrealism (1920 - 1950), Constructivism (1919 - 1940), Abstract Expressionism (1940 - 1950), Pop Art (1950 - 1960), Minimalism (1960 - 1970), OP Art (1960), Conceptual Art (1960 - 1970), Land Art (1960 - 1970), Post Modernism (1970 -

present), Neo Expressionism (Late 20th century), Contemporary Art (1980 - Present%) వంటి సిద్ధాంతాల గురించి ఇచ్చిన పరిచయం ఉపయుక్తంగా ఉంది. సీరియస్నెస్ ఉన్నవాళ్లు తప్పక చదవాల్సిన వర్క్. (నిజానికి తెలుగు సాహిత్యంలో విభిన్న కోణాల్లో జరిగిన ఈ సంవాదం రానురాను తనని తాను కుదించుకుంది.కళాసాంస్కృతిక అభివ్యక్తిలో ఎక్కడో తప్పిపోయింది. అందుకనే తెలుగు సినిమా కూడా ఎప్పుడైనా చేసిన ఆ కొద్దిపాటి ప్రయోగాలని దాచు కోలేదు. తర్వాత ఇక మరి కనబడలేదు. భిన్నాభిప్రాయాలు ఉన్నప్పుడే పురోగతి సాధ్యపడుతుందనే స్పృహ మనకిలేకుండా పోయింది. అందుకే వ్యక్తీకరణలోసృజనాత్మకత లోపించింది. అదే అన్ని చోట్లా కనిపిస్తోంది. సమకాలీన సమాజంలో ఉన్న పురోగామి శక్తులు దీనిని అధిగమించడం అవసరమనే భావనతో మొన్న 30వ కోల్కతా ఫిల్మ్ ఫెస్టివల్ కు వెళ్ళినప్పుడు మిత్రులు బాలాజీ గారు ఇచ్చిన ఈ చిన్న పుస్తకం కోసం ఈ చిన్న రైటప్.)

# మేకా సత్యనారాయణ శాస్త్రి స్మారక వేదిక



ఒక జర్నలిస్టు స్మృతిలో స్థాపించిన సంస్థ ఇది.కాకినాడ జిల్లా పిఠాపురం కేంద్రంగా ఏర్పడిన ' బాంబు స్మారక సమితి' ఈనాటి వరకూ 14 విలువైన అమూల్య పుస్తకాలను ప్రచురించి, ఉచితంగా ప్రజానీకానికి అందించింది. అవన్నీ Internet Archivesలో అందుబాటులో ఉన్నాయి. ఔత్సాహికులు, అన్వేషకులు ఆసక్తి మేరకు అధ్యయనం చేయొచ్చు. స్వచ్ఛందంగా ముందుకు వచ్చి సహకారం అందించవచ్చు. విమర్శలకు ఆహ్వానం.

విలక్షణ పాత్రికేయుడిగా, ప్రజా పక్ష బుద్ధిజీవిగా,ప్రత్యామ్నాయ యోచనా పరుడిగా, సామాజిక కార్యకర్తగా, రాజకీయ నేతగా, అడపదడపా సూటైన ఘాటు రచయితగా, పర్యావరణ వేత్తగా, పర్యాటకుడిగా, కళాకారుడిగా అన్నిటికీ మించి ఒక హృదయమున్న మనిషిగా ఎన్నో రకాల క్లిష్టమైన సంక్షోభాలకు సమాధానంగా నిరంతర మానవీయ సౌందర్య ప్రవాహంగా సాగిన అరుదైన జీవితం మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) గారిది. జీవితాన్ని విలువల వెలుగులోనూ, సంస్కార సొబగులోనూ తప్ప యాంత్రిక మూసలోను, సంపాదనా చట్రాలలోనూ చూడని ఆయన జీవితం ఒక సంవేదనా భరిత సందేశం. న్యాయశాస్త్రం మీద సాధికారకమైన పట్టు ఉండి కూడా పట్టా పొందని పట్టభద్రుడు. రాష్ట్ర ముఖ్యమంత్రి స్థాయి వ్యక్తులతో సంబంధాలు ఉండి కూడా వ్యకిగత స్వార్థానికి లొంగని నిబద్ధుడు. ఆయన జీవితం ఒక జనబాహుళ్య మమేకతా సోపానం.

మేకా సత్యనారాయణ శాస్త్రి (బాంబు) మూడో వర్ధంతి సందర్భంగా తీసుకొస్తున్న ఈ ప్రచురణ, వందకి పైగా పుస్తకాలు సమీక్షల సంపుటి. విభిన్న ఆలోచనల్ని తదేకంగా రేకెత్తించే విలక్షణ కృతి. పదుల సంఖ్యలో ప్రజాపక్ష గ్రంథాల్ని గుర్తించి ఒక్కదరికి చేర్చిన విలువైన పుస్తక రాజం. ఒక మెరుగైన సమాజాన్ని స్థాపించడం కోసం తపించే ఆలోచాపరుల అకలంకిత ఆవేదనలకు అక్షర సమాహారం. సాహిత్య సామాజిక సాంస్కృతిక గ్రంథ సంగమం.

**ఇది మా సంస్థ 15వ ప్రచురణ**

**బాంబు స్మారక సమితి, పిఠాపురం**